# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

స చి త్ర ము

తొ మ్మి ద వ భా గ ము



సంపాదకుఁడు

విద్యాభూషణ

ఉపన్యాసకరత్న - కవితావిశారద

**ధ న కు ధ రం వ ర దా చా ర్యు లు**




ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006



( This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to publish religious books )

శ్రీ రామానుజ కీర్తి కౌముది

తొమ్మిదవ భాగము



మొదటి ముద్రణము

వేయి ప్రతులు

విభవ — విజయదశమి

అక్టోబరు - 1988

రామానుజ శకము ౯౭౧




ముద్రణము

వెల్కమ్ ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్

బ్రాడీపేట గుంటూరు

# సమాలోచన సమితి

మహాకవి సరస్వతీపుత్ర కళాప్రపూర్ణ పద్మశ్రీ

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

కడప

*

వ్యాకరణవిద్యాప్రవీణ - భాషాప్రవీణ

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A

విశాఖపట్టణము

*

భాషాప్రవీణ – విద్వాన్ లలితకవి

శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు

*కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు*

ఉలవపాడు

*

న్యాయవిద్యాప్రవీణ

డాక్టర్ యస్ బి రఘునాథాచార్యులు, M A Ph D

*సంస్కృత రీడర్ శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము*

తిరుపతి

*

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు M A B Ed

*లెక్చరర్ - ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి*

నాగార్జున సాగర్ — విజయపురి సౌత్

*

శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు M A

*ఉపన్యాసకులు — శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల*

పాలెమ్

*

కవికోకిల విద్వత్కవి కావ్యకళానిధి

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు

*సాహిత్య వికాస మండలి అధ్యక్షులు*

సిద్దిపేట

*

డాక్టర్ చించాపట్టణం శ్రీరంగాచార్యులు, M A Ph D
ఆంధ్రోపన్యాసకులు - ప్రభుత్వ కళాశాల
[ M V S Govt Arts & Since College ]
మహబూబ్ నగర్

*

మహోపాధ్యాయ - ఉభయవేదాంతశిరోమణి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు
సంస్కృతోపన్యాసకులు -
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధని సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవితార్కికకేసరి ఉభయవేదాంతవిద్వాన్
శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల రఘునాథాచార్యులు
వరంగల్

*

విద్యాప్రవీణ భాషాప్రవీణ - ఉభయవేదాంత శిరోమణి
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు
ప్రిన్సిపాల్ - వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సాహిత్యవిద్యాప్రవీణ
డాక్టర్ తట్టా విజయరాఘవాచార్యులు, M A Ph D
ఉపన్యాసకులు - విశిష్టాద్వైత విభాగము
కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి

# ప్రముఖులు - ప్రశంసలు

**త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్, సీతానగరము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది ద్వారా మీరు చేయుచున్న వైష్ణవ మత ప్రచారము మిగుల శ్లాఘనీయము

**శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A — విశాఖపట్టణము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది ఎనిమిదవ భాగమును సేవించి, అపరిమితానందము నందితిని అవతారములలో – కృష్ణావతారము వలె పరిపూర్ణముగా నున్నది ఉభయ వేదాంతములను గూర్చిన వ్యాసములు చాల మనోహరములుగా నున్నవి రామానుజ దర్శన వైశిష్ట్యము, ద్రావిడ ప్రబంధ వైశిష్ట్యము, ఉభయ వేదాంత సారము స్పష్టముగా ప్రకటింపబడినవి

**డాక్టర్ సి హెచ్ శ్రీరంగాచార్యులు, M A Ph D — మహబూబ్‌నగర్**

శ్రీ రామానుజ కీర్తికౌముది చక్కగా వెల్లివిరిసినది పండిత పామర జనులకును ఆమోద ప్రమోదములను కలిగించుచున్నది 8 – వ కౌముదిలోని శ్రీ శ్రీ వేంకటాద్రీశ్వర స్తుతి పద్యములు సులలిత పద బంధురమై, భక్తి భావ సంభరితమై, మాధుర్యగుణ సంయుతమై తనరారుచున్నవి భగవద్విషయ విశేషములు, దివ్య ప్రబంధ నీరాజనము, రామానుజ దర్శనము ఇత్యాది వ్యాసరాజము లన్నియును పఠితలకు ఉత్కంఠతను, ఆనందమును కూర్చునట్టివి ఇక ధనుర్దాసు వృత్తాంత పద్యరాజములో! వాని కవే సాటి తమ నిర్విరామ కృషి ప్రశంసనీయము శ్రియఃపతి తమ సంకల్పమును సఫలము చేయుగావుత!

దేవరవారు లోకమున కీర్తి కౌముది' సంపుటములను ప్రకాశింపజేయుట భగవత్కృప కాక, వేరు కాదు ఒక విజ్ఞాన సర్వస్వ గ్రంథరాజమును కొన్ని సంపుటములలో – అంచె లంచెలుగా ప్రకటించు ప్రయత్నమున ఎదురగునట్టి సాధక బాధకము లేవో అందరికి గ్రాహ్య మగు విషయములు కావు ఈ రోజులలో గ్రంథ ముద్రణ – కత్తిపై సాము వంటిది శ్రియఃపతి లోకోపకార పరాయణు లగు తమ ఈ ప్రయత్నమును సులభతర మొనర్చి, అన్ని విధములుగా చేయూత నిచ్చి, తమను కృతకృత్యుల నొనర్పవలయునని వేడుకొందును

**కె టి యల్ నరసింహాచార్యులు** — **ముసునూరు**

భగవద్రామానుజ నామ స్మరణమే వైష్ణవమాత్రుని యుజ్జీవమునకు ఏకైక సాధనము ఆ రామానుజ కీర్తిని ప్రకాశింపజేయుట కవతరించినది శ్రీ రామానుజ కీర్తి కౌముది కౌముది అనగా - వెన్నెల దాని కధినాథుడు చంద్రుడు కాని, ఆ కౌముది షోడశకళా పరిపూర్ణమైనపుడే అది సకల జన మనో నయనానంద కర మగుట ఆ మహాకార్య నిర్వహణమునకే దీక్ష పూనుకొన్నారు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు

శ్రీ రామానుజులవారి వ్యక్తిత్వమును సర్వాంగీకారముగా సర్వతోముఖముగా చేయుట కవతరించిన ఈ గ్రంథమాలా పరంపర దైవానుగ్రహముచేత ఇప్పటి కెనిమిది భాగములు (కళలు) వెలువడినవి నానాటికి గ్రంథము రక్తి గట్టుచున్నది ఎనిమిదవ భాగమున మిక్కిలి యుపయుక్తాంశములు కలవు ఈ భాగమునకు కొలికిపూస భగవద్విషయము - భగవద్విశేషములు అను వ్యాసరత్నము అంతయు నొక యెత్తు - శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యగారి ధనుర్దాస కావ్య సంపాదనమొక యెత్తు అంతటి మంచి పనిచేసిన శ్రీమాన్ వరదాచార్యులవారికి ఆంధ్ర లోకము మిగుల ఋణపడి యున్నదనుటలో అతిశయోక్తి ఆవంతయు లేదు-

**నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు** — **వరంగల్**

అప్రమేయమైన తమ కృషికి, సంప్రదాయ పరివర్ధన కైంకర్యమునకు మా ధన్యవాదములు

**కంకణాల యతిరామానుజయ్య** — **హైదరాబాదు**

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ ప్రచురణ మహోద్యమములో దేవరవారు ప్రదర్శించుచున్న దీక్షా దక్షతలు మిక్కిలి ప్రశంసా పాత్రములు ఇంతవరకు వెలువడిన 8 భాగములును పాఠకులకు ఆధ్యాత్మిక చింతనను, భక్తి భావనను కలిగించుచు, అవ్యక్తమైన ఆనందమును ప్రసాదించుచున్నవి ఈ గ్రంథరాజములలోని రచనలన్నియు - మధుర సుధారస ధారలుగా, ఆస్వాద యోగ్యములుగా నొప్పారుచున్నవి ఈ కౌముది - శ్రియఃపతి యనుగ్రహముచే అచిర కాలములో - షోడశ కళా పరిపూర్ణమై, తన కాంతి కిరణములను దిగంతములవరకు ప్రసరింప జేయ గలదని తలంచుచున్నాను

కేశవపట్నం తిరువేంగళయ్య — విశాఖపట్టణము

శ్రీ రామానుజ మత వ్యాప్తికి మీరు చేయుచున్న కృషి – అమూల్యము, చిరస్మరణీయము తాము ప్రచురించిన శ్రీ రామానుజ కీర్తి కౌముది మొదటిభాగము నుండి ౮ – వ భాగము వరకు సేవించితిని పాడ్యమి చంద్రునినుండి పూర్ణిమ చంద్రునివరకు వెన్నెల అభివృద్ధి చెందునట్లుల, తాము వెలువరించిన 'కౌముది గ్రంథములు దినదినాభివృద్ధిగాంచుచు, సంప్రదాయ రహస్యములను వెలువరించుట చేతను, గనినుండి వెలికి తీసి సానపట్టిన జాతిరత్నముల వంటి రచనలను పొందు పరచుటచేతను శ్రీ రామానుజ కీర్తి కౌముది దిగంతముల వరకు వ్యాపించుచున్నదని దాసుని అభిప్రాయము

Dr PREMA NANDAKUMAR M A Ph D — *SRIRANGAM*

Thank you very much for the 8th volume of *Sri Ramanuja Keerthi Kaumudi* which continues to keep up the very high standards you have set from the beginning And though the subject is the same — the propogation of Sri Ramanuja Darsana — you have also managed to bring out plenty of new angles of view in each succeeding volume

While the long poems on Sri Venkatadriswara and Dhanurdhasu are full of bhakti bhava, the various research articles are a feast to the mind and the heart Your own article brings out succinctly the widespread influence the Alwars have had on Tamil literature through the centuries Indeed there is very little of devotional poetry in Sangham age except for s me passages in *Paripadal* and the remarkbly evocative *Tiru Murugatru Padai* There is the famous passage - Vari-ppattu in *Silappadkikaram* on the exploits of Rama and Krishna avataras The Alwars and later the Nayanmars gave a decisive turn to Tamil literature by injecting bhakti into the thematic content and even adapting the *aham* and *puram* styles in Sangham

poetry for describing the soul s anxiety to meet the Lord I might point out hear that the influence of the Alwars Continues to reighn widely and the famous poet, Subramania Bharathi was so deeply influenced by the Divya Prabandham and Periazhvar in particular that he wrote *Kannan Pattu* He has also adopted modes such as Vipranarayana s Tiruppallai Ezhuchi for writing patriotic poems

Sri Kidambi Srinivasa Ramanujacharyulu s article *on S i Bhagavad Vishayam* has insightful passages on Nammalwar s hymns So to the scholarly paper on the philosophy of Sri Ramanuja by Sri T Vijayaraghavacharyulu Sri Chinchapatnam Srirangacharyulu on the yoga ideal in Sri Ramanuja is another welcome essay

I was particularly struck by Sri Kidambi Narasimhacharyulu s article on *Tirunammamulu* I never knew of this word nor anything about the literature (I understand it is mostely in folk style) associated with it I am writing to the author to help me get at a volume of Tirunamamulu to get acquainted with this branch of writing



# పత్రికలు - ప్రశంసలు

*(ఏడవ భాగమును గురించి)*

**ఆంధ్ర పత్రిక** **5 – 4 88**

ఇది సప్తమ కళ దీనియందు శ్రీమాన్ బృందావనం రంగాచార్యుల కృతి – 'శ్రీనివాస స్తుతి' పద్యరచన మొదటిది వేంకటేశ్వర సంబోధనాంతం, సురుచిర భావ సంభరితం, సులలిత శైలీ సంభరితం రెండవది – 'దివ్య ప్రబంధములు – సంగీత సాహిత్యములు' రచయిత – శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు నాలాయిర దివ్యప్రబంధ వైశిష్ట్యము, ఆళ్వారుల కావ్య సౌందర్యము – భారతీయ సంగీత సౌరభము, ఆళ్వారుల కావ్యములు–జాతీయములు, లోకోక్తులు, వర్ణనల వైచిత్ర్యము, ప్రకృతి చిత్రణ – ఇలా వేర్వేరు శీర్షికలతో వివరించిన విశిష్ట రచన మూడవది – 'శ్రీ రామానుజ వైభవము' రచయిత – శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు, పరిష్కర్త – శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు (శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు) విశిష్టాద్వైత ప్రశస్తికీ, ప్రతిష్ఠకీ కర్తగా, శ్రీభాష్య కర్తగా, ఆదిశేషాంశోద్భవుడుగా వైష్ణవ విశ్వాసానికి – అనాథ జనాశ్వాసానికి ఆచార్యుడుగా సంస్కర్తగా, కుమతవాద సంహర్తగా లబ్ధప్రతిష్ఠుడైన శ్రీరామానుజుల జనన వృత్తాంతము యథా తథముగా, సర్వులకూ ఎదురుగా కూర్చుని, మృదువుగా, మధురముగా చెప్తున్నట్టు ఉన్నది ఈ గ్రంథాని కిది పచ్చల పతకం నాల్గవది – శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యుల రచన – 'శ్రీమద్రామానుజోదాహరణము అయిదవది – 'శ్రీమద్రామానుజులు – భక్తి తత్త్వము' ఆరవది శ్రీ యతిరాజ వైజయంతి' ఏడవది 'శ్రీమద్రామానుజులు – విశిష్టాద్వైతము' ఎనిమిదవది – 'శ్రీ రామానుజ స్తుతి పూర్వకవి విరచితము స్తుతిగా ఉన్న పద్యాలు మూడే అయినా, మూడవది – ముద్దు మొగంబు' అనే పద్యం – పోతనామాత్యుణ్ణి చూపుతుంది శ్రీరామానుజులవారి చిత్రపటం సకల జనాకర్షణగా ఉంది ఈ పవిత్ర గ్రంథ ముద్రణకు తిరుపతి దేవస్థానమువారు ద్రవ్య సహాయం సమకూర్చడం – బంగారానికి వెలిగార మద్దినట్టుంది

*— యామిజాల పద్మనాభస్వామి*

## (ఎనిమిదవ భాగమును గురించి)

**ఆంధ్ర ప్రభ** 1

శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్యాలు – తిరుమంత్రార్థ వివరణతో పలువురు విద్వాంసుల వ్యాసాలు పొందుపరచబడిన శ్రీవైష్ణవ ధర్మ ... స్యంలో ఇది ఎనిమిదవ సంపుటం శ్రీ వేంకటాద్రీశ్వర స్తుతి, దివ్యప్రబంధ సము, భగవద్విషయము తద్విశేషాలు, శ్రీరామానుజ దర్శనం, శ్రీరామాను రత్నములు, శ్రీమద్రామానుజులు – యోగవిద్యా రహస్యం, ధనుర్దాసు, తి ములు – వైష్ణవతత్త్వం మొదలైనవి ఇందులో ఉన్నాయి నిగూఢమైన తి వాఙ్మయి ప్రశస్తి, ధనుర్దాసు వైరాగ్యదీక్ష, భక్తిజ్ఞాన – బ్రహ్మజ్ఞాన – ... జీవనం గురించి ఆసక్తికరమైన విషయాలు ఇందులో ఉన్నాయి నాథ ఆళ్వారుల దివ్యప్రబంధాలను సంపాదించి ప్రచారం చేసినప్పటినుండి, భక్తల విశేష వ్యాప్తి చేశారు తమిళవాఙ్మయంమీద దివ్యప్రబంధాల ప్రభావం వుంది వాల్మీకిశైలీ రీతి వ్యుత్పత్తులతో కంబమహాకవి రామాయణాన్ని చారు తమిళంలో గొప్పకీర్తి లభించిం దా కావ్యానికి నమ్మాళ్వారుల తిర మొళి నుండి కొన్ని అనుకరణలు, కులశేఖరాళ్వారుల పెరుమాళ్ తిరుమొళి ...ని అనుకరణలు కంబరామాయణంలో కన్పిస్తాయి విశిష్టమైన శ్రీవైష్ణవ సి... లను ఇతర కవులు గ్రహించి తమ తమ కావ్యాలలో నిక్షేపించడం గమ ...గ్గ విషయం దివ్యప్రబంధముల ప్రభావం ఇతర భక్తిసంప్రదాయాల్లో ... షంగా ఉంది అనేకమైన భాష్యాలుకూడా వెలువడ్డాయి తిరుక్కురళ్ వ్యాఖ్యా 14 – వ శతాబ్దంనాటి తిరుప్పుగళ్, పెరియభట్టమవారి శిష్యులగు నంజీయర భాష్యము – మువ్వత్తారాయిరప్పడి వంటి ప్రసిద్ధమైన గ్రంథాలు – శ్రీవైష్ణవానికి, అటు తమిళ సాహిత్యానికి కీర్తిపతాకాలు భగవద్విషయ వ్యాసంలో భగవద్గీతకు, తిరువాయిమొళికి సామ్య – భేదాలను విశదీకరిం విశేషం ఈ సంపుటిలో మొదటినుండి వెలువడిన ఏ సంపుటంలో ఏ వ... లున్నాయో – ఆ వివరణలు ఇచ్చారు

— శేషం రామానుజాచారి



శ్రీనివాసాయ నమః	శ్రీమతే రామానుజాయ నమః

# ప్రస్థాన త్రయము

## ( సంపాదకీయము )

ఆధ్యాత్మిక మార్గమునకు - (1) శ్రవణము (Hearing), (2) మననము (Reading), (3) నిదిధ్యాసనము (Study medition) అనునవి మూఁడును ముఖ్య సాధనములుగా చెప్పఁబడుచున్నవి ఇవియే ప్రస్థాన త్రయముగా ప్రసిద్ధి పొందినవి ఉపనిషత్తులచే శ్రవణము, బ్రహ్మసూత్రములచే మననము, భగవద్గీతచే నిదిధ్యాసనము ఉద్దేశింపఁబడినవి

### 1 ఉపనిషత్తులు -

వేదము భారతీయ జ్ఞాన విజ్ఞానములకు గని 'విద జ్ఞానే' అను ధాతువుచే 'వేద' శబ్దము సముత్పన్నమైనది అట్టి వేద వైశిష్ట్యము ఉపనిషత్తులలో కానవచ్చును ఆత్మవిద్యా రహస్యము, బ్రహ్మవిద్యా రహస్యము అనునవి ఉపనిషత్తులలో విపులముగా తెలుపఁబడినవి 'ఉపనిషత్తు' అను శబ్దమునకు — 'బ్రహ్మ విద్య' యనియే యర్థము వేదమును పురుషునిగా భావించినచో, ఉపనిషత్తులు దానికి శిరముగా తలంపనగును 'ఉప' - 'ని' ఇవి రెండును ఉపసర్గలు 'సద' ధాతువు - 'గతి' యను అర్థమును సూచించును 'గతి' యను పదమునకు - జ్ఞానము, గమనము, ప్రాప్తి అని మూఁడర్థములు కలవు ఇచట - 'ప్రాప్తి' అను అర్థము సమన్వయించును 'ఉప - సామీప్యేన, ని - నితరాం ప్రాప్నువంతి పరం బ్రహ్మ యయా విద్యయా సా ఉపనిషత్'

అని దీని నిర్వచనము అనఁగా - ఏ విద్యచే పరబ్రహ్మైక్య-సామీప్య - తాదాత్మ్యములు ప్రాప్తించునో - అది 'ఉపనిషత్తు' అని చెప్పఁబడుచున్నది

'ఉప' + 'ని' అను రెండు ఉపసర్గలను - 'సద' ధాతువుతో 'క్విప్' ప్రత్యయమును చేర్చినచో - 'ఉపనిషత్తు' అను శబ్ద మేర్పడు చున్నది 'సద' ధాతువు - (౧) విశరణము (వినాశము), (౨) గతి (జ్ఞానము, ప్రాప్తి), (౩) అవసాదనము (శైథిల్యము అనఁగా - విశ్లేషము) అను మూఁడు అర్థములలో ప్రయోగింపబడుచున్నది దీనినిఁ బట్టి, పాప - తాపములను ఉపశమింపఁజేయునదియే 'ఉపనిషత్తు' అని స్పష్ట మగుచున్నది

'ధర్మే రహ స్యుపనిషత్ స్యాత్' ఉపనిషత్ శబ్దము - ధర్మము, రహస్యము అను అర్థములలో ప్రయోగింపనగునని అమర కోశము వక్కాణించుచున్నది

'ఉపనిషత్' శబ్దమునకు — ఉప - వ్యవధాన రహితము, ని - సంపూర్ణము, షత్ — జ్ఞానము అనఁగా - వ్యవధి రహిత మగు సంపూర్ణ జ్ఞాన మని మఱి యొక అర్థము కలదు ఉపనిషత్తులలోఁగల విజ్ఞానము పరిపూర్ణమైనది, సత్యమైనది అని సంభావింపనగును

మహోన్నతమైన భారతీయ తత్త్వజ్ఞానము ఉపనిషత్తులలోఁ గాక, మఱి దేనియందును కానరాదు ప్రపంచమునఁ గల దార్శనికు లెల్ల ఆకును ఈ ఉపనిష ద్విజ్ఞానము అమృత తుల్య మగుచున్నది ఈ ఉపనిషత్తులను ఎవరు ఎంతగా అవగాహనము చేసికొనగలరో, వారు అంతగా ఆనందమును పొందఁగలరు

ఆత్మకల్యాణ మార్గదర్శనము సులభముగా లభించునది కాదు వనములలోగాని, అరణ్యములలోగాని, గురుకులములలోగాని, విద్యాలయములలోగాని ఉపనిష ద్వివేచనము చేయుటవలన మాత్రమే అట్టిది లభింపఁగలదు నాలుగు వర్ణములవారు, నాలుగు ఆశ్రమములవారు ఈ ఉపనిషత్తులవలన – ఐహికముగా, పారమార్థికముగా ప్రయోజనమును పొందగల్గుచున్నారు ఉపనిషత్తులు విజ్ఞానదాయకము లగుటయే ఇందులకు కారణము

వేదము లనంతములు కల్ప కల్పాంతరములలో ఆ వేదమునకు శాఖలు ప్రాదుర్భవించుచునే ఉండును. వర్తమాన మన్వంతరమున వేదమునకు 1180 శాఖ లున్నట్లు తలంపఁబడుచున్నవి ప్రతి వేదశాఖకు – సంహిత(మంత్రము) బ్రాహ్మణము, ఉపనిషత్తు అనునవి ఉండును ఈ రీతిగా 1180 మంత్రభాగములకు 1180 ఉపనిషత్తులు ఉండవలసియున్నవి కాని, నేఁడు ఈ ఉపనిష ద్వాఙ్మయములో – చాలవఱకు లుప్తమగుట మిగుల విచారకర విషయము పోయినవి పోఁగా, నేఁడు మనకు అష్టోత్తరశత (108) ఉపనిషత్తులు మాత్రమే లభించుచున్నవి ఇవి మిక్కిలి ప్రసిద్ధిని పొంది, సాధకులకు – ఐహిక, ఆముష్మిక ఫలములను ప్రసాదించుచున్నవి అట్టివానిలో – 1) ఈశ, 2) కేన, 3) కఠ, 4) ప్రశ్న, 5) ముండక, 6) మాండూక్య, 7) తైత్తిరీయ, 8) ఐతరేయ, 9) ఛాందోగ్య, 10) శ్వేతాశ్వతర అను ఉపనిషత్తులు పదియును ప్రధానమైనవిగా భావింపబడుచున్నవి

ఉపనిషత్తులలో (1) సద్విద్య, (2) అంతరాదిత్య విద్య, (3) ఆకాశ విద్య, (4) ప్రాణ విద్య, (5) జ్యోతి ర్విద్య, (6) ఇంద్ర ప్రాణ విద్య, (7) శాండిల్య విద్య, (8) ఉపకోశల విద్య, (9) వైశ్వానర విద్య, (10) భూమ విద్య, (11) ఆనంద విద్య, (12) నచికేతస విద్య, (13) అంతర్యామి విద్య, (14) అక్షర విద్య, (15)

గార్గ్యక్షర విద్య, (16) అక్షిస్యాహిన్నాయక విద్య, (17) ఆదిత్య స్థాహా న్నాయక విద్య, (18) పంచాగ్ని విద్య, (19) మైత్రేయి విద్య (20) బాలాకి విద్య, (21) సంవర్గ విద్య, (22) దేవేపాస్యజ్యోతి విద్య, (23) అంగుష్ఠప్రమిత విద్య, (24) దహార విద్య, (25) ప్రణవ విద్య, (26) పురుష విద్య, (27) ఉశస్తిర ఖగోళ విద్య, (28) వ్యాహృతి విద్య, (29) ఈశావాస్య విద్య, (30) ద్రుహిణ రుద్రాది శరీర విద్య, (31) అజా శరీర విద్య అను విద్యలు వర్ణింపఁబడియున్నవి

శ్రీమద్రామానుజులు - ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, కౌషీతకీ, శ్వేతాశ్వతర, సుబాల, మహానారాయణ, మహోపనిషత్తులను ఆధారముగా గొని, 'వేదార్థ సంగ్రహ' మను గ్రంథమును రచించుచు, అందు - విశిష్టాద్వైతమే ఉపనిషత్తులలో ప్రతిపాదింపఁబడియున్నట్లు స్పష్టీకరించియున్నారు

## 2 బ్రహ్మసూత్రములు

భారతీయ దర్శన వాఙ్మయములో - బ్రహ్మసూత్రములకు ఒక ప్రత్యేక స్థాన మున్నది ఈ సూత్రములలోఁ గల అసాధారణ మగు విశేషముచే, ఈ సూత్రములు రచింపఁబడిననాటినుండియు వీని అధ్యయనము, అధ్యాపనము అనునవియేగాక, ఇవి చర్చావిషయముగాకూడ ప్రాముఖ్యమును పొందియున్నవి పూర్వాచార్యులు కొందఱు ఈ బ్రహ్మసూత్రములపై - వృత్తి, వాక్యము, వార్త్తికము, భాష్యము అను పేర్లతో వ్యాఖ్యానములు రచించియున్నారు అవి నేటివఱకును ప్రముఖ స్థానమలంకరించియే యున్నవి అవియే గాక, మఱి కొందఱు వానిని అధ్యయనము చేసి, బ్రహ్మసూత్రములను గుఱించి వివరించుచు, అనేక గ్రంథములను రచించియున్నారు

ఈ రీతిగా, మహామనీషులగువారు - భారతీయ దర్శన వాఙ్మయమున నాఁటినుండి నేఁటివఱకు తమ తమ ప్రతిభావ్యుత్పత్తులను బ్రహ్మసూత్ర వ్యాఖ్యానములను రచించుటలో ప్రదర్శించుచునే యున్నారు

ఈ బ్రహ్మసూత్రములు బాదరాయణుఁ డనఁబడు వ్యాసభగవానునిచే రచింపఁబడినవి ఆతఁడు వేదవిదుఁ డగుటచే, ఆ వేదములలోఁ గల తాత్త్విక విషయములను సూత్రప్రాయముగ వెల్లడించెను ఈ సూత్రములు వ్యాస రచితములై నందున, 'వ్యాస సూత్రము' లనియు వీనికి వ్యవహారము కలదు నాలుగు అధ్యాయములలో, 185 సూత్రములతో నొప్పారుచున్న ఈ బ్రహ్మసూత్ర గ్రంథమునకు దార్శనికులు కొందఱు భాష్యములను రచించి యున్నారు ఆ వివరము దిట పేర్కొనఁబడుచున్నవి —

| | భాష్యకారుఁడు | భాష్యము | సిద్ధాంతము |
|---|---|---|---|
| 1 | శంకరాచార్యులు | శంకర భాష్యము | అద్వైతము |
| 2 | భాస్కరాచార్యులు | భాస్కర భాష్యము | ఔపాధిక భేదాభేదము |
| 3 | రామానుజాచార్యులు | శ్రీభాష్యము | విశిష్టాద్వైతము |
| 4 | నింబార్కాచార్యులు | వేదాంత పారిజాత సౌరభము | స్వాభావిక భేదాభేదము |
| 5 | మధ్వాచార్యులు | పూర్ణప్రజ్ఞ భాష్యము | ద్వైతము |
| 6 | శ్రీకంఠాచార్యులు | శైవ భాష్యము | శైవ విశిష్టాద్వైతము |
| 7 | శ్రీపతి (ఆచార్యులు) | శ్రీకర భాష్యము | వీరశైవ విశిష్టాద్వైతము |
| 8 | వల్లభాచార్యులు | అణు భాష్యము | శుద్ధాద్వైతము |
| 9 | విజ్ఞానభిక్షు | విజ్ఞానామృత భాష్యము | అవిభాగాద్వైతము |
| 10 | బలదేవుఁడు | గోవింద భాష్యము | అచింత్య భేదాభేదము |

శ్రీరామానుజులు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము వ్రాయుచు, ఆ గ్రంథమున —

"భగవ ద్బోధాయన కృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యా స్సంక్షిపుః, తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యన్తే"

'బోధాయన మహర్షి చే రచింపఁబడిన బ్రహ్మసూత్ర వృత్తిని పూర్వాచార్యులు సంక్షేపింపఁగా, తదనుసారము బ్రహ్మసూత్రములు వ్యాఖ్యానింపఁబడుచున్నవి' అని ఉద్ఘాటించియున్నారు కావున, శ్రీభాష్య రచనకు ప్రధానాధారము బోధాయనవృత్తియనియు, శ్రీభాష్యమున నిర్దేశింపఁబడిన సిద్ధాంతము పూర్వాచార్యానుగృహీతమనియు స్పష్టమగుచున్నది గదా! ఈ శ్రీభాష్యమును శ్రీరామానుజులు క్రీ శ 1155 – 56 లో రచించినట్లు, చరిత్రాధారములవలన తెలియవచ్చుచున్నది ఈ రామానుజ భాష్యము వైష్ణవ భాష్యము లన్నింటిలో మిన్నయైనదిగా సంభావింపఁబడుచున్నది ఇందు – సూత్రములలో ప్రతిపాదింపఁబడిన విషయములు సూత్రానుకూలముగ నుండుటేగాక, ఈ భాష్యరచనా విధానమునకూడ – సరలత, గంభీరత, ప్రౌఢత, సోపపత్తికత, అర్థగౌరవము, సూక్ష్మ విచారము, భాషా సౌష్ఠవము ఇత్యాదుల అపూర్వ సమన్వయము అవశ్య దర్శనీయము ఇట్టి సమన్వయ విశేషముచల్లనే, శ్రీ రామానుజుల బ్రహ్మసూత్ర భాష్యము – కాశ్మీర విద్యాపీఠమున శారదాదేవిచే స్వీకరింపఁబడి, 'శ్రీభాష్య' మను పేర సువిఖ్యాతమైనది

3 భగవద్గీత –

ముముక్షువులకు జ్ఞానోదయమునుఁ గల్గించునది భగవద్గీత ఇది పంచమవేద మనఁబడు మహాభారతములో – భీష్మపర్వమున ఇరువదియైదవ అధ్యాయముగ విలసిల్లుచున్నది అష్టాదశ పురాణములను రచించి విఖ్యాతి గాంచిన వేదవ్యాసుఁడే మహాభారతేతిహాసాంతర్గతమగు ఈ భగవద్గీతను రచించెను

సప్తర్షులలో నొకఁడగు వసిష్ఠుని కుమారుఁడు శక్తి అతని కుమారుఁడే పరాశరుఁడు ఆ పరాశరుని తనయుఁడే వ్యాసుఁడు

విష్ణు భగవానుఁడే వ్యాసుఁ డను పేర నవతరించెను గీత నుపదేశించిన కృష్ణుఁడు విష్ణువే అట్టి కృష్ణుని వదనారవిందమునుండి వెలువడిన భగవద్గీతను మహాభారతములోఁ జేర్చి రచించిన వ్యాసుఁడును విష్ణువే ఇందువలన, విష్ణుభగవానుని మహిమను వెల్లడించుటకు అతఁడే అవతరించెను

ఉపనిషత్తు లన్నియు ఒక గోవుగను, కృష్ణుని గోపాలునిగను, అర్జునుఁడు వత్సగను, ఆ వత్సకొఱ కేర్పడిన క్షీరమే గీతామృతముగను గ్రహించి, ఆ యమృతమును ఆస్వాదించి, ఆనంద స్వరూపుఁడగు భగవానుని యనుగ్రహమును పొందుటయే మానవ జీవిత పరమార్థము

భగవద్గీత 18 అధ్యాయములతో, 700 శ్లోకములతో విలసిల్లుచున్నది ఈ భగవద్గీత - దాదాపు, ప్రపంచ భాష లన్నింటిలో అనూదితమై, విశ్వవిఖ్యాతి గాంచియున్నది

"స్వధర్మ జ్ఞాన వైరాగ్య సాధ్యభక్త్యేక గోచరః
నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః"

వర్ణాశ్రమ ధర్మ నిర్వహణముచేతను, జ్ఞానముచేతను, భక్తిచేతను, వైరాగ్యముచేతను గోచరుఁడగు శ్రీమన్నారాయణుఁడే గీతాశాస్త్రమున నిర్దేశింపఁబడినాఁడని శ్రీ యామునాచార్యులవారు వక్కాణించియున్నారు భగవద్రామానుజ యతిసార్వభౌములు ఈ భగవద్గీతకు భాష్యమును రచించుచు, ఆరంభమున అవతారికలో —

"శ్రియఃపతిః నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైకతానః స్వేతర సమస్త వస్తు విలక్షణానన్త జ్ఞానానందైక స్వరూపః, స్వాభావికా నవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృ త్యసంఖ్యేయ కల్యాణ గుణ గణ మహోదధిః – – – వివిధ విచిత్రానన్త భోగ్య భోక్తృవర్గ పరిపూర్ణ నిఖిల జగ దుదయ విభవ లయ లీలః పరంబ్రహ్మ, పురుషోత్తమో నారాయణః – బ్రహ్మాది స్థావరాంత మఖిలం జగ త్సృష్ట్వా, స్వేన రూపే ణావస్థితః, బ్రహ్మాది దేవ మనుష్యాణాం ధ్యానారాధనా ద్యగోచరః, అపార కారుణ్య సౌశీల్య వాత్స ల్యౌదార్య మహోదధిః స్వమేవ రూపం త త్తత్సజాతీయ సంస్థానం స్వస్వభావ మజహదేవ కుర్వన్, తేషు తేషు లోకే ష్వవతీర్యావతీర్య, తై స్తై రారాధిత స్తత్త దిష్టానురూపం ధర్మార్థ కామమోక్షాఖ్యం ఫలం ప్రయచ్ఛన్ భూభారావతరణాపదేశేన, అస్మదాదీనా మపి సమాశ్రయణీయత్వా యావతీ ర్యోర్వ్యాం సకల మనుజ నయన విషయతాం గతః, పరావర నిఖిలజన మనో నయనహారి దివ్యచేష్టితాని కుర్వన్, పూతనా శకట యమ లార్జునారిష్ట ప్రలంబ ధేనుక కాలియ కేశి కువలయాపీడ చాణూర ముష్టిక తోసల కంసాదీ న్నిహత్య అనవధిక దయా సౌహార్దానురాగ గర్భావలోకనాలాపామృతైః విశ్వ మాప్యాయయన్, నిరతిశయ సౌన్దర్య సౌశీల్యాది గుణగణావిష్కారేణ అక్రూర మాలాకారాదీన్ పరమ భాగవతాన్ కృత్వా, పాణ్డుతనయ యుద్ధప్రోత్సాహన వ్యాజేన పరమ పురుషార్థ లక్షణ మోక్ష సాధనతయా వేదాన్తోదితం స్వవిషయం జ్ఞాన కర్మానుగృహీతం భక్తియోగ మవ తారయామాస"

అని, భగవద్గీతలో – జ్ఞానకర్మానుగ్రహీతమైన భక్తియోగమును, అంతకంటెను విశేష ఫలదాయకము, మోక్షోపాయము నగు ప్రపత్తి యోగమును శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు ఉపదేశించె ననియు, అట్టి శ్రీకృష్ణోపదేశమున విశిష్టాద్వైతమే ప్రతిపాదింపబడె ననియు భగవద్రామానుజులు తమ గీతాభాష్యమున ప్రమాణోక్తు లతో నిరూపించియున్నారు

ఏవం విధము లగు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత అనునవి ప్రస్థాన త్రయ ప్రఖ్యా విభాతములై, విశిష్టా సిద్ధాంత ప్రతిపాదకములై, జ్ఞాన విజ్ఞానదాయకములై, మార్గోపదేశకములై యలరారుచున్నవి

శ్రీభాష్యకారో జయతు రామానుజ జగద్గురుః
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమ దష్టాక్షర ప్రదః ॥







# ఒక అద్భుత విషయము

**18-10-87 తేదీనాటి ఆంధ్రపత్రిక ఆదివారము అనుబంధములో - డాక్టర్ : గుమ్మనూరు రమేష్‌బాబుగారు - 'శతాబ్దాల నాటి పరమహంస దేవ్‌రహాబాబా' అను శీర్షికతో ఒక వ్యాసమును వ్రాసియున్నారు. ఆ వ్యాసమును యథాతథముగ ఈ క్రింద పొందుపఱచుచున్నాము :-**

"ఎందరో మహానుభావులు ఉద్భవించిన ఈ పుణ్య భారతములో - పరమహంసలు, పరిపూర్ణ విజ్ఞాన భాస్కరులు, సర్వసంగ పరిత్యాగులు, విశిష్ట బోధకులు, ఉత్కృష్ట కార్యసాధకులు - ఇలాగే ఎంతోమంది అవతరించి, జాతిచరితను మరింత సంస్కరించి, విశ్వ మానవ భాగ్యోదయానికి మార్గం చూపి, పవిత్రాత్ములైనారు. పరమపదించి కూడా చిరంజీవులైనారు.

భారతీయ గురుపరంపరకు చెందిన యోగీశ్వర మునిపుంగవులు నేటికీ ఉన్నారు. స్వామీజీలు, బాబాలు, సన్యాసులు, బైరాగులు, ఫకీరులు - ఇలా ఎందరో ఉన్నారు. పొట్టకూటికోసం ఆశపడి, గురు పరంపరకు కళంకాన్ని తెస్తున్న మోసగాళ్ళు కూడా ఉన్నారు. అయితే, అలాంటివారివల్ల మహోన్నతులైన మహర్షులకు కలిగే నష్ట మేమీ లేదు. కాలం ముందు మోసం తప్పక బైట పడుతుంది. భారతీయ తత్త్వమే జవసత్వంగా ఉన్న మహాత్ములు కనుమరుగైనా, జాలిగుండెలో శాశ్వతంగా ఉండిపోతారు.

పరమహంస తత్త్వమున్న మన మహర్షి కోవకు చెందినవారే ఉత్తర ప్రదేశ్ కు చెందిన దేవరహాబాబా అని ఆయనను దర్శించి వచ్చిన విజ్ఞులు చెబుతున్నారు అవధూత లక్షణాల ప్రతిరూపం దేవర్ బాబా అని ఎంతోమంది నమ్ముతున్నారు రాజునూ - పేదనూ, పాచినీ - పసిడినీ, సుఖాన్నీ - దుఃఖాన్నీ, మమకారాన్నీ - వైరాగ్యాన్నీ ఒకేలా చూడగల సంయమి ఈ బాబా అని ఎంతోమంది విశ్వాసం

బృందావన్‌లో - సుందర యమునాతటి వద్ద ఉన్న ఒక సాధారణ మంచె బాబా నివాస స్థలం భక్తులకు ప్రసాదాలు పంచిపెట్టడానికి చిల్లులుపడ్డ ఒక పూరిపాక వుంది అదే బాబాకు గొప్ప భవంతిలాగా తోస్తూ ఉండవచ్చు బాబా ఎప్పుడోకాని మంచె దిగరు గడ్డిపరకలతో తయారయిన చిల్లుల చాపలపై ఆయన పవళిస్తాడు హంసతూలికాతల్పమైనా ఆయన పవళింపు ఒక్కటే సమ్యక్ ప్రాజ్ఞుడు ఆ గురువృద్ధుడు

దేవ్‌రహాబాబా నిండు వార్థక్యంలో ఉన్నవారు ఈయన వయస్సెంతో ఇంతవరకు ఎవరకీ ఖచ్చితంగా తెలియదు కొంతమంది ఆయన వయస్సు 900 సంవత్సరాలని అంటారు 'నిత్య ఈశ్వర లీనుడను నా వయస్సును గుర్తు చేయకండి' అని సమాధానం చెబుతారట బాబా జగద్గురు శ్రీరామానుజాచార్యుల వద్ద దేవ్ బాబా దీక్షను స్వీకరించినట్లు ఆయన భక్తులు చెప్పుకొంటూ ఉంటారు.
శ్రీ రామానుజాచార్యులు 1016 లో పుట్టినవారు (1916 లో కాదు. 1917 లో శ్రీరామానుజులు ఆదిశేషాంశతో అవతరించి, అతిమానుష కృత్యము లనేకము లొనర్చి, జగద్గురువులుగా విఖ్యాతి వహించారు

బాబా గొప్ప యోగి ఆయన మహాశక్తివంతమయిన యోగా భ్యాసమువల్ల, వయస్సును అవలీలగా జయించగలుచున్నారని యోగ శాస్త్ర నిపుణులే అభిప్రాయపడుతున్నారు మనందరికీ ఒకరోజు ఆయుర్దాయం ముగిస్తే, బాబాకు అందులో ఎనిమిదవభాగం - అనగా, మూడుగంటల ఆయుర్దాయం ముగుస్తుందని ఆయన శిష్యులు చెబు తున్నారు బాబా వయస్సును ఆరా తీస్తే, బహుశా - 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' కూడా ఖంగు తినవచ్చు

దేవ్‌రహీ బాబాను కలుసుకున్న వారిని గురించి ఆలోచించినా కూడా, బాబా అత్యంత వృద్ధుడని చెప్పవలసి వస్తుంది గత శతా బ్దిలో - బెంగాల్‌కి ప్రధాన న్యాయమూర్తిగా ఉండిన సర్ జాన్ ఉరఫ్ - బాబాను కలుసుకున్నట్లు రికార్డ్ నమోదయిఉంది అలాగే, బ్రిటన్ మహారాజు - ఐదవ జార్జి కూడా దేవ్‌రహీబాబా దర్శనం చేసుకున్నాడట మదన్‌మోహన్ మాలవీయా, పురుషోత్తదాసు తండన్‌లుకూడా బాబాతో గడిపినట్లు రికార్డ్‌లు ఉన్నాయి వీరంతా ఇప్పటివారా? స్వామీ రామదాసు రాసిన 'లివింగ్ విత్ ది హిమా లయన్ మాస్టర్స్'లో - దేవ్‌రహీబాబాను గురించి ఉంది అందులో - బాబా అందరికంటె వృద్ధుడనీ, నిత్యయోగాభ్యాసంవల్ల ఆయుర్దా యాన్ని ఇచ్ఛ ఉన్నంతకాలం పెంచుకోవచ్చుననీ రాశారు కంద మూలాలు, ఫలపత్రాలు మాత్రమే స్వీకరించడంవల్ల ఆయుర్దాయం పెరగడమే కాదు - చురుకుదనంకూడా కలుగుతుందని స్వామివారు చెబుతున్నారు అయితే, దేవ్‌రహీబాబా మాత్రం - 'సంతోషాన్ని మించిన బలం లేదు, ప్రాణాయామయోగాన్ని మించిన అద్భుతం లేదు' అంటారట!

మన తొలి రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ ఆరు సంవత్సరాల బాలుడిగా ఉన్నప్పుడు దేవ్‌రహీబాబా దర్శనం

చేసుకున్నారట అప్పటికి బాబా వయస్సు 80 సంవత్సరాలు ఉండ వచ్చునని ఆయన అనుకొన్నారు కొన్ని దశాబ్దాలు గడిచి రాష్ట్రపతి అయ్యాక మళ్ళీ రాజేంద్రప్రసాద్ బాబాను కలిస్తే, ఆయాన ఎప్పటి లాగానే ఉన్నారట! దేవ్ రహింబాబా అలాగే ఉన్నారట! హేతు వాది, శాస్త్రవాది అయిన మన తొలి ప్రధాని జవహర్ లాల్ నెహ్రూకూడా దేవరహింబాబాను తరచూ కలుసుకునేవారట ఆయన బాబా ప్రసాదాన్ని మందులతోపాటు తీసుకొనేవారట కూడా! ఇక ఇందిరాగాంధీ - మనసుకు కష్టమనిపించినప్పుడెల్లా, ఆ బాబాను దర్శించి, ఉపశమనం పొందేవారట ఆయన మంచెమీద ఎక్కువ ఉంటారుకనుక, కుప్పలు వేసి, ఈవిడనుకూడా అంత ఎత్తుమీదికి చేర్చడం జరుగుతూ ఉండేదట 'దయా హై' అనడం బాబా అల వాటు ఎందుకో కొన్నేళ్ళ తరువాత, భక్తుల తలలమీద కుడిపాదం మోపడం అలవాటు చేసుకున్నారు బాబూ జగజీవనరామ్ శిరస్సును ఈయన కుడిపాదంతోనే ఆశీర్వదించారట ఇటీవల ఈయనను దర్శనం చేసుకున్న ప్రస్తుత లోకసభ స్పీకర్ బలరామ్ జక్కర్ నుకూడా ఆయన కుడి పాదమే దీవించింది

బాబారూపం అతి సామాన్యమయింది బక్కపలచగా ఉండే శరీరం బాగా ముడతలుపడి ఉంటుంది తెల్లటి గడ్డం, లోతుకు పోయిన కళ్ళు, ఎక్కడో పాతాళంలోంచి వచ్చే కంఠస్వరం, దుమ్ము కొట్టుకుపోయిన కాళ్ళూ, చేతులూ అంతా చిత్రంగా తోస్తుంది ఈయన కళ్ళల్లోని వింత కాంతులు విస్మయాన్ని కలుగజేస్తే, చిద్వి లాసంగా తోచే ఆయన చిరు నవ్వులు ఆశ్చర్యాన్ని జత చేస్తాయి. ఆయన ఆశీర్వదిస్తే, మనోవాంఛితాలు సిద్ధిస్తాయట ప్రసాదం అందిస్తే చాలు - ఇక్కట్లన్నీ తొలగిపోతాయట తన కుడిపాదాన్ని భక్తుల శిరస్సులపై మోపితే చాలు - వాళ్ళకు అష్టైశ్వర్యాలతో

పుణ్యలోకాలుకూడా ప్రాప్తిస్తాయట ఇదంతా నమ్మ శక్యం కాక పోవచ్చు నమ్మడానికి వీలు కానంతమాత్రాన వాస్తవాలను తృణీక రించడం అవివేకమే అవుతుంది బృందావన్‌లో ఈయన ఉండే స్థలంలో - కొన్ని దశాబ్దాలుగా ఏ మార్పూ లేకపోయినా, కొన్ని దశాబ్దాలనుంచి జనవాహిని నిరంతరాయంగా ప్రవహిస్తూ ఉండడం మాత్రం గొప్ప విశేషముగా తోస్తుంది మరి వ్యక్తిలో మహిమ లేదు - అంతా కాకతాళీయమే అని సరిపుచ్చుకోవడం ఆత్మవంచనే అవుతుంది 'హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పారశీలు అనే విభేదాలు మనం సృష్టించుకున్నవే దేవుని దృష్టిలో అందరూ ఒకటే అసలు దైవస్వరూపం ధర్మమేకదా! ధర్మాన్ని మనం రక్షించాలి అప్పుడే అది మనల్ని రక్షిస్తుంది' అని చెబుతున్న బాబా ఆంతర్యం - అందరికీ అవగతమయితే, వసుధైవ కుటుంబ భావన అను క్షణం సాక్షాత్కరిస్తే, విశ్వసౌభాగ్యం సిద్ధించదా? భారతీయ జీవ నుడి ఈ లక్ష్యసిద్ధిని అందుకోవడంకోసమేకదా ఆత్మ ప్రత్యయంగా ముడివడి ఉన్నది!"

పై పంక్తులనుబట్టి దేవరబాబా అను మహనీయులు శ్రీరామాను జులవారి శిష్యరత్నమని స్పష్టముగా తెలియుచున్నదిగదా! దేవరబాబా యందు అలనాడు శ్రీ రామానుజులవారు ప్రసరింపజేసిన అనుగ్రహ విశేషమూ, ఆ బాబా నియమ్మయుక్తముగా చిరకాలము చేసిన యోగ సాధన విశేషమూ ఆ దేవరబాబాను అంతవారినిగా చేసినవి అనుటలో ఏ మాత్రమూ సందేహము లేదు బాబావారి ఈ అతిప్రామాణ్యస్థితి - శ్రీ రామానుజ భక్తులకు హర్షదాయకము; సర్వ భారతీయులకు గర్వ కారణము

చ॥ యమ నియమాది యోగముల నభ్యసనంబొనరించి మించి, సం
యములయి, సాధుచంద్రులయి, ఆత్మబలమ్ము సమార్జియించియున్

సముచితరీతి తద్విధఘోరంబగు దివ్య తపోబలంబు స
ర్వము ప్రజకై వ్యయింప, కడు వైభవ మందిన భారత మ్మిదే

అని ఒక కవిశేఖరుఁ డన్నట్లు, మహామహిమోపేతులగు యోగిపుంగవులకు మన భారత దేశము జన్మభూమి యనుట జగద్విదితము అట్టి భారతీయ మహర్షుల కోవకుఁ జెందిన మహనీయులే ఈ శ్వరబాబా యని మనము సంభావించవచ్చును లోక కల్యాణ కాంక్షయే అట్టి మహనీయుల జీవిత లక్ష్యముగా మనకు గానవచ్చును

"ఉత్తమ కీర్తులైన మనుజోత్తము లాత్మ హితంబు నెన్నఁడున్
చిత్తమునందు గోరరు, హసించియు - లోకులకెల్ల సర్వ సం
పత్తియు, భూతియున్, సుఖము, భద్రము గోరుదురు

అను భాగవత సూక్తి ఇట స్మరింపఁదగి యున్నది

— ప్రకాశకులు



# విషయానుక్రమణిక

భగవద్రామానుజులు - శ్రీభాష్యము (ప్రథమాధ్యాయము)

35_131

—o—

# శ్రీ వేంకటేశ స్తవము

'కళాప్రపూర్ణ'
డాక్టర్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు

—✱—

శ్రీమ త్సప్తాద్రివాసం శ్రితజన వరదం స్నిగ్ధభావ ప్రసన్నం
కల్యాణానాం నిధానం కలిమల శమనం కంజపత్రాయతాక్షమ్
అల్మేల్మంగా వధూటీ ప్రణయ మధు సర స్సంచర ద్రాజహంసం
సేవే భక్త్యా ప్రపత్త్యా స్మితముఖ కమలం శ్రీనిధిం వేంకటేశమ్

శ్రీమ త్సర్వ చరాచరాత్మక జగ త్సంవాసినం స్వామినం
భక్తాభీష్ట ఫలప్రదాన నిరతం పద్మావతీ వల్లభమ్
ప్రత్యక్షో త్తమదైవ రాట్కలియుగే బాలాజి నామాంతరం
సేవే నిత్య మహం వినమ్ర శిరసా శ్రీవేంకటేశ ప్రభుమ్

శ్రీమ చ్ఛేష ధరాధరాగ్రనిలయం శ్రీ భూ మనోనాయకం
కాళిందీ ప్రభవో త్తమాంఘ్రి యుగళం కారుణ్య పాదోనిధిమ్
పూర్ణేందూపమిత ప్రసన్న వదనం మోక్షప్రదం సంతతం
సేవే భక్తి జగత్ప్రపాలనచణం శ్రీవేంకటేశ ప్రభుమ్

కనులకు విందు నిన్గనుట, కర్ణ రసాయనమయ్యె నీ కథల్
వినుట, మహానుభావ! రస విస్తృత మోహనమూర్తి వీవు 'ప్రమొ
క్కిన వర మిచ్చు వేల్పు' వని కీర్తి గడించిన శ్రీనివాస! నీ
ఘనతకు నంజలింతు త్రిజగన్నుత! నన్ దరిఁజేర్చి బ్రోవుమీ

భువనంబుల్ పదునాల్గు లోఁగొనిన దేవుం డీవు, సామాన్య మా
నవు లట్టుల్ తలదాచుకొంట కలి దీనత్వంబునన్ వేడి, యా
ది వరాహోద్ధృతి నందు సప్తగిరియందే లీల నిర్మించుకొం
టివ వైకుంఠము? భక్తరక్షణకరా తండ్రీ! వేంకటేశప్రభూ!

శ్రుతులైనన్ స్మృతులైన, నీ మహిమ నచ్చుం దీయఁగారాని, య
ప్రతిమానాద్భుత పారలౌకిక కలాపప్రౌఢి నొప్పారుచోన్
మతిమాలన్ మితిమీరి నిద్దలియఁగా మాదృ క్సుధీమాన్యు లే
గతి 'మే' మంచు నహంకరింతురు ? జగత్కల్యాణ కల్పద్రుమా !
తరియింపన్ వరియింప నెంతు 'ప్రభు భృత్య న్యాయ' మో
స్వామి ! మా
న్య నిరస్యాక్రియఁ గోర నెన్నఁడును 'సోఽహం' బొక్క
'దాసోఽహ' మే
పరమార్థంబగు నాకు, సత్క్రమత సోపానంబు లెక్కించి, నీ
దరికిన్ జేర్చి యనుగ్రహింపు మనువందన్ వేంకటేశప్రభూ !

దశ దిశల్ దులకించు దర చక్ర హస్తముల్
పొక్కిలి మాణిక్యమున్ గటారి
మంజీర కింకిణీ రంజిత మృదుపద
కంజాతముల్, కనకాంబరమ్ము
కటి తటంబునఁ జేర్చు కరయుగ్మమున్, గల
కల లాడుచున్ ముద్దుగారు మోము
నవరత్న ఖచిత కుండల కిరీటోజ్జ్వల
కాంతు లోల నిండి కనుల విందు
గొలుపు సౌందర్య జిత శతకోటి మన్మ
థాకృతిం గేరు పద్మావతీ కళత్ర !
భక్త మందార ! యుపనిషత్పథ విహార !
శ్రీనివాస ! దయానిధే ! తే నమోఽస్తు





యస్త్వ్యాదపద్మ ద్వయ మాశ్రితానాం సంసారసింధో స్తరణాయ పోతః
రామానుజం తం రమణీయ మూర్తిం సేవే సదా సంయమి భాష్యకారమ్

# శ్రీమద్రామానుజులు - వేదార్థ సంగ్రహము

సాహిత్య విద్యాప్రవీణ'

డాక్టర్ తట్టా విజయరాఘవాచార్యులు, ఎం ఏ పిహెచ్ డి

—✻—

"పుణ్యా భోజ వికాసాయ పాపధ్వాన్త క్షయాయ చ
శ్రీమా నావిరభూ ద్భూమౌ రామానుజ దివాకరః"

## నామౌచిత్యము

శ్రీరామానుజ గ్రంథములలో - 'వేదార్థ సంగ్రహము' మొదటిది ఇది - శ్రీ శేషాచలమున శ్రీనివాస భగవానుని దివ్య సన్నిధియందు, ఉపన్యాస రూపమున రచింపఁబడినది[1] ఈ గ్రంథము సను శ్రీరామానుజులు-'వేదార్థ సంగ్రహ' మను నామ ముంచుటలో, ఔచిత్య మెంతయో గోచరించును

వేదముయొక్క అర్థము వేదార్థము చక్కగా సమీకరింపఁబడుట సంగ్రహము। వేదార్థముయొక్క సంగ్రహము వేదార్థ సంగ్రహము ఈ గ్రంథమున వేదార్థము బాగుగా సమీకరింపఁబడుటచే, ఈ గ్రంథమునకు - 'వేదార్థ సంగ్రహ' మని పేరు కలిగినది దీనికి 'వేదాంత సంగ్రహ' మనియు నామాంతర మున్నది వేదాంత మనఁగా - వేదముయొక్క అంతిమ పర్యంతము చెప్పఁబడిన విషయ సారము ఉపనిషత్తులు వేదాంతములు అట్టి ఉపనిషత్తుల సర్వార్థ మిందు సంగ్రహముగా చెప్పఁబడుటవలన, ఈ గ్రంథము - 'వేదార్థ సంగ్రహ' మని నిర్వచింపఁబడుచున్నది అందువల్లనే, శ్రీమద్రామానుజులచే ప్రత్యేకముగ ఉపనిషద్వ్యాఖ్యము రచింపఁబడలేదు

---

1 "శ్రీరామ్యకృద్వప్యత్తో శ్రీశైలపతేః పురః
వేదార్థసంగ్రహ స్యాస్య ఖర్మ ప్రాత్సర్యదీపికామ్ "

ఈ వేదార్థ సంగ్రహమున వివరింపబడిన అర్థము వేదార్థ మనుటకు ప్రమాణ మే మనఁగా - ఈ తత్త్వార్థము శ్రుతిస్మృతీతిహాస పురాణ ప్రమాణ వాక్యములచే ప్రతిపాదింపఁబడుటయే ఇతిహాస పురాణముల ద్వారా, వేదార్థము నెఱుఁగవలెనని బార్హస్పత్యస్మృతి ఇట్లు బోధించుచున్నది -

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"

పూర్వోత్తర భాగద్వయాత్మకమైన వేదమునందలి పూర్వ భాగమున, ఆరాధన విచారము, ఉత్తర భాగమున ఆరాధ్య విచారము చేయఁబడినది ఈ ఆరాధనారాధ్య విచారములు రెండును చేయఁబడుటచే, ఈ గ్రంథము - 'వేదార్థ సంగ్రహ' మనబడు చున్నది

## పరంపరాగత సిద్ధాంతము

భగవద్బోధాయన, టంకాచార్య, ద్రమిడాచార్య, గుహదేవ, కపర్ది, భారుచి, భర్తృమిత్ర, భర్తృప్రపంచ, నాథముని, యామునమునులచే ప్రవర్తింపఁజేయఁబడిన సిద్ధాంతమునే శ్రీమద్రామానుజులు విస్తరింపఁజేసిరి. కావున, ఇయ్యది - పరంపరాగత తత్త్వార్థ సిద్ధాంతమే కాని, వే ఱొకటి కాదు

పరంపరాగతమగు మహర్షుల భావనా విశేషమే ఈ వేదార్థ సంగ్రహమున స్పష్టము జేయఁబడినది కాని, స్వతంత్రముగా చెప్పినది కాదు అందువల్లనే శ్రీమద్రామానుజులు తమ వేదార్థ సంగ్రహమున నిట్లు వివరించిరి —

"సాక్షాత్కార క్షమ భగవద్ద్వైపాయన, పరాశర, వాల్మీకి, మను యాజ్ఞవల్క్య, గౌతమ ఆపస్తంబ ప్రభృతి మునిగణ ప్రణీత విధ్యర్థవాద మంత్రరూప వేదమూలేతిహాస పురాణ ధర్మశాస్త్రోపబృంహిత పరమార్థభూతానాది నిధనావిచ్ఛిన్న సంప్ర

దాయ ఋగ్యజుస్సామాథర్వ రూపానంతశాఖం వేదం చా భ్యుపగచ్ఛతా మస్మాకం కిం న సేత్స్యతిః

వ్యాస, పరాశర, వాల్మీకి, యాజ్ఞవల్క్య, గౌతమ, ఆపస్తంబాది మహర్షులచే రచింపబడిన వేదమూలములగు ఇతిహాస, పురాణ, ధర్మశాస్త్రములలో నిరిష్టమైన పరమార్థము - అనాది నిధనము, అవిచ్ఛిన్నము, సంప్రదాయబద్ధము నగుచుండ, ఋగ్యజుస్సామాథర్వరూప మగు అనంత శాఖలు గల వేదమును అనుసరించు మనకు సమ్మతముకానిదే ముండును ?'

పై పంక్తులనుబట్టి, శ్రీమద్రామానుజులు - తమ వేదార్థ సంగ్రహమున వేదములను యథావస్థితముగా వివరించియున్నట్లు స్పష్ట మగును కావున, అతి విలక్షణమగు తత్త్వనిరూపణ వైఖరితో భగవద్రామానుజులు వేద-పరబ్రహ్మలను, ప్రమాణ-ప్రమేయములను నిరూపించుటచే, ఇది 'దర్శన' మనుటలో సందేహము లేదు

## గ్రంథస్థ విశేషములు

వేదార్థ సంగ్రహమున శ్రీరామానుజులచే - శంకర, భాస్కర, యాదవప్రకాశ మతములు విమర్శింపబడి, నవరణలు చేయబడుటే కాక, సర్వసమ్మతములగు శ్రుతిస్మృతీతిహాసపురాణ ప్రమాణ వాక్యములచే, విశిష్టాద్వైతసిద్ధాంతస్థాపన చేయబడినది అందు ముఖ్యముగా - చిదచి ద్విశిష్టుడగు శ్రీమన్నారాయణుడే ముఖ్య తత్త్వమని ప్రతిపాదింపబడినది జ్ఞాన, శక్తి, బలైశ్వర్యాది భగవద్గుణములు నిరూపింపబడి, సగుణత్వము సమర్థింపబడినది పరమాత్మయొక్క సవిశేషత్వము, దివ్యమంగళవిగ్రహత్త్వము వర్ణింపబడినవి ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞానము సంభవించుట వివరింపబడి, తద్ద్వారా, జీవ జగ ద్బ్రహ్మలకు విశిష్టైక్యము నిరూపింపబడినది

'తత్త్వమసి' అను మహావాక్య విచారణముద్వారా, సామానాధి కరణ్యము ప్రస్తావింపఁబడినది 'తత్త్వమసి' వాక్యమునకు ఇతరులు చెప్పు అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞాన విధానములందలి దోషములు స్పష్టము చేయఁబడినవి జగదుత్పత్తి విధానము, జీవాత్మ స్వరూపము, పరమాత్మ సర్వకార్యకారణత్వము - శ్రుతిస్మృతీతిహాస పురాణవాక్య ప్రమాణములచే నిరూపింపఁబడినవి శ్రీమన్నారాయణుఁడే సర్వశబ్దవాచ్యుఁ డనియు, సర్వాంతర్యామి యనియు, సర్వజ్ఞుఁ డనియు, సర్వశేషీయనియు, సర్వాధిపతియనియు ప్రమాణీకరింపఁ బడినది పరమాత్మ ప్రాప్తియే మోక్షమనియు, మోక్షప్రాప్త్యుపాయముల స్వరూప విధానములు స్పష్టముచేయఁబడినవి భక్తి వైలక్షణ్యము వివరింపఁబడినది తత్త్వహితపురుషార్థముల నిట్లు తెలియఁ జేయుటవలన, ఈ వేదార్థ సంగ్రహము అమూల్య గ్రంథముగా వెలయుచున్నది

## విశిష్టాద్వైత దర్శన పరామర్శము

జీవ జగత్తులను శాసించు పరమాత్మను తెలియజేయునవియే శ్రుతులు సకల కల్యాణ గుణాకరుఁ డగు శ్రీమన్నారాయణుని చరణారవిందప్రాప్తియే మహాఫలము

ధ్యానార్చన ప్రణామ కీర్తనాదులు పరమాత్మోపాసనకు సాధనములుగా చెప్పఁబడినవి ధ్యాన మనఁగా - మానసిక ప్రక్రియ నామ సంకీర్తనము వాచిక ప్రక్రియ ఈ విధముగా భగవ దుపాసనా విధానములను భగవద్గీత, భాగవతము బోధించుచున్నవి (భ గీ 8-5 18-65 భాగ 7-5-23, 24)

అనాదియగు జీవాత్మ - అవిద్యాసంచితమైన పుణ్యాపాపకర్మ ప్రవాహములోఁ బడి, బ్రహ్మాది స్తంబపర్యంతము - సుర, నర, జంతు, వృక్షాది దేహముల ధరించి, ఆ దేహాత్మాభిమానముతో

అకృత్యము లాచరించుచు, పునర్జన్మ - జరా - మరణాదుల నొందుచున్నాఁడు అదృష్టవశమున, దయాసాగరుఁ డగు పరమాత్మ కృపచే, దేహాతిరిక్తమైన, ఇంద్రియాతిరిక్తమైన, ప్రాణాతిరిక్తమైన ఆత్మస్వరూపము నెఱింగి, తదంతర్యామియైన పరమాత్మనెఱింగి, తత్స్వరూప స్వభావోపాసన ఫలభూతమైన, ఆత్మస్వరూపావిర్భావపూర్వకమైన, అనవధికాతిశయమైన ఆనందరూప బ్రహ్మానుభవమును పొందుచున్నాఁడు

**'తత్త్వమసి'** 2 **'అయమాత్మా బ్రహ్మ'** 3

నీ వా బ్రహ్మాత్మకుఁడవై యున్నావు ఈ యాత్మ - బ్రహ్మకు శరీర మగుటచే, బ్రహ్మ యనఁబడును '

**య ఆత్మని తిష్ఠన్, ఆత్మనో ఽన్తరో, య మాత్మా న వేద యస్యాత్మా శరీరమ్ య ఆత్మాన మంతరో యమయతి స చ ఆత్మా అన్తర్యా మ్యమృతః "** 4

ఏ పరమాత్మ - జీవాత్మయం దున్నవాఁడై, ఆత్మకు లోనుండునో, ఏ జీవాత్మ-పరమాత్మను తెలిసికొనలేఁడో, ఏ పరమాత్మకు జీవాత్మ శరీరమో, ఏ పరమాత్మ జీవాత్మను లోపలనుండి నియమించునో - ఆ పరమాత్మయే నీకు అంతర్యామి ఏ దోషము అంటనివాఁడు ”

**"ఏష సర్వభూతాన్తరాత్మా, అపహతపాప్మా, దివ్యో దేవ ఏకో నారాయణః "** 5

సర్వభూతములకు అంతరాత్మయైన ఇతఁడు ప్రకాశించుచున్న దేవుఁ డొక్కఁడేయైన నారాయణుఁడు ”

---

2 ఛాందోగ్యోపనిషత్తు 6 18 16
3 బృహదారణ్యకోపనిషత్తు 6 4 5
4 బృహదారణ్యకోపనిషత్తు 5 7 2
5 సుబాలోపనిషత్తు 7

"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి
యజ్ఞేన దానేన తపసా అనాశకేన " 6

అట్టి యీ పరమాత్మను విప్రులు వేదాధ్యయనముచేతను, యజ్ఞముచేతను, దానముచేతను, తపస్సుచేతను, అనశనవ్రతముచేతను ప్రీతివిషయమైన ఉపాసన చేయుచున్నారు "

"బ్రహ్మవిదాప్నోతిపరమ్ " 7

బ్రహ్మము నెఱిఁగినవాఁడు బ్రహ్మత్వము నొందును ' ఇచట - 'విత్ ' అను శబ్దముచేత, జ్ఞానవిశేషమైన ధ్యానము బోధింపఁబడుచున్నది

"తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా అయనాయ విద్యతే " 8

ఆ పరమాత్మను ఈ విధముగా ఉపాసించి, ఇచట సంసార విముక్తుఁడగుచున్నాఁడు పరమాత్మప్రాప్తికి మఱియొక మార్గము లేదు "

ఇత్యాది అనేక శ్రుతి స్మృతీతిహాస పురాణ వాక్యములు - జీవాత్మ పరమాత్మలనుఁగూర్చి తెలియఁజేయుచున్నవి

## జీవాత్మ

"నిర్వాణమయ ఏవాయ మాత్మా జ్ఞానమయోఽమలః
దుఃఖాజ్ఞానమలాధర్మాః ప్రకృతే స్తే న చాత్మనః " 9

జీవాత్మ స్వతస్సిద్ధముగ జ్ఞానానందస్వరూపుఁడు ఏ దోషములు లేనివాడు ప్రకృతి సంబంధముచే దుఃఖమును, అజ్ఞానమును,

6 బృహదారణ్యకోపనిషత్తు 6 4-22
7 తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లి 1-1
8 పురుషసూక్తము 17
9 విష్ణుపురాణము 6 7-24

దోషములను పొందుచున్నాఁడు ప్రకృతి సంబంధమువలన వచ్చిన ధర్మములే కాని, అవి జీవాత్మయొక్క సహజ ధర్మములు కావు

"పుమా న్న దేవో న నరో న పశు ర్న చ పాదపః
శరీరాకృతి భేదాస్తు భూపైతే కర్మయోనయః" 10

ఈ జీవాత్మ - దేవుఁడు కాడు, మనుష్యుడు కాడు, జంతువు కాడు, వృక్షము కాదు కర్మవశమువలన వివిధ శరీరాకారములను పొందుచున్నాఁడు"

## పరమాత్మ

చిదచిదాత్మకమైన ప్రపంచముయొక్క పుట్టుకకు, స్థితికి, లయమునకు కారకుఁడు, అఖిల హేయప్రత్యనీకుఁడు, అనంత కల్యాణ గుణాకరుఁడు, స్వేతర సమస్త విలక్షణుఁడు, సర్వాత్మ, పరమాత్మ, పరంబ్రహ్మ, పరంజ్యోతి, పరతత్త్వ, సదాది (సత్ + ఆది) శబ్దములచే పిలువఁబడుచు, నిఖిల వేదాంత వేద్యుఁడైన, భగవంతుడైన నారాయణుఁడు - పురుషోత్తముఁడు సర్వాంతర్యామిగా నున్నాఁడు స్వేతర సమస్త చిదచిద్వస్తుజాతాంతర్యామియైన ఆ పరమాత్మ వైభవము - శక్తి, అంశ, విభూతి, రూప, శరీర ప్రభృతి శబ్దములచే, సామానాధికరణ్యముచే ప్రతిపాదింపఁబడుచున్నది

"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ" 11

ఈ పరమాత్మయొక్క శక్తి - అనేక విధములుగా వినిపించుచున్నది జ్ఞానము, బలము, క్రియ సహజములైనవి

విష్ణో రంశాః ద్విజోత్తమ" 12

---

10 విష్ణుపురాణము : 2 13 94
11 శ్వేతాశ్వతరోపనిషత్తు : 6 6-17
12 విష్ణుపురాణము 1-22 17

'ఓ బ్రాహ్మణోత్తమా ! ఇవి విష్ణువుయొక్క అంశలు.'

"విష్ణో రేతా విభూతయః" 13

'ఇవి విష్ణువుయొక్క విభూతులు'

"పరస్య బ్రహ్మణో రూపమ్" 14

'ఇది పరబ్రహ్మయొక్క రూపము'

"జగ త్సర్వం శరీరం తే, స్థైర్యం తే వసుధాతలమ్" 15

'ఓ మహావిష్ణు ! సమస్త జగత్తు నీ శరీరము భూతలమే స్థైర్యము"

"త త్సర్వం వై హరే స్తనుః" 16

'అది యంతయు హరియొక్క తనువు'

"తాని సర్వాణి త ద్వపుః" 17

'అవి యన్నియు ఆతని శరీరము'

ఈ విధముగా పరమాత్మయొక్క శరీరత్వము, జగజ్జీవుల త్వము స్పష్ట మగుటచే, శరీర శరీరి భావముద్వారా విశిష్టైక్యమ ప్రతిపాదించుటచే 'విశిష్టాద్వైత' మనఁబడుచున్నది

## శరీర శరీరి భావము

సర్వము పరమాత్మకు శరీరము పరమాత్మ శరీరియని జీవ పరమాత్మలకు గల విలక్షణత్వమును, విశిష్టైక్యమును బోధ

13 విష్ణుపురాణము 1-22-82
14 విష్ణుపురాణము : 1-2-17
15 శ్రీమద్రామాయణము యుద్ధకాండ 120 - 26
16 విష్ణుపురాణము 1-22 87
17 విష్ణుపురాణము 1-22 87

శ్రుతులు ఇచ్చట సమీకరింపఁబడుచున్నవి సర్వము పరమాత్మకు శరీరము అయినను, ఆ సర్వ మనునది ఏవి యో వివరించుటకై, ప్రత్యేకముగ శ్రుతులందు పేర్కొనఁబడినవి -

| | |
|---|---|
| యస్య పృథ్వీ శరీరమ్ । | యస్య ద్యౌః శరీరమ్ । |
| యస్య ఆప శ్శరీరమ్ । | యస్య ప్రాణః శరీరమ్ । |
| యస్య తేజ శ్శరీరమ్ । | యస్య బుద్ధిః శరీరమ్ । |
| యస్య వాయు శ్శరీరమ్ । | యస్య ఆత్మా శరీరమ్ । |
| యస్య ఆకాశ శ్శరీరమ్ । | యస్య మనః శరీరమ్ । |
| యస్య అవ్యక్తం శరీరమ్ । | యస్య రేతః శరీరమ్ । |
| యస్య అక్షరం శరీరమ్ । | యస్య మృత్యుః శరీరమ్ । |
| యస్య తమః శరీరమ్ । | యస్య వాక్ శరీరమ్ । |
| యస్య చక్షుః శరీరమ్ । | యస్య విజ్ఞానం శరీరమ్ । |
| యస్య చంద్ర తారకః శరీరమ్ । | యస్య శ్రోత్రం శరీరమ్ । |
| యస్య చిత్తం శరీరమ్ । | యస్య ఆదిత్యః శరీరమ్ । |
| యస్య త్వక్ శరీరమ్ । | యస్య అహంకార శ్శరీరమ్ । |
| యస్య దిశః శరీరమ్ । | యస్య సర్వాణి భూతాని శరీరమ్ । |



అని, బృహదారణ్యక - సుబాలోపనిషత్తులందు వివరింపఁబడినవి ఇవి యన్నియు పరమాత్మకు శరీరము వీని యన్నిటికిని పరమాత్మయే శరీరి అనఁగా - సర్వము పరమాత్మకు శరీరము పరమాత్మ శరీరి పరమాత్మ ఆధారము సర్వము ఆధేయము పరమాత్మ శేషి - సర్వము శేషము పరమాత్మ నెఱిఁగినచో, సర్వము తెలియును కనుక, ఏక విజ్ఞానముచేత, సర్వ విజ్ఞానము సాధింపఁబడుచున్నది ఇదియే శరీర శరీరి భావము, ఆధార ఆధేయ భావము, కార్య

కారణ భావము వీని సంబంధము విడదీయుటకు వీలులేని దగుటచే, అపృథక్సిద్ధ సంబంధము - లేక, పృథక్సిద్ధ్యనర్హ సంబంధము - అనఁగా, విడదీయుటకు వీలులేని సంబంధము అనిరి చిదచిదీశ్వరులకు గల ఈ విశిష్ట ఐక్య సంబంధమే విశిష్టాద్వైతమున ముఖ్యము

## పరమాత్మ సవిశేషత్వము

సర్వ సృష్టి స్థితి లయములకు కారకుఁడైన పరమాత్మ - అనేక విశేషములు కలవాఁడు - నిర్గుణుఁడు అనఁగా - ఇంత మాత్రమే కాదు - ఇంకను ఎన్నియో గుణములు కలవాఁడని యర్థము అందువల్లనే అనంత కల్యాణగుణవిశిష్టుఁడని చెప్పఁబడి నది పరమాత్మయొక్క సవిశేషత్వమును శ్రుతులు ఈ రీతిగా బోధించుచున్నవి —

**జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజాం స్యశేషతః**
**భగవ చ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః " 18**

జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు - ఈ యాఱును కలిసి, భగవచ్ఛబ్దవాచ్యములు హేయ గుణములు లేకుండుటవలన 'నిర్గుణుఁడు' అనఁబడుచున్నాఁడు ఈ విశేషములు కలవా రెవ రనఁగా -

**ఏవం ప్రకార మమలం సత్యం వ్యాపక మక్షయమ్**
**సమస్త హేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్ " 19**

ఈ ప్రకారముగా - అమలమైన, సత్యమైన, సర్వవ్యాపి యైన, అక్షయమైన, సకలహేయగుణరహితమైన విష్ణు వను నామము కలదే పరమపదము సర్వ శబ్ద వాచ్యుఁడై, సర్వాంతర్యామిగా

---

18 విష్ణుపురాణము 6-5-79

19 విష్ణుపురాణము : 1-22 53

నుండుటచేతను, సర్వమునకు ఆధారభూతుఁ డగుటచేతను, సర్వశేషి యగుటచేతను విష్ణువు అనేక విశేషములను కలిగియున్నాఁడు అందు చేతనే, నారాయణుఁ డనఁబడుచున్నాఁడు

నారములకు అయనమైనవాఁడు ఎవఁడో, అతఁడు నారాయణుఁడు చేతనాచేతనములు ఎవనికి నివాస స్థానమో - అతఁడు నారాయణుఁడు 'రిజ్ క్షయే' అను ధాతువునుండి ఉత్పన్నమైన 'ర' అనఁగా - క్షయ వస్తువు - 'నర' అనఁగా - నాశరహితమైన నిత్య వస్తువు నిత్య వస్తువు సమూహారములో - 'అణ్' ప్రత్యయముతో ఆది వృద్ధి జెందగా - 'నార' అని నిత్యవస్తుసమూహము తెలుపఁబడుచున్నది అట్టి నిత్యవస్తువు లేవి యనఁగా - జ్ఞాన, శక్తి, బలైశ్వర్య, వీర్య, తేజః ప్రభృతి జ్ఞానానందామలత్వాదులు వాని స్వరూప నిరూపక ధర్మములు - వాత్సల్య, సౌశీల్య, స్వామిత్వ, సౌలభ్యాది అసంఖ్యేయ కల్యాణగుణ విశేషములు అసాధారణ అప్రాకృత దివ్యమంగళ విగ్రహము, సౌందర్య - సౌకుమార్య - సౌగంధ్య - లావణ్య - యౌవనాది విగ్రహ గుణములు, స్వోచిత వివిధ విచిత్రానంతాశ్చర్య నిత్య నిరవద్య నిరతిశయ సుగంధ సుఖ స్పర్శ జాజ్వల్య కిరీట మకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక నూపురోదర శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామోదరబంధన పీతాంబర కాంచీగుణ నూపురా ద్యపరిమిత దివ్య భూషణాదులు, స్వానురూపాచింత్య శక్తి శంఖ చక్ర గదా శార్ఙ్గా ద్యసంఖ్యేయ నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధములు, శ్రీ - భూ - నీళాది దేవేరులు, అనంత గరుడ విష్వక్సేనా ద్యసంఖ్యేయ సూరి బృందము, కైంకర్యోపకరణ ఛత్ర చామర-తాళవృంత భృంగారాదులు, చండ, ప్రచండ, భద్ర, సుభద్ర, పుండరీక, వామన, శంఖుకర్ణ, సర్పనేత్ర సుముఖ సుప్రతిష్ఠాది గదాధిపులు,

అఖిల కైంకర్య నిరతి శయాసంఖ్యేయ చేతనులు, సాత్త్విక రాజస తామస గుణసహిత మూలప్రకృతి, కాలము, చతుర్వింశతి తత్త్వములు, దేవ మనుష్య తిర్యక్ స్థావరములు మున్నగున వన్నియు నిత్య వస్తువులు

'అయన' శబ్దము ఆశ్రయ వాచకము కనుక, వీని అన్నింటికిని ఆశ్రయుఁడు నారాయణుఁడు అనఁగా - పరమాత్మ యగుటచే, పరమాత్మ సవిశేషత్వము స్పష్ట మగుచున్నది

## నారాయణ పరత్వ స్థాపనము

"వేదవి త్ప్రవర ప్రోక్త వాక్య న్యాయోపబృంహితాః
వేదా స్సాంగా హరిం ప్రాహు ర్జగ జ్జన్మాది కారణమ్ " [20]

వేదవేత్తలచే చెప్పఁబడిన వాక్యములచేతను, న్యాయముల చేతను విశదీకరింపఁబడిన యంగ సహితమైన వేదములు - జగజ్జన్మాదులకు కారణముగా హరిని చెప్పుచున్నవి -

"యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి,
యత్ప్రయ న్త్యభిసంవిశ న్తి త ద్బ్రహ్మేతి " [21]

దేనివలన ఈ భూతము లుదయించుచున్నవో, పుట్టిన భూతములు దేనివలన జీవించుచున్నవో - అది బ్రహ్మ అనఁగా - జగజ్జన్మాదులకు కారణము పరమాత్మయేయని స్పష్ట మగుచున్నది

"స దేవ సోమ్య ! ఇద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్ " [22]

ఓయి సోమ్యా! సృష్టికి పూర్వము సచ్ఛబ్దవాచ్య మొక్కటియే యుండెను 'వేరు నిమిత్త కారణము లేదు' అని జగ దుపాదానత్వము, జగ న్నిమిత్తత్వము, జగ దంతర్యామిత్వమువలన పరమ కారణ

---

20 శ్రీభాష్యకారులు
21 తైత్తిరీయోపనిషత్తు భృగువల్లి 1
22 ఛాందోగ్యోపనిషత్తు 6 2-1

ముగా సచ్ఛబ్దము చెప్పఁబడినది అదియే శాఖాంతరమందు బ్రహ్మ శబ్దముచే చెప్పఁబడినది

"బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్ " 23

సృష్టికి పూర్వము బ్రహ్మ ఒక్కటియే యుండెను ' ఈ బ్రహ్మ మఱి యొక శాఖయందు ఆత్మ శబ్దముచే చెప్పఁబడినది

ఆత్మా వా ఇద మేక మగ్ర ఆసీత్ " 24

సృష్టికి పూర్వము ఈ యాత్మ యొక్కటియే యుండెను ' ఈ యాత్మయే మఱి యొక శాఖయందు –

ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానో నేమే ద్యావా పృథివీ 25

సృష్టికి పూర్వము ఒక్క నారాయణుఁడే ఉండెను బ్రహ్మ లేడు, ఈశానుడు లేడు ఈ పృథివి, అంతరిక్షములు లేవు' అని చెప్పటచే, సద్బ్రహ్మాది శబ్దములచే నారాయణుఁడే చెప్ప బడుచు న్నాడని స్పష్టమగుచున్నది

ఏష సర్వభూతాన్తరాత్మా ! అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః " 26

ఈ సర్వభూతములందు అంతరాత్మగా నుండి, పాపము లంటని వాడు – దివ్యమైన దేవుడు ఒక్క నారాయణుడే ' అని శ్రుతులు నారాయణుని పరత్వమును ప్రతిపాదించుచున్నవి

"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ " 27

నీకు శ్రీదేవియు, భూదేవియు భార్యలు' అని, మహాపురుష ప్రకరణమందు చెప్పబడుటచే, ఆ పరమాత్మ నారాయణుడే యని స్పష్టమగుచున్నది

---

23 బృహదారణ్యకోపనిషత్తు 3-4 11

24 ఐతరేయోపనిషత్తు : 1-1-1

25 మహోపనిషత్తు 1 1

26 సుబాలోపనిషత్తు : 7

27 పురుషసూక్తము 7 4.

పై జేర్కొనినట్లు వేదములందేగాక, ఇతిహాస - పురాణము లందును, నారాయణుడే తత్త్వమని చెప్పబడుచున్నది

"ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః
జంగమా జంగమంచేదం జగ న్నారాయణోద్భవమ్ " 28

ఋషులు, పితరులు, దేవతలు, మహాభూతములు, స్థావర - జంగమరూపమైన ఈ జగత్తు - నారాయణునివలన ఉదయించినది' అని నారాయణునకే పరతత్త్వము ప్రతిపాదింపఁబడినది

"విష్ణోః స్సకాశా దుద్భూతం జగ త్తత్రైవ చ స్థితమ్
స్థితి సంయమ కర్తాఽసౌ జగతోఽస్య జగచ్చ సః " 29

ఈ జగత్తు విష్ణు వీక్షణమువలన నుద్భవించినది, విష్ణునియందే ఉన్నది, అతనియందే లీన మగును దీని సృష్టి స్థితి లయములకు ఆయనయే కర్త జగత్తుకూడ ఆయనయే' యని, విష్ణు వైశిష్ట్య ముగ్గడింపబడినది

"ప్రకృతిర్యా మయా ఖ్యాతా వ్యక్తావ్యక్త స్వరూపిణీ
పురుషశ్చా ప్యుభా వేతౌ లీయతే పరమాత్మని " 30

స్థూలసూక్ష్మమయిన యే ప్రకృతి నాచేత చెప్పబడినదో - అదియు, పురుషుడు (జీవాత్మ), పరమాత్మ లయము నందుచున్నారు' అని, సర్వ కార్య కారణత్వమును చెప్పి, ఆ పరమాత్మ యెవ రనగా -

"పరమాత్మా చ సర్వేషా మాధారః పరమేశ్వరః
విష్ణునామా స వేదేషు వేదాన్తేషు చ గీయతే " 31

---

28 మహాభారతము అనుశాసనికపర్వము 229
29 విష్ణు పురాణము 1 1-31
30 విష్ణు పురాణము 6 4 39
31 విష్ణు పురాణము 6 4 31

పరమేశ్వరుడైన పరమాత్మ - అందరకును ఆధారమైన వాడు విష్ణు వను పేరుగలవాడు వేదములందును, వేదాన్తము లందును కీర్తింపబడుచున్నాడు' అనియు చెప్పబడినది

"స్రష్టా సృజతి చాత్మానం విష్ణుః పాల్యం చ పాతి చ
ఉపసంహ్రియతే చాన్తే సంహర్తా చ స్వయం ప్రభుః" 32

ప్రభువైన పరమాత్మ విష్ణువు స్వయముగనే సృష్టించుచు న్నాడు, రక్షించుచున్నాడు, లయము చేయుచున్నాడు' అని చెప్ప బడుటవలన, నారాయణుడే పరతత్త్వమని స్పష్ట మగుచున్నది

"విశ్వం నారాయణం దేవం అక్షరం పరమం పదమ్" 33

"నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః" 34

"నారాయణ పరంజ్యోతిః" 35

"ఆత్మా నారాయణః పరః" 36

నారాయణః పరంబ్రహ్మ" 37

అని ఈ మొదలగు శ్రుతి స్మృతీతి హాస పురాణ ప్రమాణ వాక్యములచే, నారాయణుడే పరతత్త్వమని వ్యక్త మగుచున్నది

## 'తత్త్వమసి' వాక్య విచారము

జీవాత్మ పరమాత్మశరీర మగుటచే, బ్రహ్మాత్మకము బ్రహ్మయే ఆత్మగా కలవాడు జీవుడు పరమాత్మకు శరీరమైన జీవాత్మ - ప్రకృతికి

---

32 విష్ణు పురాణము 1 2 67
33 తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లి : 11
34 తైత్తిరీయోపనిషత్తు - నారాయణవల్లి : 13 1
35 తైత్తిరీయోపనిషత్తు - నారాయణవల్లి 13
36 తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లి 11
37 తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లి : 13

ప్రతిరూపములైన దేవ, మనుష్య, యక్ష, రాక్షస, పశు, పక్షి, వృక్ష, శిలాదులను శరీరముగా కలిగియున్నాడు - సమస్తమైన, చిదచిత్స్వరూపమైన ప్రపంచము సర్వము బ్రహ్మాత్మకము కనుక, 'తత్త్వమసి' ౩౮ నీవు ఆ బ్రహ్మాత్మకుడవై యున్నావు' అని భావము 'తత్, త్వమ్, అసి' అని పద విభాగము 'తత్' శబ్దము బ్రహ్మప్రతిపాదకము జీవుడు బ్రహ్మాత్మకు డగుటచే, 'త్వమ్' శబ్దముకూడ బ్రహ్మ ప్రతిపాదకమే అగుచున్నది కనుక, 'తత్' శబ్ద 'త్వమ్' శబ్ద ప్రతిపాద్యుడు పరమాత్మయే బ్రహ్మ సర్వశబ్దవాచ్యు డగుటచే, 'తత్ త్వమ్' అని సామానాధికరణ్యముచేతను, జీవ శరీర మగుటచేతను జీవ ప్రకారమైన పరమాత్మయే చెప్పబడుచున్నాడు

'త్వమ్' అని ఎవడు దేహమున కధిష్ఠాతయై తోచబడు చుండునో, అట్టి ఆత్మ - పరమాత్మకు శరీర మగుటచే, పరమాత్మకు ప్రకారభూతుడై, పరమాత్మపర్యంతమైనవాడు అందువలన, 'త్వమ్' అను శబ్దము ఆత్మప్రకారముగల ఆత్మాన్తర్యామినే చెప్పును

**"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి ౩౯**

ఈ జీవాత్మ శరీరకుడునై ప్రవేశించి, నామము, రూపము కల దానినిగా చేయుదు'నని జీవాత్మకు బ్రహ్మ ఆత్మగా కలవాడగుట చేతను, తన పేరును పొందియుండుటచేటను 'తత్' 'త్వమ్' అను పదములు జగత్తునకు కారణమై, సకల కల్యాణ గుణాశ్రయుడైన హేయప్రత్యనీకునిగా తెలుపును 'త్వమ్' అనియు ఆ బ్రహ్మనే జీవునకు అంతరాత్మరూపుడై, శరీరముతో గూడిన జీవుడు ప్రకారము కలవానిగా తెలుపును ఈ విధముగా - ప్రవృత్తి నిమిత్తముగా బ్రహ్మయందే 'తత్' 'త్వమ్' అను పదములకు పర్యవసానము చెప్ప

బడినది జగత్కారణత్వ - విశిష్ట జీవాత్మత్వ విశిష్టమైన రెంటికిని ఐక్యము సామానాధికరణ్యముచే ప్రతీత మగుచున్నది

## సామానాధికరణ్యము

"భిన్నప్రవృత్తి నివృత్తానాం శబ్దానాం ఏకస్మి న్నర్థే వృత్తిః సామానాధి రణ్యమ్ "

అని మహాభాష్యకారులు నుడివిరి భిన్నమైన ప్రవృత్తి మిత్తములైన శబ్దములకు ఒక విశేష్యరూపమైన యర్థమందు ర్యవసానము సామానాధికరణ్యము' అని దీని భావము ఉదాహర కు - 'నీలోత్పలము' (నల్లని కలువ పూవు) అనుచోట, నీల శబ్దము లత్వరూప గుణప్రవృత్తి నిమిత్తము అది నీలత్వ విశిష్ట గుణమును ోధించును ఉత్పల శబ్దము ఉత్పలత్వ రూపజాతిప్రవృత్తి నిమిత్తము ఉత్పలత్వ విశిష్ట ఉత్పలమును బోధించును ఈ రెంటికిని ఒకే భక్తియం దుండుటవలన ఐక్యము స్పష్ట మగుచున్నది నీలత్వ శిష్టము, ఉత్పలత్వ విశిష్టము ఉత్పల మొక్కటియే కనుక, భిన్న ప్రవృత్తి నిమిత్తములైన నీల, ఉత్పల శబ్దములకు విశేష్యమైన ఉత్పలమందే పర్యవసానము కనుక, సామానాధికరణ్యము సిద్ధము

"సమానం అధికరణం యయోః తే తస్య భావః సామానాధికరణ్యమ్ "

అని విగ్రహ వాక్యము 'నామాన్నితే సమానాధికరణే,[40]అని, పాణిని సూత్రమున చెప్పబడినది సమానార్థత్వమే సామానాధి కరణ్యము 'తత్త్వ మసి[41] నీ వా బ్రహ్మకుత్మడవై యున్నావు సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ'[42] సత్యము, జ్ఞానము, అనంతము

40 అష్టాధ్యాయీ 1-79

41 ఛాందోగ్యోపనిషత్తు 6 8 7

42 తైత్తిరీయోపనిషత్తు - ఆనంద వల్లి 1 3

బ్రహ్మ' అనుచోట్ల, ప్రవృత్తి నివృత్తి భేదముచేతనే సామానాధి కరణ్యము ప్రకారద్వయ విశిష్టైక వస్తు ప్రతిపాదనముచేత సామా నాధికరణ్యము సిద్ధము అందువలన, విశిష్టాద్వైతమున సామానాధి కరణ్యమునకు అత్యంత ప్రాధాన్య మీయబడినది

## మహా వాక్యము

సవిశేష బ్రహ్మ విషయిక వాక్యము మహావాక్య మనబడును 'తత్త్వమసి' 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' మొదలగు సవిశేష ప్రతిపాదక వాక్యములు మహా వాక్యములు 'తత్త్వమసి'అనుచోట - సామానాధికరణ్యముచేత జీవాంతర్యామి గుణవిశేషముచెప్పబడినది 'అయ మాత్మా బ్రహ్మ' [4] ఈ యాత్మ బ్రహ్మ యనబడును

'స త ఆత్మా అంతర్యా మ్యమృతః' [44] 'ఈ యాత్మ - అంతర్యామి, అమృతము అయినది' అనుటవలన, జగదంతర్యా మిత్వముచేత, నీయొక్క ఆత్మ అది యని అర్థము కనుక, 'తత్' శబ్దముచేతను' 'త్వమ్' శబ్దముచేతను పరమాత్మయే చెప్పబడు చున్నాడు.

'త త్సత్యమ్' [45] 'త త్సర్వమ్' [46] 'త దాత్మా' [47] 'త ద్బ్రహ్మ [48]' మొదలగుచోట్ల 'తత్' శబ్దముచేత చెప్పబడుచున్న పరమాత్మ నీకు అంతర్యామి యగుటవలన 'తత్త్వమసి' నీవు ఆ బ్రహ్మాత్మకుడవై యున్నావు' అని భావము

---

43 బృహదారణ్యకోపనిషత్తు 6 4 5
44 ఛాందోగ్యోపనిషత్తు 6 8 6
45 ఛాందోగ్యోపనిషత్తు 6 8 6
46 తైత్తిరీయోపనిషత్తు - నారాయణవల్లి
47 పురుష సూక్తము
48 పురుషసూక్తము




'ఇదం సర్వం యదయమాత్మా'[49] ఈ సర్వము ఏదియో అది ఆత్మ 'అయ మాత్మా బ్రహ్మ'[50] ఈ యాత్మయే బ్రహ్మ అనుట వలన, సర్వము బ్రహ్మాత్మక మగుటచేత, 'తత్త్వ మసి' నీవు ఆ బ్రహ్మాత్మకుడవై యున్నావు' అని భావము

'తత్' 'త్వమ్' అను పదములు సవిశేష బ్రహ్మాభిధాయకము లగుటవలన, 'తత్త్వ మసి' అను వాక్యమునందు సామానాధికరణ్యము నిర్విశేష వస్త్వైక్య పరము కాదు 'తత్' 'త్వమ్' పదములు - సత్యకాముడైన, సత్యసంకల్పుడైన, సర్వజ్ఞుడైన, సర్వశేషియైన, సర్వాంతర్యామియైన పరమాత్మను బోధించుచున్నవి

## 'సోఽయం దేవదత్తః' విచారణము

వేదార్థ సంగ్రహమున 'తత్త్వ మసి' వాక్యమును బోలిన 'సోఽయం దేవదత్తః' అతడే దేవదత్తుడు' అను వ్యావహారికోదాహరణవాక్యము స్పష్టము చేయబడినది ఈ వాక్యవిచారణమున 'సః' (అతడు) అను శబ్దముచేత, దేశాంతరమందు కాలాంతర సంబంధియయిన పురుషుడు చెప్పబడుచున్నాడు అనగా పురుషుడు - రెండు కాలములందు, రెండు తావులలో నున్నాడు అందువలన, భూత - వర్తమాన క్రియా ద్వయ సంబంధమైన ఐక్యమును ప్రతిపాదించుట విరుద్ధము కాదు దేశద్వయమునకు గల భేదము కాలముచే పరిహరింపబడినది ఈ అభేదము 'లక్షణ'చే సాధింపబడుచున్నదన్నచో, అది సరికాదు రెండు పదార్థములకు లక్షణ నాశ్రయించుట సరికాదు లక్షణచే లక్షితమైన ఒక పదార్థముచేతనే విరోధము పరిహరింపబడినది

---

49 బృహదారణ్యకోపనిషత్తు : 2 4 6

50 బృహదారణ్యకోపనిషత్తు 6 4 5

'సోఽయం దేవదత్తః' అతడే యీ దేవదత్తుడు' అను చోట, లక్షణయే లేదు దేశాంతరమునం దుండుట భూతకాలమున, వర్తమానకాలమున మఱియొక దేశమునం దుండుట సంభవము కాదు గదా! అసంభవమైనచో, 'లక్షణ' నాశ్రయించవలెను 'గంగాయాం ఘోషః' గంగలో 'గొల్లపల్లి' యనుచోట, గంగాప్రవాహములో గొల్లపల్లి యుండుట అసంభవముకనుక, 'తీరమునందు - సమీపమున' అని లక్షణచేత చెప్పబడుచున్నది కనుక, 'సోఽయం దేవదత్తః' అనుచోటకూడ, సామానాధికరణ్యముచేతనే ఐక్యము సిద్ధించుచున్నది లక్షణచే కాదు అట్లే, 'తత్త్వమసి' అనుచోట కూడ, 'తత్' శబ్దయుక్తమైన, జగత్కారణభూతవిశిష్టమైన పరమాత్మకు-'త్వమ్' శబ్దయుక్తమైన జీవాత్మకు అంతర్యామివిశిష్టుడైన పరమాత్మకు - ఐక్యము సామానాధికరణ్యముచేతనే ప్రతీయమానమగుచున్నది కేవల స్వరూప మాత్రైక్యము సామానాధికరణ్యము యొక్క ఉద్దేశ్యము కాదు వైదిక శబ్దము లన్నియు బహు విధములుగా పరమాత్మనే ప్రతిపాదించుచున్నవి అందువల్లనే అతడు 'సర్వశబ్దవాచ్యుడు' పరమాత్మ కారణము చిదచిత్తులు కార్యము కనుక, ప్రకృతిలో జీవుడు, జీవాత్మలో పరమాత్మయు అపృథక్సిద్ధ సంబంధములో - అనగా, విడదీయుటకు వీలులేని విధముగా విశిష్టైక్యముగా నున్నారని 'తత్త్వమసి' వాక్యముయొక్క అంతరార్థము

## 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్'

వేదార్థ సంగ్రహమున విశిష్టాద్వైత మతానుసారము ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము నిరూపింపబడినది ఇతరులు చేయు పూర్వపక్షములు నిరాకరింపబడినవి 'ఒకటి తెలిసినచో, అన్నియు తెలియును' అను ఈ సిద్ధాంతము ఛాందోగ్యోపనిషత్తునందు, శ్వేత

కేతు వను కుమారుని గూర్చి, తండ్రి ఉద్దాలకునిచే చెప్పబడినది తర్క-శాస్త్ర జ్ఞానమువలన తర్క-శాస్త్రజ్ఞానమే సంభవించును వ్యాకరణశాస్త్రజ్ఞానమువలన వ్యాకరణశాస్త్రజ్ఞానమే సంభవించును ఇతర సమస్త శాస్త్రముల జ్ఞానము ఎట్లు సంభవించును ?' అని సందేహించుచున్న తనయుడగు శ్వేతకేతువునకు ఉదాహరణముతో నిట్లు వివరించుచున్నాడు తండ్రి యగు ఉద్దాలకుడు -

'ఒక మట్టిముద్దతో - కుండ, ముంత, మూకుడు మొదలగు నవి చేయబడుచున్నవిగదా ! అట్టి స్థితిలో - ఆ మట్టిముద్దను గూర్చి తెలిసికొన్నచో, దానితో తయారగు ఘట శరావాదు లన్నింటి జ్ఞానము తెలియునగదా ! అట్లే ఈ జీవ జగత్తుల కన్నింటికిని మూల కారణ మెవరో తెలిసికొనినయెడల, సర్వజ్ఞానము సంభవించును

**ఇదం సర్వం యదయ మాత్మా "** 51

ఈ సర్వము ఏదియో - అది ఆత్మ

**"అయ మాత్మా బ్రహ్మ "** 52

ఈ ఆత్మయే బ్రహ్మ యనబడును

**యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి**
**యత్ప్రయం త్యభిసంవిశన్తి త ద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మేతి "** 53

ఈ భూతము లన్నియు దేనివలన జన్మించుచున్నవో, దేని వలన జీవించుచున్నవో, దేనియందు లయమగుచున్నవో అది బ్రహ్మ అని తెలిసికొనదగినది

ఏష సర్వభూతా న్తరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" 54

---

51 బృహదారణ్యకోపనిషత్తు 2 4 5
52 బృహదారణ్యకోపనిషత్తు 6-4-5
53 తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి 1
54 సుబాలోపనిషత్తు 1

ఈ సర్వభూతములందలి యంతరాత్మ - పాపము లంటని వాడు, దివ్యమైన దేవుడు ఒక్క నారాయణుడే అని శ్రుతులు బోధించుచున్నవి కనుక, అట్టి బ్రహ్మజ్ఞానమువలన సర్వవిజ్ఞానము సంభవించునని స్పష్టమగుచున్నది

## ఉపాదాన కారణము

దృశ్యమానమగు ఈ సకల జగమునకు సర్వశబ్దవాచ్యుడగు పరమాత్మయే ఉపాదానకారణము, నిమిత్తకారణముగూడ కారణ జ్ఞానముచే కార్యజ్ఞానము సంభవించునని దర్శనములు స్పష్టము చేయుచున్నవి మూలపదార్థము రూపాంతరముల నందుచున్నదో, అది ఉపాదానకారణము రూపాంతరములు ఉపాదేయ కార్యములు మృత్పిండ ఘట శరావాది దృష్టాంతముచే, జగద్బ్రహ్మలకు ఉపాదాన ఉపాదేయ భావ మున్నదని స్పష్టమగుచున్నది అట్లే, 'సర్వ' పదముచే, జగత్సర్వము - కార్యవర్గమునం దుండుటవలన, మఱియొక నిమిత్తకారణము లేదనియు, ఉపాదానకారణము బ్రహ్మయే, నిమిత్త కారణముకూడ బ్రహ్మయే యని స్పష్టమగుచున్నది

స దేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్ " 55

అను శ్రుతియందలి అద్వితీయ పదముకూడ, మఱియొక నిమిత్త కారణము లేదని స్పష్టము చేయుచున్నది కనుక, జగత్సర్వమునకు ఉభయవిధ కారణ సమర్థుడు పరమాత్మయే యని భావము

ఉపాదాన మనగా - రూపాంతరమును పొందుటయే చైతన్యాశ్రయమైనది జగత్తు ప్రపంచమునందు ప్రతిక్షణము ప్రతిపరమాణువు పరిభ్రమించుచుండును సృష్టికి పూర్వము సూక్ష్మరూపముగా

55 ఛాందోగ్యోపనిషత్తు 6-2 1

నున్న జీవ జగత్తులు - సృష్టికాలమునందు విస్తృతరూపమును ధరించుచున్నవి ఈ జీవ జగత్తులందు అంతర్యామిగా సర్వవ్యాపకుడై యున్న పరమాత్మ వీనికి సంకోచ వికాసములు కల్పించుచున్నాడు పరమాత్మ కారణము జగత్సర్వము కార్యము కనుక, పరమాత్మ జ్ఞానముచే సర్వజ్ఞానము సంభవించునని స్పష్టమగుచున్నది

## పరమాత్మయే సర్వకారణము

సృష్టి స్థితి లయ కాలత్రయమునందు చిదచిత్తులకు పరమాత్మతో అపృథక్సిద్ధసంబంధ ముండుటవలన పరమాత్మ సర్వదా చిదచిద్విశిష్టుడే భగవంతునిచే గీతయందు స్వయముగా ఇట్లు చెప్పబడినది -

**"భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా " 56**

పృథివ్యప్తేజో వాయ్వాకాశములు, మనస్సు మొదలగు ఇంద్రియ సమూహము, మహత్తత్వ మనబడు బుద్ధి, మూడు విధములైన అహంకారము అని ఎనిమిది విధములుగా విభజింపబడిన ఈ ప్రకృతి నాదే' అని -

**"అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్**
**జీవభూతాం మహాబాహో ! యయేదం ధార్యతే జగత్ " 57**

అర్జునా ! (అచేతనమైన) ఈ ప్రకృతి నికృష్టమైనది దీని కంటెను ప్రధానమైన మఱియొక నా ప్రకృతి - జీవరూపమై యున్నది దానినే ఈ జగము ధరించుచున్నదని తెలిసికొనుము '

---

56 భగవద్గీత 7 4
57 భగవద్గీత 7-5

ఇట్టి ప్రమాణములను బట్టి, పరమాత్మ సర్వదా చిదచి ద్విశిష్టుఁడని స్పష్టమగుచున్నది

సూక్ష్మరూపమున తనయందుగల చిదచితులకు స్థూలరూప మును కల్గించుటయే సృష్టి యనియు, విస్పృతరూపమున పరమాత్మతో నుండుటయే స్థితి యనియు, సూక్ష్మరూపమున పరమాత్మతో ఏకీ భావము నందుటయే లయ మనియు నిర్వచింపఁబడును కనుక, సృష్టి - స్థితి - లయ కారకుఁడైన ఆ పరమాత్మజ్ఞానమువలన, సర్వవిజ్ఞానము సంభవించునని స్పష్ట మగుచున్నది

"అన్త ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్స్థితః" 58

లోపల, వెలుపల అంతటను వ్యాపించియున్నవాఁడు నారా యణుఁడు

"విష్ణో స్సకాశా దుద్భూతమ్" 59

విష్ణువునుండి ఈ సర్వ ముద్భవించెను' అను ప్రమాణము వలన, ఆ పరమాత్మ నారాయణుఁడే యని స్పష్టమగుచున్నది

## సత్కార్య వాదము

దార్శనికుల వాదములలో నొకటియైన సత్కార్యవాదమును విశిష్టాద్వైతులు సమర్థించుచున్నారు ఈ సత్కార్యవాదమును గూర్చి వేదార్థ సంగ్రహమున సంగ్రహముగాఁ జెప్పఁబడినది కాని, ఈయంశ మెంతయో వివరింపఁదగినది విశిష్టాద్వైత మతమునందు ఉపాదానా తిరిక్తమైన కార్యద్రవ్యము లేదు అవస్థాభేదమున్మాత్రమే స్వీకరింపఁ బడినవి

58 తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లి : 11

59 విష్ణుపురాణము : 1-1 31

స దేవ సోమ్య ! ఇద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్ ॥ 60

అని శ్రుతి కదా! కార్యకారణ భావావస్థాద్వయావసితమైన వస్తువుయొక్క ఏకావస్థాజ్ఞానముచేత అవస్థాంతరావసిత వస్తుజ్ఞానము సంభవించుననను ఐక్యమును మృద్దృష్టాంతముతో చూపి, శ్వేతకేతువుకు తెలియని బ్రహ్మయొక్క సర్వకారణత్వమును తెలియఁజేయుటకు గాను - 'ఇద మగ్రే స దేవాసీత్' ఇది మొదట సత్తే అయియుండెను అని 'ఇదం' శబ్దవాచ్యమైన ప్రపంచమునకు సదాపత్తిరూపమైన క్రియను, సద్ద్రివ్యతను చెప్పుచున్నాఁడు ఇది ప్రతిపాదింపఁబడుట వలన, పరమాత్మ జగదుపాదానత్వము స్పష్టమగుచున్నది కారణ భూతమైన ద్రవ్యమొక్కటే అవస్థాంతర యోగముచేత కార్య మనఁ బడుచున్నది' అనుటే సత్కార్య వాదము

సమస్త విశ్వమునకు మూలపదార్థ మొక్కటియే ఎప్పుడును కార్యము కారణమునందే ఉండుటవలన, కారణ సంబంధము పరిణామమే యను వాదము సత్కార్యవాదము కనుక, కారణమైన పరమాత్మయందు సూక్ష్మరూపమైన, అంతర్లీనమైయున్న సమస్తము స్థూలరూపముగా పరిణామము నందుచున్నట్లు స్పష్టమగుచున్నది సాంఖ్య వేదాంతుల మతములందు కారణముకంటెను భిన్నమగు కార్య మేదియు లేదు అదియే సత్కార్యవాదము

ఉపాదాన కారణమునందు ఉత్పత్తికి పూర్వము కార్యము కారణ రూపమున ఉన్నది యను వాదము సత్కార్యవాదము దేని యందు కార్యము సూక్ష్మరూపముగా అంతర్గతమై యున్నదో, ఆ వస్తువు కారణము ఈ విషయము బహు విధములుగా పండితులచే చర్చించబడినది లేని వస్తువు ఏ క్రియయందును కారణము కాదు ఉదాహరణమునకు - శశ విషాణము ఉత్పత్తి క్రియకు ఆస్పదము

---

60 ఛాందోగ్యోపనిషత్తు 6 2-1

కాదు అవిద్యమానమైన వస్తువు సద్వస్తువు కాఁజాలదు ఉత్పన్నమైన వస్తువు ఏ వస్తువునుండి ఉత్పన్నమైనదో, ఆ వస్తువుకంటెను అభిన్నము ఏ వస్తువునుండి ఒకటి ఉత్పన్నమైనదో - అది ఉత్పత్తికి పూర్వము దాని కారణరూపముగనే ఉండెను కార్యమునందు కారణస్వభావము కనబడుచున్నది వస్త్రమునందు నూలుపోగు వలె, ఆభరణమునందు సువర్ణమువలె, ఘటమునందు మట్టివలే అయినను, వస్త్రము నూలుపోగుకంటెను భిన్నమైనదికాదు ఆభరణము సువర్ణము కంటెను భిన్నముకాదు ఘటము మృణ్మయముకంటెను భిన్నము కాదు కారణమునం దంతర్లీనమైన స్వరూపము స్పష్టముగా బహిర్గత మగుటయే కార్యము కారణ సామర్థ్యము కార్యమునందు స్పష్టమగుచున్నది కారణము, కార్యముకూడ ఒకే వస్తువుయొక్క భిన్నావస్థలు ఈ భిన్నత్వము వస్తువు నుపయోగించుకాలమునందు స్పష్టమగుచున్నది మట్టికుండ నీటినిఁ దెచ్చుట కుపయోగించును మట్టి అట్లు ఉపయోగపడదు ఈ విధముగా - కార్యకారణములకు గల భేదములు క్రియాకలాపములందు స్పష్టమగును కనుక, సత్కార్యవాద సిద్ధాంతప్రకారము - కార్యము, కారణముకూడ ఒకే వస్తువుయొక్క భిన్నావస్థలు అనునది స్పష్టము

సత్కార్యవాదుల మతమున ఉత్పత్తి యనఁగా - ఆవిర్భవించుట ఆవిర్భావముయొక్క పూర్వావస్థయే ప్రాగభావము ఆవిర్భూతమైన కార్యముయొక్క విరోధాభావావస్థయే ప్రధ్వంసాభావము 'స దేవ సౌమ్య! ఇద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్'[61] అనుచోట - ఇప్పుడు నామరూపములతో - నానావిధములుగానున్న జగత్తు, ఇంతకు పూర్వము రూపవిభాగాభావముతో ఒక్కటియే అయియుండెను అది అద్వితీయమైన బ్రహ్మ ఆ బ్రహ్మయే

---

61 ఛాందోగ్యోపనిషత్తు 6 2 1

'బహుస్యాం ప్రజాయేయ'[62] బహువిధములుగా అయ్యెదనని సంకల్పించి, తేజః ప్రభృతి వివిధ విచిత్ర స్థిరత్వ సరూపజగదాకారము నందుటచే, పరమాత్మ - జీవ - జగత్తుల విశిష్టైక్యము స్పష్టమగు చున్నది

## పరిణామ వాదము

కార్యకారణములకు భేదము లేకున్నను, కార్యములందు వివిధ భిన్నత్వము కనంబడుచున్నది ఎట్లనగా - మట్టిచే చేయబడిన కుండ, ముంత మొదలగునవి స్వరూపభేదములు అవి యన్నియు మట్టిమయమే అట్లే, జగన్మూలకారణమైన పరమాత్మ - వివిధ రూపములుగా పరిణమించుచున్నాఁడు, కనుక, పరమాత్మ పరిణామమే ప్రపంచము అను వాదము పరిణామవాదము పాలు ఎట్లు పెరుగుగా మార్పు చెందు చున్నదో, అట్లే పరమాత్మ - ప్రపంచాకారముగా పరిణమించుచున్నాఁడు పరిణామ మనఁగా - విపాకము అవస్థానాశపూర్వక అవస్థాంతరప్రాప్తి ఆగంతుక ధర్మమని లక్ష్యార్థము దాని పరిణామ మనఁగా - దాని అవస్థాంతరప్రాప్తియే యని ముఖ్యార్థము

సృష్టికి పూర్వము సూక్ష్మరూపమున పరమాత్మను విడిచి యుండని సంబంధముతోఁగల చిదచిత్తులు పరమాత్మకు శరీరముగా నుండి, సృష్టికాలమున సృష్టిక్రమమార్గము ద్వారా విస్తృత రూపమును ధరించుచున్నవి సూక్ష్మావస్థనుండి స్థూలావస్థను పొందుటయే సృష్టి యనఁబడును సృష్టికాలములోకూడ చిదచిత్తులు పరమాత్మను విడువకయే యుండును ప్రళయకాలమున స్థూలావస్థనుండి సూక్ష్మావస్థను పొందును అట్టి యవస్థయే ప్రళయ మనఁబడును ప్రళయ మనఁగా - సంకోచము నందుట సంకోచ వికాసముల నందుటయే పరిణామ మని భావము

62 తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లి 6

కారణమున కార్యము సూక్ష్మరూపమున నుండును కారణముయొక్క వికాసమే కార్యము స్పష్టస్వరూపము వికాసమునం బడును కార్య కారణములకు గల భేదము అవస్థాభేదమే కాని, అత్యంత భేదము కాదు

"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" 63

ఆ బ్రహ్మ ఇట్లు తలచెను 'అనేక విధము లయ్యెదను, అందులకై పుట్టెదను' అని

"తదాత్మానం స్వయ మకురుత" 64

ఆ బ్రహ్మ తనను తానే చేసికొనెను

"తదను ప్రవిశ్య, సచ్చత్యచ్చాభవత్" 65

దానియందు ప్రవేశించి, బహువిధములుగా నయ్యెను.

ఈ మొదలగు శ్రుతివచనములచే, పరమాత్మయే ఉపాదాన కారణము, నిమిత్తకారణము ననియు, ప్రపంచాకారముగా పరిణమించుననియు స్పష్టమగుచున్నది

పరమాత్మయొక్క నిరవద్యత్వ, సత్యసంకల్పాదుల వలన జగదాకారముగా పరిణమించుటలో సందేహము లేదు 'పరిణామాత్' 66 పరిణామమువలన' అని బ్రహ్మసూత్రము స్పష్టము చేయుచున్నది అవిభక్తనామరూపరహితాది సూక్ష్మచిదచిద్వస్తుశరీరకుండైన పరమాత్మ కారణావస్థలో నుండి, స్వయంసంకల్పశక్తిచే విభక్త వివిధ నామరూప స్థూల చిదచి ద్వస్తు శరీరకుం డగుచున్నాఁడు కనుక,

63 ఛాందోగ్యోపనిషత్తు 6-2 3
64 తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి 7
65 తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి 8
66. బ్రహ్మసూత్రము 1 4-27

చిదచిత్తులకు, పరమాత్మకు గల విశిష్టైక్యము పరిణామవాదముద్వారా స్పష్ట మగుటచే, విశిష్టాద్వైతులచే పరిణామవాదము సమర్థింపఁబడినది

## సృష్టిక్రమ విధానము

భగవత్సంకల్పమువలనే జగత్తు సృష్టింపబడుచున్నది సృష్టికి పూర్వము సూక్ష్మరూపమున పరమాత్మతో కూడియున్న 'అచిత్తు' అను ప్రకృతి - విస్తృతముగా పరిణామము నందుటే సృష్టి యనఁబడును అవ్యక్తమైన అచిత్తు వికారములను ప్రసరింపజేయును గనుక, 'ప్రకృతి' యనఁబడును ప్రకృతియందలి గుణములు భగవత్సంకల్పము వలన వైషమ్యమును పొంది, సృష్ట్యనుకూలావస్థ పొందును అట్టి యవస్థయే అవ్యక్త మనఁబడును దానినుండి మహత్తు ఉద్భవించును ఆ మహత్తు - సాత్త్వికము, రాజసము, తామసము అని మూఁడు విధములు దీనివలననే దేహాత్మాభిమానము కల్గును రాజసాహంకార సాహాయ్యముతో తామసాహంకారమునుండి పంచతన్మాత్ర లుదయించును తన్మాత్ర లనఁగా - భూతముల కుపాదానమగు భూతాద్యవహిత సూక్ష్మావస్థా విశిష్టద్రవ్యము శబ్ద తన్మాత్రము, స్పర్శ తన్మాత్రము, రూప తన్మాత్రము, రస తన్మాత్రము, గంధ తన్మాత్రము అని తన్మాత్రములు ఐదు ఈ తన్మాత్రములే భూతములుగా విస్తరించును విశిష్ట శబ్దాది విషయాధికరణము భూత మనబడును శబ్దతన్మాత్రము ఆకాశముగా, స్పర్శతన్మాత్రము వాయువుగా, రూపతన్మాత్రము అగ్నిగా, రసతన్మాత్రము జలముగా, గంధతన్మాత్రము పృథివిగా విస్తారము నందును భూతముల మధ్యలో - తన్మాత్రము లున్నవనియు, అవియే సూక్ష్మాంశము లనియు గమనార్హములు ఆ విధముగా పరమాత్మవలన ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి భూమి,

భూమినుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము, అన్నమువలన జీవుడు ఉద్భవించెను ఈ రీతిగా ప్రతి యుగమందును సృష్టి జరుగునని, ఈ క్రింది శ్రుతి చెప్పుచున్నది

"సూర్యాచంద్ర మసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్ " [67]

విధాత సూర్యుని, చంద్రుని - పూర్వమువలెనే సృష్టించెనని దీని తాత్పర్యము దీనినిబట్టి సృష్టిక్రమము సుస్పష్టము

## ప్రళయక్రమ విధానము

సృష్టి స్థిత్యనంతరము ప్రళయ కాలమున జగత్సర్వము పరమాత్మతో ఏకీభావమునందును ఆ విధముగా ఏకీభావము నందుటయే ప్రళయ మనఁబడును జీవుల భౌతిక దేహములు పృథ్విలో, పృథ్వి జలములో, జలము తేజస్సులో, తేజస్సు వాయువులో, వాయువు ఆకాశములో, ఆకాశము మహత్తులో, మహత్తు అవ్యక్తములో, అవ్యక్తము అక్షరములో, అక్షరము తమస్సులో, తమస్సు పరమాత్మలో లీన మగును ఈ విధముగా సృష్టి స్థితి లయములు భగవదాజ్ఞానుసారము సంకల్పమాత్రముచేతనే జరుగుచున్నవి ఇది పరమాత్మకు క్రీడ వంటిది

"క్రీడతో బాలక స్యేవ చేష్టా తస్య నిశామయ " [68]

అను పురాణ వాక్యమే ఇందులకు ప్రబల ప్రమాణము

## మోక్షము

పరమాత్మ ప్రాప్తియే మోక్షము మోక్షమే పరమ పురుషార్థము క్షయ శూన్యమైనది, నిరతిశయమైనదియు పరమత్వ మన

---

67 తైత్తిరీయోపనిషత్తు నారాయణవల్లి 1 33

8 విష్ణుపురాణము : 1-2 18

బడును పరశేషతైకరసస్వరూపావిర్భావపూర్వకమైన నిరవధిక సుఖప్రాప్తియే మోక్షమని వేదాంతదేశికులు 'న్యాయసిద్ధాంజన' మను గ్రంథమున నుడివియున్నారు.

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ " 69

పరబ్రహ్మ ఆనంద స్వరూపుడు అట్టి పరమాత్మను జీవాత్మ పొంది, ఆనందము నొందును

"రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి " 70

బ్రహ్మయే సుఖమనియు, బ్రహ్మమును పొంది సుఖించుచున్నాడనియు దీని భావము

## బ్రహ్మప్రాప్త్యుపాయము

నిరతిశయమైన పుణ్యముచే సమస్త పాపములు నశింపగా - పరమ పురుషుని చరణారవిందములందు చేసిన శరణాగతివలన జనించిన అభిముఖ్యమును కల్గి, సదాచార్యుల ఉపదేశముచే విశదీకరింపబడిన శాస్త్రజ్ఞానమును పొంది, తత్త్వయాథాత్మ్య జ్ఞానపూర్వకముగా అనుదినము అభివృద్ధి నందుచున్న శమము, దమము, తపము, సదాచారము, క్షమ, ఆర్జవము, భయాభయస్థాన వివేకము, దయ, అహింస మొదలగు ఆత్మ గుణములతో కూడియుండి, వర్ణాశ్రమములకు తగిన పరమ పురుషారాధన రూపమగు నిత్య - నైమిత్తిక కర్మల నాచరించుచు, నిషిద్ధాగరిష్ఠులై, పరమపురుషుని చరణారవిందములందుంచబడిన ఆత్మీయ భావముతో, భగవద్భక్తిచే ఎల్లప్పుడు - స్తుతి, స్మరణ, వందన, ప్రయత్న, కీర్తన, గుణశ్రవణ, గుణవచన, ధ్యానా

69 తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి : 6
70 తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి 7-1

ర్చన, ప్రణామముల నాచరించ - ప్రీతుఁడైన పరమకారుణికుఁ
పురుషోత్తముని యనుగ్రహమువలన, తనలోని అజ్ఞానమను తమ
నశింపఁగా, అనన్యప్రయోజనమైన భక్తిచేత, పరబ్రహ్మమై
పురుషోత్తముఁడైన శ్రీమన్నారాయణుడు పొందఁదగినవాఁడు. ఇ
అత్యుత్తమ పరమ ప్రాప్త్యుపాయ మని విశిష్టాద్వైత సిద్ధాంతమ

## ముగింపు

వేద వేదాంతముల సర్వార్థమును సప్రమాణముగా, సమ
ముగా బోధించు శ్రీమద్రామానుజుల వేదార్థ సంగ్రహ సార
మిందు సంగ్రహముగా వివరింపఁబడినది ఇయ్యది - వేద వేద
ముల సారసంగ్రహ మగుటచే, ముముక్షువులకు శిరోధార్యము అ

**“రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా”**



# భగవద్రామానుజులు - శ్రీభాష్యము

## (ప్రథమాధ్యాయము)

ఉభయ వేదాంత శిరోమణి

**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు,** ఎం ఏ

—❋—

"అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా "

"పారాశర్య వచస్సుధా ముపనిష ద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతాం
సంసారాగ్ని విదీపన వ్యపగత ప్రాణాత్మ సంజీవనీమ్
పూర్వాచార్య సురక్షితాం బహుమతి వ్యాఘాత దూరస్థితాం
ఆనీతాం తు నిజాక్షరై స్సుమనసో భౌమాః పిబ న్త్వన్వహమ్ "

## బ్రహ్మసూత్ర ప్రశస్తి

తాపత్రయముచే సతమతమగు జీవులు అజ్ఞానాంధకారమున బడి, సదసద్వివేకము లేక తారాడుచుండగా - పరమ కారుణికుడగు సర్వేశ్వరుడు - తమస్సును హరించి, సదసద్వివేకమును కల్గించుటకు అంధకారమున నుండువానికి దీపమువలె ప్రమాణ మూర్ధన్యమగు వేదమును ప్రసాదించెను తాపత్రయము నడగించు ఆనంద రూపమగు పరమ పురుషార్థము అలౌకికమైనదగుటచే, దానిని సాధించుటకు - ప్రత్యక్షము, అనుమానము అను ప్రమాణములు సమర్థములు కావు కావున, శబ్దమునే ఆశ్రయింపవలయును అట్టి శబ్ద ప్రమాణములలో వేదము సర్వోత్తమమైనది ఇది అపౌరుషేయము ఇందు, పురుషబుద్ధిసహజములను భ్రమ - ప్రమాదము లుండవు

అజ్ఞానమునఁ దలంగుచున్న చేతనులపై వాత్సల్యము కలిగిన వేదమాత - యథార్థజ్ఞానము నందింప సన్నద్ధమై యుండును కావున, అదియే మనకు సర్వదా సర్వథా ఆశ్రయింపదగినది

ఆ వేదమున రెండు భాగములు గలవు అందు పూర్వభాగము పశువులు, పుత్రులు, వర్షము, అన్నము, స్వర్గము మొదలగు ఐహికాముష్మికము లగు కర్మలను విధించుచు, విడువదగినవానిని బోధించుచు, అభ్యుదయమును చేకూర్చును ఉత్తర భాగమగు వేదాంతము (ఉపనిషత్తులు) పరమపురుషార్థమును, ఆనందస్వరూపుడును అగు శ్రీమన్నారాయణుని ప్రతిపాదించి, వానిని పొందు ఉపాయమును నిరూపించుచు, నిశ్శ్రేయసమును చేకూర్చుచున్నది ఇట్టి వేదరూప ప్రమాణము నొసంగి, ఆ సర్వేశ్వరుడు ఆయా అవతారముల - దానినిగూర్చిన జ్ఞానమునుగూడ స్థిరముగా నుండునట్లు ప్రయత్నించెను శ్రీమన్నారాయణుని వలన కలిగిన ఆ జ్ఞానము కృతయుగమున మాత్రమే అట్లు నిలబడి, త్రేతాయుగమున మార్పుచెంది, ద్వాపర యుగమున ఖిల మాయెను ఇట్లు వైదికమగు జ్ఞానము లుప్తము కాగా, ఏది ప్రమాణము ? ఏది ప్రమేయము ? అని నిర్ధరించుకొన లేక, సంకీర్ణబుద్ధులై, దేవతలు శ్రీమన్నారాయణుని పొంది, ప్రమాణ ప్రమేయముల వివేకము కలిగింపవలసినదిగా ప్రార్థించిరి అప్పుడు శ్రీమన్నారాయణుడు పరాశరునకు సత్యవతియందు వ్యాసభగవానుడుగా అవతరించెను కాని, క్షీణబుద్ధులగువారు వేదార్థము నవగాహనము చేసికొనలేరని తలంచి, వ్యాసమహర్షి సంక్షేపముగ సూత్రములను వ్రాయ సంకల్పించెను అందు - ధర్మప్రతిపాదకమగు పూర్వభాగమునకు - తన శిష్యుడగు జైమిని సూత్రములను వ్రాయుటచే, దానిని వదలి, బ్రహ్మప్రతిపాదకమగు వేదమున ఉత్తర భాగమగు వేదాంతమునకు సూత్రములను స్వయముగ రచించెను ఈ పూర్వ భాగమునకు సంబంధించిన సూత్రములను 'పూర్వ మీమాంస'

అని యందురు వేదాంతమునకు వ్యాసమహర్షి రచించిన సూత్రము లను 'ఉత్తర మీమాంస' అనియు, శారీరక మీమాంస యనియు అందురు వీనికే 'బ్రహ్మ సూత్రములు' అని పేరు

బ్రహ్మసూత్రములను పూర్వాచార్యులు పలువురు వ్యాఖ్యా నించి, అందలి పరతత్త్వము శ్రీమన్నారాయణుడే యనియు, మోక్ష మునకు రాజమార్గము భక్తియే యనియు ప్రతిపాదించిరి కాని, తరువాత కొందరు కుదృష్టులు సరియైన దర్శనము లేక, తత్త్వా లోకము లేనివారై, వేదాంతమున అపార్థములను ప్రతిపాదించి, మోక్షమును కరటకావృత మొనర్చిరి అట్టి కుదృష్టులు నిరూపించిన మార్గమున మోహితులై ప్రవర్తించుచున్న చేతనులను చూచి, వాత్సల్యముచే ఆ మోహమును తొలగింపవలసినదిగా లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని ప్రార్థించెను ఆ ప్రార్థన నంగీకరించి సర్వేశ్వ రుడు - శేషుని భగవద్రామానుజులుగా అవతరింపజేసెను ఆ రామానుజ యతిసార్వభౌములు - తత్త్వాలోకము లేక, కుదృష్టులై మోహితులగు చేతనకోటికి సిద్ధాంజనముగ శ్రీభాష్యాదులగు సప్త గ్రంథములను ప్రసాదించెను 1 వేదాంతసారము 2 వేదాంత దీపము 3 శ్రీభాష్యము 4 వేదార్థసంగ్రహము 5 గీతాభాష్యము 6 గద్యత్రయము 7 నిత్యగ్రంథము ఇందు - సార, దీప, శ్రీభాష్య ములు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానములు వేదార్థ సంగ్రహము ఉపనిషత్తు లందలి వివిధములకు శ్రుతులకు ముఖ్యార్థములను దెలిపి, ఐక కంఠ్యమును ప్రతిపాదించి, విశిష్టాద్వైతమే సర్వశ్రుతిప్రతిపాద్య మని నిరూపించుచు, శ్రీ శ్రీనివాసుని సన్నిధిని భగవద్రామానుజులు చేసిన యుపన్యాసము శరణాగతి గద్యము, శ్రీవైకుంఠ గద్యము శ్రీరంగ గద్యము అనునవి మూడును గద్యత్రయ మనబడును కర్మ, జ్ఞాన వైరాగ్యములచే సాధింపబడిన భక్తి ప్రపత్తులే మోక్షోపాయ మని నిరూపించుచు, విశిష్టాద్వైతమే కృష్ణభగవానుని సూక్తి ప్రతి

పాద్యమని ఉపపాదించిన భగవద్గీతా వ్యాఖ్యానమే గీతా భాష్యము నిత్యము చేయదగు భగవ దర్చనా విధానమును వివరించు గ్రంథము నిత్య గ్రంథము ఇట్లు భగవదాజ్ఞచే భగవద్రామానుజులు చేత నోజ్జీవనమునకై అవతరించి, శ్రుతి - స్మృతి - సూత్రములకు గల అన్యోన్య విరోధములను పరిహరించి, ఐకమత్యమును కల్పించిరి

శ్రీ రామానుజసూక్తులు అవిస్తృతములు, సుగంభీరములు ఆ శ్రీసూక్తుల యర్థము వాని యనుగ్రహముచేతనే లభింపదగినవి గాని, స్వప్రయోజనముచే కాదు బ్రహ్మసూత్రములకు కుదృష్టులు చేసిన వ్యాఖ్యానములను పరిహరించి, పూర్వాచార్యుల కభిమత మగు అర్థములను ఋషుల మతముల ననుసరించి శ్రీభాష్యకారులు ప్రసాదించిరి ఈ బ్రహ్మసూత్రభాష్యమునే 'శ్రీభాష్య' మని సరస్వతి పరిగ్రహించెను. వీరీ వ్యాఖ్యానమున ఋషుల మతము నతిక్రమింపక, బోధాయనుల వృత్తిని ఆధారముగ చేసికొని, సూత్రములను వివరించిరి ఋషుల అభిప్రాయములను ఋషులే ఎఱుగగలరు పూర్వఋషిప్రణీతములగు వానికి, తరువాత ఋషులు కొందఱు వ్యాఖ్యానములు వ్రాసియున్నచో, వానినే అనుసరింపవలెనుగాని, వానిని వీడి, స్వకపోలకల్పితముగ నూహించి, వ్యాఖ్యానించుట పండితమ్మన్యత యగును ఒకే ఋషి రచించిన గ్రంథములో విరుద్ధముగా రెండభిప్రాయములు కన్పట్టిన, అందొకటి పూర్వపక్షమనియు, రెండవది సిద్ధాంతమనియు గ్రహింపవలెనేగాని, ఒక యభిప్రాయమును అప్రమాణముగ త్రోసిపుచ్చరాదు వేరువేరు ఋషులు పరస్పరవిరుద్ధములగు అభిప్రాయములను వెలిబుచ్చినచో, ఆ విరోధము పరిహరించుటకు శక్యము కానియెడల, వానిలో నేది యుక్తియుక్తమో, దానినే గ్రహింపవలెను అంతేగాని, 'పూర్వర్షి సమ్మతములగు భావములను త్యజించి, దురభిమానమును ప్రదర్శింపరాదు'

అను సిద్ధాంతమును మనమున నిడుకొని, తదనుగుణముగనే భగవద్రామానుజులు తమ శ్రీభాష్య రచనమును కొనసాగించిరి

భగవద్రామానుజుల కాలమునుండి శిష్యాచార్యపరంపరగా వారి గ్రంథములు వాత్స్యశ్రీ వరదాచార్యులవారివరకు వచ్చెను శ్రీభాష్యము సుగంభీరములు, నిగూఢములునగు భావములు గలదియు అయియుండినను, అంతవఱకు వారి వారి హృదయముల ధారణ చేసి, శిష్యులకు వెల్లడి చేయుచుండిరి కాని, రామానుజ యతిసార్వభౌములు అవి యన్నియు గ్రంథరూపమున నుండుట అవశ్యకమని భావించి, వాత్స్య వరదాచార్యులవారిని ఆవేశించిరా యనునట్లు, గంభీరమగు కాలక్షేపమును శిష్యులకు ప్రసాదించిరి ఆ సమయమున వ్యాసభట్టరువారి మనుమలగు శ్రీ సుదర్శనభట్టరువారు శ్రీవాత్స్య వరదాచార్యులవారివద్ద శిష్యులుగా చేరి, ఇరువది నాల్గుసార్లు శ్రీభాష్య కాలక్షేపమును విని, వాత్స్య వరదాచార్యులవారినుండి వినిన విపులములు, విశదములునగు శ్రీభాష్యవిశేషములను వినినట్లుగనే, గ్రంథరూపమున ప్రకాశింపజేసిరి అట్లు వారు రచించిన వ్యాఖ్యానమునకే 'శ్రుతప్రకాశిక' యని పేరు ఆ టీకను శ్రీరంగనాథుని సన్నిధిని విన్నపము చేయగా, రంగనాథుడు విని సంతసించి, సుదర్శనభట్టరునకు వ్యాసార్యులని బిరుదము నొసంగిరి అన్యమత ప్రతిక్షేపము, చేసి, విశిష్టాద్వైతమును ప్రతిపాదించిన శ్రీభాష్యము మన కెంత యావశ్యకమో, అందలి భావములను విశదముగ వ్యాఖ్యానించిన శ్రుతప్రకాశిక అంత యావశ్యకము తల్లిపాలు త్రాగకయైనను పసిబిడ్డ జీవింపవచ్చునుగాని, వేదాంత జిజ్ఞాసగలవారు వ్యాసార్యసూక్తిసుధను గ్రోలక జీవింపలేరు ఎవరైన, ఎప్పుడైనను 'నేనీ క్రొత్త యర్థము నూహించితి' నని భావించి గర్వించినచో - వాని గర్వమును ఈ శ్రుతప్రకాశిక తొలగించగలదు శ్రీభాష్య - శ్రుతప్రకాశికలు విశిష్టాద్వైత సిద్ధాంతమునకు వజ్ర ప్రాకారములు మన పూర్వులు

తమ సంతతికై ఈ మహార్థరత్న నిక్షేపమును కాపాడి, మన కందించిరి

ఇపు డిక, బ్రహ్మసూత్రాధికరణముల సారమును సంగ్రహ ముగా గ్రహింతము గావుత

## అధికరణార్థ సంగ్రహము

వేదముయొక్క వ్యాఖ్యానరూపమగు మీమాంసాశాస్త్ర మున - పూర్వమీమాంస, ఉత్తరమీమాంస యను రెండు భాగ ములు కలవు వేదమందలి పూర్వభాగమునకు వ్యాఖ్యానమగు పూర్వ మీమాంసా సూత్రములను జైమినిమహర్షి రచించెను అందు - వేద పూర్వభాగమందలి కర్మలు వివరింపబడినవి ఉత్తర భాగవ్యాఖ్యాన మగు ఉత్తర మీమాంసా సూత్రములను (బ్రహ్మసూత్రములను) వ్యాసమహర్షి రచించెను ఇందు - ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన బ్రహ్మము నిరూపింపబడినది ఇట్లు ఈ మీమాంసా శాస్త్రము పూర్వోత్తర భేదములచే వేరుగ తోచినను, వేదమునకు వ్యాఖ్యాన మగుటచే, రెండు భాగములు కలసి ఒకే శాస్త్రమని ఎరుంగవలెను ఈ శాస్త్రము - 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను సూత్రముతో ఆరం భమై, 'అనావృత్తి శ్శబ్దాత్, అనావృత్తి శ్శబ్దాత్' అను సూత్ర ముతో అంత మగును ఈ విషయమునే బోధాయన మహర్షి తమ వృత్తియందు - 'సంహిత మేత చ్ఛారీరకం జైమినీయేన షోడశ లక్ష ణేన' ఈ శారీరక మీమాంస (ఉత్తర మీమాంస) జైమిని రచిత మగు పదునారు అధ్యాయములతో కలసి ఏకశాస్త్రమే' అని నిరూ పించిరి. కావున, వేదమునకు వ్యాఖ్యామగు ఈ శాస్త్రమును ఏక శాస్త్రముగనే భావింపవలెనుకాని, వేర్వేరుగ - రెండు శాస్త్రము లుగ భావింపరాదు

శారీరక మీమాంసయందు నాలుగు అధ్యాయములు గలవు అందు మొదటి రెండధ్యాయములందు చేతనాచేతనములకంటె విలక్షణమును, సమస్త జగత్తునకు ప్రధాన కారణమును అగు బ్రహ్మముయొక్క స్వరూపము నిరూపింపబడినది తరువాతి రెండధ్యాయములందు - ఉపాదానము, ఫలము వివరింపబడినవి

## ప్రథమాధ్యాయము - ప్రథమపాద విశేషము

బ్రహ్మసూత్రములలో మొదటి అధ్యాయము సమన్వయాధ్యాయము జగత్కారణమును ప్రతిపాదించు శ్రుతివాక్యములను పర్యాలోచనము చేసి, 'జగత్కారణము బ్రహ్మము' అని నిరూపింపబడినది అందు మొదటి పాదమున - 'బ్రహ్మ జగత్కారణమే' అని నిరూపించిరి అందు మొదటి నాలుగు సూత్రములచే (చతుస్సూత్రిచే) 'బ్రహ్మవిచారము చేయదగినదా? కాదా?'అను సందేహమును పోగొట్టి, బ్రహ్మవిచారము ఆరంభింపదగినదే యని సమర్థింపబడెను

### 1 జిజ్ఞాసాధికరణము

1 ఆ నాల్గు సూత్రములలో మొదటిది 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అను సూత్రము ఇందలి విషయమే జిజ్ఞాసాధికరణము బ్రహ్మవిచారము చేయవలెను కాని, బ్రహ్మనుగూర్చిన జ్ఞానమును కల్గించు సాధనము (ప్రమాణము) వేదాంతవాక్య మగునా ? కాదా ? యని సంశయించి, 'వేదాంత వాక్యము బ్రహ్మజ్ఞానము కల్గించు ప్రమాణము కాగలదు' అని నిర్ధరించెను

లోకములో - 'ఈ శబ్దమునకు ఇది యర్థము' అను జ్ఞానము (వ్యుత్పత్తి) పెద్దల వ్యవహారమువలన కల్గును పెద్దలు ఒకరితో మాట్లాడుకొనునపుడు ఆ సంభాషణము వినుచు, వారు చేయు పను

లను చూచుచున్న బాలుడు - ఈ శబ్దమునకది యర్థమని గ్రహించును 'గోవును తెమ్ము, గోవును కట్టుము' మొదలగు వ్యవహారము వలననే వ్యుత్పత్తి కలుగును అనగా - గో శబ్దమునకు గోవ్యక్తి యర్థమను జ్ఞానము కల్గును ఇట్టి వ్యవహారముచే కల్గు వ్యుత్పత్తి - 'ఇది చేయకుము' అనునట్లు, కార్యరూపముగనే కలుగును కాని, సిద్ధములైయున్న విషయమునుగూర్చి కలుగదు బ్రహ్మము సిద్ధమగు వస్తువు దానిని గూర్చిన జ్ఞానము వేదాంత వాక్యముచే కలుగనేరదు కావున, 'అప్రామాణికమగు బ్రహ్మ విచారము ఆరంభింప తగదు' అను పూర్వ పక్షము కాగా, అది ఈ యధికరణమున నిరాకరింపబడు చున్నది

లోకములో పిల్లలకు అమ్మ, నాయన, తాత మొదలగు శబ్దములను చూపుచుండుటచే, అర్థజ్ఞానము (వ్యుత్పత్తి) కల్గుచుండుట మన మెరుంగుదుము కావున, వ్యవహారమువలననేకాక, పెద్దలు నేర్పుటచే కూడ వ్యుత్పత్తి కల్గుచున్నది, అనియు, 'అది కేవలము చేయదగిన పనులను గూర్చియేకాక, సిద్ధములగు వస్తువులనుగూర్చియు కల్గుచున్నది' అనియు తెలియుచున్నది పెద్దల వ్యవహారమువలన గూడ, సిద్ధములగు వస్తువుల జ్ఞానము కల్గుచున్నది 'నీకు కుమారుడు కల్గినాడు' అనుటచే, ఆవరకే సిద్ధమైన ఒక విషయమునుగూర్చి జ్ఞానము కల్గుచున్నదికదా! కావున, వ్యవహారమువలననే వ్యుత్పత్తి కలుగును ను నియమము లేదు' అనియు, 'వ్యవహారముచే గూడ సిద్ధమగు వస్తువుల జ్ఞానము కల్గును' అనియు తెలియుచున్నది కావున, వేదాంత వాక్యములకు బ్రహ్మనుగూర్చిన జ్ఞానము కల్గించు శక్తి లేదనుటయు శీసహజము కాదు వేదాంతవాక్యములచే బ్రహ్మము సిద్ధమైనను, జ్ఞానము కల్గునుకాన, బ్రహ్మవిచారము ప్రామాణికమే యని సిద్ధాంతీకరింపబడినది ప్రమాణము వేఱు కనుక, బ్రహ్మవిచారము చేయరాదను శంక నిరసింపబడినది

## 2 జన్మాద్యధికరణము

జిజ్ఞాసాధికరణమున బ్రహ్మవిచారము ప్రామాణికమని నిరూపించి, తరువాత అధికరణ మగు జన్మాద్యధికరణమున జగజ్జన్మాది కారణత్వము అను లక్షణముచే బ్రహ్మస్వరూప మెఱుంగ వీలగునని నిర్ధరించుచున్నారు వాక్యమునకు సిద్ధమగు వస్తువును తెలియజేయు శక్తియున్నదికావున, వేదాంత వాక్యములు బ్రహ్మవిషయమున ప్రమాణము కావచ్చును కాని, బ్రహ్మమును ఇతర వస్తువులనుండి వేఱుగ చూపు లక్షణ మేదియు లేదు లక్షణము లేని వస్తువును శబ్దము బోధింపజాలదు

"యతో వా ఇమాని భూతాని జాయన్తే,
యేన జాతాని జీవన్తి, యత్ప్రయం త్యభిసంవిశన్తి"

ఈ జగత్తుయొక్క సృష్టికి, స్థితికి, లయమునకు కారణము బ్రహ్మము' అని లక్షణము చెప్పవచ్చునుకదా యని తలపరాదు పై శ్రుతి తెల్పిన జగజ్జన్మాది కారణత్వమును బ్రహ్మమునకు లక్షణ మనుట పొసగదు

లక్షణము విశేషణముగాకాని, ఉపలక్షణముగాకాని యుండవలెను విశేషణముగా నుండు లక్షణము తాను నిర్వచించు వస్తువునందు ఏ యితర ధర్మములు లేవనియు, ఈ ధర్మమే యున్నదనియు తెలియజేయును బ్రహ్మము జగజ్జన్మకారణము, జగత్ స్థితికారణము, జగల్లయకారణము అని లక్షణము విశేషణముగా చెప్పవలెను అట్లు చెప్పినచో, ఈ మూడు విశేషణములు బ్రహ్మమునకు మూడు ధర్మములు కలవని తెల్పుచున్నవి ధర్మ భేదముచే ధర్మి భేదించుట, బోడి యావు, నిండుకొమ్ముల యావు, విరిగిన కొమ్ముల యావు అనుచో, విశేష్యములైన గోవ్యక్తుల నానాత్వము గాంచుచున్నాము గాన, ఇచట మూడు విశేషణములు బ్రహ్మము అనేక

మని తెలియజేయవచ్చును. అఖండమగు బ్రహ్మమునకు బహుత్వము అసంగతము కావున, పై శ్రుతి విశేషణముగ లక్షణమును ప్రతిపాదింపదు. ఇక ఇది ఉపలక్షణముగకూడ లక్షణము కాదు. 'కాకి యున్నదే దేవదత్తుని గృహము' అని దేవదత్తుని ఇల్లు ఇది అని తెలుపుటకు లక్షణము చెప్పిరి అనుకొందము. దేవదత్తుని ఇంటిని తెలుపుటలో – కాకి యుండుట ఉపలక్షణము. అది గృహము అని అంతకు ముందే తెలియును. దానియందు 'దేవదత్తునిది' అని, దేవదత్తుని సంబంధమును తెలుపుట ఉపలక్షణము చేయు పని. కావున, ఉపలక్షణము ఇంతకుముందు ఒక యసాధారణ ధర్మముతో, తెలిసిన వస్తువునందు వేరొక ధర్మమును తెల్పును. బ్రహ్మస్వరూపము ఇంతకుముందు వేరొక విధముగ మనకు తెలియదు. అట్లు తెలియని నాడు ఇది ఉపలక్షణ మగుట కుదురదు. కావున, లక్షణముచే నిరూపింపబడు బ్రహ్మమును ప్రతిపాదించుటలో వేదాంత వాక్యములు ప్రమాణములు కావు కనుక, బ్రహ్మవిచారము ఆరంభింపతగదు' అని పూర్వపక్షము రాగా, వారిని 'బ్రహ్మాద్యస్య యతః' అను రెండవ సూత్రములోని జన్మాద్యధికరణమున ఖండించుచున్నారు.

విశేషణములు భిన్నము లగుటచే, విశేష్యము భిన్నమగునని యనుట యుక్తిదూరము. ఒకటికంటె ఎక్కువ విశేషణములు ఒకే విశేష్యమున కుండవు' అనుట ఆ విశేషణములు తెలియజేయు ధర్మములు నీవు జూపిన ఉదాహరణమునుబట్టి, పరస్పర విరుద్ధములైనపుడే. పరస్పర విరోధము లేని ధర్మములను తెలియజేయు విశేషణము లున్నపుడు విశేష్య మొక్కటియే కావచ్చును. 'ఈ యావు తెల్లనిది, బోడిది' అనుచో – ఆ రెండు విశేషములు తెలియజేయు ధర్మములు పరస్పర విరోధములు లేనివి కనుక, ఒకే విశేష్యమునం దన్వయింపవచ్చును. 'ఈ యావు తెల్లనిది, నల్లనిది' అనుచో – ఆ రెండు విశేషణములు తెల్పు ధర్మములు పరస్పర విరుద్ధములు కనుక, ఒకే

విశేష్యమునం దన్వయింపవు కావున, విశేష్యములు భిన్నములని తలంపవలెను కాని, బ్రహ్మము జగజ్జన్మాదికారణము అనుచో - జన్మకారణము, స్థితికారణము, లయకారణము అను విశేషణములు పరస్పర విరుద్ధములు కావుకనుక, ఒకే బ్రహ్మము విశేష్యముగా నిరూపింపజాలును కావున, ఇది బ్రహ్మకు విశేషణముగా లక్షణ మగును

'యతో వా ఇమాని' అను శ్రుతి ప్రతిపాదించు జగజ్జన్మాది కారణత్వము పైన చూపిన విధమున, విశేషణముగ లక్షణము అగుటయేకాక, ఉపలక్షణముగకూడ లక్షణ మగును అంతకు ముందు - సర్వజ్ఞత్వాది ధర్మములచేతను, స్వరూపముచేతను బృహత్త్వము కలదిగా శ్రుతిచే నెరుంగబడిన బ్రహ్మకు - జగజ్జన్మాది కారణత్వము ఉపలక్షణ మగును

ఇట్లు బ్రహ్మ - లక్షణముచే నెరుంగబడునదే యనియు, దాని నెరిగించు ప్రమాణము వేదాంతమనియు, నిరూపించి, బ్రహ్మవిచారము కర్తవ్యమే యని సమర్థింపబడినది

## 3 శాస్త్రయోనిత్వాధికరణము

బ్రహ్మవిచారము ప్రామాణికమే కావచ్చును బ్రహ్మస్వరూపము లక్షణముచే నిర్వచింపదగినదే కావచ్చును కాని, ప్రత్యక్షానుమానములచే సిద్ధింపనివానినేగదా శాస్త్రము (శబ్దప్రమాణము) సాధించును 'బ్రహ్మమును 'సామాన్యతోదృష్టము' అను అనుమానము సాధించుచున్నదికావున, వేదాంతవాక్యములచే బ్రహ్మవిచారము ఆరంభింప నవసరము లేదు' అను శంకను శాస్త్రయోనిత్వాధికరణము తొలగించి, బ్రహ్మము శాస్త్రప్రమాణమే యని నిరూపించుచున్నది

అవయవములతో కూడియున్నది తప్పక కార్యమే యగును అనగా - ఒకరిచే నిర్మింపబడినదే యగును ఈ జగత్తు అవయవములు కలది కావున, దానిని నిర్మింపజాలిన కర్త లేనిదే సృజింపబడదు లోకములో కార్యములగు వస్తువులు వానిని నిర్మింపజాలిన కర్త లేనిదే సృజింపబడకుండుట మనము సామాన్యముగ చూచుచున్నాము కావున, ఈ జగత్తునకు కర్తలు అనుమానముచే ఈశ్వరుడు సిద్ధించుచున్నాడు అందుచే, బ్రహ్మము శాస్త్రప్రమాణసిద్ధము కాదు 'వేదాంతవాక్యములచే బ్రహ్మవిచారము ఆరంభింపదగినది కాదు' అని పూర్వపక్షము రాగా, దాని నిందు ఖండించుచున్నారు అనుమానము జగత్తునకు కర్తగా జీవుని సాధించునేకాని, జీవునికంటె విలక్షణమగు బ్రహ్మమును సాధింపనేరదు కావున, బ్రహ్మము అనుమానసాధ్యము కాదనియు, శబ్దప్రమాణముచే మాత్రమే ఎఱుంగదగినదనియు అనేక యుక్తులచే, ప్రమాణములతో, సిద్ధాంతీకరింపబడినది

## 4 సమన్వయాధికరణము

వేదాంత వాక్యములకు సిద్ధమగు బ్రహ్మమును తెలియగల శక్తి యుండవచ్చును బ్రహ్మము లక్షణముచే నెరుంగదగిన స్వరూపముకలది కావచ్చును కాని, ఆ బ్రహ్మపదార్థము నెఱుంగించునది శాస్త్రమే గావచ్చును కాని, ఆ బ్రహ్మపదార్థము నెఱుంగవలె నను కోరిక యుదయించిననాడు కదా బ్రహ్మవిచారముయొక్క ఆవశ్యకత తెలిసికొనవలెనను కోరిక ప్రయోజన మున్ననాడే యుదయించును వేదాంతశాస్త్రమునకు ప్రయోజనము - ఒక కార్యమునందు ప్రవర్తింప జేయుట, లేదా - నివర్తింపజేయుట యగును అట్టి ప్రయోజనము వేదాంత వాక్యములచే కలుగలేదు. ప్రవృత్తిగాని, నివృత్తిగాని కలిగింపనినాడు శాస్త్రము ప్రమాణము కాదు వేదాంతవాక్య

ముయి సిద్ధమగు బ్రహ్మపదార్థము నెరింగించునేగాని, ఒక కార్యము నందు ప్రవృత్తినిగాని, నివృత్తినిగాని కల్గింపవు అందుచే, ప్రవృత్తి నివృత్త్యన్వయము లేని వేదాంతశాస్త్రము ప్రయోజన రహితము అప్రమాణమునగు వేదాంతముచే బ్రహ్మవిచారముచేయ నారంభింప నవసరము లేదు' అని పూర్వపక్షము రాగా, దానిని సమన్వయాధి కరణమున ఖండించుచున్నారు

శబ్దము సిద్ధ వస్తువును బోధింపజాలదని వెనుక జిజ్ఞాసాధికరణ మున నిరూపింపబడినదిగదా ! అట్లు సిద్ధవస్తువగు బ్రహ్మమును బోధించుటచే ప్రవృత్తి నివృత్త్యన్వయము లేదుకావున, ఈ వేదాంత శాస్త్రము ప్రయోజన రహితమనియు, అందుచే అప్రమాణమనియు అనుటకు వీలు లేదు ప్రవృత్తి నివృత్తులను కలిగించుట మాత్రమే ప్రయోజనము కాదు పురుషార్థముకూడ ప్రయోజనమే వేదాంత వాక్యములు ఆనంద స్వరూపమును, పరబ్రహ్మరూపమును అగు పరమ పురుషార్థమును బోధించుచున్నవి కావున, వేదాంతశాస్త్రము ప్రయోజన సహితమే సర్వోపనిషద్వాక్యములు పరమపురుషార్థ మగు బ్రహ్మమునందే అన్వయించుచున్నవికావున, ఉపనిషద్వాక్య ములు ప్రయోజనవంతములై, ప్రమాణములే యగుచున్నవి కావున, బ్రహ్మవిచారము కర్తవ్యమే యని నిశ్చయింపబడినది

ఇట్లు చతుస్సూత్రిచే వేదాంత వాక్యములు బ్రహ్మమును నిరూపించుటలో ప్రమాణములే యనియు, బ్రహ్మ లక్షణముచే నెరుంగదగిన పదార్థమే యనియు, బ్రహ్మము శాస్త్రైకప్రమాణ మనియు, వేదాంత వాక్యములు పరమపురుషార్థపరము లగుటచే ప్రయోజనవంతములే యనియు నిర్ధరించి, పై కారణములచే బ్రహ్మ విచారరూపమగు ఈ శారీరక మీమాంస అవశ్యము ఆరంభింప దగినదే యని నిర్ణయింపబడినది

ఇక ఆ ప్రమాణముచే నెఱుంగబడు విషయమును వివరించు చున్నాడు అందు మొదటిది - ఈక్షత్యధికరణము

## 5 ఈక్షత్యధికరణము

'స దేవ సౌమ్యే ఇద మగ్ర ఆసీత్' అనునది కారణమగు వస్తువును తెలుపునట్టి శ్రుతివాక్యము 'ఈ కనబడుచున్నది (జగత్తు) సృష్టికిపూర్వము సత్తుగానే యుండెను' అని చెప్పుచున్నది 'ఇదం' ఇది అని అచేతనమగు ఈ జగత్తును నిర్దేశించి, దానికి కారణము 'సత్' అని వ్యవహరింపబడు వస్తువు అని తెలియజేయుచున్నది కార్యము అచేతనము కావున, కారణముగానుండు 'సత్' కూడ అచేతనమే కావలయును కారణము కార్యముతో సజాతీయమై యుండునుగదా ! అందుచే, 'సత్' శబ్దముచే తెలియజేయబడు వస్తువు ప్రధానమే (ప్రకృతియే) అదియే జగత్కారణము కాని, బ్రహ్మ కాదు' అని శంక కలుగగా - 'ఈక్షతే ర్నా శబ్దం' అను ఈ సూత్రముచే దానిని ఖండించుచున్నారు అ శబ్దము - శబ్దముచే తెలియబడక, అనుమానముచేతనే ఎఱుంగదగు ప్రధానము అది 'న' - 'సత్' అను శబ్దముచే చెప్పబడునది (జగత్కారణము)కాదు 'ఈక్షతేః' — ఈక్షణము (చూచుట) అను వ్యాపార ముండుటవలన, జగత్కారణముగ తెలియబడు 'సత్' అను వస్తువు ఈక్షణ పూర్వకముగనే సృజించుచున్నట్లు - 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' అని శ్రుతి చెప్పుచున్నది సృష్టిని ప్రతిపాదించు ఉపనిషద్వాక్యము లన్నియు ఈక్షణపూర్వకముగనే సృష్టిజరిగినట్లు నిరూపించుచున్నవి అట్టి ఈక్షణము (చూచుట) చేతనమునకేగాని, అచేతనమగు ప్రధానమునకు సంభవము కాదు కావున, సర్వజ్ఞుడు, సర్వశక్తి అగు పురుషోత్తముడే 'సత్' శబ్దవాచ్యుడు అతడే జగత్కారణభూతుడను అని తెలియనగును జగత్తునకు కారణము ప్రధానము (ప్రకృతి)

అని ప్రతిపాదించు సాంఖ్యుల మతము ఈ యధికరణముచే పరాస్తమైనది సృష్టికి పూర్వమును, సృష్టికి తరువాతనుకూడ చేతనాచేతనములు బ్రహ్మమునకు శరీరముగా నుండును కావున, కారణము చేతనాచేతన శరీరుడగు బ్రహ్మమే కార్యమును చేతనాచేతన శరీరకమగు బ్రహ్మమే అగుటచే, కారణమునకు, కార్యమునకు సజాతీయమగుటకు భంగము లేదు

## 6 ఆనందమయాధికరణము

అచేతనమగు ప్రకృతి జగత్కారణము కాదనియు, పరమాత్మయే జగత్కారణ మనియు, వెనుకటి యధికరణమున నిరూపించిరి ఈ యధికరణమున జీవాత్మ జగత్కారణము కాదని నిరూపించుచున్నారు 'తస్మాద్వా ఏతస్మాత్ విజ్ఞానమయా దన్యోఽంతర ఆత్మా ఆనందమయః' అను తైత్తిరీయ ఉపనిషద్వాక్యమున విజ్ఞానమయముకంటె అన్యముగ చెప్పబడిన ఆనందమగు ఆత్మ - జీవాత్మయా? లేక - పరమాత్మయా? అను సందేహము కలుగగా, జీవాత్మయే యని చెప్పుటకు అవకాశము కన్పట్టుచున్నది అందు - 'తస్యైష ఏవ శారీర ఆత్మా' అని, ఆ యాత్మకు శరీరసంబంధము కలదని వర్ణితమైనది శరీరసంబంధము జీవునకేగాని, పరమాత్మకు ఉండదుగదా! కావున, ఆనందమయమగు ఆత్మ జీవాత్మయే అని పూర్వపక్షి ఆశంకింపగా, దానిని ఈ యధికరణము నిరాకరించుచున్నది తైత్తిరీయోపనిషత్తు ఆనందముయొక్క అవధిని వర్ణించుచు, ఒకదానికంటె వేరొకదాని యానందాతిశయమును వర్ణించుచు, నిరతిశయానందయోగము విజ్ఞానమయముకంటె అన్యమగుతత్త్వమున కలదని వర్ణించుచున్నది దుఃఖము లేని నిరతిశయమగు ఆనందము జీవాత్మ కుండుట పొసగదు కావున, పరమాత్మయే ఆనందమయము

అని నిశ్చయింపవలెను చేతనాచేతనములు పరమాత్మకు శరీర మగు టచే ఆనందమయుమగు ఆ పరమాత్మకు శరీర సంబంధము కలదని చెప్పుటలో దోషము లేదు

## 7 అంతరధికరణము

చేతనాచేతనమగు శరీర సంబంధము పరమాత్మ కున్నను, అది శరీర విశేషముతో సంబంధము కాజాలదు కరచరణాదులతో గూడిన శరీరవిశేషము జీవునకు ఉండునే కాని, పరమాత్మకు ఉండదు శరీరము ఉపకరణము జీవుడు ఆ యుపకరణము కలవాడు ఇట్టి ఉపకరణోప కరణిభావసంబంధము శరీర విశేషమునకును, జీవునకును ఉండును కాని, పరమాత్మ కుండదు అంతరాదిత్యవిద్యయందు 'హిరణ్య శ్మశ్రుః' మొదలగు వాక్యములచే, శరీర విశేష సంబంధము కలదని తెలియు చున్నది అట్టి శరీరము కలిగియుండుటచే, ఆదిత్యమండలములోనుండు పురుషుడు జీవుడే కావలెను ఆ పురుషుడును, ఆనందమయుడును ఒకటేయని, 'సయశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే, స ఏకః' అను ఉపనిషద్వాక్యము నిరూపించుటవలన, ఆనందమయుడు జీవా త్మయే కాని, పరమాత్మ కాదు - అని మరల ఆశంక కలుగగా, ఆ యాశంకను అంతరధికరణముతొలగించుచున్నది అంతరాదిత్యవిద్యలో శరీర విశేష సంబంధము చెప్పినమాట నిజమే కాని, ఆ పురుషు నకు, జీవునకు ఉండని గుణములు 'అపహత పాప్మత్వము' మొదలగు నవి కలవని ఇందు వర్ణింపబడెను ఆ గుణములు పరమాత్మకే కాని, జీవాత్మ కుండవు కావున, ఆదిత్యమండలమునం దుండు పురుషుడు పరమాత్మయే ఆ పురుషుడే ఆనందమయుడు కావున, ఇతడును పర మాత్మయే పరమాత్మకు కూడ కరచరణాదిసహితమగు శరీర విశేష సంబంధము అసంగతము కాదు పరమాత్మకు ప్రాకృతమగు శరీర సంబంధ ముండదు కాని, అప్రాకృత దివ్యమంగళ విగ్రహ

ముందును అందుచే, ఆదిత్యమండలములో భాసించు పురుషుడును విజ్ఞాన మయునికంటె పరుడగు ఆనందమయుడును పరమాత్మయే జీవాత్మ కాడు' - అని, అంతరధికరణము స్పష్టము చేయుచున్నది.

## 8 ఆకాశాధికరణము

సర్వజగత్కారణము బ్రహ్మము' అని నిర్ణయింపబడినది ఆ కారణమగు పదార్థము ప్రకృతి కాదు' అని వెనుకటి యధికరణములలో తొలగింపబడుచున్నది ఆకాశము అనగా - మనకు ప్రసిద్ధమగు భూతములలో నొకటి యగు ఆకాశమే యని అనుకొనుట కవకాశము కలదు కాని, ఇచ్చటి యాకాశ శబ్దము ప్రసిద్ధమగు ఆకాశమును నిర్దేశించునది కాదు. 'ఆసమంతాత్ కాశతే ఇతి ఆకాశః' అను వ్యుత్పత్తిచే, సర్వదా తనకు తానే ప్రకాశించు పరమాత్మయే ఆకాశ శబ్దప్రతిపాద్యుడని తెలియవలెను. అందుచే, పరమాత్మయే జగత్కారణముగాని, ఈ యాకాశము కాదు' అని ఇందు నిరూపింపబడినది




## 9 ప్రాణాధికరణము

ఛాందోగ్యోపనిషత్తునందు-'సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి, ప్రాణ మభ్యుజ్జిహతే, సైషా దేవతా ప్రస్తావ మన్వాయత్తా ' మన్నగు శ్రుతి వాక్యము- ప్రాణమే జగత్కారణమని నిరూపించుచున్నది నిఖిల భూతములును ప్రాణము వలననే జీవించియుండుటయు, అది లేనిచో, జీవించియుండకుండుటయు మనము చూచుచున్నాము కావున, ఇచట ప్రాణ మనగా - మనకు ప్రసిద్ధముగా, రూఢముగా తెలిసిన ప్రాణమే జగత్కారణము అను సందేహము కలుగవచ్చును దానిని ఈ యధికరణమున తొలగించుచున్నారు

ఇచటి ప్రాణశబ్దము ప్రసిద్ధ ప్రాణపరము కాదు శిలలు, కాష్ఠములు ప్రాణముచేతనే జీవించియుండుటలేదు చేతనుడగు జీవుడు కూడ ప్రాణముచేతనే జీవించువాడు కాడు ప్రాణముచే నిలుచునది దేహముకాని, జీవుడు కాదు కావున, చేతనాచేతనాత్మకమగు సర్వ జగత్తును ప్రాణాధీనమై నిలుచునది కాదు కావున, ఇచటి ప్రాణ శబ్దము యౌగికముగ పరమాత్మను తెలియజేయును 'ప్రాణయతి సర్వాణి భూతాని' అను వ్యుత్పత్తిచే, సర్వ చేతనాచేతనాత్మక మగు జగత్తునకు ప్రాణమగు పరమాత్మయే జగత్కారణమని ఈ ఉపనిష ద్వాక్యము తెలియజేయుచున్నది ఇంతియే గాక, ఇందు ప్రాణము నకు నిఖిల జగత్ ప్రవేశము, నిష్క్రమణము కలవని వర్ణింపబడినవి ఆలింగములు అనగా - చిహ్నములు పరమాత్మకేకాని, ప్రసిద్ధమగు ప్రాణమునకు లేవు అందుచే, జగత్కారణము చెప్పబడిన ఈ ప్రాణశబ్దముచే చెప్పబడునది పరమాత్మయే

## 10 జ్యోతిరధికరణము

'అథ యదతఃపరో దివో జ్యోతిర్దీప్యతే' అను వాక్యమున జ్యోతిశ్శబ్దము కన్పట్టుచున్నది జ్యోతియే కారణమని చెప్పుచున్నది ఆ జ్యోతిశ్శబ్దముచే తెలుపబడునది ప్రసిద్ధమగు - తేజోరూపమగు జ్యోతియా ? లేక - పరమాత్మయా ? అను సందేహమును ఇందు తొలగించుచున్నారు ఈ వేదాంతవాక్యమున జగత్కారణమగు జ్యోతిస్సును జగత్కారణముగా నిరూపించు వాక్యమున పరమాత్మ ధర్మములు చెప్పబడలేదుకాని, ఉపక్రమ వాక్యమున 'సర్వభూత ములు ఒక పాదముగా గలది ఆ జ్యోతిస్సు' అని చెప్పుటచే, పర మాత్మయే ప్రతిపాదింపబడుచున్నది కాని, ప్రసిద్ధ జ్యోతిస్సు దీనిచే నిరూపింపబడలేదు

## 11 ఇంద్రప్రాణాధికరణము

ఇంకను ఇంద్రశబ్దవాచ్యుడు కూడ పరమాత్మయే యని నిరూపించుచున్నారు

'ప్రతర్దనో హవై దైవోదాసిః' అను శ్రుతివాక్యమున 'మా ముపాస్వ' అని ఉపాసనమునకు కర్మగా ఇంద్రుడు చెప్పబడినాడు ఆ ఇంద్రుడు త్వాష్ట్రిహననము చేసినట్లు ఉపక్రమమున చెప్పబడినది ఇందుచే, ఆ త్వాష్ట్రుని చంపిన దేవప్రభువగు ఇంద్రుడే ఉపాసింపదగిన వాడని తోచుచున్నది జగత్కారణమే ఉపాసింపదగినది గనుక, ఆ ఇంద్రుడే జగత్కారణభూతుడని ఆశంక కలుగుచున్నది దాని నిందు పరిహరించుచున్నారు ఈ ప్రకరణమున ఇతర వాక్యములలో అనేక స్థలములందు పరమాత్మకుండు లక్షణములు చెప్పబడినవి. మహావాక్యముకంటె ఉపక్రమము దుర్బలము కావున, ఉపక్రమములో చెప్పిన త్వాష్ట్రిహననమును మాత్రము స్వీకరించి, ప్రసిద్ధమగు ఇంద్రుడే ఉపాస్యుడని చెప్పుట యుక్తము కాదు ఇంద్రశబ్దముచే,ఇంద్రుడు శరీరముగాగల అంతర్యామియగు పరమాత్మయే ఉపాస్యుడని గ్రహింపనగును

(ఇట్లు ప్రథమాధ్యాయ - ప్రథమపాదము పూర్తియైనది)

## ప్రథమాధ్యాయ - ప్రథమపాదసారము

బ్రహ్మసూత్రములలో - నాల్గు అధ్యాయములందలి మొదటి అధ్యాయమునందు - జగజ్జన్మ స్థితి లయ కారణము చేతనాచేతన విలక్షణమగు బ్రహ్మమే అని నిరూపింపబడినది అట్టి కారణత్వము చేతనునకుగాని, అచేతనమగు ప్రకృతికిగాని లేదని అందు నిరూపించిరి మొదటి పాదమున మొదటి నాల్గు సూత్రములు ఈ బ్రహ్మమీమాంసాశాస్త్రము ఆరంభింపదగినదే యని సమర్థించినవి సమస్త

చేతనాచేతన విలక్షణమగు కారణ మొకటి గలదని ప్రథమపాదమున నిరూపించి, ఆ కారణము బ్రహ్మయే అనియు ప్రతిపాదించిరి బ్రహ్మకు లక్షణము జగజ్జన్మాది కారణత్వము అని శ్రుతివాక్యములు నిరూపించుచున్నవి ఆ లక్షణమునకు అవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవము అను మూడు దోషములును ఉండరాదు కారణమగు పదార్థము ఒక్కటే గనుక, అం దవ్యాప్తిదోష ముండుట కవకాశము లేదు ఇక అసంభవ దోషమును నిరాకరించుటకు బ్రహ్మయే కారణము అని నిరూపించవలెను మొదటి పాదము బ్రహ్మకారణమే అని నిరూపించి నది అందుచే, 'బ్రహ్మకు కారణత్వము లేదు' అను శంక తొలగినది కాని, జీవుడుకాని, ప్రకృతికాని కారణములు కావచ్చునన్నట్లు కొన్ని శ్రుతివాక్యములవలన తోచవచ్చును అట్లయినచో - పై లక్షణము నకు అతివ్యాప్తి వచ్చును కావున, దానిని రెండు - మూడు నాల్గు పాదములలో పరిహరించుచున్నారు జీవ విశేషమునకు కాని, ప్రకృతి విశేషమునకుకాని చెందిన ధర్మములతో కూడిన పదార్థమును కారణ ముగ చెప్పునట్లు భాసించెడి శ్రుతివాక్యములను మూడు విభాగములు చేసిరి (1) అస్పష్టముగ జీవప్రకృతి ధర్మములను నిరూపించుచు, బ్రహ్మవ్యతిరిక్తము కారణమా ? అను సందేహమును కల్గించు శ్రుతులు (2) స్పష్టముగ జీవాది ధర్మములేయని చెప్పదగు ధర్మము లను చెప్పుచు, అట్టి ధర్మములు గల బ్రహ్మవ్యతిరిక్తపదార్థము కారణమా ? ' అను సందేహమును కల్గించు శ్రుతులు (3) స్పష్ట తరముగ ఆ ధర్మముగల జీవుడు - లేదా, ప్రకృతియే కారణమని ప్రతిపాదించుచున్న ట్లున్న శ్రుతులు ఈ మూడు విధములగు శ్రుతులను ఈ మొదటి అధ్యాయమునందలి రెండు, మూడు, నాల్గు పాదములలో వరుసగా పరమాత్మపరముగ సమన్వయించుచు, బ్రహ్మయే కారణమని, అతివ్యాప్తిని పరిహరించుచున్నారు

# ప్రథమాధ్యాయము - ద్వితీయ పాదము

## 1 సర్వత్రప్రసిద్ధ్యధికరణము

'సర్వం ఖ ల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత' ఈ జగత్తంతయు బ్రహ్మయే సర్వజగత్కారణ మగుట వలన' అని, శాంతుడై ఉపాసన చేయవలయును అందు చతుర్ముఖుడు మొదలు తృణమువరకుగల సర్వప్రపంచ తాదాత్మ్యము బ్రహ్మకు చెప్పబడినది జీవుడు అనాదియగు అవిద్యచే బ్రహ్మాది స్తంబపర్యంతము తద్రూపముగా సంభవించుచుండుటవలన, జీవునకు సర్వ తాదాత్మ్యము చెప్పుట సమంజసము బ్రహ్మ, ఆత్మ మున్నగు శబ్దములు జీవునికూడ ప్రతిపాదించుచుండును అందుచేతనే పరతత్త్వమును దెల్పునపుడు - పరమాత్మ, పరంబ్రహ్మ అని విశేషణమును చేర్చి చెప్పుచున్నారు అందుచే, ఇచట ఉపాస్యముగ చెప్పబడినది జీవుడే అంతియేగాక, ఆ ఉపాస్యుడగు బ్రహ్మ - 'మనోమయుడు' 'ప్రాణ శరీరుడు' 'భా రూపుడు' అని ఈ శ్రుతి చెప్పుచున్నది ఇట్లు మనః ప్రాణ శరీర సంబంధము జీవునకేగాని, పరమాత్మ కుండదుగదా ! కావున, అదృష్టముగ కన్పట్టు ఈ జీవ ధర్మములచే ఇం దుపాస్యముగ చెప్పబడిన పదార్థము జీవుడేగాని పరమాత్మ కాదు' అను శంక కలుగుచున్నది ఆ శంకను ఈ యధికరణము నిరాకరించుచున్నది

'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' అనుచోట, జగత్తు బ్రహ్మనుండి జనించుచున్నది కనుకను, దానియందే లయమగుచున్నది కనుకను, దానివలననే నిలుకడ నందుచున్నది కనుకను, ఈ జగత్తంతయు బ్రహ్మాత్మకమే కావున, జగజ్జన్మస్థితిలయకారణత్వము బ్రహ్మకు ప్రసిద్ధమే అట్లగుటచే, కారణమగు వస్తువు ధ్యానము చేయదగినది కావున, జగత్కారణమగు బ్రహ్మను ఉపాసింపవలెనని ప్రతిపాదింపబడినది

ప్రసిద్ధమగుదానినే హేతువుగ చెప్పుదురు. ఇట్లు - బ్రహ్మ నుపాసించుటలో హేతువుగా - జగజ్జన్మాది కారణత్వమును చెప్పిరి ఆ హేతువు బ్రహ్మయందే సర్వశ్రుతి ప్రసిద్ధము కావున, ఇచట బ్రహ్మశబ్ద ప్రతిపాద్యమగు ఉపాస్య వస్తువు పరమాత్మయే' ఆ పరమాత్మకు చేతనాచేతనములు శరీరములు అందుచే, పరమాత్మకు సర్వతాదాత్మ్యము చెప్పుటలో విరోధము లేదు

ఇక జీవధర్మములుగ భాసించు మనోమయత్వ ప్రాణశరీరత్వములుకూడ పరమాత్మ ధర్మములే పరమపురుషుడు మనోమయుడు అనగా - వివేకాదులగు సాధన సప్తకముచే అనుగ్రహింపబడిన పరమాత్మోపాసనచే, నిర్మలమయిన మనస్సుచే గ్రహింపదగినవాడు అని అర్థము ప్రాణశరీరుడు అనగా - ప్రాణము శరీరముగా గలవాడు అని అర్థము పరమాత్మకు ఆధేయమై, విధేయమై, శేషభూతమై వర్తిల్లు ప్రాణము - ఆ పరమాత్మకు శరీరముగదా! ఇట్లు పరమాత్మకు ప్రసిద్ధములగు గుణములు ప్రతిపాదింపబడుటచే, ఇందు ప్రతిపాదింపబడిన ఉపాస్యము జగత్కారణమగు పరబ్రహ్మగాని, జీవుడుగాదు హృదయమున - అత్యల్పప్రదేశమున ఉండునని చెప్పుటచే, అణుస్వరూపుడగు జీవుడే ఇందు ప్రతిపాదింపబడినాడని వేరొక సందియము తోపవచ్చును కాని, వాస్తవముగ అతడు అణుస్వరూపుడని కాదు అట్టి సందియము కలుగకుండుటకే, ఆ సందర్భముననే - "జ్యాయాన్ పృథివ్యా జ్యాయా నంతరిక్షాత్, జ్యాయాన్ దివః జ్యాయానేభ్యో లోకేభ్యః' అని, ఆ ఉపాస్యుని గరీయస్త్వము ఉపదేశింపబడినది కావున, ఈ శ్రుతిచే ప్రతిపాదింపబడు ఉపాస్యుడు, కారణభూతుడు పరమాత్మయే యని నిర్ధరింపబడినది

పరమాత్మ జీవునకు అంతర్యామియై, శరీరములో వసించుచున్నను, కర్మఫలమును ఆతడు భుజింపడు కర్మఫలభోక్తృత కర్మచే

శరీరమునందున్న బద్ధుడగు జీవునకేగాని, ఆతని రక్షణముకై స్వచ్ఛందముగ శరీరమున ప్రవేశించిన సర్వేశ్వరునకు లేదుకదా! అందుచే, భోక్తగా శ్రుతులలో ప్రతిపాదింపబడువాడు జీవుడే కావలెను కనుక, కఠోపనిషత్తునందు — 'యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనం, క ఇత్థా వేద యత్ర సః' ఎవనికి బ్రహ్మ, క్షత్రములు ఓదనమో, ఎవనికి మృత్యువు ఉపసేచనమో (నంజుడో), అట్టివానిని ఎవడెరుంగగలడు? అనుచోట, మృత్యువును ఉపసేచనముతో బ్రహ్మక్షత్రములను భుజించువాడు' అని ప్రతిపాదింపబడువాడు జీవుడే కావలయునని సందియము కలుగగా, దానిని అత్త్రధికరణము నిరాకరించుచున్నది

పై శ్రుతియందు — 'బ్రహ్మక్షత్రములు' అనగా — చరాచరములు. ఆ చరాచరములను సంహరించుటయే భుజించుట. అందు — మృత్యువు ఉపసేచనమగును. ఆ చరాచరములను మృత్యువుతో జోడించి, ఉపసంహరించుచు, ఆ మృత్యువునుకూడ భుజించును. 'మృత్యుర్యస్యోపసేచనమ్' అనుటచే మృత్యువుకూడ పరమాత్మకు విధేయమై యుండును. తాను తినబడుచు, మరొకదానిని తినుటకు సాయపడెడి వస్తువును ఉపసేచనము — లేదా, వ్యంజనము అందురు. అట్లే, ఈ చరాచర జగత్తు నంతను పరమాత్మ తినునపుడు — అనగా, ఉపసంహరించునపుడు మృత్యువు దానికి తోడుపడుచు, తానును తినబడును' అనగా — 'ఉపసంహరింపబడును' అని పై శ్రుతి విశదము చేయుచున్నది. ఇచట, 'క్షత్రబ్రహ్మభోక్తృత్వము' అనగా — చరాచర జగత్సంహార కర్తృత్వమే కాని, కర్మఫలభోక్తృత్వము కాదు. అట్టి సంహార కర్తృత్వము పరమాత్మకే కాని, జీవునకు లేదు కావున, ఇందు ప్రతిపాదింపబడినది పరమాత్మయే అని నిశ్చయింపబడినది

పై కఠోపనిషత్తునందే 'తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం' 'లోన చొచ్చి మరుగుపడిన పరమాత్మ - సుఖముగ దర్శింపదగిన వాడు కాడు' అని చెప్పుటచే, 'దర్శనీయుడుగ ప్రతిపాదింపబడిన వాడు పరమాత్మ' యని చెప్పుటకు వీలులేదు కాని, ఛాందోగ్యమున 'య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే. ఏష ఆత్మేతి హోవాచ, ఏత దమృత మేత ద్బ్రహ్మ' నేత్రములో ఏ పురుషుడు కనబడుచున్నాడో, అతడు ఆత్మ 'ఇది అమృతము, ఇది బ్రహ్మము' అని యున్నది ఇచట 'య ఏషః' అని ప్రసిద్ధముగ నిర్దేశించి, 'దృశ్యతే' 'చూడబడుచున్నాడు' అని నిరూపించెను అట్లు మనము చూచుటకు వీలయినవాడు పరమాత్మ కాడుకదా ! కావున, కంటిలో ప్రతిఫలించు ప్రతిబింబమైన కావలయును, లేదా - చక్షురింద్రియాధిష్ఠానమగు దేవతా విశేషమైన కావలయును లేదా, జీవుడైన కావలయును 'య ఏషః' అని అందరకు బాగుగా తెలిసినదానినే చెప్పినట్లు చెప్పుటవలనను, 'దృశ్యతే' అని, కంటికి కనబడునట్లు చెప్పుటవలనను అది కంటిలోని ప్రతిబింబ మనుటకు ఎక్కువ అవకాశము కనబడుచున్నది లేదా, శరీరమందు ఎల్లపుడు సన్నిహితుడై యుండును కావున, జీవుడు కావచ్చును ఆదిత్యుడు తన రశ్మిలచే కంటియందు ప్రతిష్ఠితుడై యుండునని శ్రుతిలో ప్రసిద్ధముగ నుండుటచే, ఆ దేవతా విశేషమైన కావచ్చును కాని, 'పరమాత్మ ఇందు ప్రతిపాదింపబడుట లేదు' అని సందేహము కలుగగా, దానిని అంతరాధికరణము తొలగించుచున్నది

అక్ష్యంతరమున అధివసించు ఉపాస్యుడగు పురుషుడు పరమాత్మయే అరంభమున 'య ఏషః' అని ప్రసిద్ధముగ చెప్పబడుటవలనను, 'దృశ్యతే' అని, ప్రత్యక్షము అని చెప్పుటవలనను జీవుడు అని చెప్పుటకు వీలులేదు తరువాత, 'ఏష ఆత్మా, ఏత దమృతం, ఏత దభయం, ఏత ద్బ్రహ్మ' 'ఏతం సంయద్వామ మాచక్షతే, ఏష

ఉపేవవామనీః, ఏష హి సర్వేషు లోకేషు భాతి' అని ఆ పురుషుడు ఆత్మ, అమృతము, అభయము, బ్రహ్మ హేయగుణములు లేనివాడు, కల్యాణగుణములు కలవాడు' అని ఈ శ్రుతియే ప్రతిపాదించుచున్నది. ఆ ధర్మములు పరమాత్మకేకాని, జీవుడు మున్నగువారికి లేవు. అంతేకాక, 'య శ్చక్షుషి తిష్ఠన్' మొదలగు శ్రుతిచే పరమాత్మ చక్షురింద్రియాంతర్యామియై అధివసించునని ప్రతిపాదింపబడుచున్నది. కావున, అక్షిపురుషుడు పరమాత్మయే కాని, ఇతరులు కారు.

## సూత్రము :- "వివక్షిత గుణోపపత్తే శ్చ"

వెనుక చెప్పబడినట్లు, పరమాత్మకు సర్వతాదాత్మ్య ముపపన్నమగుటయేగాక, చెప్పబోవు గుణము లన్నియు తగుచున్నవి. అవి యేవన - 'మనోమయః, ప్రాణశరీరః భారూపః, సత్యసంకల్పః, ఆకాశాత్మా, సర్వకామః, సర్వగంధః, సర్వరసః, సర్వ మిద మభ్యాత్తః, అవాకీ, అనాదరః' అనునవి. ఇందలి మనోమయ శబ్దము సం వివేక విమోకాది సప్తసాధనములచే సాధింపదగిన పరమాత్మోపాసనచే నిర్మలమగు మనస్సుచేమాత్రమే గ్రహింపదగినవాడని యర్థమగుటచే, దుర్గుణములకు దూరుడై, కల్యాణ గుణములకు ఖనియగుటవలన సిద్ధించు వైలక్షణ్యము సూచింపబడుచున్నది. మలిన మనస్కులకు గోచరించునవి మలినమైనవేగదా ! కావున, ఇది పరమాత్మకే అసాధారణమగు గుణమగుచున్నది. 'ప్రాణ శరీర' అనునది రెండవ విశేషణము. అనగా - జగత్తునందలి సమస్త ప్రాణములకును ధారకుడని యర్థము. శరీర మనగా - ఆధేయము, విధేయము, శేషభూతమగు వస్తువు. ప్రాణమట్లు పరమాత్మకు ఆధేయము, విధేయము, శేషభూతము నగుచున్నదిగాన, అతడు ప్రాణశరీరుడు. మూడవది 'భారూపః' అనగా - నిరతిశయ దీప్తియుక్తుడని యర్థము. ఈతడు అప్రాకృతమును, తనకు మాత్రమే తగియున్నట్టియు, నిరతి

శయమగునట్టియు కల్యాణమగు దివ్యరూపముడుగలవాడు 'సత్య సంకల్పః' మరవోని సంకల్పమే కలవాడు 'ఆకాశాత్మా' ఆకాశము వలె అంతటను వ్యాపించుట కర్త స్వామే, నిర్మలమగు స్వగుణము కల వాడు 'సర్వకర్మా' — సకల జగత్తును సృష్టించువాడు 'సర్వకామః' కామములు అనగా భోగ్యపదార్థములు వానిననుభవించు ఉపకరణ ములు పరిశుద్ధములగు భోగ్య భోగోపకరణములు కలవాడు 'సర్వ గంధః', 'సర్వరసః' ప్రకృతి వికారములు లేనివియు, దోషరహిత ములు, నిరతిశయములునగు కల్యాణతరములునగు సర్వగంధములు, సర్వరసములు కలవాడు 'సర్వ మిదం అభ్యాత్తః' — పైన చెప్పిన సమస్త కల్యాణగుణములను స్వీకరించినవాడు 'అవాకీ' ఎక్కువ మాటలు మాటలాడనివాడు 'అనాదరః' తనకు పొందవలసినదేదియు లేకపోవుటచే, దేనియందు ఆసక్తి యుండనివాడు కావున, ఎక్కువ మాటలు మాటాడడు ఈ విధమగు గుణములన్నియు పరమాత్మయందే ఉండ దగినవి

**అనుపపత్తేస్తు న శారీరః**

పైన చెప్పిన గుణములన్నియు శరీరము కలవాడగుటచే, అపరిమిత దుఃఖములు అనుభవింపదగు జీవునకుండుట సంభవము కాదుకనుక, ఈ ప్రకరణమున జీవుడు ప్రస్తావింపబడలేదు పర మాత్మయే ఇందు నిరూపింపబడెనని ఎరుంగవలెను

**కర్మకర్తృ వ్యపదేశాచ్చ**

'ఏతమితః ప్రేత్యాభిసంభవితాఽస్మి' ఈ శరీరమును వదలి వీనిని పొందుదును' అని శ్రుతిలో జీవుడు పొందునని చెప్పుటచే, పొందబడువాడు వేరు, పొందెడివాడు వేరు కనుక, పరబ్రహ్మము జీవుని కంటె వేరని తెలియుచున్నది

## శబ్ద విశేషాత్

'ఏష మ ఆత్మా అంతర్హృదయే' అనే వాక్యములో హృదయమందున్న ఈ ఆత్మ ఉన్నాడని అనీ, 'నా ఆత్మ' అని షష్ఠీవిభక్తితో జీవుని చెప్పి, ఈ ఆత్మ అని ప్రథమా విభక్తితో పరమాత్మ చెప్పబడెను కావున, ఇద్దరు వేరేకానీ, ఒకరు కాదు.

## స్మృతేశ్చ

భగవద్గీతలో 'సర్వస్య చాహం హృది సన్నివిష్టః' 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' అని ఉపాసించు జీవుని హృదయములో పరమాత్మ ఉన్నాడని చెప్పుటచే జీవునికంటెను పరమాత్మ వేరుగా నిర్దేశింపబడియున్నాడు.

**"అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న, నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ"**

హృదయములో ఉన్నాడనియు, (యవ) ధాన్యముకంటె వ్రీహిధాన్యము గింజకంటె అణువని చెప్పబడుటచే, అపరిచ్ఛిన్నుడగు పరమాత్మ అట్టి ప్రదేశమున నున్నాడని చెప్పబడుటచే, ఈ ప్రకరణమున జీవుడే చెప్పబడుచున్నాడు అనుట అసంగతము కాదు.

ఉపాసకుడు తన హృదయ దేశమున ఉన్నట్లు ధ్యానింపవలెనని చెప్పుటకే అట్లు చెప్పబడినది కాని, పరమాత్మ అణురూపుడని తాత్పర్యము కాదు. ఆ శ్రుతియందే అణువుకంటె అణువుగా వర్ణించిన పరమాత్మనే – అంతరిక్షముకంటెను, ద్యులోకముకంటెను పెద్దవాడని చెప్పబడినది కావున, ధ్యానమున అట్లు భావింపవలెననియే దాని భావము.

ఈ ప్రకరణము నంతను పర్యాలోచన చేసి, ఈ క్రింది విధముగా అవగాహనము చేసికొనవలెను.

"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత."

అని జగత్తుయొక్క సృష్టిప్రళయములకు కారణమై, సకల జీవులలో ప్రవేశించి ఆత్మగానుండువాడు పరమాత్మకనుక, 'సమ స్తము బ్రహ్మాత్మకము' అని ఉపాసింపవలెనని ముందు చెప్పి, అన్ని టికి ఆత్మగా నుండు ఆ పరమాత్మను ఎట్టి గుణములు గలవాడుగా ఉపాసించిన, అట్టి సిద్ధికలుగునని ఆ పరమాత్మస్వరూపమును, గుణము లను - మనోమయుడు, భారూపుడు, సర్వకాముడు, సత్యసంకల్పుడు మొదలగు గుణములు కలవానినిగా ఉపాసించవలెనని చెప్పెను అట్టి పరమాత్మ - ఉపాసన చేయువారికి అణురూపముగ నుండుటకై, ఉపాసకుని హృదయములో అణువైన జీవునికంటె అణువుగా ఉండు నని చెప్పెను ఉపాసకుని ధ్యానసౌకర్యమునకై అట్లుండునేకాని, అతడు భూమికంటె - ఆకాశముకంటె పెద్దవాడు, సర్వకాముడు, సత్యసంకల్పుడు అన్నియు తన కుండుటచే, దేనియందును ఆదరము లేక, ఉదాసీనుడై యుండును' అని, ప్రాప్యమగు బ్రహ్మ స్వభావ మును వివరించెను

అట్టివాడు నన్ను అనుగ్రహించుటకు నా హృదయదేశమున సన్నిహితుడై యున్నాడనియు, అట్టివానిని నే నుపాసించి, శరీర వియోగానంతరము పొందగలవాడనని భావించుకొనవలెను అట్లు భావించి ఉపాసించినవానికి అట్టి పరమాత్మను పొందుటలో సందే హము లేదు' అని పరిసమాప్తము చేసెను అందుచే, ఈ ప్రకరణ మున, 'అల్పమైన ప్రదేశమున నుండువాడు, అణువుకంటె అణువైన వాడు' అని, ఉపాసనకొరకు పరమాత్మను గూర్చియే చెప్పెనుకాని, జీవునిగూర్చి కాదు

"సంభోగ ప్రాప్తి రితి చే న్న వైశేష్యాత్

పరబ్రహ్మముకూడ జీవునివలె శరీరమునం దుండును అని నచో, పరమాత్మకుకూడ జీవునివలె శరీరసంబంధముచే సుఖదుఃఖాను

భవము తటస్థించునని ఊహింప వీలుకాదు శరీరములో నుండుట చేతనే సుఖదుఃఖము లనుభవింపవలసిన యవసరము లేదు కర్మపర వశుడైనవాడు అనుభవించును పరమాత్మ అపహతపాప్మత్వము కల వాడు కావున, కర్మసంబంధము ఉండదు అందుచేతనే మరియొక ఉపనిషత్తున 'రెండు పక్షులు ఒకచెట్టుపై నుండును ఒకపక్షి పండ్లు తినును, వేరొక పక్షి పండ్లు తినక, ప్రకాశించుచుండును' అని చెప్ప బడినది కావున, ఈ ప్రకరణమున జీవపరమాత్మలకు భేదమే నిరూ పితమైనదనియు, జీవపరము కాదనియు ఎరుంగవలెను

## 2 అత్త్రధికరణము

వెనుకటి అధికరణములో పరమాత్మకు భోక్తృత్వము లేదన్ని నారు భోక్తృత్వము కలవాడుగా చెప్పబడినవాడు జీవుడే యగును కదా! అట్లైనచో, కఠోపనిషత్తునందు -

"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః
మృత్యు ర్యస్యోపసేచనం, క ఇత్థా వేద యత్ర సః"

బ్రహ్మక్షత్రములు (చరాచరములు) రెండింటిని మృత్యువును ఉపసేచనముగా (నంజుడు) చేసికొని ఎవడు అన్నముగా స్వీక రించుచున్నాడో, వాని నెవడు తెలిసికొనగలడు' అను సూత్రములో - చరాచరభోక్తగా చెప్పబడినవాడు జీవుడా? పరమాత్మయా? అని సందేహము కలిగినది కర్మసంబంధ ముండిననే భోక్తృత్వ ముండును కావున, జీవుడే యని పూర్వపక్షము వచ్చినది దానికి సమా ధానముగ -

**'అత్తా చరాచరగ్రహణాత్'**

అత్తా = భోక్త పరమాత్మయే చరాచరములను అన్నింటిని భుజించుట యనగా - సంహరించుట అది జగత్తుయొక్క సృష్టి స్థితి

నియమములకు పోతువరున పరమాత్మకే కాని, జీవాత్మకు సంభవింపదు మృత్యువు ఉపసేచనమని చెప్పబడినది. ఉపసేచనమనగా — ఘోరోక దానిని తినుటకు సాయపడునట్లు, తానును తినబడునది అని యర్థము అట్లు మృత్యువునుకూడ చరాచరములతో గ్రహింపగల సామర్థ్యము పరమాత్మకే తప్ప జీవునకు ఉండదు ప్రకరణాచ్చ = అంతేకాదు. ఈ ప్రకరణము పరమాత్మనుగూర్చి వివరించుచున్నది" పరమాత్మను వాని యనుగ్రహమ్ముచే ఎఱుంగువాడే ఎఱుంగగల్గడుకాని, కేవల శ్రవణ మనన ధ్యానములచే ఎఱుఁగజాలడు అని చెప్పుచు, చరాచరములను మృత్యువుతోబాటు గ్రసింప మిగిలిన పరమాత్మను వాని యను గ్రహములేనిదే గ్రహించుట సాధ్యపడదని చెప్పుచున్నాడు కాని, ఈ ప్రకరణములోనే తర్వాత

ఋతం పిబంతే సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే "

అను కర్మఫలమును అనుభవించు ఒకడు మరొకనితో కలిసి హృదయ గుహాయందున్నాడని చెప్పబడినది కర్మఫలము ననుభవించు వాడు జీవుడేకదా ! వానికి తోడుగా నుండు ప్రాణమో, బుద్ధియో రెండవవాడుగా చెప్పబడియుండును కావున, జీవుని చెప్పిన ఈ మంత్రమునకు ముందున్న - వెనుక మంత్రములోకూడ భోక్తగా చెప్పబడినవాడు జీవుడే యనదగును' అని శంక రాగా,

గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్"

ఇచట - గుహలో ప్రవేశించియున్నవారని - చెప్పబడినవారు ప్రాణము, జీవుడుకాని, బుద్ధి, జీవుడుకాని కానేరదు జీవపరమాత్మలిద్దే గుహలో ప్రవేశించియున్నట్లు ఈ ప్రకరణము చెప్పుచున్నది

"తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం "

అని పరమాత్మ గుహలో నున్నట్లును -

"యా ప్రాణేన సంభవ త్యదితి ర్దేవతామయీ గుహాం ప్రవిశ్య తిష్ఠన్తి "

అను మంత్రమున 'అదితి' యనగా - జీవుడుకూడ గుహాలో నన్నట్లు చెప్పబడి, జీవుడు, పరమాత్మ - ఇద్దరు గుహాలో నున్నారు, వా రిద్దరిలో జీవుడు కర్మఫలమును అనుభవించువాడు పరమాత్మ అనుభవింపజేయువాడు కనుక, ఇద్దరిని భోక్తలుగా చెప్పినారు అను కొనవలెను అంతేకాక, ఈ ప్రకరణమునం దంతటను జీవుని ఉపాసకునిగాను, పరమాత్మను ఉపాస్యునిగాను, జీవుని ప్రాప్త (పొందే వాడు) గాను, పరమాత్మను ప్రాప్యుడు (పొందబడేవాడు) గాను నిరూపించుచున్నారు కావున, ఈ ప్రకరణము జీవ పరమాత్మలనే నిరూపించుచున్నదికావున, ఇచట భోక్తగా చెప్పబడినవాడు సకల జగత్తును ఉపసంహారించు పరమాత్మయేయని యెరుంగనగును ఆ పరమాత్మ సులభముగా ఎరుంగుటకు శక్యము కానివాడని తెలియ జేయుటకే అట్లు చెప్పబడినదికాని, ఆ జీవుని ప్రతిపాదించునది కాదు

## 3 అంతరాధికరణము

పరమాత్మ దుద్దర్శుడని చెప్పినారుకదా ఛాందోగ్యోపని షత్తులో -

"య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి
హోవా చైత దమృత మభయ మేత ద్బ్రహ్మేతి

కంటిలో ఏ పురుషుడు కనబడుచున్నాడో, ఆతడే ఆత్మ అమృతము, అభయము, బ్రహ్మము' అని యున్నదిగదా! దృశ్యతే - చూడబడుచున్నాడని చెప్పబడినవాడు పరమాత్మయా? లేక జీవాత్మయా? ప్రతిబింబాత్మయా? లేక - ఇంద్రియాధిష్ఠాన దైవమా? అని సందేహము

ప్రతిబింబమే - ప్రసిద్ధముగ నున్నట్లు చెప్పబడినది, చూడబడు చున్నది' అని చెప్పినారు కనుక — ప్రాణి యనియు, జీవాత్మయనియు చెప్పవచ్చును జీవుడు కంటియం దున్నాడని భావించబడును కన్ను తెరచుట, మూయుట వలన, జీవాత్మ శరీరములో ఉన్నాడో, లేదో తెలిసికొన వీలగుచున్నది సూర్యుడు తన కిరణములచే కంటియం దున్నాడని శ్రుతి చెప్పుచున్నది కావున, అధిష్ఠాన దేవతయైన కావచ్చును కాని, పరమాత్మ కానరాదు కనుక, పరమాత్మ యనునది కుదురదు' అని ఆశంక రాగా -

"అంతర ఉపపత్తేః"

కంటిలో నున్నాడని ఉపనిషత్తు చెప్పినది పరమాత్మయే అమృతత్వ, అభయత్వాది గుణములు పరమాత్మయందే ఉపపన్నములుకాని మిగిలినవానియం దుండుట పొసగదు

"స్థానాది వ్యపదేశా చ్చ"

పరమాత్మ కంటికి తెలియకుండ కంటిలోనుండి నియమించుచున్నాడని చెప్పబడినది లోన ఉండుట, నియమించుట పరమాత్మకే కాని, ఇతరులకు కుదురదు యోగులు ప్రత్యక్షముగ చూతురుకనుక, కంటియందు చూడబడుచున్నాడని శ్రుతి చెప్పినదికావున, నేత్రమం దున్నవాడు పరమాత్మయే

"సుఖ విశిష్టాభిధానాదేవ చ"

అంతేకాక, 'కం బ్రహ్మ, ఖం బ్రహ్మ' అని సుఖముగలవాడు బ్రహ్మమని చెప్పి, అట్టి బ్రహ్మను కంటియందు ఇట్లు ఉపాసన చేయవలెనని ఉపాసనమును విధించుటకొరకే నేత్రమునం దున్నాడని ఉపనిషత్తు చెప్పినది

'కం బ్రహ్మ, ఖం బ్రహ్మ' అని సుఖము బ్రహ్మ, ఆకాశము బ్రహ్మ' అని పరమాత్మ శరీరములుగా, సుఖమును, ఆకాశమును బ్రహ్మగా భావించవలెనని చెప్పినట్లు కనబట్టుచున్నది కాని, బ్రహ్మ

స్వరూపమును ప్రతిపాదించుటలేదను సందేహము కలుగవచ్చును. కాని, అట్లు కాదు

“అత ఏవ చ స బ్రహ్మ”

అక్కడ -

“యద్వావ కం త దేవ ఖం యదేవ ఖం త దేవ కం”

అని, అపరిచ్ఛిన్నమై, సుఖరూపము బ్రహ్మము అని చెప్పినదికావున, అపరిచ్ఛిన్న సుఖరూపముగా నుండుట బ్రహ్మమునకేగాని, మిగిలిన వానికి లేదుకనుక, నేత్రమం దుపాసింపదగినవాడుగా చెప్పబడినవాడు పరమాత్మయే అంతేకాక, పరమపురుష యాథాత్మ్యము నెరిగిన వారు అనుసరించదగినదిగా ఇతర శ్రుతులలో చెప్పబడిన అర్చిరాది గతి ఈ అక్ష్యాధారపురుషోపాసన చేయువారికిగూడ అనుసంధింప దగినట్లు ఉపదేశించుటచే, పరమాత్మయే ఇందు ప్రతిపాదింప బడినాడు.

“అనవస్థితే రసంభవాచ్చ నేతరః”

ప్రతిబింబము మున్నగునవి ఎల్లపుడు నియతముగ నేత్రమునం దుండవు కనుకను అమృతత్వ – అభయత్వాది గుణములు పరమాత్మయందే తప్ప, జీవాదులం దుండవు కనుక, పరమాత్మకంటె ఇతరులు నేత్రాంతరమున ఉపాసింపదగినవాడు కారు

## 4 అంతర్యామ్యధికరణము

వెనుక అధికరణమున ‘స్థానాది వ్యపదేశాచ్చ’ అను సూత్రములో - ‘య శ్చక్షుషి తిష్ఠన్’ అను శ్రుతిచేత, నేత్రమునం దుండి, నేత్రమును నియమించువాడు పరమాత్మయే అని చెప్పబడినాడు కనుక, నేత్రము నాధారము జేసికొని యుపాసన చేయబడువాడు పర

మాత్మయేకాని, జీవాత్మకాదు అని నిరూపించినారు కాని, ఆ అంతర్యామి పరమాత్మ యగునా? యని శంకించి, సమాధానము చెప్పుచున్నారు

"అన్తర్యా మ్యధిదైవాధిలోకేషు తద్ధర్మ వ్యపదేశాత్

బృహదారణ్యకోపనిషత్తులో – కాణ్వశాఖ, మాధ్యందిన శాఖ అను రెండు శాఖలలో – పృథివి, జలము, అగ్ని, అంతరిక్షము, వాయువు, సూర్యుడు, దిక్కులు, చంద్రుడు, తారకలు, ఆకాశము, తమస్సు, తేజస్సు మొదలగు సర్వదైవములందు సర్వభూతములందు, ప్రాణము, వాక్కు, చక్షువు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సు, మొదలగు ఆత్మాత్మీయములందును, సర్వలోకములందును, సర్వయజ్ఞములందును లోన దానిని తెలిసికొనుటకు శక్యము కాకుండ, దానిని శరీరముగా కలిగి, దానిని నియమించుచు ఉన్నవాడు నీకు అంతర్యామియని చెప్పబడినది ఆ అంతర్యామి – ద్రష్ట, శ్రోత యని చెప్పబడియున్నదికావున, ఇంద్రియాధీనజ్ఞానము కల జీవాత్మయే అంతర్యామియని తెలియుచున్నది కనుక, నేత్రమున ఉపాసింపదగినవాడు జీవాత్మయే యని సందేహము కలుగును కాని, అంతర్యామి జీవాత్మ కాదు. అపహత పాప్ముడగు నారాయణుడు పరమాత్మయే సర్వలోక – సర్వభూత – సర్వదైవములను నియమించుట పరమాత్మయొక్క ధర్మమే సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, పురుషోత్తముడునగు పరమాత్మకంటెను ఇతరులకు అన్నింటిలోన ప్రవేశించి నియమించుట, అన్నిటికి ఆత్మగా ఉండి నియమించుట సంభవించదు ఉపనిషత్తులలో పెక్కు స్థలములందు – అన్నింటిని శాసించుట, అన్నిటికి ఆత్మగా నుండుట పరమాత్మకే వర్ణింపబడినవి

అమృతత్వము అంతర్యామికి చెప్పబడినది అమృతత్వము పరమాత్మ ధర్మమే. ద్రష్టత్వము శ్రోతృత్వము పరమాత్మకు సహజ

ముగ ఉండును కాని, ఇంద్రియాధీనము కాదు 'పశ్యత్య చక్షుః, స శృణో త్య కర్ణః' కన్నులు లేకుండనే చూచును, చెవులు లేకుండనే వినును అని, పరమాత్మకు సహజముగ ద్రష్టృత్వము, శ్రోతృత్వము కలవని శ్రుతి చెప్పినది 'నాన్యతోఽస్తి ద్రష్టా' అని, ఆ జీవునికి వాని కంటె వేరొకడు నియంత లేడని చెప్పుచున్నది 'ఏష త ఆత్మా' 'స త ఆత్మా' అని, 'వాడు నీకు ఆత్మ' అని చెప్పుచుండుటచే, తే — నీకు అని చెప్పబడిన జీవునకు ఆత్మయని కూడ శ్రుతి చెప్పుచున్నది కనక, అంతర్యామి జీవుడు కానేరడు

"న చ స్మార్త మతద్ధర్మాభిలాపా చ్ఛారీర శ్చ "

అంతర్యామి ప్రధానము (ప్రకృతి) కాని, జీవుడుకాని కానేరడు అంతర్యామికి చెప్పిన సర్వద్రష్టృత్వ, సర్వనియంతృత్వ, సర్వాత్మత్వ, అమృతత్వములు ప్రకృతికిగాని, జీవునకుగాని ఉండ నేరవు

ఉభయేఽపి హి భేదేనైన మధీయతే "

మాధ్యందిన కాణ్వ శాఖలు రెండును అంతర్యామి ప్రకృతి వికారములును, అచేతనములును ఆత్మను (జీవాత్మను) కూడ అంతర్యామి వానిలోనుండి వానికి తెలియకుండ నియమించునని చెప్పుచున్నవి ఆత్మలోనుండి ఆత్మను నియమించువాడు, ఆత్మకంటె వేరుగనుండు పరమాత్మయే యగునుకాని, ఆత్మయే కాదుగదా! కావున, ఆ రెండును పరస్పరము భిన్నములని చెప్పుచున్న శ్రుతినిబట్టి అంతర్యామి జీవాత్మకంటె వేరైన నారాయణుడే యని స్పష్టమగుచున్నది.

## 5 అదృశ్యత్వాది గుణకాధికరణము

"అథ పరాయయా త దక్షర మధిగమ్యతే ; య త్త ద ద్రేశ్య మగ్రాహ్యమ్ "

ఇత్యాదినా అదృశ్యత్వాది గుణములుగల అక్షరమున్ను, 'అక్షరా త్పరతః పరః' అని, అక్షరముకన్న గొప్పది యగు మరియొక తత్త్వమున్ను ఈ వాక్యమున తెలుపబడినవి ఈ యదృశ్యత్వాది ధర్మములుగల అక్షర మేది ? దానికంటె పరమగు తత్త్వ మేది ? యని శంక జనించెను

పూర్వపక్షి అక్షరము ప్రకృతియనియు, రెండవది జీవుడనియు చెప్పి సమర్థించెను ఎట్లన, ఇచ్చట అక్షరమునకు అదృశ్యత్వాది ధర్మములు చెప్పబడినవి లోకమున 'అబ్రాహ్మణః' అనగా - బ్రాహ్మణ భిన్నుడని యర్థము అట్టివాడు చండాలుడును కావచ్చును పశువును కావచ్చును కాని, బ్రాహ్మణ్యమునకు అత్యంత సన్నిహితుడైన క్షత్రియజాతికి చెందిన నొక క్షత్రియుడని చెప్పుట సమంజసము అట్లే, 'అబాలః' అనగా - బాల్యమునకు దగ్గరదైన యౌవనావస్థలోనున్న ఆ పురుషుడే యర్థమగుట సమంజసము కాని, వేరొక ధర్మిని బోధించుట యుక్తము కాదు అట్లే, ప్రస్తుతము దృశ్యత్వము ఘటాద్యచేతనములయందున్నది కావున, అదృశ్యత్వము ఆ యచేతనముయొక్క సూక్ష్మావస్థ ద్రవ్యగతమని చెప్పుటయే సమంజసమగును అట్టిది ప్రకృతియే యనియును, 'అక్షరా త్పరతః పరః' యనుచో, 'పరతః అక్షరాత్' అని విశేషణ విశేష్యభావము నంగీకరించి, అక్షరము వికారరహిత సూక్ష్మావస్థ అచిద్ద్రవ్యముగాన, అది వికారముగల అచేతన ద్రవ్యముకంటె గొప్పది దానికంటె పరుడు ఆత్మ కావున, ఇచ్చట ప్రకృతిపురుషులే చెప్పబడుచున్నారని చెప్పుదురు మరియు, ఆ పురుషునిచే అధిష్ఠింపబడినదై, ప్రకృతి మహదాది వికారముల నన్నిటిని పుట్టించుచున్నదని, సాలిపురుగు గూడును బుట్టించుట, భూమినుండి ఓషధులు పుట్టుట, పురుషునినుండి కేశములు పుట్టుటయు ఉదహరింపబడినవి సిద్ధాంతులు - అదృశ్యత్వాది గుణకుడు, అక్షరాత్పరతః పరుడును పరమపురుషుడే యని సిద్ధాంతీకరిం

చిరి అందులకు కారణము - 'తద్ధర్మోక్తేః' పరమాత్మకు అసాధారణమైన జగత్కారణత్వము, దాని కుపయోగించు సర్వజ్ఞత్వాది ధర్మములు చెప్పబడుటయే

అద్రేశ్య మనగా - ఇంద్రియములకు గ్రాహ్యించకుండుట లేక, కంటికి గ్రాహ్యించకుండుట లేక, జ్ఞానేంద్రియములకు గోచరింపకుండుట

'అగ్రాహ్య మనగా - అనుమాన ప్రమాణముచే తెలియబడకుండుట లేక, ఇతరేంద్రియములకు గ్రాహ్యించకుండుట లేక, కర్మేంద్రియములగు చేతులు మొదలగువానిచే తీసికొనుటకు, విడుచుటకు శక్యముగాకుండుట' యని యర్థము

'శాస్త్రయోనిత్వాత్' అను మూడవ యధికరణమున కేవల శాస్త్రప్రమాణముచే తెలియఁబడువాడేకాని, ఇతరములగు ప్రప్రమాణములకుగాని గోచరింపబడడని సమర్థింపబడెను గదా! 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' అనగా - సకల వేదములచేతను మాత్రమే నే నెఱుంగబడుచున్నానని భగవానుడు సెలవిచ్చెను గదా!

'అక్షరా త్పరతః పరః' అను వాక్యములోని అక్షరపదము మొదటి వాక్యములోని అక్షరపదమువలె పరమాత్మను చెప్పదు చెప్పినచో, ఆతనికంటె గొప్పవా డెవ్వడున్నాడు? కాబట్టి, దానికి ఇ ట్లర్థము చెప్పవలెను

ఈ వాక్యము - ప్రకృతమగు అదృశ్యత్వాది గుణములు గలవాడును, సృష్టికర్తయు, సర్వజ్ఞుడును అగు సర్వేశ్వరునే పరతత్త్వముగా చెప్పుచున్నది కావున, అక్షర శబ్దము భూతసూక్ష్మమగు ప్రధానమునే చెప్పును దీనికంటె పరుడు (గొప్పవాడు) జీవుడు అతనికంటె గొప్ప వస్తువును చెప్పవలెను కావున, 'పరతః' అని, పంచమ్యంతము స్వతంత్రమేగాని, వెనుకటి 'అక్షరాత్' అను పదము

నకు విశేషణము కాదు 'ఆ జీవునికంటెను గొప్పవాడు పరమాత్మయే' యని సిద్ధాంతము కావున, ఈ ప్రకరణమున ఉభయత్ర పరమాత్మయే చెప్పబడుచున్నాడు

"విశేషణ భేద వ్యపదేశాభ్యాం చ నేతరౌ

విశేషణ మనగా — వైలక్షణ్యమును జెప్పుట వేనికంటెను? ఎవరికి? ప్రధాన పురుషులకంటె పరమాత్మకు ఏ ధర్మము లుండుట వలన ఆతని కీ వైలక్షణ్యము? తా నొక్క డెఱుంగబడినచో, తన కంటె భిన్నమైన సమస్త మెఱుంగబడుటయే ఈ విశేషము ప్రకృతికిగాని, పురుషునకుగాని లేదు

భేద వ్యపదేశము — ఆ ప్రకృతి పురుషులకంటె పరమాత్మకు భేదము చెప్పబడుచున్నది ఈ రెండు కారణములచే, నేతరౌ — ప్రకృతి పురుషులు ఈ ప్రకరణమున తెలియబడుట లేదు పరమాత్మయే తెలియబడుచున్నాడు

అక్షరాత్ — అవ్యాకృతముకంటె, పరః — సమష్టిపురుషుడు, తస్మా దపి పరః — అదృశ్యత్వాది గుణకుడను, అక్షరుడనబడు వాడను నగు పరమాత్మయే

## 6 వైశ్వానరాధికరణము

ఈ యధికరణమున ఎనిమిది సూత్రములు కలవు ఛాందోగ్యోపనిషత్తునందు ఉపాస్యముగా చెప్పిన వైశ్వానరాత్మ పరమాత్మయే యని ఇందు నిరూపింపబడును వెనుకటి అదృశ్యత్వాధికరణమున, త్రైలోక్యము శరీరముగా గలవాడు పరమాత్మయేయని నిర్ధరించిరి కాని, వైశ్వానరాత్మకుకూడ త్రైలోక్యము శరీరముగా నున్నట్లు వర్ణింపబడినది ఆ వైశ్వానరాత్మ - పరమాత్మయా? జీవాత్మయా? అను సందేహము కలుగగా, పరమాత్మయే అని నిరూపించుటకు ఈ యధికరణము ఆరంభింపబడినది

ఔపమన్యవుడు మొదలగు అయిదుగురు మహర్షులు 'కో న ఆత్మా? కిం బ్రహ్మ'? 'మన కాత్మ యేది? బ్రహ్మ యేది' అని చర్చించి, వైశ్వానరాత్మ నెఱుంగగోరి, ఉద్దాలకునివద్ద కేగిరి ఆ యుద్దాలునకుగూడ వైశ్వానరాత్మస్వరూపము తెలియదు అందుచే, వారందరు కలిసి అశ్వపతి యను కేకయరాజునొద్ద కేగి, ఆతనికి తెలిసిన వైశ్వానరాత్మస్వరూపమును తమ కెఱింగింపవలసినదిగా కోరిరి

ఆత్మాన మేవేమం వైశ్వానరం సంప్ర త్యధ్యేషిత మేవ బ్రూహి "

నీవు ఆత్మయగు ఏ వైశ్వానరు నుపాసించుచున్నావో, వానిని మాకు చెప్పుము' అని కోరిరి ఇచట 'వైశ్వానరాత్మ' పరమాత్మయని నిర్ణయింప శక్య మగునా? కాదా? అని సందేహము వైశ్వానర శబ్దము నాలుగర్థములయందు ప్రయోగింపబడుచున్నది

"అయ మగ్ని ర్వైశ్వానరో యేనేద మన్నం పచ్యతే యదిద మద్యతే తస్యైష ఘోషో భవతి యమేత త్కర్ణావ పిధాయ శృణోతి స యదో త్క్రమిష్య న్భవతి నైనం ఘోషం శృణోతి '

మనము తినిన అన్నము దేనిచే పక్వము (జీర్ణము) అగు చున్నదో, అది వైశ్వానర మను అగ్ని చెవులు మూసికొని వినుచో, దాని ఘోష వినబడును అది వెడలిపోయినచో, ఆ ధ్వని వినబడదు' అనుచోట, వైశ్వానర శబ్దము జాఠరాగ్నిని తెల్పుచున్నది

2 "విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతు మహ్నా మకృణ్వన్

ఈ సర్వప్రపంచమునకొఱకు పగటికి చిహ్నభూతమైన వైశ్వానర మను అగ్నిని సృజించిరి' అనుచోట, వైశ్వానర శబ్దము మహాభూతములలో మూడవది యగు అగ్నిని తెల్పుచున్నది

3 "వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజాహికం భువనానా మభిశ్రీః "

సర్వసంపద లంతట వెలయుచు, సర్వభువనములకు రాజగు వైశ్వానరుని మంచి తలంపు మనపై ప్రసరించుగాక' అనుచోట, వైశ్వానర శబ్దము దేవతా విశేషమునందు ప్రయోగింపబడినది.

**4 "తదాత్మన్యేవ హృదయేఽగ్నౌ వైశ్వానరే ప్రాస్యత్"**

**"స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని రుదయతే"**

దానినే ఆత్మయందు, హృదయమందు, వైశ్వానరాగ్ని యందు నిక్షేపించెను ఈ ఆ వైశ్వానరుడు విశ్వరూపుడు ప్రాణము అగ్నియై ఉదయించుచున్నాడు' అనుచోట, పరమాత్మవాచకముగ వైశ్వానర శబ్దము ప్రయోగింపబడినది

ఇట్లు నాలుగర్థములుగల వైశ్వానర శబ్దము ఇచట పరమాత్మనే తెల్పును' అని నిర్ణయ మెట్లు చేయ వీలగును ? అంతేగాక, ఈ ప్రకరణమున వైశ్వానరుని ధర్మములుగా చెప్పబడినవి ఇతరానుగుణముగ కూడ చెప్ప వీలగుచున్నవి కావున, వైశ్వానరాత్మ పరమాత్మయే యని ఎట్లు నిర్ణయముచేయగలము ? అని పూర్వపక్షము రాగా —

**1 వైశ్వానరః సాధారణ శబ్ద విశేషాత్"**

వైశ్వానరుడు పరమాత్మయే పరమాత్మకే చెందు ధర్మములను తెల్పు విశేషణములు సాధారణ శబ్దమగు వైశ్వానర శబ్దమునకు విశేషణములుగా ప్రయోగించుటవలన —' అని సమాధానము చెప్పుచున్నారు

కేకయరాజగు అశ్వపతివద్దకు ఉద్దాలకునితో కలిసి వెళ్ళిన అయిదుగురు మహర్షులు ముముక్షువులై, వైశ్వానరాత్మ నెరుంగగోరిరి జీవాత్మల కాత్మభూతమగు బ్రహ్మము నెఱుంగగోరి, దాని నెఱింగినవాని నన్వేషించుచు, వారు బయలుదేరిరి ఆ వైశ్వానరాత్మ నెఱింగిన కేకయరాజువద్దకు వచ్చిరి కావున, ముముక్షువులగు

అ ఋషు లడిగిన వైశ్వానరాత్మ పరమాత్మయే యగునుకాని, ప్రత్యగాత్మకాదు అంతేకాక, 'ఆత్మ, బ్రహ్మ' శబ్దములతో నారంభించి, తరువాత – బ్రహ్మశబ్దస్థానమున వైశ్వానరశబ్దమును ప్రయోగించుటచేకూడ వైశ్వానరాత్మ పరమాత్మయే యని నిర్ణయింపవచ్చును మఱియు, వైశ్వానరాత్మ విజ్ఞానమునకు ఫలముగ –

"తద్యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేవ ఏవం హాస్య
సర్వే పాప్మానః ప్రదూయన్తే"

గడ్డిపరక అగ్నిలో వేసిన ఎట్లు మాడిపోవునో, అట్లే ఇతని పాపము లన్నియు డుల్లిపోవును' అని సర్వపాపప్రకాశమును చెప్పెను. ఇదికూడ వైశ్వానరాత్మ పరమాత్మయే యని నిర్ణయమునకు సాయపడుచున్నది అంతియేగాక –

2 స్మర్యమాణ మనుమానం స్యాదితి "

శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధమగు ఆ పరమాత్మ స్వరూపమే ఇచట వైశ్వానరాత్మయొక్క రూపము' అని గుర్తు చేయుటకూడ, వైశ్వానరాత్మ పరమాత్మ యనుటలో హేతువు అగుచున్నది

శ్రుతిస్మృతులలో ద్యులోకము మొదలు పృథివ్యంతములగు లోకములు పరమాత్మ కవయవములుగ వర్ణింపబడినది

అగ్ని ర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశః శ్రోత్రే
వాగ్వివృతాశ్చ వేదాః । వాయుః ప్రాణో హృదయం
విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా "

అని శ్రుతి చెప్పుచున్నది

ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి ఖం వై నాభిం చంద్రసూర్యౌ చ నేత్రే
దిశః శ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సోఽచింత్యాత్మా సర్వభూత ప్రణేతా."

అని స్మృతి చెప్పుచున్నది

ఈ ప్రకరణమునగూడ ఆ ద్యులోకము మొదలగునవి వైశ్వానరునకు శిరస్సు మొదలగు అవయవములని చెప్పబడినది కావున, ద్యులోకము మున్నగునవి శిరము మున్నగు అవయవములుగా కల్గియుండు రూపము పరమపురుషునకే తగును కావున, వైశ్వానరుడు పరమ పురుషుడే

3 "శబ్దాదిభ్యః అంతః ప్రతిష్ఠానాచ్చన - ఇతిచేన్న - తథా దృష్ట్యుపదేశాత్ అసంభవాత్ పురుష మపి చైవ మధీయతే

శబ్దా భ్యః అంతః ప్రతిష్ఠానాచ్చన

వైశ్వానరుడు పరమాత్మ యనుట పొసగదు వైశ్వానర శబ్దము అగ్ని శబ్ద సమానాధికరణముగ బృహదారణ్యకమున -

స ఏషోఽగ్ని ర్వైశ్వానరః "

'ఈ వైశ్వానరాగ్ని' అని ప్రయోగింపబడినది ఈ ప్రకరణమందుగూడ హృదయస్థానమం దుండు వైశ్వానరుడు గార్హపత్యాగ్ని యనియు, మనస్సునందుండు వైశ్వానరుడు అన్వాహార్య పచనాగ్ని యనియు, ఆస్యగతుడగు వైశ్వానరుడు ఆహవనీయాగ్ని యనియు వైశ్వానరునకు త్రేతాగ్ని స్వరూపము కల్పింపబడినది ప్రాణాహుతుల కాధారముగ ఈ వైశ్వానరుడు నిర్దేశింపబడినాడు అందుచే, వైశ్వానరుని పరమాత్మ యనుట పొసగదు

మఱియు, ఈ వైశ్వానరుడు (అను అగ్ని) పురుషునిలో ప్రతిష్ఠితుడై యున్నట్లు -

స యో హైత మేవ మగ్నిం పురుషవిధం పురుషేంతః ప్రతిష్ఠితం వేద "

అని బృహదారణ్యకమున చెప్పబడినది ఇట్లు వైశ్వానరశబ్దమును అగ్ని శబ్దసమానాధికరణముగ ప్రయోగించుటచేతను, వైశ్వానరుని మూడు అగ్నులుగ రూపించుటచేతను, ప్రాణాహుతుల కి

వైశ్వానరు డాధారమని చెప్పుటచేతను, పురుషుని లోపలి భాగమున ఈ వైశ్వానరు డుండునని చెప్పుటచేతను, వైశ్వానరుడు జాఠరాగ్ని యనికూడ చెప్పుట కవకాశమున్నది కాన, ఇతడు పరమాత్మయే యని చెప్ప వీలులేదు' 'ఇతి చేన్న' అని శంకింపరాదు

'తథా దృష్ట్యుపదేశాత్' త్రైలోక్యము శరీరముగాగల పరబ్రహ్మమగు వైశ్వానరుని జాఠరాగ్ని శరీరునిగా ఉపాసన చేయవలెనని ఉపదేశింపబడినది కాని, అగ్ని యనగా - కేవల జాఠరాగ్ని కాదు జాఠరాగ్ని విశిష్టుడగు పరమాత్మ యని తెలియనగును అట్లు కానిచో, 'అసంభవాత్' త్రైలోక్యము శరీరముగా నుండుట జాఠరాగ్నికి సంభవింపదుగదా ।

ఈ జాఠరాగ్ని యన, దానితో కూడిన పరమాత్మయే యని -

"అహం వైశ్వానరో భూత్వా పచా మ్యన్నం చతుర్విధమ్ "

నేను (భగవానుడు) వైశ్వానర శరీరముతో కూడినవాడనై, నాలుగు విధములగు అన్నమును పచనము చేయుచున్నాను' అని భగవద్గీత తెలుపుచున్నది మఱియు,'పురుష మపి చైన మధీయతే' ఈ వైశ్వానరాగ్నిని పురుషునిగాకూడ వాజసనేయులు చెప్పుచున్నారు 'స ఏషోఽగ్ని ర్వైశ్వానరో యత్పురుషః' అని కేవల జాఠరాగ్నిని పురుషుడుగా చెప్ప వీలుపడదుగదా ! పురుషు డనగా - పరమాత్మయే యని, 'సహస్ర శీర్షా పురుషః' అనుటవలన తెలియుచున్నది కావున, వైశ్వానరుడు పరమ పురుషుడే

"సాక్షా ద్ప్యవిరోధం జైమినిః "

జాఠరాగ్ని విశిష్టుడగు పరమాత్మ యని యర్థము చెప్పి, అగ్ని శబ్దము పరమాత్మనే తెలియజేయునని వెనుక సమర్థించితిమి కాని, అగ్ని శబ్దము సాక్షాత్తుగ పరమాత్మనే తెలుపును కావున,'స ఏషోఽగ్ని

వైశ్వానరః' అని వైశ్వానరునితో సమానాధికరణముగ అగ్ని శబ్దమును వాడినను విరోధము లేదని జైమిని చెప్పచున్నాడు వైశ్వానర శబ్దము — 'విశ్వాన్ నరాన్ నయతి' 'విశ్వే నరాః ఏనం' అను వ్యుత్పత్తులచే,'నడిపించువాడు' 'సమస్త జీవకోటిచే పొందబడువాడు' అను పరమాత్మధర్మమును దెల్పుటచే, ఆ గుణము కలవాడుగ చెప్పబడిన వైశ్వానరుడు పరమాత్మయే అట్లే, 'అగ్రం నయతీతి అగ్నిః' 'అగ్రం నీయతే ఇతి అగ్నిః' 'అగ్రం నమయతి ఇతి అగ్నిః' అను వ్యుత్పత్తులచే, అగ్ర నయన మను గుణము, ప్రసన్నత యను గుణము పరమాత్మయందే పుష్కలముగా నుండుటచే, అగ్నిశబ్దము పరమాత్మవాచకమే

ఇచట ఒక సందేహము కలుగవచ్చును అపరిచ్ఛిన్నమగు పరబ్రహ్మను ద్యులోకము మొదలు పృథివ్యంత ప్రదేశమునకు పరిమితముగ వర్ణించుట యుక్తమా ? కావున, ఇచట వైశ్వానరుడు మహాభూతమగు అగ్నియో, లేక — దేవతారూపమగు అగ్నియో కావలెను అని

దానికి సమాధానముగా — 'అభివ్యక్తేరి త్యాశ్మరథ్యః' అట్లు వర్ణించుట ఉపాసకుడు గ్రహించుటకు సులభముగా నుండుటకే అని ఆశ్మరథ్యుడు చెప్పెను ప్రాకృతుల కుండునట్టి శిరము మొదలగు అవయవములతో కూడియుండినట్లు పరమాత్మను వర్ణించుట తగునా ? కావున, ఇయ్యది దేవతావిశేషమే కానోపును' అని శంక కలుగగా — 'అనుస్మృతే ర్బాదరిః' అనుస్మృతి యనగా — ఉపాసనము పురుషుని విధముగ త్రైలోక్య శరీరుడగు పరమపురుషుని బ్రహ్మప్రాప్తికై ఉపాసన చేయవలెనని ఉపదేశించుచున్నారు కావున, ఉపాసన కొరకై ఆ యాకారము వర్ణింపబడినది' అని బాదరి చెప్పెను

ఈ ప్రకరణమున ఉరము మొదలగువానిని అగ్నిహోత్రమునకు వేడి మొదలగు వానినిగా నిరూపించిరి పరమాత్మయే వైశ్వానరు

డగుచో నిది తగునా ? కావున, జాఠరాగ్నియే వైశ్వానరుడని చెప్పిన ఆ యగ్నికి వేదిగా ఉరము నిర్దేశింపబడుట యుక్తమని శంక కలుగగా -

**"సంపత్తే రితి జైమినిః, తథా హి దర్శయతి "**

ఉపాసకులు ప్రతిదినము చేయు ప్రాణాహుతి పరమాత్మ సమారాధనరూపమైనదే త్రైలోక్య శరీరుడగు పరమాత్మయే వైశ్వానరుడను అగ్ని కావున, ఆ యగ్నికి ఆధారముగా ఉరము మొదలగువానిని వేదిగా ఇం దుపదేశించిరని, జైమిని అను ఆచార్యుడు తలంచుచున్నాడు

వైశ్వానరునియందు అగ్నిహోత్రకల్పనము చేసి, ప్రాణాహుతి చేయుటచే, పరమాత్మోపాసనమువలన కల్గు ఫలము కల్గునని ఈ ప్రకరణమే తెల్పుచున్నది

**"స య ఇదమ విద్వా నగ్నిహోత్రం జుహోతి, యథాంగారా నపోహ్య భస్మని జుహుయా త్తాదృక్తత్స్యాత్ అథ య ఏత దేవం విద్వానగ్నిహోత్రం జుహోతి, తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మ సుహుతం భవతి తద్యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మనః ప్రదూయన్తే" ఇతి**

'ప్రతిదినము చేయు ప్రాణాహుతి పరమాత్మ సమారాధనార్థమని ఎఱుంగనివారై ఎవడు ఈ ప్రాణాహుతి ననుష్ఠించునో, అతడు - అగ్ని లేని భస్మములో హోమముచేయువాడు ఎవడు దీని నెఱింగి యనుష్ఠించునో, అతడు సర్వాత్మకుడగు భగవంతుని ఆరాధించుటచే - సర్వలోకములను, సర్వభూతములను, సర్వాత్మలను ఆరాధించువాడు అగును కావున, సర్వపాపములు నశించును' అని చెప్పుచున్నారు కనుక, ఉరము మొదలగువానిని వేద్యాదులుగ నిరూపించుట, అగ్ని

హోత్ర సంపాదనము - పరమాత్మసమారాధనార్థమే యని ఎఱుంగు టకు — అని తెలియనగును

"ఆమనన్తి చైన మస్మిన్"

ద్యులోకాదులు మూర్ధా ద్యవయవములుగాగల పరమపురుషు డగు ఈ వైశ్వానరుడు ఉపాసకుని శరీరమునందు ప్రాణాహుతికి ఆధారముగా నుండుననియు చెప్పుచున్నారు

"తస్య హ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య మూర్తైవ సుతేజాః"

త్రైలోక్యము శరీరముగాగల పరమపురుషుడగు వైశ్వానరుని ఉపాసన చేయవలెను' అని చెప్పి, ఆ ఉపాసకునకు అంగముగ ప్రాణాగ్నిహోత్రము నుపదేశించిరి ఉపాస్యుడుగ చెప్పబడిన ఆ వైశ్వానరునకు- సుతేజుడు, విశ్వరూపుడు, పృథగ్వర్త్మ, బహుళుడు, రయి, ప్రతిష్ఠ, అను నామధేయములుగల ద్యులోకము, ఆదిత్యుడు, వాయువు, ఆకాశము, జలము, పృథివి అనునవి — శిరము, నేత్రము, ప్రాణము, నడుము, పొత్తికడుపు, పాదములు అని నిరూపించిరి

అట్లు త్రైలోక్య శరీరుడుగ నిరూపింపబడిన పరమాత్మను ఉపాస కుడు తన శరీరమున సన్నిహితుడై యున్నట్లు అనుసంధానము చేసి కొనవలెను తనయొక్క ఉరము వేది యనియు, లోమములు బర్హిస్సు లనియు, హృదయము గార్హపత్య మనియు, మనస్సు అన్వాహార్య పచన మనియు, ఆస్యము ఆహవనీయ మనియు తలంచి, వానిని అగ్ని హోత్రోపకరణములుగ కల్పింపవలెను ఇట్లు కల్పింపబడిన ప్రాణాగ్నిహోత్రముతో - పరమాత్మయగు వైశ్వానరుని ఆరాధింప వలెను అని ఈ వైశ్వానరోపాసన ప్రకరణము వివరించుచున్నది. కావున, ఇందు ప్రతిపాదింపబడిన వైశ్వానరుడు పరమాత్మయగు పురుషోత్తముడే యని నిర్ణయింప నగును

# ప్రథమాధ్యాయము - తృతీయ పాదము

## 1 ద్యుభ్వాద్యధికరణము

మొదటి అధ్యాయము రెండవ పాదమున అస్పష్టముగ జీవ లింగములు కలిగి, జీవపరముగ చెప్పదగునట్లు కన్పడు ఉపనిష ద్వాక్యముల నన్నిటిని పరమాత్మపరముగ నిరూపించిరి ఈ మూడవ పాదమున స్పష్టముగ జీవధర్మములు కల్గి, జీవపరములే యని చెప్ప దగు వాక్యములను పరమాత్మపరములుగ నిరూపించుచున్నారు

**యస్మిన్ ద్యౌః పృథివీచాంతరిక్షమోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైః, తమే వైకం జానథాత్మాన మన్యా వాచో విముంచథ అమృతస్యైషసేతుః "**

ద్యులోకము, అంతరిక్షము ప్రాణపంచకముతో మనస్సు దేని యందు సమవేతమైయున్నదో, దాని నొక్క దానినే ఆత్మగా ఉపా సింపుడు వేరు మాటలను విడువుడు ఇదియే అమృతమునకు సేతువు' అని, అథర్వవేదీయమగు ముండకోపనిషత్తునందు చెప్పబడినది ఈ వాక్యమున - పృథివ్యాదుల కాయతనముగ చెప్పబడునది జీవుడా ? పరమాత్మయా ? అని సంశయము కలుగుచున్నది జీవుడే యని చెప్ప టకు స్పష్టముగ అవకాశము కన్పట్టుచున్నవి ఏల నన, దీని తరువాత శ్లోకమున -

**"అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః**
**స ఏషోఽ న్తశ్చరతే బహుధా జాయమానః "**

రథచక్రమునందలి ఆకులు మధ్య కుంచమువ (Hub) ఎట్లు చేరి యుండునో, అట్లు దేనియందు నాడులు కూడియుండునో- అతడే బహు రూపముల జన్మించుచున్నవాడై, లోన చరించుచున్నాడని చెప్ప బడెను. ఇందు చెప్పబడిన నాడీ సంబంధము, దేవాది రూపములతో బహువిధములుగ జన్మించుట యనునవి జీవధర్మములు

వెనుకటి శ్లోకమున ద్యు పృథివ్యాదుల కాశ్రయభూతుడుగ చెప్పబడినవానినే ఇందు 'యత్ర' అను వాక్యముచే గ్రహించి, వానికే నాడీసంబంధము కలదనియు, బహురూపముల జనించుచున్నాడనియు చెప్పబడినది.

మొదటి శ్లోకమున ప్రాణపంచకమునకు ఆశ్రయభూతుడుగా వర్ణింపబడుటచే, అదికూడ జీవధర్మమే కనుక, ఇచట ప్రతిపాదింప బడినవాడు జీవుడేయని నిశ్చయింప వీలగుచున్నది ద్యు పృథివ్యాదుల కాయతనమై యుండుట జీవధర్మము కాకపోయినను, ఎట్లో సరిపెట్టు కొనవచ్చును' అని పూర్వపక్షము రాగా, ఈ యుపనిషత్తుచే ప్రతి పాదింపబడువాడు పరమాత్మయే యని సిద్ధాంతము చేయుచున్నారు ఈ యధికరణమున ఆరు సూత్రములు కలవు. మొదటి సూత్రము -

1 "ద్యుభ్వా ద్యాయతనం స్వశబ్దాత్ ''

ద్యులోక భూలోకాదులకు - అనగా, ఈ పృథివ్యంతరిక్షా దుల కాధారముగ చెప్పబడినవాడు పరమాత్మయే. పరబ్రహ్మకే చెందు అర్థముగల శబ్ద ముండుటవలన, 'అమృతస్యైష సేతుః' అమృత మున కిది సేతువు' అను శబ్దము పరమాత్మకే చెందు శబ్దము

'త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే "

అని, ఉపనిషత్తులం దంతట పరబ్రహ్మయే అమృతత్వప్రాప్తికి హేతువుగ చెప్పబడినది 'సేతువు' అను పదము 'కలుపువాడు, చేర్చు వాడు' అను అర్థము కలది అమృతమునకు సేతువు అనగా - 'సంసార సముద్రపు టవ్వలి ఒడ్డు అగు అమృతత్వమును చేర్చు వాడు' అని యర్థము ఆ యర్థము పరమాత్మకే చెందునది కావున, ఇచట పరమాత్మయే ప్రతిపాదింపబడుచున్నాడు. అంతేకాక, ఆత్మ శబ్దముకూడ పరమాత్మకే చెందును 'ఆప్నోతి ఇతి ఆత్మా' (అంతటను

వ్యాపించువాడు) అను వ్యుత్పత్తిచే సమస్త వస్తువులను నియమించు శక్తితో వ్యాపించువాడు పరమాత్మయే అందువలన, ఈ శ్లోకము పరమాత్మనే ప్రతిపాదించుచున్నది అని చెప్ప వీలగును.

నాడీసముదాయమున కాధారభూతుడగుటచే, జీవుడని సంశయింప బనిలేదు అదియు పరమాత్మ ధర్మమే

**"సన్తతం సిరాభి స్తులంబత్యా కోశసన్నిభం. తస్యా శ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః "**

అని, పరమాత్మ నాడీసముదాయమున కాధారభూతుడై యుండునని స్పష్టముగ చెప్పబడినదిగదా ! బహు రూపములలో జనించుట జీవ ధర్మ మని శంకింప బనిలేదు.

**"అజాయమానో బహుధా విజాయతే, తస్య ధీరాః పరిజానంతి యోనిమ్ "**

అని, దేవాదులకు సులభ సమాశ్రయణీయు డగుటకు జన్మమే లేని పరమాత్మ - తన సంకల్పముచే తన స్వభావమును వీడకయే దేవాది రూపములను స్వీకరించుచుండును. ఈ విషయమును భగవద్గీత కూడ ఇట్లు సమర్థించుచున్నది.

**"అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్**
**ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా " (4-6)**

నేను అజుడుగను, పరిణామము లేనివాడుగను, సర్వభూతములకు ఈశ్వరుడుగను, నా యీశ్వరస్వభావమును విడువకయే, నా సంకల్ప రూపజ్ఞానముచేత జనించుచున్నాను' అని, మనస్సు మొదలగు జీవుని ఇంద్రియములకు, ప్రాణములకుకూడ పరమాత్మయే ఆధారభూతుడుగ నుండు ననుటలో అసంగతి లేదు. కావున, 'యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షం' అను వాక్యము పరమాత్మనే ప్రతిపాదించును.

2 "ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ"

పృథివ్యంతరిక్షా ద్యాయతనభూతుడుగ చెప్పబడిన పురుషుడే సంసారబంధమునుండి విడువడిన ముక్తులచేకూడ పొందదగినవాడని ఈ ఉపనిషత్తు ప్రతిపాదించుటవలనకూడ, ద్యు పృథివ్యా ద్యాయతనభూతుడని వెనుక నిర్దేశింపబడినవాడు పరమాత్మయే యని ఎఱుంగ నగును

"యథా పశ్యతే రుక్మవర్ణం కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్
తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి"

బ్రహ్మదర్శి దివ్యమంగళవిగ్రహముగల జగత్కర్తయగు పరమ పురుషు నెపుడు దర్శించునో, అపుడు పుణ్యపాపములను వీడి, సర్వజ్ఞత్వాది గుణావిర్భావముచే, పరమపురుషునితో అత్యంత సాదృశ్యము నందును"

"యథా నద్య స్స్యందమానా స్సముద్రే ఽస్తం గచ్ఛన్తి నామ రూపే విహాయ
తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్."

గంగా, యమునా, సరస్వత్యాది నదులు ప్రవహించుచుపోయి తమ తమ పేర్లను, తెలుపు - నలుపు మొదలగు రంగులను వీడి, ఎట్లు సముద్రములో చేరుచున్నవో, అట్లే, ఈ ఆత్మజ్ఞానముకలవాడు నామరూపములను వీడి, పరమపురుషుని చేరును

పుణ్యపాపములచే అచిత్సంసర్గమును పొంది, దానివలన నామరూపములను కల్గియుండుట సంసారము పుణ్యపాపములను దులుపుకొనినవారును, వానివలన కల్గు ప్రకృతిసంబంధము లేనివారును, నామరూపభేదములు లేనివారును ముక్తపురుషులు. అట్టి ప్రకృతి బంధమునుండి విడువడి, పరబ్రహ్మతో తమ సామ్యమును పొందిన వారిచేగూడ పొందదగినవాడుగ ఈ ద్యు పృథివ్యా ద్యాయతన

మగు పురుషుడు వర్ణింపబడినాడు కావున, ఈ పురుషుడు పరమ పురుషుడే

3 "నానుమాన మతచ్ఛబ్దా త్ప్రాణభృచ్చ "

ఈ ప్రకరణమున ప్రతిపాదింపబడునది ప్రధానమా ? అను సందేహ ముదయింపలేదు దానికి కారణము ప్రధానమును (ప్రకృతిని) మాత్రమే తెలియజేయు శబ్ద మిందు లేకుండుటయే అట్లే జీవుని మాత్రమే తెలియజేయు శబ్దమిం దేదియు లేదుకావున, ఈ యుపనిషత్తుచే ప్రతిపాదింపబడువాడు జీవుడుకూడ కాడు పరమపురుషుడే అంతేకాక —

4 'భేద వ్యపదేశాత్ "

"సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్య త్యన్యమీశం అస్య మహిమాన మితి వీతశోకః "

శరీరమునందు బద్ధుడగు జీవుడు తనకు భోగ్యభూతమగు ప్రకృతిచే మోహపెట్టబడినవాడై శోకించును ఎపుడు తన కంటె వేరగు ఆ సర్వనియంతను, ఆతని మహిమను కనుగొనునో, అపుడు శోకము లేనివాడగును' అని వెనుక ఆత్మ నెఱుంగవలెనని చెప్పెనో, ఆ యాత్మ జీవాత్మకంటె భిన్నమైనదని చెప్పుటవలన, ఈ యుపనిషత్తున నుపదేశింపబడిన ద్యుభ్వాద్యాయతన మగు పురుషుడు పరమ పురుషుడే యని యెఱుంగనగును.

5 "ప్రకరణాత్ "

ఇది యంతయు పరమాత్మను ప్రతిపాదించు ప్రకరణ మగుటచే, ఈ యుపనిష త్ప్రతిపాద్యుడు పరమపురుషుడే

6 "స్థిత్యదనాభ్యాం చ "

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్న న్నన్యో అభిచాకశీతి "

సమానమగు గుణములు కలవాడును, పరస్పర సమానులును, పక్షులవంటివారును అగు ఇద్దరు ఒకే వృక్షమును అనగా – శరీరమును ఆశ్రయించిరి అందులో నొకడు ఫలమును (కర్మ ఫలమును) భోగ్యముగ ననుభవించును వేరొకడు భుజింపకయే ప్రకాశించుచుండును

ఈ యుపనిషత్తునందే ఒకడు కర్మఫలభోక్తయనియు, వేరొకడు భుజింపకయే ప్రకాశించుచు, శరీరమున నిలిచియుండుననియు చెప్పబడినది అందు కర్మఫలము ననుభవింపక, ప్రకాశమానుడగు పురుషుడే సర్వజ్ఞుడు, అమృతసింధువు, సర్వాత్మ, ద్యులోక పృథివ్యాధారభూతుడు కానోపునుగాని, కర్మఫలము ననుభవించుచు శోకించు పురుషుడు కానేరడు కావున, ముండకోపనిషత్తున ద్యుపృథివ్యాద్యాయతనముగ చెప్పబడిన ఆత్మ – పరమాత్మయే యని నిశ్చయింపవగును

## 2. భూమాధికరణము

ఛాందోగ్యోపనిషత్తునందు నారదుడు – 'తరతి శోక మాత్మవిత్' ఆత్మ నెఱింగినవాడు శోకమును దాటును' అని పెద్దలవలన విని, ఆత్మస్వరూపము నెఱుంగుటకై సనత్కుమారునివద్ద కేగెను సనత్కుమారుడు నారదునకు 'నామము బ్రహ్మము' అని యుపదేశించెను 'దానికంటె అధికము ఏదేని కలదా ?' అని మఱల నారదుడు అడుగగా, దాని కంటె వాక్కు గొప్పది అనియు, అదియే బ్రహ్మ యని ఉపాసించు మనియు చెప్పెను ఇట్లే, నారదు డడుగుచుండగా – ఒకదానికంటె వేరొకటి గొప్పది అని చెప్పి, 'ప్రాణము బ్రహ్మయని ఉపాసించుము' అని చెప్పెను ప్రాణమే ఆత్మ యనియు, దాని నుపాసించువాడు ఉపాస్యములలో అది అతిశయించునని పల్కుట లెస్స యని చెప్పెను తరువాత నారదుడు – 'అంతకంటె గొప్పది ఏదేని

కలదా ? అని ప్రశ్నింపలేదు కాని, సనత్కుమారుడు సత్యమును బ్రహ్మస్వరూపముగా చెప్పి, అది సుఖస్వరూపము. అది భూమ అనియు చెప్పెను భూమస్వరూపమును నిర్వచించుచు ఇట్లు చెప్పెను -

"యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా
అథయత్రాన్య త్పశ్య త్యన్య చ్ఛృణో త్యన్య ద్విజానాతి తదల్పమ్."

దీని నెఱింగినవాడు దానినేతప్ప, వేరొకదానిని కనడో, వినడో, ఎఱుంగడో — అది భూమ అట్లుకాక, కనవచ్చుచు, వినవచ్చుచు, ఎఱుంగవచ్చుచున్నచో - అది అల్పము.

ఇచట భూమ యనునది అల్పమునకు విరుద్ధార్థమున ప్రయోగింపబడినది అందుచే, భూమ యనగా - విపులమైనది అని యర్థము. ఆత్మస్వరూపము నెఱుంగగోరి యడిగిన నారదున కుపదేశించుచు, దానినే 'భూమ' యని చెప్పెను కావున, ఈ విపులమైనది ఆత్మయే. 'తరతి శోక మాత్మవిత్' అని ప్రారంభించి, భూమవిజ్ఞానము నుపదేశించి, 'ఆత్మైవేదం సర్వమ్' ఇదియే ఆత్మయని ఉపసంహరించెను. కావున, 'భూమ' యనగా - విపులమైనది ఆత్మయే యని తెలియుచున్నది

ఇచట ఈ ఆత్మ — జీవాత్మయా ? పరమాత్మయా ? యని సందేహము కలుగుచున్నది ఇచట ప్రత్యగాత్మయే రహస్యముగా చెప్పబడినదని చెప్పుటకు అవకాశము కన్పట్టుచున్నది.

ఆత్మజ్ఞానము నొందగోరి వచ్చిన నారదునకు 'నామము' మొదలు, ప్రాణమువఱకు బ్రహ్మముగా ఉపాసించుము' అని చెప్పుటలో -

"అస్తి భగవో నామ్నో భూయః" "అస్తి భగవో వాచో భూయః"

నామముకంటె గొప్పది కలదా ? వాక్కుకంటె గొప్పది కలదా ? అను నారదుని ప్రశ్నలును —

"వాగ్వావ నామ్నో భూయసీ మనో వావవాచో భూయః"

వాక్కు నామముకంటె గొప్పది, మనస్సు వాక్కుకంటె గొప్పది' అను సమాధానములును కన్పట్టుచున్నవి ఈ ప్రశ్న ప్రతివచనములు ప్రాణము వఱకు కన్పించును ప్రాణమును బ్రహ్మాగా నుపాసించుము' అని యుపదేశించినపిమ్మట, 'అంతకంటెను గొప్పది కలదా?' అని నారదుడు ప్రశ్నింపలేదు కావున ఇచట ప్రాణ మనగా — 'ప్రాణముతో కలిసియుండు జీవాత్మ' యని ఎఱుంగనగును ఆత్మోపదేశము పూర్తి యాయెనని నారదుడు మఱల ప్రశ్నించెను

ఇచట ప్రాణశబ్దము ఆత్మనే తెలియజేయునుగాని, ప్రాణ వాయువును కాదని ఆ సందర్భముననే స్పష్టమగుచున్నది. 'ప్రాణోహ పితా, ప్రాణోహ మాతా ' మొదలగు వాక్యములచే, ప్రాణ శబ్దము చేతనపరముగా ప్రయోగింపబడెనని తెలియుచున్నది ప్రాణమే తండ్రి, తల్లి, ఆచార్యుడు అని పిలువబడుచున్నది ఏల నన, ప్రాణముతోనున్న తల్లినిగాని, తండ్రినిగాని చంపినవానిని మాతృఘ్నుడు, పితృఘ్నుడు అని నిందింతురు ప్రాణము పోయిన తరువాత, వారిని శూలముతో పొడిచినను అట్లు నిందింపరు కావున, 'ప్రాణమే సర్వము' అని యుపదేశించెను కావున, హింసాయోగ్యుడగు చేతనుడే ఇచట ప్రాణశబ్దవాచ్యుడని స్పష్టమగుచున్నతి కనుక, అట్లు చేతనుడు ప్రత్యగాత్మయే (జీవాత్మయే) జీవునకే కాని, ఈశ్వరునకు హింసాప్రసంగమే కుదురదుగదా! కాని, చక్రములోని ఆకులు మధ్యనుండు కుంచముపై ఆధారపడినట్లు, సర్వము ఈ ప్రాణమందే ఆధారపడియున్నదని చెప్పుటచే, ఈ ప్రాణము పరమాత్మయని చెప్పుటకు వీలు కలుగదు కాని, పరమాత్మకు హింస యనునది కుదురదు కనుక, ఈ అరనాభి (Spokes and hub) దృష్టాంతము నిట్లు సరిపెట్టుకొనవలెనను జీవునకు భోగ్యము, భోగోపకరణము నగు సర్వాచి

ద్వస్తువునకు జీవుడే ఆధారముకనుక, ఆ దృష్టాంతముకూడ సరిపడును. కావున, ప్రాణ మనగా – జీవాత్మయే ఆ జీవాత్మయే భూమ.

'అస్తి భగవః ప్రాణా ద్భూయః' ప్రాణముకంటె గొప్పది కలదా ? అను ప్రశ్నకాని, 'అద్ధో వావ ప్రాణాద్భూయః' ఇది ప్రాణము కంటె గొప్పది' అను సమాధానముకాని లేదు. కావున, ప్రాణప్రకరణము అంతటితో ఆగలేదు కావున, ఇది యంతయు ప్రత్యగాత్మకు సంబంధించినదే. ప్రాణమును ఉపాస్యమునుగా ఎఱింగినవాడు ప్రాణమునే ఉపాస్యములలో అతిశయమైనదానినిగా చెప్పువాడు (ప్రాణాతివాది) అగును అతడే సత్యవాదియు నగునని, 'ఏష తు వా అతివదతి, య స్సత్యేనాతివదతి' అని సత్యవచనమునకు అంగమని చెప్పెను ప్రాణముయొక్క యథార్థ స్వరూపము నెఱుంగుటకు – మననము, శ్రద్ధ, నిష్ఠ, ప్రయత్నము ఆవశ్యకములని యుపదేశించెను. ఆ ప్రయత్న మారంభించుటకు, ప్రాణ శబ్దముచే వెనుక నిర్దేశింపబడిన జీవాత్మ సుఖరూపమని యుపదేశించెను. ఆ సుఖము అల్పము కాదు విపులమని, 'భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః' అని యుపదేశించెను అవిద్యనుండి విముక్తి నందిన జీవుని స్వరూపము విపులసుఖరూపమని యుపదేశించెను అట్లు విపుల సుఖస్వరూపమగు ఆత్మ నెఱుంగుట శోకమును దాటుటకు మార్గ మగును కావున, నారదునకు కావలసిన ఆత్మజ్ఞానము నుపదేశించిన ట్లాయెనుగదా !

అంతియేకాక, అట్లుపదేశించిన 'అహమ్' అను పదమునకర్థమగు ప్రత్యగాత్మయొక్క వైభవమును 'అహమేవాధస్తా దహముపరిష్టాత్' అని ఆరంభించి, 'అహమేవేదం సర్వమ్' జీవాత్మయే ఇది యంతయును' అని యుపదేశించెను కావున, ఈ సనత్కుమార – నారద సంవాదమున – 'భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః' ఉపా

సింపదగినదని ఉపదేశించిన విపులమగు (భూమ) సుఖరూపమగు వస్తువు జీవాత్మయే యని నిశ్చయింపవచ్చును' అని పూర్వపక్షము చేయగా _

**"భూమా సంప్రసాదా దధ్యుపదేశాత్ "**

ప్రత్యగాత్మకంటె (జీవునికంటె) అధికుడని పరమాత్మ నిందు ఉపదేశించినారుకావున, భూమగుణవిశిష్టుడుగా చెప్పబడినవాడు పరమాత్మయేకాని, జీవుడు కాడు' అని సిద్ధాంతము చెప్పచున్నారు

సంప్రసాదము' అనగా _ జీవుడు సంప్రసాదాత్ _ జీవుని కంటె, అధి _ అధికుడుగా, ఉపదేశాత్ _ ఉపదేశించుట వలన, భూమా _ భూమగుణవిశిష్టుడు పరమపురుషుడే.

ప్రాణశబ్దము ప్రత్యగాత్మ నుపదేశించి, దానికంటె అధికముగా సత్యము నుపదేశించెను సత్యమనగా _ పరమాత్మయే అదియే భూమగుణ విశిష్టమైనది (విపులసుఖరూపమైనది) అని యుపదేశించెను ప్రాణముకంటె ఈ సత్యము వేరైనదియే యని, ఈ ఉపదేశమున తెలియుచున్నది ఈ విషయమునే బోధాయనవృత్తికారు డిట్లు చెప్పెను ._

**"భూమాత్వేవేతి భూమా బ్రహ్మ - నామాదిపరంపరయా ఆత్మన ఊర్ధ్వ మస్యోపదేశాత్ "**

'భూమ' అని చెప్పబడు ఉపాస్యము పరబ్రహ్మమే నామము మొదలుగ _ ఉపాస్యములుగ ఆ యా వస్తువులను చెప్పచు, ఆత్మ కంటె తరువాత ఈ భూమగుణవిశిష్టమగుదాని నుపదేశించుటవలన, ప్రాణ శబ్దముచే నిర్దేశింపబడినదో, లేదో చూతము

ప్రాణోపాసనము చేయువానిని సర్వోపాస్యములలో శ్రేష్ఠోపాస్యమగు ప్రాణమే పురుషార్థముగా అతిశయించునని చెప్పపోనినిగా,

అనగా - ప్రాణాతివాదిగా పేర్కొని, వానికంటె అధికునిగా - 'ఏష తు వా అతివదతి య స్సత్యే నాతివదతి' సత్యము నెఱింగి, సత్యమునే పురుషార్థముగ సర్వోపాస్యములలో అతిశయించునదిగా చెప్పువాడు (సత్యాది వాది) వెనుక చెప్పిన ప్రాణాతివాదికంటె అధికుడని, 'తు' అను శబ్దము నిరూపించుచున్నది అందుచే, ప్రాణము కంటె సత్య మధికమని తెలియుచున్నది ఆ సత్యము పరమాత్మయే - 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని, సత్యశబ్దము 'పరబ్రహ్మ' అను అర్థమున ప్రయోగింపబడినది అందుచే, పురుషార్థముగా ఉపాస్యములలో అతిశయించునదిగా పరమాత్మను పేర్కొనువాడు - ప్రాణాతివాదికంటె అధికు డగునుగదా ! నామము మొదలు ఆశవఱకు ఉపాస్యములుగా చెప్పి, వానికంటె ప్రాణశబ్దముచే నిర్దేశింపబడిన జీవాత్మ - పురుషార్థముగా అతిశయించునని ప్రాణము నుపాసించు వానిని ప్రాణాతివాదిగా చెప్పెను దానికంటె, నిరతిశయ పురుషార్థ మగుటచే, సత్యమును (పరబ్రహ్మమును) ఉపాస్యములలో అతిశయించునదియని చెప్పువాడే - అనగా, సత్యాతివాదియే నిజముగా అతివాదియని, ప్రాణముకంటె సత్యమే అధికమని ఇందు నిరూపించ బడినది అది యెఱింగియే నారదుడు - 'భగవ స్సత్యే నాతిపదానీ' ఓ పూజ్యుడా ! నేను సత్యాతివాది' నగుదునని చెప్పెను దానివి విని ఆచార్యుడు - 'సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమ్' సత్యమే ఉపా సింపదగినదని చెప్పెను

మఱియు - 'ఆత్మనః ప్రాణః' అని, 'ఆత్మనుండి ప్రాణము జనించుచున్నది' అని ప్రాణమునకుగూడ కారణముగ ఆత్మ పేర్కొన బడినది. కావున, ఆ 'ఆత్మ' - ప్రాణశబ్దవాచ్యమగు జీవాత్మకంటె వేరైనదియేకాని, జీవాత్మ కాదు.

'నామము' మొదలు 'ఆశ'వఱకు - అచేతనములగు పదార్థములను బ్రహ్మముగా నుపాసించుమని చెప్పుచు, అవి యన్నియు

అచేతనములే కనుక, ఒకదానికంటె వేఱొకటి అతిశయించునని అతి వదనము చెప్పలేదు. కాని, అచేతనములకంటె అతిశయితమగు పురుషార్థ మగుటచే, ప్రాణశబ్ద నిర్దిష్టమగు జీవాత్మ యాథాత్మ్యము నెఱింగినవాడు ప్రాణాతివాది యని చెప్పెచు, దానిచే శిష్యుడు అంత టితో ఆత్మోపదేశము సమాప్త మైనదని తలంచి, మఱి ప్రశ్నించుట మానెను కాని, ఆచార్యు డీ ప్రత్యగాత్మ జ్ఞానముకంటెను అతి శయితమగు పురుషార్థము సత్యశబ్దవాచ్యమగు పరబ్రహ్మమని, 'ఏష తు వా అతివదతి, యస్సత్యేనాతివదతి' అని స్వయముగ సత్యాది వాది ప్రాణాతివాది కంటె అధికుడని నిర్దేశించెను పరమపురుషార్థ మను పరబ్రహ్మముకూడ సత్యమే యని యెఱింగినవాడై, శిష్యుడు దాని స్వరూపమును, దాని యుపాసన స్వరూపమును ఎఱుంగగోరి, 'నాహం భగవ స్సత్యే నాతి వదామి' నేను సత్యమును, ఉపాస్య మును ఉపాస్యములలో అతిశయించుదానినిగా చెప్పువాడను' అని కోరగా, అట్టి సత్యాతివాదమునకు ఉపాయమగు బ్రహ్మోపాసన మును - 'సత్యంత్వేవ విజిజ్ఞాసితవ్యం' అని యుపదేశించి, దాని కుపాయభూతమగు మననమును 'మతి స్త్వేవ విజిజ్ఞాసితవ్యా' అని యుపదేశించెను విన్న దానిని నిలుపుటకు మననము సాధన మగును కావున, దానికి ముందు శ్రవణమును దాని కుపాయభూతమగు శ్రద్ధను, దానియందు నిష్ఠను, ఆ నిష్ఠ యారంభించు ప్రయత్నమును ఆవశ్యకము లని యుపదేశించెను. అట్టి ప్రయత్నము సిద్ధింపవలెనన్న - ప్రాప్య మగు, సత్యస్వరూపమగు బ్రహ్మము సుఖరూపమని తెలియవలెనని యుపదేశించెను. సాధారణ సుఖము లెన్నియో యున్నను - ఈ బ్రహ్మసాక్షాత్కారరూపమగు సుఖము - నిరతిశయ విపుల సుఖమని తెలియవలెనని 'భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః' అని యుపదేశించెను

అట్టి నిరతిశయ విపుల సుఖరూపమగు బ్రహ్మయొక్క లక్షణ మును 'యత్ర నాన్య త్పశ్యతి, నాన్య చ్ఛృణోతి, నాన్య ద్విజానాతి

స భూమా' అని చెప్పెను. ఆ నిరవధిక సుఖరూపమగు బ్రహ్మను అనుభవించువాడు సమస్త వస్తుజాతము ఆ పరబ్రహ్మయొక్క విభూతులలో అంతర్భూతమైన దగుటచే, వేఱొకదానిని దేనిని చూడడు. ఆ పరబ్రహ్మ విభూతిలో అంతర్భూతము కాని వస్తువే లేదు. కావున, విభూతి విశిష్టుడగు పరమాత్మ ననుభవించువాడు చూడనిదే యుండదుగదా! అనుభవింపబడున దంతయు సుఖరూపమే యగుటవలన, సుఖమునే పొందడు.

పరబ్రహ్మయొక్క విభూతియైన ఈ జగత్తు కర్మవశ్యులైన జీవులచే బ్రహ్మకంటె వేఱుగా, స్వతంత్రముగా ననుభవింపబడి నపుడు - పరిమిత సుఖమై, దుఃఖమై యుండును అట్లు దుఃఖముగాను, పరిమితసుఖముగాను ఈ జగత్తు అనుభవింపబడు కర్మరూపమగు అవిద్యయే కారణము ఆ కర్మబంధము వీడిన జీవుడు విభూతి విశిష్టుడగు బ్రహ్మను అనుభవించును. కావున, ఆ బ్రహ్మానుభవాంతర్గతమై, ఈ జగత్తుకూడ నిరవధిక సుఖమే యగును పైత్యము ఎక్కువగా నున్నవానికి పాలు అంత రుచిగా నుండక, చేదుగా నుండును ఆ పైత్యము తగ్గిననాడు వానికే, ఆ పాలే రుచిగా, హాయిని గొల్పును గదా! అందుచే, జగద్విభూతివిశిష్టుడు అనవధిక సుఖరూపుడును అగు పరబ్రహ్మను అనుభవించువాడు - ఆ పరబ్రహ్మముకంటె వేఱొకదానిని చూడడు దుఃఖ మన్న మాటయే యెఱుంగడు అట్లు విపులసుఖరూపమగు పరబ్రహ్మానుభవము కలవాడు కర్మవశ్యుడు కాక, సర్వలోకములయందు కామచారము కలిగియుండును. ఇట్లు ఈ ప్రకరణము నంతను చూచినచో - 'భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః' అని యుపదేశించిన భూమగుణ విశిష్టుడు సత్య శబ్దవాచ్యుడగు పరమాత్మయే యని యెఱుంగవలెను.

## 'ధర్మోపపత్తేశ్చ'

భూమయొక్క ధర్మములుగా ఎయ్యవి ఈ ప్రకరణమున పేర్కొనబడినవో, అవి పరమాత్మయందే ఉపపన్నము లగుచున్నవి. కావున, 'భూమ' శబ్దప్రతిపాద్యుడు పరమాత్మయే 'ఏత దమృతమ్' అని చెప్పిన అమృతత్వము, - 'స ఏవేదం సర్వమ్' అని చెప్పిన సర్వాత్మకత్వము, 'ఆత్మనః ప్రాణః' అని ప్రాణాది కారణత్వము మున్నగు ధర్మములు పరమాత్మకే సహజముగ చెందినవి 'అహమేవాధస్తాత్' మున్నగుచోట్ల అహం శబ్దముచే, బ్రహ్మయే చెప్పబడినది. ప్రత్యగాత్మకు ఆత్మగా పరమాత్మ యుండును కావున, ప్రత్యగాత్మ శరీరకుడగు పరమాత్మయే ఇచట అహం శబ్దముచే చెప్పబడును భూమ విశిష్టుడగు బ్రహ్మను 'అహమ్' అని ప్రత్యగాత్మ శరీరకునిగా ఉపాసన చేయవలెను ఉపాసకునకు అంతర్యామిగానుండు పరమాత్మవలన సర్వము ఉత్పన్నమగును కావున, 'ఆత్మనః ప్రాణః ఆత్మనః ఆకాశః' అని చెప్పుట సరిపడును

పరమాత్మ ఉపాసకునకు అంతర్యామియై, ప్రత్యగాత్మ శరీరకుడై యుండునను జ్ఞానము దృఢముగ నిలుచుటకై పరమాత్మను 'అహమ్' అని ఉపాసన చేయవలెను కాని, 'అహమ్' అనుటచే, ప్రత్యగాత్మయే 'భూమ' గుణవిశిష్టుడు అని తలపరాదు

## 3. అక్షరాధికరణము

బృహదారణ్యకోపనిషత్తునందు గార్గి యాజ్ఞవల్క్యుని - 'అంతరిక్షమునకు పైనను, భూమికి క్రిందిగాను, సర్వప్రదేశము లందును, సర్వకాలములందును ఉండు సమస్త వస్తుజాతమునకు ఆధారముగా నున్నది ఏది?' అని ప్రశ్నింప, 'అక్షరము' అని సమాధానము చెప్పి, దాని లక్షణము నిట్లు వివరించెను -

"స హోవా చైతదైత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి
అస్థూల మనణ్వ హ్రస్వ సుదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయమ్"

ఇత్యాది ఆ యాజ్ఞవల్క్యుడు - "ఓ గార్గి ! అన్నిటికి ఆధార మైన ఈ అక్షరము స్థూలమైనది కాదు, అణువు కాదు, హ్రస్వము కాదు, దీర్ఘము కాదు, లోహితవర్ణము కలదికాని, స్నేహము కలది గాని, ఛాయ కలదికాని కాదు" అని ఈ మొదలగు కొన్ని లక్షణములను చెప్పెను.

ఈ అక్షరము ప్రధానమా ? (ప్రకృతియా ?) జీవుడా ? పర మాత్మయా ? అని సందేహము ఏర్పడుచున్నది.

'అక్షరా త్పరతః పరమ్' అనుచోట, అక్షరశబ్దము ప్రధాన మును తెల్పునదిగ ప్రయోగింపబడినదికావున, 'అక్షరము' ప్రధా నమే (అచేతనమగు ప్రకృతియే) అనుట న్యాయముగ తోచుచున్నది 'యయా త దక్షర మధిగమ్యతే' మొదలగుచోట్ల 'అక్షరము' అను పదము పరమాత్మ పరముగ ప్రయోగింపబడినను - ప్రమాణాంతర ముచే, అనగా - లోకవ్యవహారమున ప్రధానమను అర్థమున ప్రయో గింపబడుటచే, ఆ యర్థము మనకు ప్రసిద్ధముగ ముందు తోచుచుండ, దానిని మాని, శ్రుతిలో ప్రసిద్ధమగు అర్థముచెప్పునపుడు ఏదేని విరోధ మున్నచో, శాస్త్రప్రసిద్ధమగు అర్థమును చెప్పవచ్చును కాని, ఇచట 'అక్షరము' అను పదమునకు ప్రధానము అను అర్థము చెప్పినను విరో ధము లేదు. అంతేకాక, స్థూలము కానిది మొదలగు లక్షణములు ప్రధానమునకూడ సరిపడును కాలత్రయమునందును, సర్వదేశము లందును ఉన్న వస్తుజాతమునకు కారణమును, ఆధారమును ఆకా శము' అని చెప్పిన తర్వాత, గార్గి - 'కస్మిన్నుఖ ల్వాకాశ ఓతశ్చ ప్రోతస్య' ఈ ఆకాశము దేనియందు ఆధారపడియున్నది ? అను ప్రశ్నలో - నిర్దిష్టమైన ఆకాశము ప్రసిద్ధమగు వాయుపంచాయతన

మగు ఈ ఆకాశము కాదు. వానికికూడ ఆధార కారణమును అగు అవ్యాకృతము. అట్టి అవ్యాకృతమునకుగూడ ఆధారము అవ్యాకృతమే కాదుగదా !

"యదూర్ధ్వం గార్గిదివో, యదర్వా క్పృథివ్యా, యదుతరా ద్యావా పృథివీ ఇమే యద్భూతంచ భవచ్చ భవిష్యచ్చే త్యాచక్షతే ఆకాశ ఏవ తదోతంచ ప్రోతంచ "

దీపము కంటె పైనను, పృథివికి క్రిందను, ద్యావాపృథివులకు మధ్యను - భూత భవత్ భవిష్యత్కాలములందు ఏది యుండునో, దాని కాధారము ఆకాశమే యని చెప్పబడినది. అట్లు ఆధారమయిన ఆకాశము ఈ ప్రసిద్ధమగు ఆకాశ మనుటకు వీలుకాదు కావున, భూత సూక్ష్మమని చెప్పవలెను ఆ భూతసూక్ష్మమగు అవ్యాకృతాకాశము నకు ఆధారముగ నిర్దేశింపబడిన అక్షర మగుటకు వీలులేదు కావున, పరమాత్మ యనియే చెప్పవలెను

అక్షరశబ్దముచే ప్రధానము అను అర్థము వేగముగా ప్రతీత మగును అని చెప్పుటకుకూడ వీలులేదు 'న క్షరతి ఇత్యక్షమ్' అను వ్యుత్పత్తిచే పరమాత్మ యను అర్థము శీఘ్రముగనే ప్రతీక మగును కావున, అక్షరము ప్రధానము కాదు, పరమాత్మయే.

ప్రధానము కాకపోయిన పోవుగాక, అక్షరము అనగా - జీవుడని చెప్పవచ్చునుకదా ! 'అవ్యక్త మక్షరే లీయతే' 'యస్యావ్యక్తం శరీరం యస్యాక్షరం శరీరం' 'క్షర స్సరాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే' మొదలగు స్థలముల అక్షర శబ్దము జీవాత్మను ప్రతిపాదించునదిగ ప్రయోగింపబడినదికదా ! ఆ జీవుడు భూతసూక్ష్మ పర్యంత మందు సర్వాచిద్వస్తువుల కాధారముగ నుండుట పొసగునుగదా కావున, 'అక్షరము జీవాత్మయే' అని మఱల ఆశంక రాగా

"సా చ ప్రశాసనాత్ "

సా = ఆ ధారణము, ప్రశాసనాత్ - ప్రకృష్టమగు శాసన మూలమున అవ్యాకృత పర్యంతము ఈ ప్రకృతిని శాసించి ధరించు నది ఈ అక్షరమని ఈ యుపనిషత్తు ప్రతిపాదించుచున్నది

"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః"

ఈ అక్షరముయొక్క ప్రకృష్టమగు శాసనమునందే, సూర్య చంద్రులు - ముహూర్త, నిమేష, వత్సరాదికాలము మొదలగునని నిలచియున్నవి అని చెప్పుచున్నది ఈ విధముగ తన శాసనము ద్వారా సర్వవస్తువులను ధరించుట బద్ధజీవునకు కాని, ముక్తజీవునకు గాని సంభవింపదు. కావున, అట్లు తన శాసనముచే సర్వవస్తువులను ధరించు అక్షరము పరమాత్మయే

"అన్యభావ వ్యావృత్తేశ్చ."

ఈ అక్షరము పరమపురుషుడే తప్ప ప్రధానముకాని, జీవుడు కాని కాదని ఇందే తరువాతి వాక్యములచే తెలియుచున్నది

"తద్వా ఏతదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ అమతం మన్తృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ, నాన్యదతోఽస్తి ద్రష్టృ, నాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యతోఽస్తి మంతృ, నాన్యదతోఽస్తి విజ్ఞాతృ, ఏతస్మిన్నుఖల్వక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ."

ఓ గార్గి ! ఈ అక్షరము తాను చూడబడకయే చూచును విన బడకయే వినును తలంపకయే తలంచును ఎఱుంగకయే ఎఱుంగును ఈ అక్షరముకంటె వేరగు ద్రష్టకాని, శ్రోతకాని, మననశీలికాని, విజ్ఞాతకాని లేడు ఈ అక్షరమునందే ఆకాశము ఆధారపడియున్నది' అని ఈ యుపనిషత్తే చెప్పుచున్నది.

అచేతనమగు ప్రధానము చూడలేనిది, వినలేనిది యగుటచే, ద్రష్ట శ్రోత కానేరదు కావున, అక్షరము కాదని స్పష్టముగ తెలియు చున్నది 'తా నెవరిచేతను చూడబడకయే, తాను చూచును' అను టచే, జీవుడు కాదని తెలియుచున్నది అందుచే, ఇట్టి అక్షరము పర మాత్మయే యని ఎఱుంగవగును.

తాను దేనిచేతను చూడబడకయే సర్వమును చూచువా డొక పరమాత్మయే కాని, వేరొకడు లేడనికూడ ఆ వాక్యమే తెలియ జేయుచున్నది

శ్రుతి స్మృతి విహితము లగు సర్వకర్మలను ఈ అక్షరము యొక్క ఆజ్ఞచేతనే ప్రవర్తిల్లుచున్నదనియు ఇందు ప్రతిపాదింపబడి నది కావున, అక్షరము పరబ్రహ్మమే మఱియు —

**"యో వా ఏత దక్షరం గార్గి అవిదిత్వా, అస్మా ల్లోకాత్ ప్రైతి స కృపణః అథ య ఏత దక్షరం గార్గి విదిత్వా, అస్మా ల్లోకాత్ ప్రైతి స బ్రాహ్మణః."**

ఎవడీ యక్షరము నెఱుంగకయే ఈ లోకమును వీడునో, అతడు కృపణుడు ఎవడీ యక్షరము నెఱింగి ఈ లోకమును వీడునో — అతడు బ్రహ్మజ్ఞాని' అని అక్షర జ్ఞానము లేకపోవుటయే సంసారహేతువనియు, ఆ అక్షరమే అమృతత్వప్రాప్తియనియు ప్రతిపా దింపబడెను కావున, అక్షరము అనగా పరమాత్మయని యెఱుంగ నగును

## 4. ఈక్షత్యధికరణము

ఈ యధికరణము అథర్వవేదమునకు సంబంధించిన ప్రశ్నోప నిషత్తున సత్యకామ ప్రశ్నకు సంబంధించినది

సత్యకాముడు ప్రణవోపాసనకు ఫలమునుగూర్చి ప్రశ్నించెను. దానికి సమాధానమున ఏక మాత్రక ప్రణవోపాసనమున మనుష్య

లోక ప్రాప్తియు, ద్విమాత్రక ప్రణవోపాసనమున అంతరిక్షలోక ప్రాప్తియు కల్గునని చెప్పి, త్రిమాత్రక ప్రణవోపాసనమునకు ఫలమును ఈ క్రింది విధమున వివరించెను —

**"యః పునరేతం త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరంపురుష మభిధ్యాయీత, స తేజసి సూర్యే సంపన్నో యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవం హైవ స పాప్మనా వినిర్ముక్త స్సామభి రున్నీయతే బ్రహ్మలోకం, స ఏతస్మా జ్జీవ ఘనా త్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే"**

ఎవడు పరమ పురుషుని త్రిమాత్రకమగు ఈ ఓమ్ అను అక్షరముచే ధ్యానము చేయునో, అతడు తేజోరూపమగు సూర్యమండలము నందినవాడై, పాముకుబుసమునుండి వెలువడినట్లు సర్వపాప వినిర్ముక్తుడై, సామగాన సహితులగు పురుషులచే బ్రహ్మలోకమును పొందింపబడును ఆ యుపాసకుడు ఈ జీవఘనముకంటె పరుడగు పురుషుని దర్శించును'

ఇచట ధ్యానము చేయబడువాడును, దర్శనము చేయబడువాడునుకూడ పరమపురుషుడే యని 'పరం పురుషమ్' అను పదముచే తెలియుచున్నది కాని, ఇచట ఒక సందేహము కల్గుటకు అవకాశమున్నది

వెనకటి అక్షరాధికరణమున పరమాత్మను 'ద్రష్ట'గ 'చూచువాడు'గ నిరూపించిరి అతడే 'చూడబడువాడు'ను అనగా — ఈక్షణమున కర్మయు నగుట పొసగదు అందుచే, ఇందు బ్రహ్మలోకమున దర్శింపబడువాడు పరమాత్మయే యనుట ఎట్లు ? బ్రహ్మలోక శబ్దమునకు చతుర్ముఖబ్రహ్మ నివసించు లోకమనియే యర్థము చెప్పవలెనుకాని, వేరొక యర్థము కల్పింప వీలుకాదు కావున, ఇచట జీవసమష్టిరూపుడగు చతుర్ముఖుడా ? 'పరమపురుషుడు', లేక పరమాత్మయా ? అని.

సత్యకాముడు మరణపర్యంతము ఓంకారమునే ధ్యానించు వాడు ఏ లోకమును పొందును ? అని ప్రశ్నింప, ఏకమాత్రాత్మకమగు ప్రణవము నుపాసించినవాడు మనుష్యలోకమును, ద్విమాత్రాత్మక ప్రణవము నుపాసించినవాడు అంతరిక్ష లోకమును, త్రిమాత్రాత్మక ప్రణవము నుపాసించినవాడు బ్రహ్మలోకమును పొందు'నని చెప్పెను ఇందలి క్రమమునుబట్టి చూచినచో, ఈ బ్రహ్మలోకము చతుర్ముఖ బ్రహ్మలోకమే యని తలంచుటకు వీలు కల్గుచున్నది. అందు దర్శింపబడువాడు ఆ చతుర్ముఖ బ్రహ్మయే యని చెప్పవచ్చును

**"ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం పురిశయం పురుషమ్ "**

అనుటకూడ చతుర్ముఖబ్రహ్మకే సమన్వయించును దేహేంద్రియాదులకంటె పరుడై, దేహేంద్రియాదులతో ఘనీభావము నంది, ఏకరూపమున భాసించు ఈ వ్యష్టిజీవముకంటె పరుడుకావున, 'జీవఘనా త్పరాత్పరం పురుషం' అని, చతుర్ముఖ బ్రహ్మయే పేర్కొనబడె ననుటలో విప్రతిపత్తి లేదు ఇంకను ఇందు - 'తచ్ఛాంత మజర మమృత మభయమ్' అని, పరమపురుషుని లక్షణములు చెప్పబడినవి అవియు - సమష్టిజీవస్వరూపుడగు చతుర్ముఖునియం దుండదగిన లక్షణములే చిరకాల ముండువాడు, పరిశుద్ధస్వరూపము కలవాడు నగుటచే, ఆ లక్షణము లుండవచ్చునుగదా ! కావున, ఈ యుపనిష ద్వాక్యము జీవపరముగ అన్వయింప వీలుకలదని సందేహము కలుగ, దాని నిందు నిరాకరించుచున్నారు

**"ఈక్షతి కర్మ వ్యపదేశాత్ సః "**

ఈక్షణ మనగా - దర్శనము అందు కర్మగా అన్వయించు నది అనగా – దర్శింపబడువాడు 'ఈక్షతి కర్మ' యనబడును దర్శింపబడువాడు - 'సః' ఆ పరమాత్మయే 'వ్యపదేశాత్', 'తచ్ఛాన్త మజర మమృత మభయం పరం చ' అని, 'ఏత దమృత

మేత దభయ మేతం బ్రహ్మ' అని ఇతర శ్రుతులయందు చెప్పబడిన పరబ్రహ్మస్వరూపమే ఇచటను ప్రతిపాదింపబడినదికావున, ఈ క్షితికర్మ పరమాత్మయే యని సూత్రార్థము

'జీవఘనా త్పరాత్పరమ్' అనునదియు పరమాత్మనే తెలుపు చున్నదికాని, జీవకోట్యంతర్భూతుడగు చతుర్ముఖుని ప్రతిపాదింపదు కర్మనిమిత్తముగ దేహసంబంధముగల జీవుడు జీవఘన మనబడును. చతుర్ముఖబ్రహ్మయు దేహధారియే

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై "

అనుటచే, చతుర్ముఖుడుకూడ సర్వేశ్వరునిచే సృజింపబడి, వాని యుపదేశరూపమగు వేదములచే జ్ఞానము నొందినవాడని తెలియుచున్నది అట్టి జీవఘనముకంటె (దేహికంటె) పరుడు ముక్తుడు. ఆ ముక్తునికంటె పరుడు అగు పురుషుడు పరమాత్మయే యని యెఱుంగనగును ఇక - 'బ్రహ్మలోకము' అనగా - 'చతుర్ముఖ బ్రహ్మ నివసించు లోకము' అని గ్రహింప వీలులేదు. పరమాత్మను స్థానమైన పరమవ్యోమశబ్దవాచ్యమగు పరమపదమే యని గ్రహింప వలెను

మనుష్యలోక - అంతరిక్షలోకములను నిర్దేశించిన తరువాత బ్రహ్మలోకము అనుటచే, క్రమము ననుసరించి చతుర్ముఖబ్రహ్మ లోకమే ఇందు నిర్దేశింపబడినదని శంకింప బనిలేదు.

"యత్త చ్ఛాన్త మజర మమృత మభయమ్ "

అని - శాంతము, అజరము, అభయము, అమృతము అని బ్రహ్మలక్షణములతో ఇందలి దర్శింపబడువాడు నిర్దేశింపబడినాడు కావున, ఆ దర్శన విషయమగు పరమాత్మయే యని నిర్ధరింప తప్పదు కదా ! అట్టివానిని దర్శించువాడు పొందులోకము - నశ్వరమగు

బ్రహ్మలోకము కానేరదు అది పరమ వ్యోమమే అందుచేతనే - 'యత్ర త్వ్యవయో వేదయన్తే' అని, అది కర్మవశ్యులుకాని - జ్ఞాన సంకోచములేని సూరులచే దర్శింపదగినదిగా చెప్పబడినది అట్టి సూరులచే దర్శింపబడునది విష్ణుస్థానమగు పరమపదమే యని -

**"తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః"**

అను శ్రుతి నిరూపించుచున్నది

అంతరిక్షలోకమునకు పైన బ్రహ్మలోక మనుటయు సరిపడదు మధ్య స్వర్గలోకాదు లనేకములు కలవు కావున, దర్శనీయుడు పరమాత్మయే యనియు, బ్రహ్మలోక మనగా - పరమవ్యోమ మనబడు పరమపదమే యనియు ఎఱుంగనగును

అంతియే కాదు - సత్యకాముడు ప్రణవోపాసనమునకు ఫలమును ప్రశ్నింప -

**"ఏతద్వై సత్యకామః పరం చాపరం చ య దోంకారః తస్మా ద్విద్వా నేతే నైవాయనే నైకతర మన్వేతి"**

అని సమాధానము చెప్పెను

బ్రహ్మము - అపరము, పరము అని రెండు విధములు అందు - కార్యరూపమునసుండు అపరబ్రహ్మవాచకమగు ప్రణవము అపరము అయ్యది ఏకమాత్రముగను, ద్విమాత్రముగనుకూడ నుండును ఏకమాత్రము నుపాసించినచో, ఐహికములగు మానుషలోకఫలములు లభించును ద్విమాత్రము నుపాసించినచో, ఆముష్మికములగు అంతరిక్షాది లోకములందలి ఫలములు పొందును ఇట్లు అపరబ్రహ్మవాచకమగు త్రిమాత్రప్రణవోపాసనమున పరమపురుషునే ధ్యానించువారు- పరబ్రహ్మమును, పరమవ్యోమమనబడు ఆ బ్రహ్మలోకమున దర్శింతురు' అని, ఈ యుపనిషద్వాక్యము పరమాత్మనే దర్శన విషయముగ ఉపదేశించెనని యెఱుంగనగును

## 5. దహరాధికరణము

ఛాందోగ్యోపనిషత్తునందు అష్టమ ప్రపాఠకమున దహరవిద్య ఉపదేశింపబడెను.

**"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మి న్నంతర ఆకాశః తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్"**

బ్రహ్మపురమగు ఈ శరీరమున అల్పమగు ఈ హృదయ పుండరీకము అను భవనమందు 'లోన దహరాకాశము' కలదు దాని లోలోన ఏది కలదో - అదియు అన్వేషింపదగినది, ఉపాసింపదగినది' అని -

ఇచట - 'దహరాకాశ' మనగా నేమి ? మహాభూతములలో నొకటిగ ప్రసిద్ధమగు ఆకాశమా ? జీవాత్మయా ? లేక - పర మాత్మయా ? అని సందేహము కలుగుచున్నది

మహాభూతములలో నొకటియగు ఆకాశమే ఇచట పేర్కొన బడిన దహరమని స్థూలముగ పరిశీలించిన, తోచును. ఆకాశ శబ్దము 'భూతాకాశ' మను అర్థమున ప్రసిద్ధమైనది

దహరాకాశము లోపల వేఱొకటి కలదని చెప్పి, అది తెలిసి కొనదగినదని చెప్పుటచే, పరమాత్మలో పరమాత్మకంటె వేఱొకటి వెదుకదగినది లేదుకనుక, పరమాత్మయే దహరాకాశమని చెప్పుటకు వీలులేదు. కనుక, భూతాకాశమనియే చెప్పవలెను ఇట్లు భూతా కాశమే దహరాకాశమను వాదమునకు సమాధానము - 'దహర ఉత్తరేభ్యః' ఈ ప్రకరణమునందలి తరువాతి వాక్యములనుబట్టి దహరాకాశము పరమాత్మయే యని చెప్పవలెను

తరువాతి వాక్యములో - దహరాకాశమున ఉపాసకు డన్వే షించి, ఉపాసింపదగినవి పరమాత్మ కల్యాణగుణములే యని నిరూ పించుచు, ఆ దహరాకాశమే ఆత్మ యని నిరూపించిరి.

"ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకో విజిఘత్సో ఉపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః"

ఈ దహరాకాశమే నిరుపాధిక ఆత్మశబ్దవాక్యము జరా మృత్యు శోక క్షుత్పిపాసా రహితము సత్యకామ - సత్యసంకల్ప ములు కలది' అని ఆ వాక్యము తెల్పుచున్నది ఆ గుణములు పర మాత్మకే కాని, భూతాకాశమున నుండవు కావున, దహరాకాశము పరబ్రహ్మయే

దహరాకాశోపాసనమునకుగూడ కామచారిత్వ - సత్యసంకల్ప త్వాదులు కల్గునని చెప్పుటకు వీలు కలుగుచున్నది

"యావాన్వా అయ మాకాశః తావా నేషోఽంతర్హృదయ ఆకాశః"

ఈ ప్రసిద్ధమగు ఆకాశ మెంతటిదో, అంతటిదే ఈ హృదయాంత ర్వర్తియగు దహరాకాశమని చెప్పుటచేగూడ, ప్రసిద్ధాకాశముకంటె భిన్నమైనదై, దహరాకాశమని తెలియుచున్నది పరమాత్మయని అర్థము చెప్పినను, అధిక పరిమాణ మగు పరమాత్మకు అల్ప పరిమాణ మగు ఆకాశముతో జాపమ్యము కల్పించుట అసంగతము కాదా? యని శంక కలుగవచ్చును కాని, 'సూర్యుడు బాణమువలె పోవు చున్నాడు' అనునపుడు - బాణవేగముకంటె సూర్యునివేగము అధిక మైనదే యయ్యును, సూర్యుడు మెల్లగ పోవుటలేదని స్ఫురించుటకు ఉపమాన - ఉపమేయ భావము కల్పించినట్లే, అల్పమైన హృదయ పుండరీకమునం దున్నను, దహరాకాశము అల్పపరిమాణము కలది మాత్రము కాదని స్ఫురింపజేయుటకే ఈ యుపమాన - ఉపమేయ భావ మని గ్రహింపవలెను.

దహరాకాశమే పరమాత్మయైనచో, ఆ దహరాకాశమున వేఱొకటి అన్వేషింపదగినది కలదని చెప్పుట ఎట్లు సంభవించును ?

"దహరోఽస్మిన్నంతర ఆకాశ స్తస్మిన్యదంత స్తదన్వేష్టవ్యమ్"

పరమాత్మకంటె వే ఱొకటి ఉపాసింపదగినది దానిలో వ్యాపించియుండునది లేదుకదా ! అందుచే, 'ఏష ఆత్మా' అనుదానిచే పరామర్శింపబడినద్ది ఆ దహరాకాశాంతర్వర్తి యగు పరమాత్మ యనియు, ఆ దహరాకాశము భూతాకాశమనియు చెప్పుటయే సమంజసముకదాయని శంకింపవచ్చును. కాని, సమగ్రముగా ఉపక్రమోపసంహారములతో కలిపి చూచిన, ఆ శ్రుతియే దహరాకాశ మన నేమో - తదంతర్వర్తి పదార్థ మేదియో విభజించి తెలియజేయును కావున, మొదటినుండియు ఈ ప్రకరణమును పరిశీలింతము

ఉపాస్యుడగు పరమాత్మ - నిత్యసన్నిధానము చేయు ఉపాసకుని శరీరము బ్రహ్మపురము. ఆ శరీరముయొక్క మధ్యలో నుండు తదవయవభూత మగు హృదయమే 'దహరం పుండరీకం వేశ్మ' అల్ప పరిమాణముగల్గు పుండరీకాకార మగు పరమాత్మ వాసస్థానము ఆ హృదయపుండరీకమునందు సర్వజ్ఞుడు, సర్వశక్తి సంపన్నుడు, ఆశ్రిత వాత్సల్యైకజలధి యగు ఆ పరబ్రహ్మమే ఉపాసకుని అనుగ్రహించుటకై, ఆ దహర పుండరీక వేశ్మమున సన్నిహితుడై యుండును. సూక్ష్మరూపమున ధ్యానము చేయదగిన ఆ పరబ్రహ్మమునే దహరాకాశమని ఇందు నిర్దేశించెను ఆ పరబ్రహ్మయందుండు కల్యాణగుణగణమునుకూడ ధ్యానము చేయవలెనని - 'తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యమ్' ఆ దహరాకాశమున నేది యుండునో - అది అన్వేషింపబడదగినది' అని ఉపదేశించెను. 'తదన్వేష్టవ్యమ్' అనుచోట - 'తత్' అను పదమునకు - 'ఆ రెండును' అని యర్థము. ఆ పరబ్రహ్మము, ఆ గుణములు అను ఈ రెండును అన్వేషింపబడవలెను - అనగా - ఆ రెంటినికూడ ఉపాసన చేయవలెనని యర్థము

ఇచట దహరాకాశ మనగా పరబ్రహ్మమే యనియు, తదంత ర్వర్తియగు ఉపాస్యవస్తువు పరమాత్మయొక్క కల్యాణగుణజాతమే యనియు ఎఱుంగుట ఎట్లో, ఇట వివరింపబడును.

"యావా న్వా అయ మాకాశ స్తావా నేషోన్తర్హృదయ ఆకాశః."

ఈ ప్రసిద్ధమగు ఆకాశ మెంతటిదో, అంతటిదే ఈ హృద యాంతర్వర్తియగు దహరాకాశము' అని, దహరాకాశము మహాత్పరి మాణము కలది యని సూచించెను అటుపిమ్మట —

"ఉభే అస్మిన్ ద్యావా పృథివీ అంతరేవ సమాహితే
ఉభా వగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమసా వుభౌ, విద్యు న్నక్షత్రాణి "

ఈ దహరాకాశమునందు — ద్యులోక, పృథివీ లోకములును, వాయ్వగ్నులును, సూర్యచంద్రులును, విద్యున్నక్షత్రములును మొద లగు భోగ్య, భోగోపకరణ, భోగస్థాన, భోక్తృవర్గ మంతయు ఈ దహరాకాశమునందే నిలిచియున్నది' అని, దహరాకాశము సర్వ జగదాధారమని నిరూపించెను మఱియు —

"యచ్చా స్యేహా స్తి యచ్చ నా స్తి సర్వం త దస్మిన్ సమాహితమ్ "

ఉపాసకునకు ఈ లోకములో భోగ్యమగు వస్తువు లెయ్యవి కలవో, ఏయవి కోరికలుగనే మిగిలెనో, అవి యన్నియు దహరాకాశ మందే సన్నిహితములై యుండు'ననియు, 'దహరాకాశము నిరతిశయ భోగ్యమనియు నిరూపించెను అదియునుగాక — దేహావయవమగు హృదయమునం దున్నను, దేహమున కుండు జరామరణాదులు ఈ దహరాకాశమునకు లేవనియు, దహరాకాశము నిర్వికారమనియు నిరూపించెను.

"తత ఏవైత త్సత్యం బ్రహ్మ పురమ్ "

పై లక్షణములచే ఈ దహరాకాశము నిఖిలజగదాధారభూత

మగు - సత్యశబ్దవాచ్యమగు పరబ్రహ్మమే' యని, శ్రుతియే దహరా కాశమును పరబ్రహ్మముగా నిర్ధారించెను.

అటుపైన ఈ దహరాకాశము కామ్యములగు కల్యాణగుణములు కలది యనియు, ఆత్మ యనియు స్పష్టముగ నిరూపించుచు -

"ఏష ఆత్మా అపహత పాప్మా, విజరో, విమృత్యు, ర్విశోకో,
విజిఘత్సో, ఽపిపాసః సత్యకామ, స్సత్యసంకల్పః "

అని యుపదేశించెను.

## 6 ప్రమితాధికరణము

ఈ యధికరణమున ప్రసక్తానుప్రసక్తముగ దేవతాధికరణ, మధ్వధికరణ, అపశూద్రాధికరణములు వచ్చును ముందు ప్రమితాధికరణము ప్రస్తావింపబడుచున్నది

"అంగుష్ఠమాత్రః పురుషః మధ్యే ఆత్మని తిష్ఠతి
ఈశానో భూత భవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్వై తత్ "

"అంగుష్ఠమాత్రః పురుషః అంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః. తం స్వాచ్ఛరీరా త్ప్రవృహే న్ముంజాది వైషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్ర మమృత మితి "

అని, కఠవల్లి యందు పేర్కొనబడినది ఇందు అంగుష్ఠప్రమాణముకల ఈ పురుషుడు పరమాత్మయా ? జీవాత్మయా ? అని సందేహము. ఉపనిషత్తులలో చాల స్థలములయందు జీవుడు అంగుష్ఠ పరిమితుడు అని నిర్దేశించుటచే, తదనుగుణముగ ఇచటగూడ జీవుడనుటయే సమంజసము.

"ప్రాణాధిప స్సంచరతి స్వకర్మభిః అంగుష్ఠమాత్రః రవితుల్యరూపః సంకల్పాహంకారసమన్వితోయః."

అని చెప్పబడు ప్రాణాధిపతిత్వము, కర్మవశ్యత్వము జీవునదే కాని, పరమాత్మకు సంబంధింపవుగదా ! అందుచే, ఆ జీవుడే అంగుష్ఠ పరిమితుడు అనుట సమంజసము మఱియు, పరమాత్మను ఉపాసనము కొఱకైనను అంగుష్ఠపరిమితుడుగ ఎచటను నిర్దేశించియుండలేదు కావున, జీవాత్మయే అంగుష్ఠపరిమితుడని చెప్పవలెను పై ఉపనిష ద్వాక్యములలో — 'ఈశానో భూత భవ్యస్య' అని ఆ పురుషుడు 'సర్వేశ్వరుడు' అని చెప్పబడుచున్నదిగదా ! అది జీవున కెట్లు కుదురును ? అని సందేహము కలుగవచ్చును కాని, శరీరము, ఇంద్రియములు మున్నగు భోగ్య వస్తువులు, భోగోపకరణములు మున్నగు వానికి ఈశ్వరుడు జీవుడే యని అది సూచించును కావున, అంగుష్ఠ పరిమితుడుగ చెప్పబడినవాడు జీవుడే యని శంక రాగా, ఈ యధికరణమున ఆ పురుషుడు పరమాత్మయే యని నిరూపించుచున్నారు

'శబ్దాదేవ ప్రమితః' భూత భవిష్య ద్వర్తమాన — త్రైకాలిక వస్తుజాత నియమనశక్తి కలవాడు' అని తెల్పు 'ఈశానో భూత భవ్యస్య' అను శబ్దమువలననే అంగుష్ఠపరిమితుడు పరమాత్మయే యని నిశ్చయింప వీలగుచున్నది

## 7 దేవతాధికరణము

పరమాత్మ అంగుష్ఠపరిమితు డగుటచే, బ్రహ్మోపాసనమున మనుష్యులకే అధికారము కలదని తెలియుచున్నది. తిర్యగ్జంతువులవలె దేవతలకుగూడ అధికారములేదని తోచుచున్నది కలదా ? లేదా ? యని ఇట చర్చ చేయబడుచున్నది.

దేవతలకు ఉపాసనమున అధికారము లేదు వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము అను సప్తసాధనములచే సాధింపబడిన భక్తిచే ఈ శరీరమున ఉపా

సింపదగిన పరమాత్మను అశరీరులగు దేవతలు ఉపాసన చేయుట పొసగదు. దేవతలకు శరీర - ఆయుధములు కలవని వర్ణించిన శ్రుతి వాక్యములు ఆ యా దేవతలనుద్దేశించి చేయు కర్మలను విధించునవి కావున, ప్రధానముగ ప్రతిపాదించు కర్మవిధానముననే అవి ప్రమాణములుకాని, అశరీరాది ప్రతిపాదనమున అవి ప్రమాణములు కాజాలవు అట్లు ప్రధానముగ శరీరాదులను ప్రతిపాదించు ప్రమాణము లభించుటలేదు కావున, శరీరము లేకపోవుటచే వారికి ఉపాసనమున 'సామర్థ్యము' లేదు ఉపాసనమును - 'కోరిక' (అర్థిత్వము) కలవారే చేయుదురు. వీరికి కోరికలుకూడ లేవు కావున, దేవతలకు ఉపాసనమున అధికారము లేదని సందేహము కలుగునని, దానిని దేవతాధికరణమున వారించుచున్నారు.

బ్రహ్మోపాసనమున దేవతలకుగూడ అధికారము కలదు అర్థిత్వ - సామర్థ్యములు వారికిని గలవు' అని బాదరాయణుని అభిప్రాయము

ఆధ్యాత్మికాది తాపత్రయాభిఘాతక్షే బ్రహ్మోపాసనయందు కోరిక కలుగుటకు కారణము నిఖిలదోషరహితుడు, అసంఖ్యేయ కల్యాణ గుణ పరిపూర్ణుడునగు సర్వేశ్వరునియందు భోగ్యతాబుద్ధి కలిగినచో ఉపాసనమున కోరిక సంభవించును అది దేవతలకు కలదుకదా! అట్టి ఉపాసన చేయుటకు తగిన దేహేంద్రియాదులు బ్రహ్మాదులకు గూడ కలవని సృష్టిప్రకరణమ్మున ఉపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి

"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ "

"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి."

సృష్టికి ముందు భగవత్సంకల్పము ఆ బహుభవన సంకల్పముచే, ముందు - తేజస్సు, జలము, పృథివి మున్నగు వానిని సృజించును.

తరువాత, జీవాత్మద్వారా దానియందు ప్రవేశించి, బ్రహ్మాది స్థావరాంతము ఆ యా జీవోచిత కర్మానుగుణముగా - దేవ, తిర్యక్, మనుష్య, స్థావర శరీరములను, త దుచిత నామములను ఆ సర్వేశ్వ రుడే కల్పించును. ఈ రీతిగ - నాలు విధములగు శరీరములతో సృష్టి సాగును. ఆత్మలకు సహజముగ దేవాది భేదములు లేవుకదా! ఆ యాత్మల కర్మలకు తగిన ఫలముల ననుభవించుటకు తగిన శరీరములు దేవాదుల కుండవలెను కావున, ఆ దేహభేదమునుబట్టియే ఈ దేవాదిభేద మేర్పడును. అందుచే, దేవతలకుగూడ శరీరము కలదని నిశ్చయముగ తెలియుచున్నది ఈ వాక్యములు ఉపనిషత్తులలో తత్త్వప్రతిపాదకములు దీనిచే, దేవతలకుగూడ శరీరముకలదని విశద మగుచున్నది. కాక, ఇందు ఉపాసనపర వాక్యములందుగూడ దేవ తలకు శరీరము కలదని విశద మగుచున్నది 'ఇంద్రుడు దేవతల పక్ష మునను, విరోచనుడు అసురుల పక్షమునను ఆత్మస్వరూపము నెఱుం గుటకు ప్రజాపతివద్ద కేగిరి' మొదలగు వాక్యములను చూచిన, దేవ తలకుకూడ శరీరము, ఇంద్రియములు కలవని తెలియుచున్నది

కర్మవిధులగు శేషభూతములను అర్థవాదములందు - 'వజ్రహ స్త పురందరః' మున్నగు వాక్యములచేకూడ శరీరేంద్రియములు కలవని తెలియుచున్నది అర్థవాద వాక్యములు కర్మవిధికి భూతములు కావున, అవి దేవతలకు శరీరములు కల వనుటలో ప్రమాణములు కావని భావింపరాదు ఆదరింపవలసిన కర్మయొక్క ప్రశస్తి కొఱకు చేయు స్తుతి అర్థవాదము అట్టి స్తుతిచే, ఆ కర్మయందు ప్రదోషము జేయుట వాని ప్రయోజనము స్తుతి యనగా - గుణములను చెప్పుట లేని గుణములను చెప్పినచో - ఎవరును దాని నాచరింప ప్రరోచితులు కారు అందుచే, ఆ గుణముల నున్న వానినే అని బోధించును కావున, కర్మప్రచోదనమును చేయుచు, ఆ యా గుణములను ఆ యా యర్థము లకు కలవని చెప్పుటలో - అర్థవాదములు ప్రమాణములే యగును

కావున, అర్థవాదములవలన దేవతలకు శరీరము కలదని తెలియుచున్నది.

ఈ యర్థవాదములే కాదు - మంత్రములుకూడ దేవతలకు శరీరము కల దనుటలో ప్రమాణములే కర్మను ప్రతిపాదించునపుడు ఆ మంత్రములు ఈ ద్రవ్యముతో - ఈ దేవత నుద్దేశించి ఈ కర్మ చేయవలెనని చెప్పునుగదా! అనుష్ఠింపదగు కర్మను ప్రకాశింప జేయుటకై, ఆ కర్మ కుద్దేశ్యమగు దేవతాదుల విగ్రహములను, గుణములను ఆ మంత్రములు ప్రతిపాదించుచుండును ఇంద్రుడు శబ్దాత్మ స్వరూపము కాదు. నిర్విశేషము కాదు కావున, మంత్రాదుల యందలి ఆ యా ఇంద్రాది శబ్దములు దేవతలకు విగ్రహము కలదని ప్రకాశింపజేయును. మంత్రములకు కర్మవిధానమే ప్రధానముకదా! అవి అప్రధానమగు ఈ దేవతా విగ్రహ ప్రతిపాదనమును చేయుటలోగూడ ప్రమాణ మనుట అసంగతము వాని కది తాత్పర్య విషయము కాదుకదా!' అని సంశయింప బనిలేదు. కర్మను విధించు మంత్రము ప్రతిపాదింపబడు దేవతయొక్క ఐశ్వర్యము (శక్తిమత్త్వము)ను గూడ ప్రతిపాదింపవలెను కోరికగలవా రొక కోరికతో నొక కర్మ నాచరించుటను మంత్రము విధించుచున్నది

ఆకర్మ - క్షణము తరువాత ధ్వంస మగునదికావున, కాలాంతరమున కల్గు స్వర్గాది ఫలములను సాధించు నొక సాధన మపేక్షితము మంత్రార్థ వాదములు కర్మచే ఆరాధింపబడిన దేవత ఫలమిచ్చునని చెప్పుటచే, ఆ దేవతలకు ఆ శక్తి కలదనియు ఈ మంత్రముచే ప్రతిపాదించుచున్నవని అంగీకరింపవలెను కావున - మంత్రములు, బ్రాహ్మణములు, అర్థవాదములు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు మున్నగు సమస్తమునందును దేవతలకును దేహేంద్రియాదులు, భోగములు, భోగస్థానములు, కృత్యములు

తత్త్వదుచితములు కలవని స్పష్టముగా తెలియుచున్నది. అందుచే - అర్థిత్వము, శరీర తత్త్వము అనునవి కలవారే కావున దేవతలుకూడ ఉపాసనమున అధికారులే యని ఎఱుంగవలెను.

# ప్రథమాధ్యాయము - చతుర్థ పాదము

## 1. అనుమానాధికరణము

ఇంతవఱకు ప్రథమాధ్యాయమున మూడుపాదములైనవి నాల్గవపాద మారంభ మగుచున్నది. మొదటి పాదము అయోగ వ్యవచ్ఛేదమును చేయును అనగా - చిదచిద్విలక్షణమగు బ్రహ్మమే జగత్కారణమని సమర్థించును. తరువాతి మూడు పాదములు అన్య యోగ వ్యవచ్ఛేదమును చేయును అనగా - బ్రహ్మకంటె వేరగుజీవుడు గాని, ప్రకృతిగాని జగత్కారణము కాదని నిరూపించును. శ్రుతి వాక్యములలో - కొన్ని వాక్యములందు అస్పష్టముగ జీవునకే అన్వయించు లక్షణములతో గూడిన వస్తువు జగమునకు కారణమని భాసించును కాని, వానిలో ప్రతిపాదింపబడినది జీవుడు కాదు - పరమాత్మయే యని రెండవ పాదము నిరూపించినది. కొన్ని వాక్యములలో జగత్కారణముగా ప్రతిపాదించినది స్పష్టముగ జీవుడే యని చెప్పదగినట్లు అచటి లక్షణములు కన్పట్టును. అచటగూడ పరమాత్మయే కారణమని మూడవపాదము నిరూపించినది. నాల్గవ పాదమున స్పష్టతరముగ జీవలక్షణములు కలిగినట్లు కన్పట్టు శ్రుతివాక్యములుసైతము పరమాత్మనే ప్రతిపాదించుచున్నవని నిరూపించుచున్నారు.

మోక్షము పురుషార్థములలో ఉత్తమమగు పురుషార్థము. దానిని సాధించుటకు జగజ్జన్మస్థితిని, ప్రళయకారణమగు బ్రహ్మను ఎఱుంగవలెను. ఆ బ్రహ్మము అచేతనమగు ప్రధానముకంటె విలక్షణమైనది. 1 బద్ధులు 2 ముక్తులు అను రెండు విధములుగ నుండు జీవులకంటె

విలక్షణము హేయగుణ స్పర్శలేని సర్వజ్ఞత్వ, సత్యసంకల్పాది కల్యాణగుణ పరిపూర్ణము చేతనాచేతనమగు సకల జగమునకు ఆత్మ భూతమైనది నిరంకుశమగు ఐశ్వర్యము కలది' అని ఇంతకు ముందు పాదములలో నిరూపింపబడినది కాని, కఠోపనిషత్తునందలి వాక్యములు కొన్ని సాంఖ్య శాస్త్రముల ననుసరించి - బ్రహ్మాత్మకముకాని, కేవల ప్రధానమే జగత్కారణమని ప్రతిపాదించునట్లు, పైపైన చూచిన భాసించును కావున, ఈ యధికరణము బ్రహ్మము తప్ప, వేఱొకటి జగత్కారణము కాదను సిద్ధాంతమునే దృఢముగా నిలుపుటకు ఈ వాక్యములు ప్రధాన కారణత్వమును ప్రతిపాదించుటలేదని నిరూపించుచున్నది.

కఠోపనిషత్తులో మూడవవల్లి యందు - యముడు నచికేతునకు ఆత్మతత్త్వమును బోధించు ప్రసంగమున నిట్లు చెప్పెను -

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్య శ్చ పరం మనః
మనస స్తు పరా బుద్ధిః బుద్ధే రాత్మా మహాన్ పరః
మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషా న్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః "

ఇంద్రియములకంటె వానిచే గ్రహింపబడు విషయములు పరములు విషయములకంటె మనస్సు పరము మనస్సుకంటె బుద్ధి పరము బుద్ధికంటె మహత్తగు ఆత్మ పరము ఆ మహత్తుకంటె అవ్యక్తము పరము. అవ్యక్తముకంటె పురుషుడు పరము పురుషునికంటె పరము వేఱొకటి లేదు. అదియే పై హద్దు అదియే పరగతి

సాంఖ్యులు - 'పురుషుడు, ప్రకృతి'కంటె వేఱుగ బ్రహ్మమును అంగీకరింపరు. వారి శాస్త్రము ననుసరించి అవ్యక్తము (ప్రకృతి)నుండి మహత్తు, మహత్తునుండి అహంకారము, దానినుండి

పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములు, పంచ మహాభూతములు - తత్పరిణామముగనే ఏర్పడుచున్నవి ఇట్లు వారి సిద్ధాంతమున ప్రధానమే (ప్రకృతియే) సర్వ జగత్కారణము ఇప్పుడీ యుపనిషద్వాక్యములందు - మహత్తు, అవ్యక్తము, పురుషుడు అను శబ్దము వినవచ్చుచుండుటచే, ఆ సాంఖ్యశాస్త్ర ప్రతిపాదితమైన అవ్యక్తమే సర్వజగత్కారణమని ఈ యుపనిషత్తు ప్రతిపాదించుచున్నదా ? యని శంక కలుగవచ్చును అంతే కాక, పురుషునికంటె (జీవాత్మ) పరమగు తత్త్వము లేదనియు ఇందు కన్పట్టుచున్నది అదియే సాంఖ్య సిద్ధాంతముగదా ! అందుచే, ప్రధానమే జగత్కారణమని వేదశాఖలలో గన్పట్టుచున్నదిగదా! 'బ్రహ్మయే జగత్కారణము ప్రధానము కాదు' అని ఎట్లు చెప్ప వీలగును ? అను శంకను అనుమానికాధికరణము త్రోసిపుచ్చుచున్నది. ఈ యుపనిషత్తునందలి 'అవ్యక్త' శబ్దము బ్రహ్మాత్మకముకాని, సాంఖ్యులు కేవల అవ్యక్తమును (ప్రకృతిని) తెలియజేయునది కాదు. దీనికి ముందు శరీరమును రథముగను, ఆత్మను రథికుడుగను, మిగిలిన మనస్సు మున్నగువానిని ఆ యా పరికరములుగను రూపకమున నిరూపించెను రథమున నిరూపింపబడిన శరీరమే ఇచట 'అవ్యక్తము' అను పదమునకు అర్థముకాని, సాంఖ్యుల ప్రధానము మాత్రము కాదు

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ చ
బుద్ధిం తు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవ చ
ఇంద్రియాణి హయా న్యాహుః విషయాం స్తేషు గోచరాన్"

సంసారమను ఈ మార్గముద్వారా పయనించుచు, ఆవలి చివరనున్న పరమపదమగు పరమాత్మను చేరగోరిన బాటసారులగు ఉపాసకులకు ఈ శరీరేంద్రియాదులు ఎట్లు ఉపకరించునో తెల్పుటకు - 'రథికుడు, రథము' అను వానితో పోల్చిచూపుచున్నారు పరమపదమువైపు పయనించు బాటసారి ఉపాసకుడు పయనించు మార్గము

సంసారధ్వము దీనిని దాటుటకు శరీర మను రథము నధిష్ఠించి, ఆత్మ యను రథికుడు పయనించుచున్నాడు రథమునకు పూన్చిన గుఱ్ఱములే ఇంద్రియములు. వానిని పట్టి నడుపు పగ్గమే మనస్సు ఆ గుఱ్ఱములు విషయములు. ఇటు నటు లాగుటకు ప్రయత్నించును దానిని బుద్ధి యను సారథి మనస్సును పగ్గముతో నిగ్రహించి, మార్గమున నిలుపవలెను అటు నడుపగలిగిన ఉపాసకుడును రథికుడు —

"సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"

సంసారాధ్వమున అవ్వలి ఒడ్డ ననున్న వైష్ణవమగు పరమ పదమును చేరనగును' అని మనస్సునకు హత్తుకొనునట్లు రూపకముతో నిరూపించి వశపఱచుకొనుటలో దేనికంటె ఏది ప్రధానమో, ఆ క్రమము — 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః' అను వాక్యము నిరూపించుచున్నది. హయములగు ఇంద్రియములకంటె వానికి గోచరములగు శబ్దాది విషయములను వశపఱచుకొనుట ప్రధానము ఇంద్రియములు వశముననున్న వానికైనను విషయ సాన్నిధ్యము ప్రమాద హేతువు కావున, వాని సాన్నిధ్యమునగూడ చలించకుండునట్లు వశపఱచుకొనవలెను ఆ విషయములను వశపఱచుకొనుటకు ఇంద్రియముల నన్నిటిని శబ్దాది విషయములు లేకుండునట్లు చేయుటయు, ఆ విషయములు విడువదగినవని దృఢముగా నెఱుంగుటయు ఆవశ్యకము

ఆ విషయములను వశమునం దుంచుకొనుటకంటె, పగ్గమువంటిదగు మనస్సును లొంగదీసికొనుట ప్రధానము మనస్సు మన వశమునం దుండనిచో, విషయములు దగ్గరగా లేకున్నను, మనసే వానిని భావించుచుండును కావున, మనస్సుయొక్క అవధానము ఆవశ్యకము

అంతకంటెను సారథివంటిదగు బుద్ధిని వశమునం దుంచుట ప్రధానము విషయముల ననుభవింపవలె నను సంకల్పము కలుగ

కున్నచో - మన మేమియు చేయజాలదు. కావున, బుద్ధిని వశమునం దుంచుకొనుట ఆవశ్యకము

ఆ సారథికంటెను రథికతుల్యమగు ఆత్మ వశమం దుండుట ప్రధానము సంకల్పము కల్గునది - ఆత్మయొక్క ఇచ్ఛచేతనేకదా ! విషయముల ననుభవించు సంకల్పముకాక, ఆత్మస్వరూప యాథాత్మ్యము నెఱుంగగోరుటయే ఆత్మను వశపఱచుకొనుట ఇంద్రియ జయము మొదలు సంకల్పము వఱకు అంతయు ఆత్మయొక్క ఇచ్ఛాధీనమైయుండును కావున, 'బుద్ధే రాత్మా మహాన్ పరః' అను ఆత్మను 'మహాన్' అనినారు.

ఈ విధముగ మహత్తగు ఆత్మను వశపఱచుకొనటకంటెను రథరూపమగు ఈ శరీరమును వశమునం దుంచుకొనుట ప్రధానము ఆత్మయదార్థజ్ఞానము కల్గుటకు శరీరమందు సత్త్వగుణ ముద్బుద్ధమగుట ఆవశ్యకము సాత్త్వికాహారాదులచే, సత్త్వగుణోన్మేషము కల్గి, యదార్థజ్ఞానేచ్ఛ ఆత్మకు కల్గునట్లు చేయునది శరీరమే కావున, దానిని వశమం దుంచుకొనుట అన్నిటికంటె ప్రధానము

ఈ విధముగ ఇంద్రియములు, శబ్దాద్యర్థములు, మనస్సు, బుద్ధి, ఆత్మ, శరీరము వశీకార్యములని చెప్పి, ముందుదానికంటె తరువాతిది ప్రధానమని చెప్పి, వీనియన్నిటికి మూలమై, తన సంకల్పముచేతనే సర్వప్రవృత్తులను వశపఱచుకొనదగినవాడు ఆయనయే సాధకుని ఉపాసనను చక్కగ నెరవేర్చు నుపాయము ఆతనికంటె పరమగు ఉపాయము లేదు కావున, ఆతనిని వశపఱచుకొనుటయే సాధకుడు వశపఱచుకొనదగిన ఉపాయములలో పరాకాష్ఠ అతడే పరమ ప్రాప్యుడును పరమపురుషుని వశపఱచుట యనగా - వానిని శరణు పొందుటయే కావున, కఠోపనిషత్తునందలి పై 'ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః' అను వాక్యమున - అంతకుమున్ను 'ఆత్మానం రథినం

విధి' అను వాక్యమున రూపకముచే నిర్దేశింపబడినదియే పరామర్శింపబడినవి. అందు - ఇంద్రియములు, అర్థములు, మనస్సు, బుద్ధి అను వానిని ఆ పదములతోడనే నిర్దేశించి, శరీరమును మాత్రము 'అవ్యక్తము' అను పదముచే నిర్దేశించెను. కావున, ఇచట అవ్యక్తము సాంఖ్యప్రసిద్ధమగు ప్రధానమును ప్రతిపాదించును.

అంతియేకాక, ఇచట వరుసకూడ సాంఖ్యశాస్త్రప్రసిద్ధమగు పరిణామక్రమమును సూచించునదిగ లేదు. ఇంద్రియములకంటె అర్థములు పరములని ఇచట చెప్పబడినది. సాంఖ్యమున శబ్దాదులగు పదములు ఇంద్రియములకు కారణములు కావుకదా! అర్థములకంటె మనస్సు పరమని ఇచట నిరూపింపబడెను. సాంఖ్యమున మనస్సునుండి ఇంద్రియములు వెలువడవుగదా! అట్లే, బుద్ధికంటె మహత్తగు ఆత్మ పర మని ఇందు నిరూపింపబడినది. బుద్ధియనగా - సాంఖ్యమున మహత్తత్త్వమేకదా! మహత్తుకంటె మహత్తు పర మనుట ఎట్లు పొసగును? ఆ మహత్తత్త్వమునకు - 'ఆత్మా' అని, విశేషణ మెట్లు అన్వయించును? అందుచే, వెనుక రథాదులుగ నిరూపింపబడినవానిని వశపఱచుకొనుటలో వేనికంటె ఎయ్యవి ప్రధానములో, ఈ వాక్యము నిరూపించుచున్నది. కాని, సాంఖ్యప్రతిపాదితమగు సృష్టిక్రమమును నిరూపింపలేదు. ఈ విషయమునే ఈ యుపనిషత్తులో - తరువాతి వాక్యము ప్రదర్శింపబడుచున్నది.

"ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః
యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛేత్ తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని"

ఈ పరమాత్మ సర్వభూతములయందు గూఢమై యుండును, కాని, ప్రకాశింపడు. సూక్ష్మదర్శులగువారు - తమ సూక్ష్మమగు దృష్టిచేమాత్రమే దీనిని కాంచగలరు. బాహ్యేంద్రియములను, అంత

రింద్రియములను జయింపనివారు పరమపురుషుని గాంచజాలరు కావున, గుఱ్ఱములు మొదలగునదిగా నిరూపింపబడిన ఇంద్రియాదులను జయించు విధమును ఇట చెప్పుచున్నారు

వాక్కును మనసునందు నియమించవలెను వాక్పాణిపాదాది కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను మనోవశవర్తులుగ చేయవలెను ఆ మనసును బుద్ధియందు నియమించవలెను ఆత్మ స్వరూపజ్ఞానరూపమగు బుద్ధికి మనసు వశవర్తియై యుండునటుల చేయవలెను ఆ బుద్ధిని సర్వకర్తయగు జీవాత్మయందు నిలుపవలెను బుద్ధిచే ఆత్మస్వరూప సాక్షాత్కారము నొందవలెనను సంకల్పముగలదై యుండవలెను ఆ జీవాత్మను శాంతమగు (ఊర్మిషట్కము సహజముగ లేనిది) పరమాత్మయందు నిలుపవలెను అనగా - పరమాత్మకు ఈ యాత్మ శేషభూతమను జ్ఞానముతో నుండవలెను ఇట్లు నియమించు రథికుడు - అనగా, ఆత్మ - వైష్ణవమగు పరమ పదమును చేరగలదు

ఈ విధముగ ఈ ప్రకరణమును పరిశీలించినచో, కఠోపనిషత్తునందలి 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః' అనుచోట - అవ్యక్తశబ్దము శరీరమునే తెలియజేయును కావున, ఇచట - సాంఖ్యప్రతిపాదితమగు ప్రధానము జగత్కారణముగ నిరూపింపబడలేదని తెలియనగును

## 2 చమసాధికరణము

ఈ యధికరణమునందు - వెనుకటి యధికరణమునందు వలె సాంఖ్యప్రతిపాదితమగు విధమున ప్రకృతి స్వతంత్రముగ, అనగా - బ్రహ్మ ఆత్మగా లేనిదై, జగత్కారణము కాదని నిరసించుచున్నారు

శ్రుతిస్మృతులు బ్రహ్మాత్మకమగు ప్రకృతియే మహదహంకార రూపాదిరూపమున పరిణమించుచున్నదని తెలుపుచున్నవి శ్రుతులిట్లనుచున్నవి -

"ప్రకృతి ఉత్పత్తి వినాశములు లేనిది, జడము, పంచమహాభూతములు, మనోబుధ్ధ్యహంకారములు అను ఎనిమిది రూపములు కలది పరమాత్మ సంకల్పరూప జ్ఞానముచే నెఱుంగబడును ఆ పరమాత్మచే అధిష్ఠితమై, స్థూలరూపమునందును దానిచే సమష్టి భూత సృష్టి జరుగును తరువాత, వ్యష్టిసృష్టి చేయు నటుల పరమాత్మచే ప్రేరేపింపబడును పురుషులు అర్థించు భోగ్యపదార్థములను, భోగ సాధనములను ప్రకృతి సృజించును"

"ప్రకృతి యొక గోవు దీని కాద్యంతములు లేవు ఇదియే సమష్టి వ్యష్టి సృష్టులను సాగించునది సత్త్వరజస్తమో గుణములచే సితాసిత రక్తవర్ణములు కలిగియుండును ఇది ఈశ్వరునకు లీలారసము నొసంగును దేహాత్మ వివేకములేని జీవులు దూడలవలె దీని పాలను త్రావి, అనుభవించుచుండును వారి వారి కర్మానుగుణమగు దేహ రూపమున పరిణమించు ఈ ప్రకృతికి పక్షపాతము లేదు స్వచ్ఛందముగా విహరింపజాలు ఒక్క పరమాత్మయే దీనిని తన వశమం దుంచుకొని, స్వసంకల్పముచే సృష్టివ్యాపారము చేయుచు అనుభవించున. సర్వజీవసాధారణమగు ఈ ప్రకృతి - కర్మవశ్యులగు జీవులచే తమ తమ కర్మానుభవమున కనుగుణముగ రూపముల నిచ్చునట్లు దూడలచే గోవువలె పీడింపబడును ఈ ప్రకృతి వ్యక్తావ్యక్త రూపముల నిరువదినాల్గు తత్త్వములుగ నుండును ఇరువదియైదవ తత్త్వము జీవుడు కాలమును ఇరువదియాఱవ తత్త్వముగ అంగీకరించిన, ఇరువదియేడవ తత్త్వము - లేక, ఇరువదియాఱవ తత్త్వమగు పరమాత్మ ప్రకృత్యాదుల కాత్మగ నుండును

"ఈ చేతనాచేతనాత్మకమగు విశ్వమును ఈశ్వరుడే భరించుచున్నాడు చేతనాచేతనములగు జీవప్రకృతులు రెండును ఈశ్వరునిచే నియమింపబడును అట్టి నియంతయగు పరమాత్మను ధ్యానించుట

వలన, యోగమువలన, సాక్షాత్కారమువలన ఈ యాత్మలకు ప్రకృతి బంధముక్తి కలుగును ''

మాయ యనగా ప్రకృతి మాయి యనగా పరమాత్మ జీవాత్మను మాయి మాయచే బంధించును సర్వేశ్వరుడే మాయచే ఈ జగత్తును సృజించుచున్నాడు ఈశ్వరుని అంశములగు చేతనా చేతనములచే ఈ జగము వ్యాప్తమై యుండును ''

స్మృతి (భగవద్గీత) యిట్లు చెప్పుచున్నది -

ప్రకృతి పురుషు లిరువురును ఆది లేనివారు అనగా - ఉత్పత్తి లేనివారు ఈ వికారము లన్నియు ప్రకృతినుండి కల్గునవియే సుఖ దుఃఖ భోక్త జీవుడే సత్త్వ రజ స్తమోగుణసంగమే జీవునికి దేహ సంబంధమును కల్గించుచున్నది కల్పాంతమునందు సర్వభూతములు పరమాత్మ శరీరమగు సూక్ష్మావస్థయందున్న ప్రకృతిలో లయ మందును కల్పాదియందు పరమాత్మ మఱల వానిని విడచును పర మాత్మయే తన శరీరమగు ప్రకృతిని నామ రూపములు కలదానినిగా, పెద్దదానినిగా జేసి, వానిచే సర్వభూతజాతమును సృజించును సర్వే శ్వరుడు అధ్యక్షుడుగా నుండ, ప్రకృతి చరాచరములను కను చున్నది ''

ఈ రీతిగా శ్రుతి స్మృతులలో - ప్రకృతియు, తద్వికారము లును కలవని అంగీకరింపబడినది కాని, ఆ ప్రకృతి - బ్రహ్మ ఆత్మగ కలిగియుండుటచేతనే వృద్ధి చేయుచున్నది' అని ప్రతిపాదింపబడినది కావున, బ్రహ్మాత్మకముగ గాక, స్వతంత్రముగ ప్రకృతి జగత్కారణ మను సాంఖ్యసిద్ధాంతము - శ్రుతి స్మృతి విరుద్ధ మని ఎఱుంగనగును

అందుచే, ఈ యధికరణమున దానిని నిరసించుచున్నారు శ్వేతాశ్వతరోపనిషత్తునందు ఒక మంత్రమున, కాపిలమగు సాంఖ్య

మున ప్రతిపాదించినట్లు, ప్రకృతియే స్వతంత్రముగ జగత్కారణమని నిరూపించినట్లు కన్పట్టును కాని, పర్యాలోచన చేయగా - అందు అట్లు లేదు' అని ఇందు నిరూపించుచున్నారు

"అజా మేకాం లోహిత శుక్లకృష్ణాం
బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః
అజో హ్యేకో జుషమాణోను శేతే
జహాత్యేనాం భుక్తభోగ్యా మజోన్యః "

ఉత్పత్తిరహిత మనునొకటి లోహిత శుక్ల కృష్ణ వర్ణములు గలిగియుండును ఉత్పత్తి విరహితుడగు నొకడు (బద్ధుడగు జీవాత్మ) దాని ననుసరించుచు, అందే యుండును వే ఱొకడు (ముక్తుడు) దాని భోగముల ననుభవించి విడచును ఇది తనతో సమానములగు రూపములు గల సంతతిని సృజించును

ఈ మంత్రమున ప్రకృతిస్వరూపము ప్రతిపాదింపబడినది అది - 'అజా' అనుటచే, ఒకదానినుండి పుట్టినది కాదు' అని తెలియు చున్నది. కావున, సాంఖ్యమందువలెనే ఇందును బ్రహ్మాత్మకము కాక, స్వతంత్రముగనే ప్రకృతి జగత్కర్త్రియని నిరూపించినట్లు తోచవచ్చును కాని, దాని యర్థ మట్లు కాదని చమసాధికరణము నిరూపించుచున్నది

## 3 సంఖ్యోపసంగ్రహాధికరణము

చమసాధికరణమున సాంఖ్యులు చెప్పినట్లు, ప్రకృతి స్వతంత్రముగ జగత్తును సృష్టింపనేరదని నిరూపించుచు - 'అజా' శబ్దముచే బ్రహ్మాత్మకముగా నుండు ప్రకృతియేగాని, స్వతంత్ర మగు ప్రకృతి నిరూపింపబడదని 'ప్రధానము జగత్కారణ' మను వాదమును

ఖండించిరి మఱల ఈ సంఖ్యోపసంగ్రహాధికరణమునగూడ వేఱొక యుపనిషద్వాక్యమునందలి సంఖ్యానిర్దేశముచే, ప్రధానమే కారణ మని శంకింప, ఖండించుచున్నారు

" యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః
త మేవ మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మామృతోఽమృతమ్ "

'దేనియందు ఐదు పంచజనములును, ఆకాశమును ప్రతిష్ఠితమై యున్నదో, దానిని ఉపాసించువాడు బ్రహ్మము నెఱింగి, అమృతు డగును' అని, బృహదారణ్యకోపనిషత్తునందలి ఒక మంత్రము తెలియజేయుచున్నది

ఇందు అమృతత్వ సాధనముగా చెప్పనది - కారణమగు ప్రధానమును గూర్చియే యని ప్రధాన కారణవాదు లనుటకు అవ కాశము కన్పట్టుచున్నది 'పంచపంచజనములు' - అనుటచే, 'పంచ పంచ' ఐదైదులు అనగా - ఇరువదియైదు తత్త్వములు అని సంఖ్యా గ్రహణముచే స్పష్టముగా తెలియుచున్నదిగదా! 'పంచ జనాః' అనునది - 'పంచానాం జనానాం సమాహారః' అని, సమాహార ద్విగువు సమాహారమున నపుంసకలింగమే యుండవలెను కాని, పుంలింగము వేదము కావున, ఉన్నను తప్పు లేదు కాగా, 'పంచ జనము' అనగా - 'అయిదు వస్తువుల సమూహము' అని యర్థము అట్టి సమూహము లైదు - 'పంచ పంచ జనము' అని ఇచట నిర్దేశింపబడెను.

1 పంచ మహాభూతములు 2 పంచ తన్మాత్రలు 3 పంచ జ్ఞానేంద్రియములు 4 పంచ కర్మేంద్రియములు 5 మిగిలిన మహ దహంకారములు' అని, అయిదేసిగా నుండు అయిదు వర్గములే సాంఖ్య శాస్త్రమున ప్రతిపాదింపబడిన తత్త్వములు ఆ తత్త్వములే 'పంచ పంచ జనములు' కావున, ఇచట ప్రధానమే (ప్రకృతి) జగత్కార

ణముగా నిర్దేశింపబడినది. ఇచట పంచవింశతి (25) తత్త్వములును నిర్దేశింప బడినచో, ఈ మంత్రమున వేఱుగా - 'యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః' అని ఇరువది నాల్గు తత్త్వములలో నొకటి యగు ఆకాశమును, ఇరువదియైదవ తత్త్వమగు ఆత్మను నిర్దే శించుట ఎట్లు పొసగును ?' అని సందేహము కలుగవచ్చును కాని, దాని కిట్లు సమాధానము చెప్పవచ్చును —

ఇరువదినాల్గు తత్త్వములు ఆత్మయందుండుటే గాక, ఆత్మ తనయందు తానే యుండునుకావున, ఈ అతిశయమును సూచించుటకును, భూతములలో కెల్ల మహాతత్త్వమగుటచే, ఆకాశమునందలి ఆ అతిశయమును ప్రత్యేకముగా పేర్కొనిరి కాని, అంతమాత్రముచే పంచ పంచ జనములు ఇరువదియైదు తత్త్వములు కావని చెప్పుట కవకాశము లేదు.

'పంచ పంచ జనాః' అనుచోట, సంఖ్యను గ్రహించినంత మాత్రమున సాంఖ్య తత్త్వములే ప్రతిపాదింపబడినవని నిశ్చయించుటకు వలనుపడదు. ఇచట నిర్దేశింపబడిన ఈ పంచజనములు ఆ యిరువది యైదు తత్త్వములకంటె భిన్నములైనవి. పంచ పంచజనములును, ఆకాశమును వేనియందు ప్రతిష్ఠితమై యున్నవో, దానిని ఉపాసన చేసినచో అమృతత్వ మందునని వీని కన్నిటికి ఆశ్రయమగు బ్రహ్మమే ప్రతిపాదింపబడుచున్నదని, 'బ్రహ్మము' అని - తర్వాత ప్రయోగించుటచే తెలియుచున్నది. ఈ పంచ పంచ జనములును, ఆకాశమును, బ్రహ్మాశ్రయములు, బ్రహ్మాత్మకములు అని ఈ మంత్రము ప్రతిపాదింపబడుచున్నదే కాని, స్వతంత్రములగు పంచవింశతి తత్త్వములను ప్రతిపాదించుచున్నదనుట సమంజసము కాదు. సాంఖ్యశాస్త్ర ప్రసిద్ధములగు ఇఱువదియైదు తత్త్వములనే నిర్దేశించుచో - 'పంచ పంచ జనాః' అని ఇఱువదియైదింటిని నిర్దేశించి

యూరుకొనక, 'యస్మిన్' అని ఆత్మను, ఆకాశమును వేఱుగా నిర్దే
శించుట అర్థరహిత మగును అట్లు నిర్దేశించుటచే, ఇఱువదియైదు
తత్త్వములకంటె భిన్నమగు పరబ్రహ్మము ఇరువదియాఱు _ లేక,
ఇరువదియేడవ తత్త్వము - ఈ తత్త్వము లన్నిటికి ఆధారముగ -
'యస్మిన్ ప్రతిష్ఠితః' దేనియందు ఆధారపడి యున్నదో అని
నిర్దేశించెను

అంతియేగాక, సంఖ్యానిర్దేశమాత్రముచే సాంఖ్య తత్త్వము
లనే ప్రతిపాదించుననుటకును వీలు కాదు 'పంచ పంచ జనాః'
'అయిదేసి వస్తువుల సమూహములు అయిదు' అని ఒక వర్గముగా
చేర్చుటకు తగిన అయిదేసి తత్త్వములు ఇందు లేవు ఒక జాతికి
చెందినవి అయి యున్నచో, వాని నొక సమూహముగా చెప్పవచ్చును
వాక్పాణిపాదపాయూపస్థలు కర్మేంద్రియములు 5, త్వక్చక్షుశ్శ్రోత్ర
జిహ్వాఘ్రాణములు జ్ఞానేంద్రియములు 5, పంచమహాభూతములు_5,
పంచతన్మాత్రలు 5, మిగిలినవి 5 _ అని గదా ఆ తత్త్వములను
వర్గీకరింపబడెను

అట్లు వర్గీకరించుటలో _ ఈ మిగిలిన అయిదింటిని వర్గముగా
చేయుటకు అనుగతమగు ఒక ధర్మము లేదు మహాభూతములలో
ఒకటి యగు ఆకాశము వేఱుగా నిర్దేశింపబడినది కావున, ఇఱువది
యైదు తత్త్వములు ఇందు చెప్పబడిన వనుట పొసగదు ఇక 'పంచ
జనాః' అనునది 'సమాహార సమాసము' అనుటయు తగదు 'సమా
హారమునందు సమూహ ముండవలెగదా! ఒక జాతికి చెందినవి
కానియపుడు అవి సమూహములుగ వర్గీకరింపబడవు కావున,
సమాహార ద్విగువు రానేరదు. అందుచే, ఇది _ 'పంచ చ తే
జనాశ్చ' అని, 'సప్త చ తే ఋషయ శ్చ' అనునట్లు, కర్మధారయ
సమాస మగవలెను. సమాహార ద్విగుచే _ అనినచో, నపుంసకలింగ

మునకు బదులు, పుంలింగములు క్లిష్టముగా సాధింపవలెను అందుచే, 'పంచజనాః' అనునది సమాహారద్విగువు కాదు

'పంచజనములు' అను సంజ్ఞచే తెలియజేయబడు ఆ అయిదు ఏవి ?' అను సందేహము కలుగవచ్చును ఈ పంచజనములు అనునవి ప్రాణాదు లైదింటికి సంజ్ఞ యని తరువాత వచ్చు వాక్యశేషముచే తెలియుచున్నది అవి యింద్రియములే! వాని నిట పరిశీలింతము _

వెనుక చెప్పిన 'యస్మిన్ పంచ పంచజనాః' అను మంత్రమునకు ముందు _

"తం దేవా జ్యోతి రాయు ర్హోపాసతే ఽమృతః"

అని, ఆ బ్రహ్మమును జ్యోతిస్సుగా నిర్దేశించిరి జ్యోతి యనగా _ ఒక వస్తువును ప్రకాశింపజేయునది అట్లు ప్రకాశములగు జ్యోతిస్సులకు ప్రకాశకము బ్రహ్మ మని చెప్పిరి ఆ జ్యోతిస్సులనే పంచ జనములు అని నిర్దేశించి, అవి బ్రహ్మాశ్రయముపై యుండునని _ 'యస్మిన్ పంచ పంచ జనాః' అను మంత్రము నిరూపించెను ప్రకాశములగు జ్యోతిస్సులు అయిదు అనుటచే, 'పంచజనాః' అనునది అయిదు జ్ఞానేంద్రియములనే తెలియజేయుచున్నది అవి ఏవి? అని సందేహము కలుగగా, దాని తర్వాత మంత్రము _

"ప్రాణస్య ప్రాణం ఉత చక్షుష శ్చక్షుః శ్రోత్రస్య శ్రోత్రం అన్న స్యాన్నం మనసో మనో యే విదుః"

అని, పంచజనములను వివరించెను వెనుక జ్యోతిస్సులకు జ్యోతి యని సామాన్యముగా చెప్పినంత, అవి ఇంద్రియములే యని 'పంచ జనాః' అను వాక్యము సూచింప, అవి ఏవియో యీ వాక్యశేషము నిర్ణయించినది కావున, 'పంచజనములు ఇంద్రియములే' యని నిశ్చయింపవలెను కాని, పైన పేర్కొనబడిన అయిదింటిలో _ ప్రాణము,

అన్నము అనునవి ఇంద్రియములు కావుగదా! వీనికి - 'పంచజన ములు' అను సంజ్ఞ ఎట్లు కుదురును? - అని సందేహము కలుగ వచ్చును కాని, మూడు మంత్రములను క్రమముగా పరిశీలించినచో, ముందు జ్యోతిస్సులకు జ్యోతి యని బ్రహ్మమును చెప్పి, ఆ జ్యోతి స్సులు విషయములను ప్రకాశింపజేయు పంచజనము లనబడు ఇంద్రి యములే యని తర్వాత నిర్దేశించి, వానికి బ్రహ్మాశ్రయత్వమును ప్రతి పాదించి, ఆ పంచజనములను అయిదును ఏవియో పేర్కొను చున్నారు కావున, ఈ యైదును వస్తుప్రకాశకములగు ఇంద్రియము లనే తెల్పునవి కావలెను అందు - చక్షుః శ్రోత్ర మనస్సు లను మూడును ఇంద్రియములే కావున, వాని బలముచే అన్నప్రాణము లగునవికూడ ఇంద్రియములనే సూచించుచున్నవని ప్రకరణ బలమున చెప్పక తప్పదు

ప్రాణ మనగా - 'ముఖ్యప్రాణము' అను అర్థము చెప్పినచో, విషయప్రకాశకమగు ఇంద్రియములు - లేక, జ్యోతిస్సుకాదుకనుక, స్పర్శప్రధానమగు త్వగింద్రియమునే ప్రాణశబ్దము తెలుపుచున్నది అట్లే, అన్న శబ్దము పృథివీసంబంధముగల యింద్రియమగు ఘ్రాణమును సూచించును అంతియేకాక, తినుటకు సాధనమైనదికూడ అన్న మన బడునుకావున, అన్న శబ్దముచే రసనేంద్రియము సూచింపబడు చున్నది ఇట్లు చక్షురాది మనఃపర్యంతములగు ఇంద్రియములే పంచజనము లనియు, అవియే బ్రహ్మాశ్రయములు కావున, 'జ్యోతిషాం జ్యోతిః' అనునపుడు - 'జ్యోతిషాం' అనుదానిచే, ఇంద్రియములే నిర్దేశింపబడుచున్నవి కావున, ఈ ఉపనిషన్మంత్రములకు ఒక పారమున - 'అన్నస్యాన్నం' అను పదము లేకపోయినను కల్పించు కొనవలెనని నిశ్చయించిరి

పై విధముగా – 'పంచజనాః' అనునది ఇంద్రియపరమునే తెలియజేయుచున్నదనియు, ఆ పంచజనము లనబడు అయిదును, మహా

భూతములును - బ్రహ్మాధీన సర్వకార్యములు అని, 'యస్మిన్ పంచ పంచజనాః, ఆకాశ శ్చ ప్రతిష్ఠితః' అని నిరూపించిరేగాని, స్వతం త్రములగు సాంఖ్యతత్త్వములు ఇందు ప్రతిపాదింపబడలేదని గ్రహింపవలెను.

## 4 కారణత్వాధికరణము

ఈ యధికరణమునగూడ - 'ప్రధానము (ప్రకృతి) స్వతం త్రముగ జగత్కారణము' అను సాంఖ్యవాదమును ఖండించు చున్నారు

స్వతంత్రముగ ప్రధానము కారణము అనునట్లు కనబడు కొన్ని ఉపనిషద్వాక్యములు ప్రధాన కారణత్వమును నిరూపింప అవకాశము నొసంగుచున్నవి అదియనుగాక, ఉపనిషత్తులలో కారణమును ప్రతి పాదించు వాక్యములలో - ఐకకంఠ్యము కన్పట్టుటలేదు 'స దేవ సౌమ్యే ఇద మగ్ర ఆసీత్' అని తెలుపుచున్నది దానికి విరుద్ధ ముగ - 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' 'అసదేవేదమగ్ర ఆసీత్' అను వాక్యములు సృష్టికి పూర్వము అసత్తే ఉండెనని యనుచున్నవి కావున, బ్రహ్మము కారణమని చెప్పువారికి అది అసత్తు అనుట పొసగదుగదా! కనుక, బ్రహ్మమే కారణమని చెప్పుటకు వీలు కాకున్నది. కాక, ప్రధానమే జగత్తునకు కారణమని చెప్పుటకు అవకా శముకూడ కన్పట్టుచున్నది ఏలనన, 'తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్' ఈ జగత్తు ప్రళయమున అవ్యాకృతమై యుండెను 'త న్నామ రూపాభ్యాం వ్యాక్రియత' అది నామరూపములచే వ్యాక రించెను' అని, అవ్యాకృతమే జగత్కారణమని స్పష్టముగ నిరూపింప బడినది 'అవ్యాకృతము' అనగా - అవ్యక్తమే నామరూపములచే వ్యాకృతము కానిది అవ్యాకృతము - ప్రధానము (ప్రకృతి) కావున, ప్రధానమే జగత్కారణమని స్పష్టమగుచున్నదికదా! వెనుక చెప్పిన

'సత్, అసత్' అను శబ్దములు పరస్పర విరుద్ధములు గావున, బ్రహ్మ మునకు వాచకములుగ చెప్పుట కుదురదు కాన, ప్రధానమును ప్రతి పాదించుట కుదురును ప్రధానము స్వరూపముచే నిత్యము అనగా - ఎల్లప్పుడును ఉండును అందుచే, అదియే పరిణామమును చెంది, నామరూపము లందును కావున, 'అసత్'

ఇచట ఒక సందేహము కలుగును ఈ ప్రకరణమునందే తరు వాత - 'పశ్యం శ్చక్షుః శృణ్వాన్ శ్రోత్రం' అని కారణ మగు అవ్యా కృతము సృష్టించి, దానిలో ప్రవేశించి, చూచుచు చక్షుస్సు, వినుచు శ్రోత్రము అని వ్యవహరింపబడుచున్నవి' అని యనుచున్నారు అచేతనమగు అవ్యక్తము కారణమైనచో, ఈ చేతన లక్షణము లెట్లు పొసగును ? ప్రకరణాంతరములందు సృష్టిప్రకరణములగూడ జగ త్కారణము ఈక్షణక్రియ కల్గియున్నట్లే వర్ణింపబడుచున్నది చేతన లక్షణమగు ఈక్షణము (చూచుట) అవ్యక్తమునకు పొసగదు అంతే కాక, ఆత్మశబ్దముకూడ కారణతత్త్వమున ప్రయోగింపబడుచున్నది అది చైతన్యము కలదానినే తెలుపునుగదా ! కావున, అవ్యక్తము - లేక, ప్రధానము జగత్కారణ మనుట ఎట్లు పొసగును ? అని సంశయము

కాని, ఈ సంశయమును ఇట్లు నివారింపవచ్చును అవ్యా కృతమే జగత్కారణ మని పైన పేర్కొనిన వాక్యములచే స్పష్టముగ నిశ్చయింప వీలగుచున్నది కావున, ఈక్షణమును దానికే కలిగెనని సమన్వయింపవలెను బ్రహ్మ మను శబ్దము అచేతనమున కెట్లు సరిపడు నని శంకింపనక్కఱలేదు 'బ్రహ్మము' అను పదము బృహత్త్వము - (పెద్దది అగుట) కలది' యను అర్థమున వాడబడుచున్నది అచేతన మగు ప్రధానముకూడ బృహత్త్వముకలదియే కనుక, బ్రహ్మ మని వ్యవ హరింపబడవచ్చును ఇక ఆత్మ యను శబ్దము కూడ - అంతటను వ్యాపించునది అను అర్థమున ప్రధానము తెలియజేయుటలో

అభ్యంతరము లేదు కావున, సర్వకారణ వాక్యములును ప్రధానము కారణ మనువపుడే చక్కగ సమన్వయించునుకావున, స్మృతి న్యాయ ప్రసిద్ధ మగు దీనినే జగత్కారణముగ నిర్ధరింపవలెను' అని పూర్వ పక్షము రాగా, దానిని ఈ యధికరణమున ఖండించుచున్నారు

'జన్మా ద్యస్య యతః' మన్నగు సూత్రములలో - సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, సర్వేశ్వరుడు నగు ఏ పరబ్రహ్మము జగత్కారణ మని నిర్దేశింపబడెనో, ఆ బ్రహ్మమునుండియే ఆకాశాదులుకూడ సంభవించునని, 'తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః' ఇత్యాదులలో - 'తస్మాత్' అనుచోటి తచ్ఛబ్దము తెలుపుచున్నది అనగా - మహాభూతములగు ఆకాశాదులకుగూడ కారణము ప్రధానము కాదు- 'ఆ ఆత్మయే' అని స్పష్టముగ తెలుపుచున్నది అచేతనమునకు కారణత్వము నిశ్చయమైనదికావున, తదనుగుణముగ ఈక్షణ మనగా - 'సృష్టికి అభిముఖముగ నుండుట' అను అర్థమును కల్పించవలెనని ప్రధాన కారణవాదుల ఆశయము కాని, సృష్టిప్రకరణము లను చూచినచో - ముందు ఈక్షణమును చెప్పి, తర్వాతనే సృష్టిని నిరూపించుచున్నారు 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చితా' అని - సత్యము, జ్ఞానము, అపరిచ్ఛిన్నత్వము, విపశ్చిత్వము' అను చేతన ధర్మములు గల బ్రహ్మమును ప్రతిపాదించి, 'తస్మా ద్వా ఏతస్మాత్' అని అట్టి ఆత్మనుండియే ఆకాశము పుట్టినది అని చెప్పుటచే, వెనుక చెప్పిన చేతన గుణములు కలదియే కారణ వస్తువని తెలియుచున్నది ముందు ఈక్షణమును చెప్పి, తరువాత దానికి కారణత్వమును చెప్పునపుడు -

ఈ చూచుట అను శక్తిగల చేతన మనుటకు వీలుపడదు ముందుగా కారణము చెప్పి, తర్వాత అది చూచినది అనుచో - ఆ చూచుట కారణమున కనుగుణముగ కల్పింపవచ్చును కాని, ముందుగనే చెప్పబడిన ఈక్షణమును ఈక్షణము కాదు - అనుట యుక్తము కాదు 'తదైక్షత బహుస్యాం' అని ముందు సర్వజ్ఞ మగు బ్రహ్మ మును నిర్దేశించి, 'తత్తేజోఽసృజత' అది తేజస్సును సృష్టించెను' అని ఆ సర్వజ్ఞ మగు బ్రహ్మమునే పరామర్శించుచున్నాడు కావున, జగత్తునకు చేతనమగు బ్రహ్మమే కారణమని నిశ్చయింపవలెను

అయినచో - 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' అని, అసత్తుగా నిర్దేశించుట ఎట్లు పొసగునని శంకింపవచ్చును ఆ శంకా నివార ణార్థము — ఆ శ్లోకమునకు పూర్వాపరములను పరామర్శింపవలెను

తైత్తిరీయమున - 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' 'సోఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహ - బ్రహ్మణా విపశ్చితా' అని బ్రహ్మ సత్య జ్ఞానగుణములు కలదియని విపశ్చిత్తు (సర్వమును చూచునది) అని చెప్పి, అన్నమయ - ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ పురుషులను నిరూపించి, 'తస్మాద్వా ఏతస్మాత్ విజ్ఞానమయాత్ అన్యోఽంతర ఆత్మాఽఽనంతమయః' అని, ఆనందమును, పురుషుని నిరూ పించెను ఆ ఆనందమయుడు చేయు సృష్టిక్రమమును నిరూపించును 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి' 'ఇదం సర్వ మసృజత్' మొదలగు వాక్యములచే, ఆ ఆనందమయుబ్రహ్మమే సత్యసంకల్పము కలిగి, సర్వమును సృజించి, దానియందు అనుప్రవేశించి, సర్వాత్మ భూతమైయున్నదని చెప్పెను ఈ యర్థమునకు సమర్థకముగ ఒక శ్లోకమును చెప్పుచు - 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' అని పేర్కొనెను

ఇచట 'అసద్వా' అను దానిచే, వెనుక చెప్పబడిన సర్వజ్ఞము, విప శ్చిత్తు, ఆనందమయమునగు బ్రహ్మమునే అసత్తు అని చెప్పినట్లు గ్రహింపవలెను కాని, అచేతనమగు ప్రధానమును పేర్కొనుట తగదుగదా! ఏలనన, ఆనందమయుడగు పురుషునే ఈ ప్రకరణ మంతయు నిరూపించుచున్నది మఱియు - ఈ 'అసద్వా' అను మంత్రమునకు పిమ్మట, 'భీషాస్మా ద్వాతః పవతే' అను మంత్రము లచే, ఆనందమయమగు బ్రహ్మము సర్వప్రకాశము 'నిరతిశయానంద రూపము' అని నిరూపించుచున్నది.



# భగవద్గీత – రామానుజ దర్శనము

'విశిష్టాద్వైత వేదాంత మహోదధి'

## శ్రీమాన్ తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు

*భక్తినివేదన పత్రికా సంపాదకులు*

—✿—

### అవతారిక

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నన్దనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా, దుగ్ధం గీతామృతం మహత్"

అను ఈ సుప్రసిద్ధ శ్లోకము భగవద్గీత ఉపనిషత్సారమని తెలుపుచున్నది మఱియు – ప్రతి అధ్యాయము చివఱను – 'భగవద్గీతాసు ఉపనిషత్సు' అనియు, 'బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే' అనియు అనుసంధింతుము వీనిచే, భగవద్గీత ఉపనిషత్సార మనుట నిర్వివాదము ఇట్లే, రామానుజ దర్శనము కూడ – 'త దిహాఖిల శ్రుతి మతం రామానుజీయం మతమ్' అను ఆర్యోక్తి ననుసరించి ఉపనిషదమే కావున, రామానుజ సంప్రదాయమునకు, భగవద్గీతకు పోలిక నొకింత గమనింతము

భగవద్రామానుజులకు భగవద్గీతయందు అపారమైన ఆదరము కలదు వారు దీనికి భాష్యమును రచించిరి బ్రహ్మసూత్రభాష్యములో – సూత్రములందు దున్న 'స్మృతి' శబ్దమునకు భగవద్గీతనే ఉదహరించుచు వచ్చిరి కావున, వీరి సిద్ధాంత మంతయు భగవద్గీతను పరిపూర్ణముగ అనువర్తించుచున్నది

### రామానుజ దర్శన విశేషములు

రామానుజ దర్శనమునందలి యీ క్రింది ప్రధానార్థములు భగవద్గీతలోని సుస్పష్టమగు ప్రమాణములతో ఇట సమర్థింపబడు చున్నవి –

1 ఈ దర్శనమునకు చిదచిదీశ్వరు లని మూడు తత్త్వములు ప్రధానములు.

2 శ్రీమన్నారాయణుడే పరతత్త్వము

3 ఆతడు సర్వాత్మకుడు, చేతనాచేతనము లన్ని యవస్థలలోను ఆతనికి శరీరభూతములు.

4 అతడు సకల కల్యాణ గుణాకరుడుగనే ఉపాసింపదగినవాడు

5 జగత్తుయొక్క సృష్టి, స్థితి, సంహార, ప్రవృత్తి, నివృత్తులు మొదలగున వన్నియు ఆతని యధీనములు

6 భగవ దర్చారాధనము నిత్యము కర్తవ్యము

7 భగవ న్నివేదిత పదార్థమే స్వీకార యోగ్యము

8 మనము చేయు సమస్త శాస్త్ర విహిత వర్ణాశ్రమ ధర్మములను, భగవత్ప్రీతి కైంకర్యబుద్ధితో - ఫలసంగకర్తృత్వములను వీడి చేయుచుండవలెను

9. దేవతాంతరములయందు పరత్వబుద్ధి పరిత్యాజ్యము.

10 జీవులకు ఈశ్వరునితోను, పరస్పరమును భేదము వాస్తవము.

11 జీవులు అణుపరిమాణము కలవారై, నిత్యులై యుందురు

12. ఈ జీవులకు - శేషత్వ, పారతంత్ర్యములు ప్రధాన లక్షణములు.

13 చాతుర్వర్ణ్య వ్యవస్థ సనాతనము.

14. వర్ణాశ్రమధర్మములు అవశ్యము ఆచరణీయములు.

15. భక్తిప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రియఃపతియే మోక్షోపాయము.

16 అర్చిరాదిమార్గమున నేగి, స్వస్వరూపమును బడసి, భగవత్సాయుజ్యము నందుటయే మోక్షము.

17 అవతార రహస్య మొక మోక్షోపాయము

18. సదాచార్యుల సమాశ్రయింపవలెను.

19 సదాచారమే ప్రబల ప్రమాణము

20 సదాచార్యప్రాప్తికి మదత్రయ పరిత్యాగము ముఖ్యావశ్యకము

21. ఆహార నియమము అనుల్లంఘనీయము

22 గీతాసారమే సారతమ చరమ మంత్రము

## తత్త్వత్రయము

శ్రీరామానుజ దర్శనమున, చిదచిదీశ్వర తత్త్వములు మూడు ముఖ్యములు ఈ మూడు తత్త్వములను భగవద్గీతలోని త్రయోదశ, చతుర్దశ, పంచదశాధ్యాయములు మూడును క్రమముగా వివరించు చున్నవి

పదమూడవ అధ్యాయమునకు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మని పేరు గీతాశాస్త్ర మంతయు మూడు షట్కములుగా విభాగింప బడెను

మొదటి షట్కము - ద్వికము, చతుష్కము అని రెండు భాగములు ద్వికమనగా - రెండధ్యాయముల సముదాయము చతుష్క మనగా - నాలుగధ్యాయముల సముదాయము మొదటి ద్వికమున - శాస్త్రసంబంధమగు ఉపోద్ఘాతము శాస్త్రావతరణమునకు కారణమైన శోకమును పోగొట్టునట్టి ఆత్మసాక్షాత్కార మను రెండు

విషయములును, చతుష్కమున ఆత్మదర్శన వివరణములు చెప్ప బడినవి.

మధ్యమ షట్కము రెండు త్రికములుగా విభజింపబడినవి. త్రిక మనగా - మూ డధ్యాయముల సముదాయము మొదటి త్రిక మున సాధనము, అధికారి, ఫలము మొదలగు భేదములుగల భక్తి యోగ స్వరూపము, రెండవ త్రికమున భక్తి జనించుటకు, వృద్ధి పొందుటకు సాధనములును తెలుపబడుచున్నవి

తృతీయ షట్కముకూడ త్రిక ద్వయముగ విభజింపబడినవి. ఇందు మొదటి త్రికమున - చిత్, అచిత్, ఈశ్వరుడు అనెడు మూడు తత్త్వములను గూర్చి క్రమముగా మూ డధ్యాయముల చేతను తెలుపబడినది మిగిలిన త్రికము కర్తవ్య వివేచనపరము.

ఈ విభాగమునుబట్టి, పదమూడు - పదునాలుగు - పదునైదు అధ్యాయములు క్రమముగ, చిత్ - అచిత్ - ఈశ్వరుడు అనెడు మూడు తత్త్వములను గూర్చియు విస్తారముగ బోధించుచున్నవి

మఱియు - సప్తమాధ్యాయారంభమున భగవంతుడు నాలు గైదు శ్లోకములలో - అచేతనమును అపరప్రకృతి యనియు, చేతన మును పరప్రకృతియనియు చెప్పి, ఈ రెండు ప్రకృతులును - 'మే మే' యని, 'నా యధీనమైన' వని చెప్పెను దీనిని బట్టియు తత్త్వ త్రయము సిద్ధించుచున్నది

"మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్
సద్భవ స్సర్వ భూతానాం తతో భవతి భారత!" (14-8)

సకల జగత్తులకు కారణమైన మూలప్రకృతి - నా యధీన మైనది దానియందు చేతన పుంజరూపమగు గర్భమును నేనే యుంచు

చున్నాను అనగా - భోగమునకు సాధనమైన అచేతన ప్రకృతితో, భోక్తృవర్గపుంజమగు చేతనప్రకృతిని కూర్చుచున్నాను నా సంకల్పముచే నేర్పడిన ఈ సంయోగమువలన, బ్రహ్మాది స్తంభపర్యంత సకల భూతముల పుట్టుక జరుగుచున్నది ''

ఈ భగవద్వాక్యమునుబట్టి చేతనము, అచేతనము, ఈశ్వరుడు అని మూడు తత్త్వములు వేఱు వేఱుగ నున్నట్లు ఋజువగుచున్నది ఈ యర్థమునే ఛాందోగ్యోపనిషత్తు - 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' అనెడు శ్రుతివాక్యమునందలి 'సత్య' శబ్దముయొక్క నిర్వచన చేసి సమర్థించుచున్నది

"తస్య హ వా ఏతస్య బ్రహ్మణో నామ సత్య మితి
తాని హ వా ఏతాని త్రీణ్యక్షరాణి సతీయ మితి
తద్యత్స త్త దమృత మథయ త్తి తన్మ ర్త్యమ్ అథయద్యం
తేనోభే యచ్ఛతి యదనేనోభే యచ్ఛతి తస్మాద్యమ
హ్మహ రహర్వా ఏవం వి త్స్వర్గం లోక మేతి "
— (ఛాందోగ్యోపనిషత్తు 8-3-4,5 )

బ్రహ్మకు సత్యమని పేరు ఆ శబ్దము - 'సత్ + తి + యం' అను మూడు పదముల సముదాయమగు సమస్త పదము అందలి 'సత్' అనగా — నశించని ఆత్మ 'తి' అనగా - క్షణక్షణమున పరివర్తించు ప్రకృతి 'యం' అనగా — ఈ రెంటిని జోడించు పరమాత్మ ఇట్లెఱింగి ఉపాసించువాడు ముక్తు డగును' అని దీని తాత్పర్యము ఇదియేగాక —

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి '' (భ గీ 9 - 10)

అను గీతా వాక్యము - చిత్, అచిత్ ప్రకృతులను రెండింటిని అనాదులుగ చెప్పుచున్నది వీనికంటె వేరగు ఈశ్వర తత్త్వ మనాది యనుటతో వివాదమే లేదుగదా ! కావున, మూడు తత్త్వములును

నిత్యముగా అనాదినుండియు ఉన్నవని భగవద్గీతా సిద్ధాంతమును భగవద్రామానుజు లంగీకరించిరి మఱియు —

"మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్
హేతునానేన కౌన్తేయ! జగద్ధి పరివర్తతే" (భ గీ 9-10)

నా యధీనమున నున్న ప్రకృతి, నిత్యసంకల్పుడనగు నేను జీవుల కర్మానుగుణముగ సంకల్పించుటచే, చరాచరాత్మకమగు ప్రపంచమును సృష్టించుచున్నది"

దీనివలనను తత్త్వత్రయ యాథాత్మ్యము సిద్ధించుచున్నది. ఇట్లెన్నియో గీతాప్రమాణముల నవలంబించి, భగవద్రామానుజులు పరమాత్మాధీనములై యుండు తత్త్వముల నంగీకరించిరి.

## శ్రీమన్నారాయణుడే పరతత్త్వము

ఈ యంశమునుగూర్చి, పరమాచార్యులగు యామునాచార్యులవారు గీతచే ప్రతిపాదింపఁబడిన ప్రధాన తత్త్వమును - ఈ క్రింది శ్లోకముతో స్పష్టపరచిరి —

"స్వధర్మ జ్ఞాన వైరాగ్య సాధ్యభక్త్యైక గోచరః
నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః."

తనకు శాస్త్రముచే విధింపబడిన వర్ణాశ్రమధర్మములను లెస్సగా ననుష్ఠించుటవలన వైరాగ్యము సిద్ధించును దానిచే భక్తి వృద్ధి పొందును అట్టి భక్తికి మాత్రమే గోచరించు నారాయణుడే భగవద్గీతలో చెప్పబడుచున్నాడు

గీత నుపదేశించు శ్రీకృష్ణుడు భగవంతుడను విషయము నిర్వివాదము కావుననే గీతలో అంతటను - 'భగవా నువాచ' అని వినబడుచున్నది అట్టి భగవంతుడు —

"మత్తః పరతరం నాస్తి కించి ద స్తి ధనంజయ!" – (7 - 7)

అర్జునా! నాకంటె గొప్పదియగు తత్త్వ మొక్కటియు లేదు సుమా!' అని సెలవిచ్చెను ఆ యుపదేశము నాదరించి, విశ్వసించిన అర్జునుడును –

"న త్వ త్సమో౽ స్త్య భ్యధికః కుతో౽న్యో
లోకత్రయే౽ ప్యప్రతిమ ప్రభావ!" – (11 - 43)

స్వామీ! ప్రపంచమునం దెచ్చటను నీతో సమానుడే లేడే. ఇక నీకంటె గొప్పవా డెట్లుండునని స్తుతించెను

"త్వ మక్షరం పరమం వేదితవ్యం, త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా, సనాతన స్త్వం పురుషో మతో మే"
(11-18)

ఉపనిషత్తులలో తెలిసికొనదగినదిగా నిర్ణయింపబడిన అక్షర పదార్థము లన్నిటిలోను గొప్పవాడ వనియు, సర్వప్రపంచమునకు ఆధారభూతుడ వనియు మొదలుగా జెప్పి, 'సనాతన స్త్వమ్' అనుటచే ఉపనిషత్తులలో –

"వేదాహమేదం పురుషం మహాన్తం" "పరాత్పరం పురుష ముపైతి దివ్యం"

ఇత్యాదులతో చెప్పబడిన సనాతన పురుషుడవు నీవే యని నా యభిప్రాయ' మని చెప్పుటచేతను అర్జునుడు దర్శించిన విశ్వరూపములో –

"బ్రహ్మాణ మీశం కమలాసనస్థం" (11-15)

అనుటచే, అండాధిపతియగు చతుర్ముఖ బ్రహ్మయు, ఆ బ్రహ్మ యొక్క ఆజ్ఞానువర్తియైయుండు రుద్రుడును, విశ్వరూపుని శరీరైక దేశమున నిమిడి మెఱయుచుండునట్లు వర్ణించుటచేతను –

"అహ మాదిర్హి దేవానాం" (11-2)

బ్రహ్మరుద్రేంద్రాది దేవత లందఱకు నేనే కారణమైనవాడనని చెప్పటచేతను –

"అహం సర్వస్య ప్రభవః" (10-8)

విచిత్ర చిదచి త్ప్రపంచమునకు తానే కారణభూతుడనని చెప్పట చేతను –

"పరంబ్రహ్మ పర-ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్" (10-12)

పరత్వము నీవే యని అర్జునుడు భగవంతుని ప్రశంసించి, అందుకు సాక్ష్యముగా సకల ఋషులను, దేవర్షి యగు నారదుని, అసితుని, దేవలుని, వ్యాసుని జూపుటచేతను, శ్రీమన్నారాయణుడే పరతత్త్వ మని నిర్ధారిత మగుచున్నది దీనికి వ్యాఖ్యానమున శ్రీరామానుజులు నారాయణానువాకములో ప్రత్యేకించి చెప్పబడిన నారాయణ పరత్వము నంతను ఇచ్చట సమన్వయపఱచుటచే, నారాయణుని పరత్వము విశద మగుచున్నది

కారణవస్తువే ధ్యేయ మనియు, అదియే మోక్షప్రద మనియు శ్రుతులు తెలుపుటచే, పెక్కు స్థలములలో భగవానుడు తానే సమస్తమునకు కారణ మనియు, తననే ధ్యానింపు మనియు, తానే మోక్షము నిత్తు ననియు శపథపూర్వకముగా సెల విచ్చుటచే, నారాయణుని పరతత్త్వము స్పష్ట మగుచున్నది ఇట్లు గీతలో నిర్దేశింప బడిన నారాయణ పరతత్త్వమునే శ్రీరామానుజులు తమ దర్శనమున స్వీకరించిరి

ఉపనిషత్తులలోని తైత్తిరీయాంతర్గతమగు భృగువల్లిలో – భృగువు తన తండ్రి యగు వరుణుని, పరంబ్రహ్మతత్త్వమును తెలుపు మని ప్రశ్నింపగా, ఆతడు –

"యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి
యత్ప్రయం త్యభిసంవిశన్తి తద్బ్రహ్మ"
- (తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి)

ఎవ్వనినుండి సమస్త భూతములును పుట్టుచున్నవో, ఎవ్వనిచే పోషింపబడుచున్నవో, ఎవ్వనియందు ప్రళయమున లీన మగుచున్నవో, మోక్షదశలో ఎవ్వనియందు విశ్రమించుచున్నవో, అనగా- సృష్టి, స్థితి, సంహార, మోక్షప్రదానములను చేయువాడే బ్రహ్మ అట్టి పరబ్రహ్మయే పరతత్త్వము

భగవాను డట్టి లక్షణోపేతుడు గనుకనే అర్జునుడును _

"పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్" (10-12)

అని ప్రస్తుతించెను భగవాను డీ విషయముల నెట్లు భగవద్గీతలో పదే పదే ఉపదేశించెనో చూడుడు _

"మమయోని ర్మహద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్" (14 3)

"సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సమ్భవన్తి యాః
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజ ప్రదః పితా" (14 4)

దేవ, గన్ధర్వ, యక్ష, రాక్షస, మనుష్య, మృగ, పక్షి, సరీసృపాది జన్మలకు మూలప్రకృతి కారణము ఆ ప్రకృతి వికారము లగు శరీరములలో _ వారి కర్మానుగుణముగా చేతనవర్గములను కూర్చువాడను నేనే

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా" (7-6)

పరాపరప్రకృతులు నా మూలకములేగాన, అవి నావియే వానివలన నుదయించిన జగత్తు నంతకును నేనే కారణభూతుడను నేనే సంహారకుడను నేనే శేషిని

"పితాహ మస్య జగతః" (9-17)

"ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్" (9-8)

నా యధీనముననున్న ప్రకృతిని - 'భూమి రాపోఽనలో వాయుః' అనునట్లు, ఎనిమిది విధములుగ పరిణమింపజేసి, దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాత్మకమగు, నాలుగు విధములగు భూతజాతమును ప్రకృతికి పరతంత్రముగ నొనరించి, ఆ యా నియమములలో సృష్టించుచున్నాను

ఎనిమిదవ అధ్యాయమున, బ్రహ్మలోక పర్యంతము గల లోకములును, ఆ లోకస్థులును, పరమపురుషుని సంకల్పముచే బుట్టుచు, గిట్టుచునుండు కాలవ్యవస్థను తెలుపు 'సహస్రయుగ పర్యన్తమ్' అని ప్రారంభించి, 'ప్రభవ త్యహరాగమే' అను 17, 18, 19 శ్లోకములలోని సారమును శ్రీభాష్యకారులు -

'నా కంటెను ఇతరమగు సమస్తము నాచే నిర్ణయింపబడిన ఆ యా కాలములలో నానుండి ఉద్భవించి, నాయందే లయ మగు చుండుటచే ' ఇత్యాది వాక్యములచే వ్యక్తము గావించిరి విశ్వ రూప సందర్శనాధ్యాయమున -

"కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః" (11-32)

(కల సంఖ్యానే - లెక్కించుట) లోకుల జీవితావసానమును లెక్కించి సంహరించువాడను అందులకే యిపు డుద్యోగించితి' నని చెప్పుటచే, సంహారకర్త తానే యని స్పష్టపరచెను విశ్వరూపమున సర్వాధార త్వమును జూపెను.

"పితామహస్య జగతో, మాతా ధాతా పితామహః" (9-17)

ఈ లోకమునకు తల్లి నేను, తండ్రి నేను, పితామహుడను నేను, సృష్టికర్త నేను' అనియు –

"గామావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా" (15-13)

భూమిలో ప్రవేశించియుండి, అప్రతిహతమగు నా సామర్థ్యముచే, సమస్త భూతములను ధరించుచున్నా' ననియు –

"మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః" (9-4)

"భూతభృన్న చ భూతస్థః మమాత్మా భూతభావనః" (9-5)

చేతనాచేతనాత్మకమైన జగత్తునంతను పైకి కాన్పించకయే అంతర్యామిగానుండి ధరించుచు, నియమించుచు శేషినై యుందును నేన ట్లుండుటచేతనే భూతములు నిలువగల్గుచున్నవి నా స్థితికి వాని యుపకార మేమియు లేదు నా సంకల్పముచేతనే అవి యన్నియు పుట్టింపబడుచు, ధరింపబడుచు, నియమింపబడుచున్నవి

"సర్వభూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్" (9-7)

స్థావర జంగమాత్మకమైన సమస్త భూతములును – చతుర్యుగావసాన సమయమున, నా సంకల్పముచేతనే నా ప్రకృతియందు లయ మగుచున్నవి తిరిగి కల్పారంభమున నేనే నా సంకల్పముచే అన్నిటిని సృష్టించుచున్నాను' ఇత్యాదులచే సృష్టి స్థితి సంహార కర్త తానే యని భగవానుడు నిస్సందేహముగా నుపదేశించెను

"మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే." (7-15)

నన్ను శరణు పొందినవారు – సత్వ రజ స్తమో గుణాత్మకమైన ప్రకృతిని సర్వదా వీడుచున్నా' రనియు –

"మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువ న్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః (8 15)

నన్ను పొందినవారు తిరిగి దుఃఖాకరమగు అస్థిర సంసార వాగురమున బడరు నన్నుపాసించువారు పరమపురుషార్థమగు నా సాయుజ్యమును పొందుదురు'

"ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావ ర్తి నోఽర్జున !
మా ముపేత్య తు కౌ న్తేయ ! పునర్జన్మ న విద్యతే " (8-16)

బ్రహ్మలోకమువఱకును లోకము లన్నియు భోగస్థానములు మాత్రమే వారు వా రా లోకముల ననుభవించుటకై చేసిన పుణ్యము క్షీణించినంతనే, తిరిగి జన్మింతురు నన్ను పొందిన వారి కిక వినాశమే లేదు కావున, వారికి పునర్జన్మ లేదు'

"యత్కరోషి యదశ్నాసి - తత్కురుష్వ మదర్పణమ్ " (9-27)

నీవు చేయునట్టి లౌకిక వైదిక కర్మల నన్నిటికిని కర్తను, భోక్తను, ఆరాధ్యుడను నేనే యను నమ్మకముతో చేయుము'

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః " (18-66)

ఇతర మోక్షోపాయముల నన్నిటిని విడచి, నన్నే మోక్షోపాయమని నమ్మియుండినవారిని నన్ను పొందుట కాటంకములుగా నుండు సకల పాపములనుండియు విడిపించి, మోక్షమును ప్రసాదింతు' నని భగవానుడు సెలవిచ్చియుండుటచే, మోక్షసాధన మాతడే యని తెలియుటవలన, ఇట్లు బ్రహ్మలక్షణము లన్నియు సమగ్రముగ ఆతని యందే సమన్వయ మగుటచే, ఆతడే పరతత్త్వ మగుట నిశ్చయము

## భగవంతుడు సకలకల్యాణ గుణాకరుడు

భగవద్గీతలో భగవంతుడు – తాను సృష్టిస్థితి లయకర్తననియు, సర్వరక్షకుడననియు సెలవిచ్చెను గదా! ఇట్టి కార్యములను నిర్వహించుటకు – సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, సత్సంకల్పత్వ, వాత్సల్యాది కల్యాణ గుణము లుండవలెను

"ఉపాదానగోచరా పరోక్షజ్ఞానచికీర్షాకృతిమత్వం కర్తృత్వమ్

సకల కార్యములకు ఉపాదానమగు పదార్థసాక్షాత్కారము, ఆ కార్యములను చేయవలయుననెడి సంకల్పము, ఆపైన – తద్విషయక కృతియు కలవాడే కర్త కావలెనని శాస్త్రజ్ఞులు కర్తృత్వమునకు లక్షణమును చెప్పిరి ఇందులకై – సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, సత్యసంకల్పత్వము కావలెను

"స దేవ సోమ్యే ఇద మగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయం
ఆత్మా వా ఇద మగ్ర ఆసీత్"

ఇత్యాది ప్రమాణములచే, సృష్టికి పూర్వము పరమాత్మ ఒక్కడే తప్ప, తదితర సాధనము లేవియు లేవని తెలియుచున్నది అట్లైతరి, ఇంతటి సృష్టిని ఎట్లు చేయగలిగెను? దానికి సత్యసంకల్ప మొక్కటియేగదా సాధనము! రక్షణ మనగా – అనిష్టములను పోగొట్టి, ఇష్టములను ఈయవలెనన్న, సర్వజ్ఞత్వ – సర్వశక్తిత్వ – వాత్సల్యాదు లుండవలెగదా! మఱియు –

"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః (7-17)

అనుచో – తనను ప్రేమించు భక్తునకు తనయం దెంత ప్రేమ కలదో, దానిని 'అత్యర్థమ్' అని సెలవిచ్చెను అత్యర్థ మనగా –

"అర్థోఽభిధేయ రైవ స్తు ప్రయోజన నివృత్తిషు"

అను అమరకోశానుసారము - 'అతిక్రాంతాభిధేయా' మని యర్థము అనఁగా, నా భక్తునకు నాయందుగల ప్రేమను - సర్వజ్ఞుడను, సర్వశక్తియుతుడ నగు నేనే చెప్పజాల' నని యర్థము 'స చ మమ ప్రియః' అతడును నాకు అంతయే ప్రియు' డని సెలవిచ్చెను ఈ ప్రీతియు ఒక కల్యాణగుణముకదా! మఱియు -

"చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున!" (7-16)

సుకృతవంతులగువారు నన్ను నాల్గు విధములుగా భజించుచున్నా' రని సెలవిచ్చిన భగవంతుడు - తన భక్తుల విషయమై తన యాదరమును తెలుపుచు -

"ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (7-18)

తననుండి పురుషార్థములను ప్రార్థించి పొందువారు ఉదారులని భగవంతుడు సెలవిచ్చెను తీసికొనువారు ఉదారు లెట్లగుదు రనగా, వ్యాఖ్యానకారులు -

"మత్తో యత్కించన గృహ్ణన్తి, తే హి మమ సర్వస్వదాయినః
ఆశ్రిత సకల ఫలప్రదత్వం హి మమ సర్వస్వమ్"

అని వ్యాఖ్యానించిరి అనగా - 'నానుండి ఏ పురుషార్థము నర్థించి గొనినను, వారు నాకు సర్వస్వమును ఇచ్చువారనియే నేను భావింతును ఆశ్రితులు కోరిన ఫలము నొసంగుటయే నా సర్వస్వము' అని సెలవిచ్చెను భగవంతుని ఔదార్యము ఎంత యుట్టిపడుచున్నదో చూడుడు. ఇది కల్యాణగుణము కాదా!

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (9-26)

నా భక్తులు నాకు సమర్పించిన ఆకునో, పువ్వునో, పండునో, నీటినో నే నా భక్తినే ప్రధానముగా గ్రహించి భుజింతు'నని భగవంతుడు సెలవిచ్చెను ఈ శ్లోకమునందలి 'ప్రయతాత్మన' అను పదము - సమర్పించువాని యోగ్యతను తెలుపుచున్నది (తత్ప్రదానైక ప్రయోజనరూప పరిశుద్ధయుక్త మనసః - అనగా, ఆ పత్ర పుష్ప ఫలాదుల నొసంగుటలో ప్రయోజనాంతరముల నపేక్షింపక సమర్పించుటయే ప్రధాన ప్రయోజనముగ సమర్పించుట.)

అ ట్లిచ్చినదానిని 'అశ్నామి' యనుట ముఖ్య విశేషము దీనికి భాష్యకారులు -

**"అహం సర్వేశ్వరో నిఖిల జగదుదయ విభవ లయలీలో ఽవాప్త సమస్త కామ స్సత్యసంకల్పో ఽనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణ గణ స్స్వాభావికానవధికాతిశయానన్ద స్స్వానుభవే వర్తమానోఽపి మనోరథపథ దూరవర్తి ప్రియం ప్రాప్యేవాశ్నామి"**

ఈ పత్రాది సామాన్య ద్రవ్యములను పరిగ్రహించుటకు విరుద్ధములగు ప్రకారము లన్నియు ఇచ్చటి విశేషములచే తెలుపబడుచున్నవి.

సర్వేశ్వరః - ఇంద్రాదులు తమ శక్తిని వృద్ధిపరచుటకొనుకై హవిరాదులను సంగ్రహింతురు నేనే సర్వేశ్వరుడను అన్నిటిని అనాది కాలమునుండియు నియమించు శక్తిమంతుడను అత డిచ్చు దానివలన నాకు లభించు అతిశయ మేమియు లేదు.

నిఖిల జగదుదయ లయ లీలః - నా లీలోపకరణములలో చేరని పత్రాదుల నిచ్చుటలేదే! వానిని నా లీలోపకరణములుగా నేనే సృష్టించుకొంటిని

అవాప్త సమస్త కామః - నాకు లేనిదాని నిచ్చుచున్నాడా! నాకు లేనిదే లేదే?

సత్యసంకల్పః - నేను సంపాదించుకొనలేనిదాని నిచ్చుచున్నాడా? నేను నా సంకల్పముచే అన్నిటిని సృష్టించుకొనగలనే?

అశ్నామి - నీటినికూడ తిందువా?' యని ప్రశ్నింపగా 'ఇచ్చువాడు తెలివితో సమర్పించిన, నేనును తెలివితో తినదగు వానిని తినియు, త్రాగదగినవానిని త్రాగియు ఉపయోగించుకొందును అతడు తన యెడ తెఱుంగని భక్తితో సమర్పించునుగాన, అట్టి పదార్థములను నేనును ఒడలెఱుంగక, తినవలసినవానిని త్రాగుదును, త్రాగవలసినవానిని తినెదను' అను భావమునే సూచించెను ఇదియేకదా స్వారాధ్యత్వము ఇది యొక కల్యాణగుణము కాదా!

"అపిచేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మన్తవ్యః సమ్య గ్వ్యవసితో హి సః" (9-30)

ఆ యా వర్ణములకును, ఆశ్రమములకును నేను విధించిన ధర్మములను విడచి, కూడదని చెప్పిన ధర్మముల నాచరించు దుర్మార్గుడైనను, నన్ను భజించుటయే ప్రయోజనముగా తలంచునో, అతడు వైష్ణవాగ్రేసరుడే యని నేను సంభావింతు' నని భగవంతుడు సెలవిచ్చెను ఇది వాత్సల్యగుణము కాదా!

ఇట్టి కల్యాణగుణము లనేకములు భగవద్గీతలో కానవచ్చును

## భగవ దారాధనము నిత్య కర్తవ్యము

ఇది శ్రీరామానుజ దర్శనమున కొక ముఖ్య మగు సాధారణ కర్తవ్యాంశము. పంచసంస్కార సంపన్నుడైనగాని వైష్ణవుడు కానేరడు. పంచసంస్కారము లనగా —

"తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగ శ్చ పంచమః
అమీ తే పంచసంస్కారాః పరమైకాన్తి హేతవః"

ప్రపన్నుడు కాగోరువాడు సదాచార్య సమాశ్రయణమును చేసి, తప్తములగు శంఖచక్రములను భుజములపై ధరించుట, ఊర్ధ్వ పుండ్రమును ధరించుట, దాస్యనామము నుంచుకొనుట, నిత్యమును భగవదారాధనను గావించుట, మంత్రోపదేశమును బడసి, నిరంతరము శ్రద్ధతో అర్థయుక్తముగా అనుసంధానము చేయవలెను ఇందు భగవదారాధనము ప్రధానాంగము దీనిని భగవానుడు భగవద్గీతలో –

**"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్"** (4.11)

న న్నారాధింపగోరి, తన కభిమతమగు ఏ రూపముతో నన్ను భావించి ఆశ్రయించునో, నే నా రూపముతోనే వారికి నా దర్శన మిచ్చుచున్నా' నని సెలవిచ్చెను.

శ్రీ భాష్యకారుల హృదయమును నిస్సంశయముగా తెలియంగ గలిగిన శ్రీ వేదాంతదేశిక శిఖామణి లీ భాష్యమునకు –

**"ఏవం సాధు పరిత్రాణార్థం దేవ మనుష్యాది సజాతీయ స్వేచ్ఛావతార వర్ణన ముఖేన ఉపాసనోపయుక్తం స్వసౌలభ్య ముక్తం. అథ తస్యైవ కాష్ఠా ప్రాప్తాం దశాం దర్శయతి యే యథేతి శ్లోకేన అత్ర కృష్ణావతార వృత్తాంతేన సహ అర్చావతార వృత్తాన్తోఽపి సంగృహీతః"**

అని సాయించిరి. అనగా, సజ్జన రక్షణ – ధర్మ సంస్థాపన ప్రయోజనములను సాధించుటకై, తాను దేవ మనుష్యాది రూపములతో స్వేచ్ఛగా నవతరించుటను చెప్పుచున్న ప్రసంగములో – ఉపాసకున కుపకరించు సౌలభ్యము చెప్పబడినది ఇప్పు డీ శ్లోకమున ఆ సౌలభ్యమునకు చివర హద్దుగా నుండు దశను చూపుచున్నారు ఇచ్చట కృష్ణావతార ప్రసంగములో – అర్చావతార వృత్తాంతమునుకూడ తెలుపబడినది

12 – వ అధ్యాయమున 8 – వ శ్లోకము నారంభించి, మోక్షోపాయము నుద్దేశించుచు, నన్ను గూర్చిన ఉపాసన నిరతిశయ పురు

పారము నొసంగునదియు, సులభమైనదియు, కావుననే శీఘ్ర ఫల ప్రదమునుగాన, నన్నే పరమప్రాప్యమని నమ్మి, నన్ను ధ్యానింపుము అందుకు శక్తి లేనిచో – దుర్గుణ దూరుడను, సద్గుణాకరుడను నగు నన్నే నిరతిశయ ప్రేమతో ధ్యానించుట కలవరచుకొనుము అందుల కును నీ కవకాశము, శక్తియు లేనిచో – 'మత్కర్మ పరమో భవ' (12–10) నా కర్మల నొనరింపు' మని ఉపదేశించెను ఇట 'నా కర్మ' లనగా – నాకొఱకై ఆలయములు నిర్మించుట, తోట నాటుట, దీప ములు వెలిగించుట, నా మందిరముల నూడ్చుట, నీరు జల్లుట, అలుకుట, ముగ్గులు పెట్టుట, పుష్పములను తెచ్చియిచ్చుట, పూజలు సేయుట, నామసంకీర్తనము గావించుట, ప్రదక్షిణముల నొనరించుట, స్తోత్ర ముల ననుసంధించుట మొదలగునవి వీనిని నా ప్రీతికొఱకై మిక్కిలి ప్రీతితో జేయు మని విధించెను ఇది అర్చావిగ్రహారాధనోపదేశమే గదా !

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు" (9–34)

భక్తిస్వరూపోపదేశపరమగు ఈ శ్లోకమున, 'మద్భక్తః' 'మద్యాజీ' అను పదములకు భాష్యకారులు –

"అనవధికాతిశయప్రియ మదనుభవకారిత మద్యజనపరో భవ యజనంనామ – పరిపూర్ణ శేషవృత్తిః"

"ఔపచారిక, సాంస్పర్శిక, ఆభ్యవహారిక, సాందృష్టిక, సకల భోగప్రదాన మాపో హి యాగః"

నేను అనంత కల్యాణ గుణాకరుడను, దృష్టిచిత్తాపహారి సౌందర్య సీమాభూమినియు నగుటచే, నా యనుభవ మపార ప్రీతి నొసంగును ఆ ప్రీతిచే ప్రేరితుడవై, నా పూజను గావింపక, నిలువలేకపోవె దవు నా పూజ యనగా – ఔపచారికాది చతుర్విధోపచారములను నిరతి శయ ప్రీతితో చేయక యుండలేని యార్తితో చేయుట

ఔపచారికము లనగా - నీరాజనాదులు,

అభ్యవహారికము లనగా - భోగరాగాదులు,

సాంద్రృష్టికము లనగా - దీపాదులు,

సాంస్పర్శకము లనగా - స్రక్చందనాదులు

వీనిని సమర్పించుటయే భగవత్పూజన మనబడును ఇవి యన్నియు అర్చామూర్తికి చేయు ఉపచారములేకదా!

ఇచ్చట నొక ముఖ్య విషయమును గుర్తించవలెను ఏమన, భగవద్గీతోపదేశము భాష్యకారులు సాయించినట్లు —

**"పాండుతనయ యుద్ధప్రోత్సాహన వ్యాజేన మోక్షసాధనతయా స్వవిషయం భక్తియోగ మవతారయామాస "**

అనుటచే నిది యర్జునుని వ్యాజముగా కల్పించుకొని, సకల మానవుల నుద్ధరించుటకే యుపదేశించిన గ్రంథ మని విశ్వసింపవలెను కేవల మర్జునుని కొఱకే యైనచో, అదియును యుద్ధప్రోత్సాహమునకే యైనచో, ఇంక చెప్పనవసరము లేదు ఒక విశ్వరూప సందర్శనము మాత్రమే అర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించుటకు చాలును అట్లు మన కొఱకే యీ యుపదేశమైనచో —

**"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి "** (9—26)

**"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ "** (9—27)

అను ఉపదేశ మెట్లు ఫలించును? వీనిని సమర్పించుట కా కృష్ణుడేడీ? ఇక నివి యర్పించుట — అర్చామూర్తికే యనవలెనుగదా! దీనిని బట్టి, అర్చారాధన భగవద్గీతలో భగవానునిచే ఆదరముతో నుపదేశింపబడిన దనుటయే సమంజసము దీనికే భగవద్రామానుజులు తమ సిద్ధాంతమున ప్రాధాన్యము నొసంగుట

## వైదిక కర్మాచరణ విధానము

రామానుజ దర్శనమున మనము చేయు శాస్త్రవిహిత వర్ణాశ్రమ కర్మలెల్లను భగవత్కైంకర్య బుద్ధితో, ఆతని ప్రీతికొఱకే ఫలసంగ కర్తృత్వములను వీడి చేయవలెనని విధింపబడెను ఇదియును గీతాసిద్ధాంతమే చూడుడు -

"యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసంగ స్సమాచర" (3-9)

భగవదారాధనకొఱకై చేయు కర్మలు - భగవత్ప్రసాద హేతువులే కావున, కర్మల నన్నిటిని భగవత్కైంకర్య బుద్ధితో గావింపు' మనియు -

"య త్కరోషి .. .. త త్కురుష్వ మదర్పణమ్" (9-27)

నీవు చేయు దేహధారణోపయోగములగు భోజనాది లౌకిక కర్మలను, హోమ దాన తపః ప్రభృతి నిత్య నైమిత్తిక కర్మలను నా కర్పింపు' మనియు -

"యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః." (18-46)

ఏ భగవంతునినుండి సమస్త భూతములును పుట్టుచున్నవో, ఎవ్వనిచే వ్యాపింపజేయబడినవో - అట్టి భగవంతుని తన వర్ణాశ్రమధర్మములతో ఆరాధించిన మానవుడు సిద్ధిని పొందుచున్నా'డనియు సెలవిచ్చుటచే, కర్మల నన్నిటిని ఈ భగవదారాధన పూర్వకముగ చేయవలెను ఇట్లు చేసినచో -

"సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మ ద్వ్యపాశ్రయః
మ త్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్" (18-56)

సకల నిత్య నైమిత్తిక కామ్యకర్మలను నాయందు కర్తృత్వాదుల నుంచి యాచరించువాడు. నా యనుగ్రహమువలన శాశ్వత పదవి నధిరోహించుచున్నాడు

"మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః" (3-30)

నీవు నాకు శరీరభూతుడవుగాన, నాచే ప్రకటింపబడియే సకల కర్మలను చేయుచున్నావు అందుచే, నా కర్మల నన్నిటికిని కర్తను నేనే యనియు, అవి యన్నియు నా యారాధనరూపములే యనియు నిశ్చయించి, ఆ కర్మఫలములయం దాశను, వానియందు మమకారము లేక, 'నాకు పరమాత్మ అంతర్యామి, అతడే కర్త నా దేహేంద్రియము లాతని పరికరములు ఇవి యాతని యారాధనకొఱకే యొసంగబడినవి అతడు సర్వశేషి, సర్వేశ్వరుడు తానే తన సేవను నాచే చేయించుకొనుచున్నా' డని తలంచి, అనాదికాలమునుండియు నేను చేసిన పాపరాశినుండి నే నెట్లు విముక్తుడ నగుదును ? నే నేమగుదునో?' అను మనస్తాపము లేక, నేను చేయు కర్మలచే, ఆరాధింపబడు ఆ భగవంతుడే నన్ను సంసారబంధమునుండి విముక్తుని చేయగల'డని, నిశ్చింతతో కర్మయోగము నాచరింపుడని యుపదేశించుచు, ఆపైన ఇట్లాచరించువారు ముక్తు లగుదురు ఇతరులు బద్ధులగుదు'రని (3-31,32) అన్వయ వ్యతిరేకములచే, ఈ సిద్ధాంతములను బలపఱచెను

"సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి" (2-38)

అను శ్లోకమునకు మఱియొక వ్యాఖ్యానకర్త, పై సిద్ధాంతమున కనుగుణముగ నిట్లొక చక్కని యర్థమును చెప్పిరి -

ఏదైన నొక లౌకికముకాని, వైదికముగాని, వర్ణాశ్రమమునకు దగిన కర్మను చేయునపుడు - దానివలన గలుగు సుఖమును, దుఃఖ

మును, లాభమును, నష్టమును, జయమును, అపజయమును భగ
వంతుని కర్పించి చేయుము ఇట్లు చేసిన పాపమునకు పాల్పడవని సెల
విచ్చెను ఇందలి 'నమే' అను పదమునకు _ 'మయా _ లక్ష్మ్యా
సహితః _ శ్రీమన్నారాయణః _ తస్మిన్ నమే ' అనగా _ 'శ్రీమ
న్నారాయణునియందు' అని యర్థము వచ్చుచున్నది

## నిష్కామ కర్మాచరణము

ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావ ర్తినోఽర్జున!
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే " (8_16)

ఆబ్రహ్మాదులు, వారి లోకములును నశించునవి కావున, వారి
నుపాసించి, ఆ యా లోకములలో _ ఆ యా ఫలముల ననుభవించు
వారును తిరిగి సంసారమున బుట్టుచుందురు కాని, సర్వజ్ఞుడను, సత్య
సంకల్పుడను, నిఖిల జగత్సృష్టి సంహారకర్తను, పరమకారుణికుడను,
సదైకరూపుడను అగు నన్ను పొందినవానికి తిరిగి జన్మలేదని సెల
విచ్చెను బ్రహ్మాదులకుకూడ ఆదికర్త నారాయణుడే యని 11 _ వ
అధ్యాయమున _

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోఽప్యాది కర్త్రే " (11_37)

బ్రహ్మాదులకును సృష్టికర్తవగు నిన్ను బ్రహ్మాదు లేల స్తుతింపకుందు
రని, అర్జునుడు భగవానుని స్తుతించెను మఱియు _

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూత విశేషసంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్ " (11_15)

ఓ విశ్వశరీరా! దేవా! నీ శరీరములో నేను సమస్త దేవతలను జూచుచున్నాను సామాన్య దేవతలనే కాదు లోకులు పరతత్త్వ ముగా భావించు కమలాసనుడగు బ్రహ్మను, ఆ బ్రహ్మకు పరతంత్రుడై వర్తించు రుద్రుని, దేవర్షులను, వాసుకి, తక్షకప్రభృతి సర్పములను జూచుచున్నానని విశ్వరూపసందర్శన యోగమున అర్జునుడు చెప్పెను.

దీనినిబట్టి, లోకులు పరతత్త్వమని భ్రమించి పూజించి యుపాసించు బ్రహ్మరుద్రాదులును శ్రీమన్నారాయణుని రోమకూపములో నొక మూల మిణుకు మిణుకు మని మెఱయు సామాన్యులే యని తెలియుచున్నది

## జీవేశ్వర భేదము తాత్త్వికము

భగవద్రామానుజ దర్శనమున జీవేశ్వరభేదము, జీవపరస్పర భేదము యదార్థమే ఈ విషయమును భగవద్గీత యెట్లు సమన్వయ పఱచుచున్నదో పరిశీలింతము

ఆత్మతత్త్వము నెఱుంగక దుఃఖించు అర్జునుని దుఃఖమును బాపుటకు – 'తరతి శోక మాత్మవిత్' అనెడు ఉపనిషద్వాక్య ప్రమాణానుసారముగ ఆత్మయాథాత్మ్యమును బోధించుట కుపక్రమించి శ్రీకృష్ణ భగవానుడాదిలోనే –

"నత్వే వాహం జాతు నాసం న త్వం నే మే జనాధిపాః" (2-12)

అని, ఆత్మనిత్యత్వమును బోధించుటలో – నేను, నీవు అనుటచే, జీవేశ్వరభేదము, 'నీవును, రాజులు' అనుటచే, జీవులలో పరస్పరభేదము తాత్త్వికమని తెలియుచున్నది మఱియు –

"అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" (7-5)

ఇపుడు చెప్పిన నా యచేతన ప్రకృతికంటె వేరైన నా పరా ప్రకృతి యొకటి కలదు అది జగత్తు నంతటిలో నుండి, దానిని ధరించి యుండు జీవప్రకృతి అదియును నా యధీనమే' అనగా - 'నాకు శేషభూతమే' అని చెప్పుటచే, జీవేశ్వరభేదము సిద్ధము

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః (15-7)

సనాతనమగు జీవాత్మ - నా యంశయే యనుచు, అనాది కర్మచే ఆవరింపబడి, జీవత్వము నొంది, ప్రపంచములో దేవ మనుష్యాది ప్రకృతి పరిణామ విశేషములగు శరీరములతో నల్లాడుచున్నవని తెలుపుటచేతను జీవతత్త్వము పరమాత్మతత్త్వముకంటె వేరైనదని తెలియుచున్నది

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే "
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః (15-16, 17)

లోకమున క్షరపురుషుడనియు, అక్షరపురుషుడనియు ఇరువురు పురుషులు కలరు అందు క్షరపురుషు డనగా - బ్రహ్మాది పిపీలికాది పర్యంతము గల బద్ధాత్మవర్గము అక్షర మనగా - ముక్తాత్మవర్గము ఉత్తమపురుషు డీ యుభయ విధాత్మవర్గముకంటె వేరైనవాడు అతనినే పరమాత్మ యని వ్యవహరింతురు అతడు ప్రకృతిలోను, బద్ధాత్మవర్గమునందును అంతరాత్మగా వ్యాపించియుండి, వానిని ధరించి యుండును వ్యాపించువాడును, భరించువాడును వ్యాపింపబడువాని కంటెను, భరింపబడువానికంటెను వేఱుగదా! అతడవ్యయుడును, ఈశ్వరుడును కావున, వ్యయస్వభావముగల ప్రకృతికంటెను, అట్టి ప్రకృతితో కూడియుండుటచే, అట్టి స్వభావమే గల బద్ధాత్మవర్గము కంటెను, కొంతకాలము ఆ ప్రకృతిలోనుండి, దాని వికారములకు గురియైన ముక్తాత్మవర్గముకంటెను వేఱు కదా! ఈశ్వరుడగు ఆ నియా

మకుడు – 'ఈశితవ్యము' అనగా నియామ్యమగు ప్రకృతి, బద్ధ ముక్తాత్మలకంటె వేఱుకదా!

**శేషత్వము –**

ఒకనికి అతిశయ మొనగూర్చుటకై, అతనికి యథేష్టముగ వినియోగించతగియుండుట శేషత్వ మనబడును దీనినే శాస్త్రకారులు – 'పరగతాతిశయాధాయకత్వం శేషత్వమ్ – పరశ్శేషీ' అని నిర్వచించిరి దీనినే అభిజ్ఞులు –

"ఇచ్ఛయా య దుపాదేయం పరాతిశయసిద్ధయే
**ఉభయా సర్వైకైక జుషా తౌ శేష శేషిణౌ**"

అని సెలవిత్తురు అనగా – 'ఉభయగతేచ్ఛయా, అనుభయగతేచ్ఛయా, ఏకగతేచ్ఛయా' ఎవనిచే ఏ వస్తువు తన అతిశయమును గూర్చుటకై గ్రహింపబడుచున్నదో, అట్లు గ్రహింపబడునది శేషమనియు, గ్రహించువాడు శేషి యనియు దీని యర్థము ఇట్టి శేష శేషి భావము ఇరువురు చేతనుల కుండవచ్చును రెండచేతనముల కుండవచ్చును. ఒకటి చేతనము, రెండవది అచేతనము కావచ్చును మొదటిది – సేవకుడు, యజమాని వీ రిరువురకు ఇష్ట మున్ననే ఈ శేష శేషిభావము ఘటించును రెండవది – పందిరి, తోరణము ఇందు ఇచ్ఛ ఈ రెండింటిలో దేనియందును లేక, అన్యచేతనగత మగును మూడవది – మనుష్యుడు, ఇల్లు ఇందు మనుష్యునకు మాత్రమే ఇచ్ఛయుండును ఇట్టి శేష శేషిభావమును భాష్యకారులు జీవేశ్వరుల కంగీకరించిరి దీన్ని గీత యెట్లు సమర్థించుచున్నదో చూడుడు –

గీతలో అనేక స్థలములందు – తనకు సేవజేయుమనియు, నమస్కరింపుమనియు, తన గుణములను కీర్తించుమనియు, తనకున్నవన్నియు తన కర్పింపుమనియు, తననే దిక్కని నమ్మియుండుమనియు అట్లున్నచో – తా నట్టివాని రక్షణభారమును తాను వహింతుననియు

పరమాత్మ తెలిపియున్నాడు ఇందుల కెన్నియో ప్రమాణశ్లోకములు గీతలో కలవు అట్టి వానిలో కొన్ని శ్లోకములు ఈ క్రింద పేర్కొన బడుచున్నవి

మన్మనా భవ'' (9 34) మత్కర్మ కృత్ (11 55)
'అనన్యాశ్చింతయంతో మాం' (9_22) 'యేతు సర్వాణికర్మాణి (12 6)
'త మేవ శరణం గచ్ఛ' (18_62) ( మా మేవ యే ప్రపద్య న్తే '(7 14)
మా మేకం శరణం వ్రజ'(18_66) త మేవ చాద్యం పురుషః (15_4)
"స్వ కర్మణా త మభ్యర్చ " (18 46)

పారతన్త్ర్యము –

"పర ఏవ త న్త్రం ప్రధానం యస్య సః పరత న్త్రః
తస్య భావః పారత న్త్ర్యమ్ "

తా నెట్టి కార్యములందను స్వాతంత్ర్యము నవలంబించక, ప్రతి పనిలోను ఆయన ఆదేశమునే శిరసావహించి, చెప్పినట్లు చేయు చుండుట దీనిని శేషత్వమువలెనే ఆత్మకు ప్రధాన లక్షణముగా శ్రీభాష్యకారులు తమ సిద్ధాంతములో ఆదరించిరి శేషత్వమున కంటెను ఇది గొప్పదిగా పరిగణింపబడను

మచ్చి త్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి " (18_58)

నాకు పరతంత్రుడవై, నేనుు ప్రవర్తింపజేయుటచేతనే నీవు ప్రవర్తించుచున్నట్లు తలంచి కర్మలను చేసినచో, నా యనుగ్రహము వలన సాంసారికబాధ లుపశమింపగలవు

"అథ చే త్వ మహంకారా న్నశ్రోష్యసి వినంక్ష్యసి (18_58)

నా కర్తవ్యాకర్తవ్యములను నేనే యోచింపుదునని స్వాతం త్ర్యము నవలంబించి, నా యుపదేశములను పాటించనిచో నశింతువ' వని భగవానుడు అర్జునునకు నిర్దాక్షిణ్యముగా చెప్పివై చెను మఱియు_

"య దహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మి థ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" (18 59)

స్వాతంత్ర్యాభిమానముతో నా యాజ్ఞ నుల్లంఘించి, నేను నీకు సహజ ధర్మముగా విధించిన కర్మను (యుద్ధమును) చేయనిచో, ఇట్టి నీ స్వాతంత్ర్యము వ్యర్థమే నా స్వాతంత్ర్యమును లక్ష్యము చేయని నిన్ను, నీ సహజ స్వభావము నీచేతను నీకు విధింపబడిన పనిని చేయించియే తీరును నా యాదేశమును పాటించి, గావింతువా - నేను నీ భార మంతయు వహించి, నీ కెట్టి పాపమును రానీయను నీ యంతనే యుద్రేకించి, స్వేచ్ఛగా ఆ పనినే తరువాత చేసియే తీరుదువు అపుడు నీకు వివేక విహీన మగును నే నుపేక్షింతును నీకు దానివలన అన్ని యిక్కట్టులను వాటిల్లును పాపి వగుదువు' అని హిత ముపదేశించెను దీనిచే, జీవుని పారతంత్ర్యము స్పష్టమేగదా !

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా (18-61)

ఈ శ్లోకము - ఈ పారతంత్ర్యమును సుస్పష్టముగా దెలుపుచున్నది

## చాతుర్వర్ణ్య వ్యవస్థ

మన భారతదేశమున వర్ణాశ్రమ వ్యవస్థ పాటింపబడుచున్నది మనుష్యలోకముననేగాక, దేవతలందును ఈ వ్యవస్థ కలదని శాస్త్రము లుగ్గడించుచున్నవి - వీనిని భగవానుడే యేర్పరచినట్లును, ఇవి మిక్కిలి యావశ్యకములనియు భగవానుడు గీతలో నుపదేశించెను నిష్కామ కర్మయోగము నుపదేశించి, ముముక్షువులకు ఇది ప్రథమ కర్తవ్యమనియు, జన్మసిద్ధ జ్ఞాననిష్ఠునకు-వేయేల ? భగవంతుడే లోకమున

నవతరించినను, ఆ యవతారజన్మకు తగిన కర్మల నాచరింపవలెననియు, చేయుచున్నాడననియు సెలవిచ్చెను

"న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి" (3-22)

నేను సత్యసంకల్పుడను అవాప్త సమస్తకాముడను నా ప్రయోజనమునకు గాని, ఏ పనిని గాని చేయవలసిన యవసరములేదు అయినను, లోక కల్యాణమునకై, నా వర్ణాశ్రమ ధర్మములను నేను పాటించుచునే యున్నాను కావున, లోకమున ప్రతి మానవుడును తన వర్ణాశ్రమ ధర్మముల నాచరించియే తీరవలెననియు, దీని మూలమున మోక్షానుభవము నందగలడనియు ఉపదేశించి, దానికి దృష్టాంతముగ —

"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" (3 20)

ఈ కర్మయోగముచే జనకాదులు ముక్తిని బడసిరని తెలిపెను అయినచో - లోకు లందఱును నిష్కామకర్మయోగు లేల కాలేదని ప్రశ్నింప, దానికి కారణము అల్ప ఫలములయం దాశను పుట్టించు పాపమే యగును ఈ పాప మందఱకు నుండునే? పుణ్యపాపముల మిశ్రమ ఫలానుభవమునకేగదా మానవ శరీరము! ఇక నిష్కామ కర్మయోగియై, ముక్తుడగువా డెవ్వడని ప్రశ్నింప, తన సృష్టి రహస్యము నెఱింగిన నీ పాపము నశించి, నిష్కామకర్మయోగియై, ముక్తిని బడయగలడనియు —

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" (4 13)

"చాతుర్వర్ణ్యప్రముఖం బ్రహ్మాది స్తమ్బపర్యన్తం కృత్స్నం జగత్ సత్త్వాది గుణవిభాగేన త దనుగుణ శమాది కర్మవిభాగేన చ విభక్తం మయా సృష్టమ్"

బ్రహ్మాది దేవతలలోను, మనుష్యులలోను సత్త్వరజ స్తమోగుణము లనుబట్టియు, దానికి తగిన శమదమాది కర్మలనుబట్టియు, నాలుగు వర్ణములను నేనే సృష్టించుచున్నా ననియు భగవానుడు సెలవిచ్చెను

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే (4 14)

ఇట్లు సృష్టించినను, నాకు నిర్దయత్వ పక్షపాతాది దోషములు లేవు దానికి కారణము ఆ సృష్టిఫలమున నాకు ఆశ లేకుండుటయే ఇట్లే, ఫలసంగకర్తృత్వములను వీడి, వారి వారికి నిర్ణయింపబడిన వర్ణాశ్రమ ధర్మముల నాచరించువారు నావలెనే కర్మలచే బంధింపబడరని సెలవిచ్చెను

ఈ వర్ణాశ్రమ ధర్మములను ముఖ్యముగ ఆచరింపవలెనని భాష్యకారుల యాశయము తాము రచించిన గీతాభాష్యమందు ఎచ్చట జ్ఞానప్రసంగము వచ్చినను, 'తెలిసికొని యనుష్ఠించి' యని వ్యాఖ్యానము చేసిరి 'తెలిసికొనుటకు ఫలము ఆచరణయేగదా! యని వారు సెలవిచ్చుచుందురు

భగవద్గీతలోని నాలుగవ యధ్యాయమునందలి ఏడవ శ్లోకమున వ్యాఖ్యానమున 'యదా యదా హి ధర్మస్య' అనుచోట, ధర్మశబ్దమునకు –

"వేదోదితస్య చాతుర్వర్ణ్య చతురాశ్రమ్య వ్యవస్థయాఽవస్థితస్య కర్తవ్యస్య అని సెలవిచ్చిరి అనగా – నాలుగు వర్ణములకును, నాలుగు ఆశ్రమములకును ప్రత్యేక ప్రత్యేకముగా వేదమున విధింపబడిన ధర్మమునకు పతనము తటస్థించినచో, తా నవతరింతునని చెప్పెను

ఐదవ శ్లోకమున – 'పరిత్రాణాయ సాధూనాం' అను శ్లోక వ్యాఖ్యానమున, సాధువు లనగా – 'ఉక్త లక్షణ ధర్మశీలాః వైష్ణవాగ్రేసరాః' అని సెలవిచ్చిరి. ఈ పదములచేతను సూచింపబడిన యాశయ మేమనగా –

న చలతి నిజధర్మవర్ణతో యః సమమతి రాత్మసుహృద్విపక్షపక్షే
న హరతి న చ హన్తి కించి దుచ్చైః సితమవసంత మవేహి విష్ణుభక్తమ్
– (విష్ణుపురాణము : 3–20)

అను శ్లోకమున, తన వర్ణాశ్రమ ధర్మములను తప్పక లెస్సగ ఆచరించు వాడును, తన విషయమువలెనే శత్రు మిత్రుల విషయమునను, సమ బుద్ధి కలిగియుండునో, ఎవరి సొత్తును హరింపక, ఎవరిని హింసింపక, రాగాది దోషములు లేకుండుటచే, మిక్కిలి స్వచ్ఛమైన మనస్సు కలవాడు వైష్ణవుడని, వైష్ణవ లక్షణము విష్ణుపురాణమున చెప్ప బడినది మఱియు —

"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్
విష్ణు రారాధ్యతే పన్థా నాన్య త్తత్తోషకారకః
— (విష్ణుపురాణము 3 8-9)

భగవంతుని ప్రసన్నుని గావించుకొనవలెననిన, అతడు విధించిన వర్ణాశ్రమ ధర్మములను ఆతని యారాధనబుద్ధితో ఆరాధించుటకంటె వేఱొక మార్గములేదని విష్ణుపురాణము తెలుపుచున్నది

ఈ విధమగు వ్యాఖ్యానముచే, గీత యుపదేశించిన వర్ణాశ్రమ ధర్మముల నెంత యాదరముతో శ్రీరామానుజులు తమ దర్శనమున ప్రవేశపెట్టిరో గమనించుడు

## ముక్తిఫల స్వరూపము

దర్శనము లన్నియు ముక్తిని సంపాదించు నుపాయములను తెలుపుటకే యేర్పడినవి కాని, ముక్తిస్వరూపమునందును, దాని నుపాయస్వరూపమునందును అనేక భేదములు కలవు అందులకు ప్రమాణములును వేఱ్వేరుగ స్వీకరింపబడినవి ఇపుడు గీతలో చెప్ప బడిన ముక్తిస్వరూపమును దానిని రామానుజదర్శన మెట్లాదరించి ప్రవర్తించునదియు ఇట వివరింపబడుచున్నది పిమ్మట ముక్త్యుపాయ మునుగూర్చి చర్చింపబడును

క్షణికవిజ్ఞానవాదులు ఆత్మ క్షణికవిజ్ఞానస్వరూపమనియు, అది ప్రతిక్షణమునందును పుట్టుచు గిట్టుచు ప్రవాహమువలె సాగుచునుండు ననియు, ఆత్మధారావిశ్రాంతియే మోక్షమనియు చెప్పుచుందురు

జైనులు ప్రకృతిబంధమును వీడిన ఆత్మకు సతతోర్ధ్వగతియే మోక్ష మందురు

నైయాయికులు ఆగంతుక గుణవినాశ పూర్వకమగు పాషాణ ప్రాయస్థితియే మోక్ష మందురు

సాంఖ్యప్రభృతులు కర్తృత్వాది విహీనమైన శుద్ధచైతన్య స్థితియే మోక్ష మందురు

కాని, అమరకోశకారుడు – 'ముక్తిః కైవల్యనిర్వాణశ్రేయో నిశ్రేయసామృతమ్ । మోక్షో౽పవర్గో౽థాజ్ఞానమవిద్యాహంమతిః స్త్రియామ్' – అని చెప్పలేదు; 'ముక్తి ర్మోక్షో మహానన్దః' అని, మహానందమే మోక్ష మనెను ఆనందమునకు మహత్వ మేమనగా – దుఃఖగంధరాహిత్యమే యందురు ఈ సంప్రదాయములలో గీత దేని నంగీకరించుచున్నదో చూడుడు –

"ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ" (14 2)

ముందు చెప్పబోవు జ్ఞానము లభించినచో, భగవత్సాయుజ్యమును బడసి, ఇక నెప్పుడును పుట్టరు, గిట్టరు' అని సాధర్మ్యము అనగా సాయుజ్యమునే మోక్షమని గీత నిర్వచించెను

9 – వ అధ్యాయమున చివరి శ్లోకమునందును 18 – వ అధ్యాయమున 65 – వ శ్లోకమునందును –

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామేవైష్యసి" (18–65)

అనునంతవఱకును పాఠభేదము లేకయే సెలవిచ్చి, ఆపైన 9 – వ అధ్యాయములో

యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః"  (9-34)

అనియును, 18 - వ అధ్యాయమున -

సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే"  (18-65)

అనియును పాఠభేదములతో శ్లోకములను ముగించెను ఇందు గమనించ వలసిన ముఖ్యవిషయ మేమన, 'మామేవైష్యసి' అని ఫలమును జెప్పి -

"ఏత త్సత్యం, తవ ప్రతిజ్ఞాం కరోమి నోపచ్ఛందనమాత్రం, యత స్త్వం ప్రియోఽసి మే యస్య మయ్యతి మాత్రో ప్రీతి ర్వర్తతే మమాఽ తస్మి న్నతి మాత్రా ప్రీతి ర్భవతీతి తద్వియోగ మసహమానోఽహం తం మాం ప్రాపయామి అత స్సత్య మేవ ప్రతిజ్ఞాతం మామే వైష్యతీతి"

నన్నే పొందగలవు ఇది సత్యము నీకు నే నొట్టుపెట్టి చెప్పుచున్నాను ఇచ్చకపు మాటలు కావు నాయందు మిక్కిలి ప్రీతికలవానియందు నాకును అత్యంతప్రీతి యుండునుగాన, వాని యెడబాటును సహించక, నేను వానిని నన్ను పొందించుచున్నాను' ఈ యుపపాదనవలన, 'పరంబ్రహ్మ సాయుజ్యమే మోక్ష' మను సిద్ధాంతమే రామానుజ సిద్ధాంతము

## మోక్ష సాధనము - భక్తియోగము

రామానుజ దర్శనము -

ముక్తి యనగా మహానందము ఇది సమస్తప్రాణు లాసించు నదియే కాని, దీని పరమావధిని ఎవ్వరును చేరలేకున్నారు

దదేవిషతి మానుషః న చ తత ద్విభూష త్యసౌ

తః ద్విషతి సర్వదా వివిధయిష్యతే తేన చ

ముముక్షతి తత్వగత్యవగతే స్స విస్సంశయః
నివిత్విషతి సర్వధా సచరిరంగ భిక్షూషితే "

అని పూర్వాచార్యుల యాభాణకము దీని యర్థ మేమన, మనుష్యుడు దేవత్వమును కోరును దేవుడు ఇంద్రుడు కాగోరును ఇంద్రుడు రుద్రుడు కాగోరును రుద్రుడు సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మ కాగోరును బ్రహ్మ ముక్తుడు కాగోరును ముక్తుడు నిత్యుడు కాగోరును నిత్యుడు శ్రీరంగమున భిక్షుకుడు కాగోరెను' అనుటచే, ఆనందాభిలాషకు పరమావధి మహానందమే అనగా, దుఃఖము లేశమైనను లేనీ యానందము ఇది సంభవమా? అనగా —

నహ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి
అశరీరం వా వసన్తం ప్రియాప్రియేన స్పృశతః

అని శ్రుతి యనుచున్నది అనగా - పాంచభౌతికశరీర మున్నంతవఱకు దుఃఖమిశ్రానందానుభవమే కలుగుచుండును కాని, ఆ శరీరము లేకుండ చేసికొన్నచో, దుఃఖగంధములేని నిరతిశయానందము ననుభవింపవచ్చును అట్లు శరీరమునకు నిరన్వయ వినాశ మెట్లు ఘటించు ననగా —

భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే

(శ్రుతి)

పరమాత్మ యొక్క సాక్షాత్కారమును బడసినచో, హృదయస్య - జీవునియొక్క, గ్రన్థిః = పీటముడివలె విప్పుటకు శక్యముగాని శరీర సంబంధము, భిద్యతే = పటాపంచలై పోవును' అని శ్రుతి చెప్పుచున్నది ఆ పరమాత్మ దర్శన మెట్లు కలుగు ననగా, ఆ శ్రుతియే —

' య మే వైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం "

ఆ పరమాత్మ ఎవనిని వరించుచున్నాడో, వానికి తన యథాప్రాకృత స్వరూపమును జూపు' ననుచున్నది ఆ పరమాత్మ ఎవనిని వరించు ననగా—

"ప్రియతమ ఏవ హి వరణీయో భవతి "

ఆయనకు అత్యంత ప్రియుని ఆతడు వరించును అట్లంత ప్రియతముడు ఎవ రనగా - అతనిని అంతగా ప్రేమించువాడే

"ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తిరి త్యభిధీయతే "

అను ప్రమాణమునుబట్టి, ఇట్లు ప్రీతితో ధ్యానించుటయే భక్తి యనబడును దీని సారాంశ మేమనగా - భక్తివలననే ముక్తిని బడయ వచ్చును ఇది రామానుజ సిద్ధాంతము దీనికి ప్రమాణము వారి శ్రీసూక్తియే

గీతాభాష్యావతారికలో - గీతలో ప్రధానముగా ప్రతిపాదింపబడు ముఖ్య మోక్షసాధనము నుపదేశించుచు —

' పరమపురుషార్థ లక్షణ మోక్షసాధనతయా వేదాన్తోదితం స్వ విషయం జ్ఞానకర్మానుగృహీతం భక్తియోగ మవతారయామాస

పురుషార్థముల నన్నిటిలో - ఉత్తమమగు మోక్షమునకు సాధనముగా వేదాంతములలో చెప్పబడినట్టియు, తనును గూర్చినట్టియు, జ్ఞానకర్మలను అంగములుగా కలిగియున్నట్టియు భక్తియోగమును భగవద్గీతాశాస్త్రముద్వారా లోకమున నవతరింపజేసె' నని భగవ ద్రామానుజులు సెలవిచ్చిరి గీత నంతను ఈ భక్తియోగపరముగనే సమన్వయించుచు, దీనికి ప్రధాన కారణముగా —

స్వధర్మ జ్ఞాన వైరాగ్య సాధ్యభక్త్యేక గోచరః
నారాయణః పరంబ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః "

— (గీతార్థ సంగ్రహము)

తన వర్ణాశ్రమధర్మములను పరమపురుషుని యారాధన యను జ్ఞానముతో ఆచరించినయెడల, వైరాగ్యము జనించును దానిచే భక్తి ఉదయించును దానిచే నారాయణుని దర్శించి, ముక్తిని పొంద వచ్చును' అనెడి తమ పరమాచార్యులగు యామునాచార్యులవారి శ్రీసూక్తిని ప్రధాన ప్రమాణముగా గైకొనిరి

**భక్తియోగము - గీతా సిద్ధాంతము -**

ముక్తికి సాధనము భక్తి భక్తి యనగా - తైలధారవలె అవిచ్ఛిన్నముగా పరమపురుషుని శాస్త్రనియమములతో ధ్యానించుట ఇది 12 - వ అధ్యాయమున విధింపబడినది దీనికి పరమాత్మయొక్క పరోక్షజ్ఞాన మవసరము అది 7, 9, 10 అధ్యాయములలో చెప్పబడి, 11 - వ అధ్యాయములో చూపబడినది 10, 11 అధ్యాయములు ముఖ్యముగా భక్తి ఉదయించుటకును, వృద్ధి పొందుటకునే ఉపదేశింపబడినవి ఇట్టి భక్తికి అధికారి - స్వాత్మసాక్షాత్కార సమర్థుడగు నిష్కామ కర్మయోగియే అట్టి ఆత్మ సాక్షాత్కారము ఆత్మధ్యానముచే ఘటించును దానికి ఆత్మపరోక్షజ్ఞాన మవసరము అదియే మునుముందు 2 - వ అధ్యాయములో తెలుపబడినది ఇట్లు ఆత్మ తత్త్వజ్ఞానపూర్వకమగు ఆత్మసాక్షాత్కారముచే, భక్తియోగాధికారమును సంపాదించుకొని, గురూపదేశమూలముగా పరమాత్మ తత్త్వము నెఱింగి, ఆతని నుపాసించి, సాక్షాత్కరించుకొనినచో, ప్రాకృత శరీరసంబంధమును వీడి, అర్చిరాదిమార్గమున పరమపదము నధిరోహించి, పరమపురుష సాయుజ్యమును బడసి, ఇక తిరిగి రాక, అచ్చటనే నిరతిశయానందము ననుభవించును

ఈ విషయము గీతలో 2 - వ అధ్యాయ ప్రారంభమున ఆత్మ పరోక్షజ్ఞానము నుపదేశించి, నిష్కామకర్మయోగము నాచరించవలసిన విధానమును బోధించి, దానివలన జ్ఞాననిష్ఠను స్థితప్రజ్ఞయొక్క అవస్థా

భేదముతో వర్ణించి, 6 వ అధ్యాయములో - అట్టి యాత్మను సాక్షాత్కరించుకొనుటకు చేయవలసిన ధ్యానముయొక్క అంతర బాహ్య నియమములను పేర్కొని, దానిచే, ఆత్మసాక్షాత్కారము బడయు క్రమము తెలుపబడెను 6 - వ అధ్యాయములో చివర - 'యోగినామపి సర్వేషాం' అను శ్లోకములో -

శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ' (6-47)

భక్తుడు యుక్తతముడని ప్రశంసించి, ఆ భక్తుని, ఆ భక్తిని గూర్చి తెలిసికొనవలెననుజిజ్ఞాస అర్జునునకు బుట్టించి, ఆపైన 12 - వ అధ్యాయమువఱకు భక్తియోగమును గూర్చి చెప్పవలసినవాని నన్నిటిని చెప్పెను అందు ముఖ్యముగా - 6, 7 శ్లోకములలో - లౌకిక కర్మల నన్నిటిని నాయందు సమర్పించి, నన్నే ముఖ్యప్రాప్యముగా తలంచి, ఇతర ఫలములను కోరక, నన్నే ఉపాసించుచు, నాయందే మనస్సును నిలిపి, ధ్యానించుచుండునట్టి వారలను మృత్యువువంటి సంసార మనెడు సముద్రమునుండి త్వరలో నుద్ధరింతునని, భక్తికి ఫలము ముక్తియేయని సెలవిచ్చెను

యో మద్భక్త స్సమే ప్రియః " (12-14)

నన్ను భజించువాడు నా కిష్టుడు

"హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః " (12-15)

సంతోషము, కోపము, భయము, మనోవ్యాకులము లేనట్టివాడు నాకు ప్రియుడు

'యో మే భక్త స్స మే ప్రియః " (11- 6)

శాస్త్రవిరుద్ధ కర్మలను విడిచి, నన్నే భజించువాడు నా కిష్టుడు

భక్తిమాన్ య స్స మేప్రియః " (11-17)

బంధహేతువులగు పుణ్యపాపములను విడచి, నన్ను భజించు కర్మయోగి నాకు ప్రియుడు

భక్తిమాన్ మే ప్రియో నరః ' (11-19)

నన్ను భజించువాడు నాకు ప్రియుడు

భక్తాస్తేఽతీవ మే ప్రియః (11 20)

భక్తులు నాకు మిక్కిలి ప్రియులు

అని ఈ రీతిగా ఆరు శ్లోకములలో భగవానుడు భక్తులను కొనియాడెను ఇక ఉపసంహారమున -

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః 9-34)

నాయందు మనస్సుగలవాడవై యుండుము నాయందు భక్తి కలిగియుండుము నన్ను పూజింపుము నన్ను నమస్కరింపుము ఇట్లు నన్నే ముఖ్యగతిగా నమ్మి, మనస్సును నాయందు నిలిపిన పిమ్మట, నన్నే ఆశ్రయింతువు' అని, భక్తియోగమునే సాంగము గను, సఫలముగను ఉపదేశించెను

'రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ (9 2)

ఈ భక్తియోగము విద్యలకు రాజు, రహస్యములకు రాజు, అన్నిటికంటెను గొప్పది, నన్ను పొందుటకు ఆటంకములగు పాపము లను పోగొట్టునది, నన్ను ప్రత్యక్షముగా జూపునది, ధర్మమును తప్పనిది, మిక్కిలి ప్రియముగ పరిగ్రహించదగినదీ, ఫలము నిచ్చియు నశించని' దని యిట్లు ఎనిమిది విశేషణములతో ఈ భక్తియోగమును పొగడి, అర్థాప్తిని జూపెను

4, 5, 6, 7, 8, 9, 10, 16, 17, 18, 19, 24, 32 శ్లోకములలో - తనకు గల అనితర సాధారణమైన మహిమను జెప్పి, అందుచే, తానే పరమపురుషార్థ ప్రదుడనని యుపపత్తిని దెలుపుటచేతను - పైన దహరించిన తాత్పర్యలింగము లారును భక్తి యోగమునే యీ యధ్యాయసారముగ నిరూపించుచున్నది

మరియొక ముఖ్యాంశ మీ యధ్యాయమున కానవచ్చుచున్నది భక్తి ఉదయించుటకును, వృద్ధి యగుటకును కారణము - పరస్పర సంబంధ జ్ఞానము ఆ సంబంధము చేతనులకు ఈశ్వరునితో తొమ్మిది విధములుగ నుండును అట్టి నవవిధ సంబంధము లివి

| | | | |
|---|---|---|---|
| 1 | పితా - పుత్ర సంబంధము | పితాహమస్య జగతః | 9-17 శ్లో |
| 2 | రక్ష్య - రక్షక భావము | నివాస శ్శరణం సుహృత్ | 18 శ్లో |
| 3 | శేష - శేషి భావము | మాతా ధాతా పితామహః | 17 శ్లో |
| 4 | భార్యా - భర్తృ భావము | గతి ర్భర్తా | 18 శ్లో |
| 5 | జ్ఞాతృ - జ్ఞేయ భావము | వేద్యం పవిత్ర మోంకారః | 17 శ్లో |
| 6 | స్వ - స్వామి భావము | గతి ర్భర్తా ప్రభుః | 18 శ్లో |
| 7 | ఆధార - ఆధేయ భావము | నిధానం బీజ మవ్యయమ్ | 18 శ్లో |
| 8 | శరీర - ఆత్మ భావము | సదస చ్చాహ మర్జున। | 19 శ్లో |
| 9 | భోక్తృ - భోగ్య భావము | భోక్తా చ ప్రభు రేవ చ | 24 శ్లో |

ఈ నవవిధ సంబంధములను మూడు శ్లోకములలో జెప్పివేసెను ఇంకను విశ్వరూప సందర్శనాధ్యాయమున —

"నాహం వేదై ర్నతపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా (11-53)

"భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప !" (11-54)

అర్జునా ! నీ విప్పుడు చూచినట్లు నా వాస్తవరూపము నా యందు భక్తి లేని కేవల వేదాధ్యయనాదులచేగాని, తపస్సులచేగాని, దానముచేగాని, యాగాదులచేగాని చూచుటకు సాధ్యము కాదు ఇతర ఫలములను కోరక, భక్తిచేతనే నా వాస్తవ స్వరూపమును శాస్త్రములచే తెలియుటకును, ఉన్నది ఉన్నట్లుగా చూచుటకును, పరిపూర్ణముగా అనుభవించుటకును సాధ్యమగు' నని కంఠరవముతో - భక్తియే ముక్తికి సాధనమని నిర్ధారణ గావించెను అట్టి భక్తికి - వివేక, విమోక, అభ్యాస, క్రియా, కల్యాణ, అనవసాద, అనుద్ధర్షములను సాధనము లేడు కలవు

1 వివేక మనగా - జాతి దుష్టములు, ఆశ్రయ దుష్టములు, నిమిత్త దుష్టములను కాని పదార్థములను భుజించి, శరీరమును శుద్ధముగా పోషించుకొనుట

2 విమోక మనగా - కామములకు వశము గాకుండుట

3 అభ్యాస మనగా - ధ్యేయవస్తువు మనస్సునను విడువకుండు నటుల నిరంతర ధ్యానము నలవరచుకొనుట

4 క్రియ యనగా - శక్తికొలది పంచ మహాయజ్ఞములు చేయుట

5 కల్యాణ మనగా - సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింసాపరులసొత్తున కాశపడకుండుట అనునవి

6 అనవసాద మనగా - దేశకాల వస్తువులు తనకు ప్రతికూలముగా నున్నవని క్రుంగిపోకుండుట

7 అనవసాద మనగా - అవి తన కనుకూలముగా నున్నవని పొంగిపోకుండుట

ప్రపత్తి యోగము :-

తన కధికారము లేకుండుటచేగాని, తనకు శక్తి లేకుండుటచే గాని దీని నవలంబించి, భక్తి యోగమును సాధించి, తద్వారా ముక్తిని బడయజాలనివారికి ప్రపత్తియే శరణ్యమని కొందరును, జీవుడు పర తంత్రు డనియు, ఈతనికి స్వాతంత్ర్యము ఏ మాత్రముకూడ గిట్ట దనియు, అట్టివానికి ఇతర సాధనము లన్నియు స్వరూపవిరుద్ధములనియు, కావున, వాని నెల్ల విడచి, ప్రపత్తి నొక్కదానినే అవలబింపవలె ననియు మరి కొందరును సెలవిత్తురు

భక్తి — తన ప్రయత్నసాధ్యముకాన, విలంబ సహము, ప్రపత్తి - సర్వధర్మపరిత్యాగపూర్వక భగవ దుపాయ పరిగ్రహము గాన, శీఘ్ర ఫలప్రదము, స్వరూపానురూపము నగుచున్నది భక్తికి - దేశ, కాల, ప్రకారాది నియమము లున్నవి కాని, ప్రపత్తి కవి లేవు

"న జాతిభేదం న కులం న లింగం న గుణక్రియాః
స్వదేశకాలే నావస్థాం యోగోహ్యయ మపేక్షతే"
"బ్రహ్మ క్షత్ర విశ శ్శూద్రా స్త్రియ శ్చాంతర జాతయః
సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వధాతార మచ్యుతమ్"

ఈ ప్రపత్తికి బ్రాహ్మణ్యాది భేదముగాని, త్ర్యార్షేయ — పంచార్షేయాది కులభేదముగాని, బ్రహ్మచర్యాది ఆశ్రమ భేదముగాని, శమాది గుణభేదముగాని, జాతపుత్రత్వాది వయోవిశేష నియమ ములుగాని లేవు బ్రాహ్మణ్యాది చతుర్వర్ణ్యములవారును, స్త్రీలును, సంకరజాతులవారును, అందరును, అన్ని వేళలయందును, అన్ని ఫలము లకును శ్రియఃపతిని ప్రపత్తి చేయవచ్చును

శ్రీభాష్యమున ప్రథమాధ్యాయ చతుర్థపాదమునందలి అను మానికాధికరణమున భాష్యకారులు - 'ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థాః' ఇత్యాది శ్రుతివాక్యమును వివరించుచు - 'శరీరాదిషు యాని యేభ్యో

వశీకార్యతాయాం ప్రధానాని తాన్యుచ్యన్తే' యని అవతారిక ననుగ్రహించి, చివరకు - 'పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః' యను వాక్యశేషమును వివరించుచు - 'వశీకార్యోపాసన నిర్వృత్త్యుపాయ కాష్ఠాభూతః పరమప్రాప్యశ్చ స ఏవ' అని సాయించి, 'తస్య వశీకరణం తచ్ఛరణాగతి రేవ' అని ముగించిరి

జ్ఞానవిరోధులగు ఇంద్రియ విషయాదులలో - దేనికంటెను ఏది ప్రబలమైనదో, దానిని జయించి, స్వాధీనము గావించుకొనుటెట్లు ? ' అని విచారించి, వానిలో - చరమావధి శ్రియఃపతియే యనియు, ఆతనిని వశీకరించుకొనుటకు దారి ఆతని శరణాగతి తప్ప వేరొక్కటి లేదనియు దీని సారాంశము

ఇట్లు భక్తిప్రపత్తులు రెండును సన్నిహిత మోక్షోపాయములు గనుకనే -

"భక్తిప్రపత్తిభ్యాం ప్రసన్న ఏవ మోక్షోపాయః"

భక్తిప్రపత్తులచే ప్రసన్నుడైన శ్రియఃపతి - మోక్షమును ప్రసాదింతునని సెలవిచ్చిరి

## అవతార రహస్యమొక మోక్షోపాయము

రామానుజ దర్శనమున అవతార రహస్యమొక మోక్షోపాయముగా నిర్ణయింపబడెను చరమశ్లోక వ్యాఖ్యానమున -

'సర్వధర్మాన్ పరిత్యజ్య' యను ప్రథమచరణ వ్యాఖ్యానము గావించుచు, ఇతర ధర్మముల నన్నిటి పరిత్యాగ మింతకు మున్నే ఉపదేశింపబడెను ఇప్పుడు విడువుమని ఉపదేశించు ధర్మములు మోక్షసాధనములు అందు సర్వ పదముచే, పరిగ్రహింపదగిన పరిత్యాజ్య మోక్ష ధర్మములను గణించుచు, అవతార రహస్యముగూడ

అట్టి ధర్మములలో నొక్కటి యని తెలిపిరి ప్రపత్త్యపేక్షయా దాని కరిత్యాగ మేర్పడినను, భక్తి మొదలగు ధర్మములవంటి దనుట నిర్వివాదమేగదా! ఈ విషయమును గీత యెట్లు సమర్థించుచున్నదో గమనింపుడు —

భగవానుడు 4 - వ అధ్యాయమున 5 - వ శ్లోకము మొదలు నాల్గు శ్లోకములలో - తన యవతార రహస్యముల నెల్ల అర్జునుని ప్రశ్నలకు సమాధానముగా నుపదేశించి, చివరకు - ఈ అవతార రహస్య విజ్ఞాన మొక మోక్షసాధనమని 9 - వ శ్లోకమున నుపదేశించెను

"జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ।" (4 9)

నా యవతార - చేష్టా రహస్యముల నెఱింగినవాడు - వర్తమాన దేహసంబంధమును వీడి, తిరిగి జన్మించకుండుటయేగాక, నా సాయుజ్యమును బడయునని భగవానుడు సెలవిచ్చెను

దీనివలన, భగవదవతార రహస్యజ్ఞాన మొక మోక్షసాధన మని ఋజువగుచున్నది

## సదాచార సమాశ్రయణము కర్తవ్యము

ఉపనిషత్తు లుద్ఘోషించు సదాచార్య సమాశ్రయణమును రామానుజ దర్శన మెంతగనో ఆదరించుచున్నది

"ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే

సదాచార్యుల నాశ్రయించిన పురుషుడే తత్త్వార్థముల నెఱుంగ గల్గును ఆతనికి మోక్షప్రాప్తికి, ప్రారబ్ధకర్మావసానమే విలంబమని ఛాందోగ్యోపనిషత్తును —

"తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్"

అను శ్రుతి - తత్త్వజ్ఞానమునకు సదాచార్య సమాశ్రయణమును విధించుచున్నది

ఆచార్యా ద్దేవ విద్యా విదితా సాధిష్టం ప్రాపత్ "

ఆచార్య సమాశ్రయణ మొనరించి, తన్ముఖతః లభించిన విద్యయే సార్థక మగును ఇట్లాచార్య సమాశ్రయణము వేదవిహితమైనది దీనికే రామానుజులు తమ దర్శనమున ప్రాధాన్య మొసంగిరి

శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధే రుత్తమం
శ్రీవిష్ణో రవమాననా ద్గురుతరం శ్రీవైష్ణవోల్లంఘనమ్
తీర్థా దచ్యుత పాదజా ద్గురుతరం తీర్థం తదీయాంఘ్రిజం
తస్మా న్నిత్య మతన్ద్రితో భవసతాం తేషాం సమారాధనమ్ "

భగవంతుని పూజించుటకంటెను భాగవతులను పూజించుట ఉత్తమము భగవంతుని దూషించుటకంటెను ఘోరమైన పాపావహము భాగవత దూషణము కావున, వారి నారాధించుటలో ఏమరరాదని భాగవత వైభవమున భగవద్రామానుజు లుపదేశించిరి ఈ సిద్ధాంతమును గీతాచార్యు లెట్లు సమర్థించెనో చూడుడు —

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" (4-84)

నేను చెప్పిన ఆత్మస్వరూపమును సాక్షాత్కరింపజేసికొనిన జ్ఞానులు నీకు చక్కగ నుపదేశింతురు కావున, నీవు వారికి సాష్టాంగ నమస్కార మాచరించి, శుశ్రూష గావించి, యడిగి తెలిసికొనుమని భగవాను డాదేశించెను దీనివలన, ఆచార్య సమాశ్రయణము భగవానున కెంతయో యభిమతమని గ్రహింపవలెను

## సదాచారమే ప్రబల ప్రమాణము

"అథ యది తే కర్మ విచికిత్సావావృత్త విచికిత్సావా స్యాత్ యే తత్ర బ్రాహ్మణా స్సమదర్శినః - యథా తే తత్ర వర్తేరన్, తథా తత్రవర్తేథాః"

గృహస్థాశ్రమమున ప్రవిష్టుడవై, నీ వాచరించు కర్మలలో గాని, ప్రవర్తనలోగాని సంశయ ముదయించినచో - అచ్చటనున్న సదాచార సంపన్నులగు సద్బ్రాహ్మణు లా కర్మలపట్ల ఎట్లు వర్తింతురో చూచి, నీవును అట్లే ప్రవర్తింపు' మని శ్రుతియు -

"మహాజనో యేన గత స్సపన్థాః"

పెద్దలు పోవునదియే మనకు మార్గ మని ఇతిహాసము -

"ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదా శ్చ"

వేదములకంటెను మునుముందు - పెద్దల యాచారమునే ప్రమాణముగా గొనవలెనని ఆపస్తంబ స్మృతియు ఉద్ఘోషించు చున్నవి

రామానుజ దర్శనమునందును - ధనుర్మాసమున కేమి ప్రమాణ మని శంకించి, హోతాధికరణన్యాయమే దీనికి ప్రమాణమని నిర్ణ యించిరి అనగా - పెద్దల యాచారమే ప్రబల ప్రమాణమని దాని యర్థము ఈ విషయమును ఆండాళ్ళుతల్లి తిరుప్పావై ప్రబంధమున -

"మేల్లై యార్ శెయ్‌వనగళ్

పెద్ద లాచరించినదానినే మే మాచరింతుమని సాయించిరి రామానుజు లకు ఈ తిరుప్పావై ముఖ్య ప్రమాణము కావుననే వీరికి తిరుప్పావై జీయ రని ప్రసిద్ధ నామము ఈ సిద్ధాంతమును గీత యెట్లు సమర్థించు చున్నదో చూడుదు -

"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే – (3–21)

గొప్పవాడుగా ఎన్నబడువాడు ఏ కర్మను ఎట్టి యంగములతో ఆదరించునో – దానిని జూచి, లోకమున సామాన్యుడుకూడ ఆ కర్మనే, ఆ యంగములతోనే ఆచరించునని భగవానుడు సెలవిచ్చెను

## సదాచార్య ప్రాప్తికి మదత్రయ పరిత్యాగము ముఖ్యావసరము

ముముక్షువునకు ఆత్మగుణములగు అమానిత్వాదులు అత్యంతావశ్యకములు వానిలోను – శమ దమాదులు ప్రధానములు ఇవి యున్ననే సదాచార్య ప్రాప్తియు, ఆతని మూలమున మంత్రావాప్తియు, దానం జేసి సర్వేశ్వరుడును, ఆతని మూలమున పరమపదమును సిద్ధించును' అని శ్రీవచన భూషణమందలి ప్రథమ ప్రకరణములోని 97 – వ సూత్రమున తెలుపబడెను

ద్వితీయ ప్రకరణమునందలి 243 – వ సూత్రమున, ప్రపన్నుని దినచర్యను చెప్పుచు, అహంకారము, అర్థము, కామము అను ఈ మూడును అనుకూలురపట్ల అనాదరమును, ప్రతికూలురపట్ల ప్రీతిని, ఉపేక్షించువారిపట్ల అపేక్షను కలుగజేయును కావున, ఈ మూడును సత్వర స్వరూప నాశకములని తెలిసికొని, వానిని సదాచార్యానుగ్రహముచే పరిహరించుకొనవలెనని తెలుపబడెను

ఈ విషయమే భగవద్రామానుజుల చరిత్రలో – చక్కని యొక ఘట్టముతో నిరూపింపబడెను

శ్రీ రామానుజులు స్నానమొనరించి, ధనుర్దాసు చేతిని ఊతగా గొని, తిరిగి వేంచేయుచుండుట వారి శిష్యులకు కంటకముగా దోచెను

వారి శంకను గ్రహించి పరిహరించుటకై శ్రీ భాష్యకారులు -

విద్యామదో ధనమద స్తృతీయో ఽభిజనో మదః
ఏతైర్మదైస్త్రిభిర్మర్త్యో రహితో ఽయం విపశ్చితః
అతః పాణిర్గృహీతో ఽస్య మయా స్నాతేన వైష్ణవాః

విద్యావంతుడ ననెడి గర్వము, ధనవంతుడ నను అభిమానము, గొప్ప వంశములో బుట్టితినను అహంకారము అను ఈ మూడు మదములును మిక్కిలి క్రూరమైనవి ఇవి యీ ధనుర్దాసునకు లేవు కావున, ఆతడు పవిత్రుడు అందువలననే నేను స్నాన మొనరించియు ఆతని చేతిని ఊతగా గొనివచ్చుచున్నానని సెలవిచ్చిరి

మరియు, పండితాగ్రగణ్యుడయ్యును - విద్యామద, ధనమద, అభిజన మదములతో గూడియున్న దాశరథులు - రామానుజులను తమకు చరమశ్లోకార్థము నుపదేశింపుడని ప్రార్థింప, వారీతనికి మద త్రయ ముండగా ఉపదేశింపరాదని శ్రీ గోష్ఠీపూర్ణుల వద్ద కనిపిరి వారు వీరి స్థితిని గ్రహించి, 'నీకు గల మూడు మదములను సమూల ముగా విడిచి, రామానుజులను శరణు జొచ్చుము వారే నీకు దాని నుపదేశింతు'రని యాదేశించిరి దానిని శిరసా వహించి - వీరు రామా నుజుల సన్నిధి కేగగా, వారు దాశరథులను మహాపూర్ణుల కుమార్తెతో ఆమె యత్తవారింటికి వంట చేయుటకై పంపెను కొంతకాల మా కైంకర్యమును శ్రద్ధగా చేయగా చేయగా, వారా మదత్రయ విముక్తులై, రామానుజుల వద్ద కేతెంచిరి అంత రామానుజులు -

త మవేక్ష్య మహాత్మానం వినిర్ముక్త మదత్రయమ్
సహసా చరమం శ్లోకం తస్మై శిష్యాయ సాదరమ్

దాశరథులను మదత్రయ దూరులనుగా నెఱింగి, వెంటనే చరమ శ్లోకార్థము నుపదేశించిరి

ఈ విషయమే గీతలో 3 - వ అధ్యాయమున, భగవాను డర్జునునితో -

> కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
> మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ' (3 37)

రజోగుణమువలన బుట్టెడు విషయముల నెంత యనుభవించినను శాంతించని కామము - అది ముదిరినచో పరిణమించు పాపాకరమగు క్రోధము - సన్నిహిత నిత్య శత్రువులు కావున, వానిని జయించుట మానవుని ముఖ్య కర్తవ్యము లేనిచో - అది జ్ఞానదీపమును రూపు మాపి, అనర్థ గర్తమున దించును అందుచే ఓ అర్జునా! కౌరవసేన కంటెను మునుముందు ఈ కాముని జయింపుమని ప్రోత్సహించెను

ఇంకను దైవాసుర సంపద్విభాగయోగమున, 16 - వ అధ్యాయములో - దైవీసంపద నొకింత జెప్పి, అసుర సంపదను జెప్పుటలో - 'దంభో దర్పోఽభిమానశ్చ' అని సెలవిచ్చెను ఇందు దుర్గుణముగా పరిగణింపబడిన అభిమాన మనగా, అభిజన - విద్యాధన దురభిమానమే ఇట్లనేక స్థలములలో - ఈ మదత్రయ పరిత్యాగము నొక ప్రధాన సాధనముగా నుపదేశించెను

## ఆహార నియమము

ఇయ్యది రామానుజదర్శనమున నే మిక్కిలి కట్టుబాటులతో పాటింపబడు ముఖ్య ధర్మము ముముక్షువుల కిది ముఖ్యతమము ముముక్షువులకే గాదు - బాగుపడదలచినవారికెల్లను ఇది ప్రథమ సోపానము ఉపనిషత్తులలో ఈ యాహార నియమ మెంతగ ఆదరింపబడినదో చూడుడు -

> ''ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః
> స్మృతి ర్లబ్ధే సర్వగ్రంథీనాం విప్రమోక్షః

ఆహారము పరిశుద్ధమైనచో - అంతఃకరణము శుద్ధమగును అది శుద్ధమైనచో - అవిచ్ఛిన్న స్మృతిసంతానరూపమగు భక్తి సిద్ధించును ఇక నేమున్నది! దానివలన, కామక్రోధాది గ్రంథులన్నియు విడిపోవు' నని దీని తాత్పర్యము

ఆహారమునకును, అంతఃకరణమునకును గల సంబంధమును ఛాందోగ్యమునందలి సద్విద్యా ప్రకరణ మెట్లు ప్రత్యక్షముగ ఋజువు చేయుచున్నదో గమనింపుడు -

ఈ ప్రకరణ మంతయు పితాపుత్ర సంవాదరూపమైనది తండ్రి ఉద్దాలకుడు కుమారుడు శ్వేతకేతువు తండ్రి కుమారునితో

అన్నమయం హి సోమ్య మనః ఆపోమయః ప్రాణః "

తేజోమయీ వాక్కని, సూత్రప్రాయముగా నుపదేశించెను దానిని విని శ్వేతకేతువు - నాకిది స్పష్టముగా బోధపడునట్లు ప్రత్యక్ష ప్రమాణముతో జూపు మనెను

అంత నాతడు - గట్టిగ తోడుకొనిన పెద్దకుండయందు గల పెరుగు చిలకబడినపుడు అడుగున కొంత పెరుగు నిలిచిపోవుటయు, మధ్య - మజ్జిగగా మారుటయు, వెన్న పైకి తేలుటయు చూచుచున్నావుకదా! అటులనే నీవు భుజించిన యన్నముగూడ, మూడు విధములుగ నీ ఉదరమున విభజింపబడి, ఘనమగు భాగము మలముగ వెలుపలకు పోయి, మజ్జిగవంటి మధ్యభాగము నీ కండరములను పెంచి, వెన్నవంటి సూక్ష్మభాగము నీ మనస్సును సంస్కరించునని చెప్పెను అందులకు నిదర్శనముగా - తన బిడ్డను పదునైదు దినములుపవసింపజేసెను అట్లుపవసించి, పదునారవ దినమున ఆ శ్వేతకేతువు తన యొద్దకు రాగా, ఉద్దాలకు డాతని నొక వేదమంత్రమును చదివి, అర్థమును చెప్పు మనగా - 'నవై మా ప్రతిభాన్తి భో ఇతి'

నా కేమియు జ్ఞాపకము వచ్చుటలే దనెను తిరిగి క్రమముగా అన్నము భుజించి రమ్మని యాదేశించెను అత డట్లు చేసి, 'యత్కించన ప్రచ్ఛ సర్వగ్ం హి ప్రతిపేదే' అడిగిన దంతయు చక్కగ చెప్పి, దీని కేమి కారణమని తండ్రిని ప్రశ్నించెను అందుల కుద్దాలకుడు - 'నాయనా! మనస్సు చంద్రునివలె పదునారు కళలతో నుండును నీవు పదునైదు దినములు అన్నము తినకుండుటచే, అవి క్షీణించి, నీ కేమియు జ్ఞాపకము లేకపోయెను తిరిగి అవి అన్నముచే ఆప్యాయితములై ప్రజ్వలించుచు, నీ కన్నిటిని స్మృతిపథమున నుంచెనని చెప్పెను అంతట ఆ శ్వేతకేతువు - 'తెలిసినది - తెలిసినది' అని సంతసించెను దీనినిబట్టి, మనము భుజించు ఆహారమునకును, మన మానస ప్రవృత్తులకును గల సంబంధము స్పష్టము గావింపబడినది ఇందువల్లనే రామానుజ దర్శనమున నాలుగు ప్రధాన సూత్రములు పెద్దలచే ముఖ్యముగా పాటింపబడుచున్నవి

1 ఎప్పుడు పడిన అప్పుడు 2 దేనిని పడిన దానిని 3 ఎచ్చట పడిన అచ్చట 4 ఎట్లున్నను అట్లు తినుటము అనునది చతుస్సూత్రి దీనిని గీత యెట్లు పాటించుచున్నదో మన మొకింత పరికింతము - కర్మయోగావశ్యకతను బోధించు తృతీయాధ్యాయమున -

> యజ్ఞ శిష్టాశి స్సన్తః ముచ్యన్తే సర్వకిల్బిషైః
> తే త్వఘం భుంజతే పాపాః యే పచ న్త్యాత్మ కారణాత్ '' (3-13)

అనెడు శ్లోకమున, 'న్యాయార్జిత పదార్థములను' భగవంతునకు నివేదించి, తినువారి పాపము లన్నియు పటాపంచలై పోవును కాని, అట్లు చేయక, తమ పొట్టను నింపుకొనుటకే వండుకొనువారు మహాపాపులు వారు తినునది పాపఖేగాని, అన్నము కాదు,

ఈ నియమము రామానుజ సిద్ధాంతమున ప్రధానముగా పాటింపబడుచున్నది

తాను భుజించు శాస్త్రసమ్మతమైన ఏ పదార్థమునుగాని, త్రాగు నీటినిగాని, ధరించు వస్త్రాభరణములకుగాని, అనగా - ధారక, పోషక, భోగ్యము లగు పదార్థముల నన్నింటిని ముందు భగవంతుని యెదుట నుంచి యర్పించి, ఆ పిమ్మటనే వానిని తా నుపయోగించు కొనవలెననునది సనాతన వైష్ణవ సిద్ధాంతము ఇది గీతాచార్యునే యనువర్తించుచున్నదిగదా !

## గీతాసారమే సారతమ చరమ మంత్రము

భగవద్గీతలోని 18 - వ అధ్యాయమందలి 65, 66 శ్లోకములు సారతమ శ్లోకములు వీని యుపదేశమునకు ముందు - భగవాను డర్జునునితో 63 - వ శ్లోకమున -

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు,''

అర్జునా ! నేను నీ కింతవరకు రహస్యముల కెల్ల రహస్యతరమైన కర్మ జ్ఞాన భక్తి యోగములకు సంబంధించిన జ్ఞానమును తెలియ జేసితిని దీని నంతయు సాకల్యముగ విని-విమర్శించుకొని, నీ యిష్టాను సారము చేయుము' అన విని యర్జునుడు - 'ఇదేమి ? ఇంతవరకు నీవు డుపదేశించినదియు, నేను విన్నదియు గుహ్యతరమా ! ఇంకను గుహ్యతమము వినదగియున్నదా ? ఈ వినినదాని నంతయు నే నిపుడు సమగ్రముగ విమర్శించవలెనా ? విమర్శించి, తోచినట్లు చేయవలెనా ? ఇది నా తరమా ? ఇక నేను కడతేరు టెట్లు ?' అని విలపించ దొడంగెను పరదుఃఖాసహిష్ణుడగు ఆ దయామయుడు ప్రియమిత్రుని ఆ దుఃఖమును జూచి కరగిన హృదయముగలవాడై -

"సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ (18-64)

అన్ని రహస్యములలోను రహస్యతమమైన ఉత్తమ వాక్యమును చెప్పెద వినుము నీవు నాకు ఇష్టుడవు అందుచే, నీకు హితమైన దానిని నేనే తెలిపెదను' అని సెలవిచ్చి, 'మన్మనాభవ (18_65) శ్లోకమున ఇష్టప్రాప్తిని, 'సర్వధర్మాన్' (18_66) అను శ్లోకమున అనిష్టనివృత్తిని రెండు శ్లోకములలో తెలిపెను అం దనిష్ట నివృత్తియైనచో - ఇష్టప్రాప్తి తనంతనే సిద్ధించును కావున, దానినే రామానుజదర్శనావలంబులు ఆచార్యుల నాశ్రయించి, తప్తచక్రాంకితులై, ఊర్ధ్వపుండ్రములను ధరించి, దాస్యనామము నుంచుకొని, మహత్తరమగు మంత్రరాజమును బడయుదురు దీనికి చరమశ్లోక మని పెద్దలు పే రుంచిరి అనగా - 'మోక్షోపాయములలో - ఇకపైన లేదు' అనదగు ఉపాయమును (ప్రపత్తిని) తెలిపెడు శ్లోకమని యర్థము దీని గౌరవమును, అర్థగాంభీర్యమును లోకమున కెఱింగించుటకే గోష్ఠీపూర్ణులు శ్రీరామానుజులంతటి మహాత్ములను పదునెనిమిది పర్యాయములు త్రిప్పి త్రిప్పి, అనేక శపథములను చేయించి ఉపదేశించిరి శ్రీరామానుజులును అర్థగౌరవము నాలోచించి, నిగూఢముగా పూర్వాచార్యులు భద్రపరచిన తిరుమంత్ర మంత్రార్థములను ప్రజలయనర్థగౌరవమునే గాంచి, తా మాచార్యాజ్ఞోల్లంఘన మొనర్చినచో, తమకు సంభవించు కుంభీపాక నరకమునైనను సరకు గొనక, ఆర్తిగల ప్రజల కందరకును ఈ రహస్యమును వెదజల్లివేసిరి

గీతాసారతమ శ్లోకమున రామానుజ సంప్రదాయుల కెంతటి యాదరమో గ్రహించితిరా! భగవద్గీతను ఇంతగా అభిమానించు మతము మఱియొకటి లేదనుట తిరుగులేని మాట.

## నిగమనము

శ్రీ రామానుజ దర్శనము సర్వాత్మనా - భగవద్గీతా పాద చ్ఛాయను రేఖామాత్రమైనను తప్పక వర్తించుచున్నట్లు ఇందు కొన్ని ముఖ్యమైన యంశములు నిరూపింపబడినవి ఇట్లింకను ఎన్నెని యంశములు నిరూపింపవచ్చును కాని, అది యంతయు గ్రంథ విస్తర మగును కావున, ఇంతటితో నిది ముగింపుచేయబడుచున్నది



# యతిరాజ సప్తతి

(శ్రీ వేదాంతదేశికుల సంస్కృత మూలమునకు ఆంధ్రానువాదము)

'సంగీత సాహిత్య కళానిధి'

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

—✿—

క్షితిపయి గవితార్కిక కేసరి యన
వెలసి, వేంకటనాథుఁడన్ పేరుతోడ
సమరు వేదాంతదేశికోత్తముడు నాకు
హృదయ పీఠమునందు వసించుగాక!

* * *

సిరినిఁ జేపట్టి, గేస్తుగాఁ జెలఁగె నెవ్వఁ
డెవఁడు ప్రకటించె వేదము లెవఁడు దాను
పాంచరాత్రాగమము వెలయించె నట్టి
గురున కాద్యున కేను బ్రమొక్కు లిడువాఁడ

జగములకు మేలు గూర్చు యోచనము గల్గి
యెవరు నిలువెల్ల నిండ, నే నిముసమైనఁ
గినుక యను మాటయే యెఱుంగని మదంబ
శౌరి సహధర్మచరికి నంజలి ఘటింతు

ఎవని నేత్రాంచలము చలింప నీ జ
గములు పుట్టును, పెంపందు, సమయుచుండు
నట్టి సూత్రవతీ మనోహరుని శౌరి
దండనాయకుఁ గొల్తు నుద్దండభక్తి

ఎవని పల్కుల వేయి వెల్లువల్పొగడి
పూల కమ్మని తావి గుబుల్కొనంగ
నెలమిఁ బ్రాబల్కులకు నెల్ల నిక్క యయ్యె
నట్టి శఠకోపమౌని యుపాస్తి గందు

నిగమ తత్త్వార్థ మరచేతి నిమ్మపండు
గాఁగ నెవ్వాని కబ్బె నా యోగివరుఁడు
నాథమౌనీంద్రుఁ డేలు మండలమునందు
నాకు నేలిక యాతఁ డౌగాక నింక

అతని నరవిందనేత్ర విఖ్యాతి గల్గి
నాథభావాప్తిచే స్ఫురణంబు గల్గి
శుద్ధసత్త్వగుణోపేత శోభ గల్గి
శౌరి యవతార మన నొప్పు సూరి గొలుతు

కొంచె మేనియు దా క్షమాగుణము విడడు
పుణ్య జనులను బాధింపఁబోవ రెపుడు
మదము రాగము దాకని మహితచరితుఁ
డట్టి నాల్గవ రాము సమాశ్రయింతు

జిహ్వాగ్రస్పర్శ మింతైనఁ జెందబోక
సాధు బృందావన ప్రకాశంబు గల్గి
కృష్ణపాద కృతాదర కీర్తి గల్గి
నట్టి యామున తీర్థగాహన మొనర్తు

అఖిల జగములు సృజియించినట్టి విష్ణు
వాంఛితము దీర్చినట్టి కృపాప్రపూర్ణు
లబ్ధవర్ణు గోష్ఠీపూర్ణు, లక్ష్మణార్య
దేశికుని నాశ్రయింతు నిజ ప్రపత్తి

పతిని లోఁగొన్న ప్రాబల్కు పడతి కేవని
పలుకుఁ బోఁడవుల సింగార మలరె నట్టి
మహిత చరితుఁడు లక్ష్మణ మునివరుఁడు
పుచ్చుకొనుగాక నాదు కై మోడుపులను

నిగనిగలాడు జన్నిదము, నిట్టురమందున నూర్ధ్వపుండ్రముల్
ధగధగలాడు మేనున, ద్రిదండము కేలఁ జెలంగుచుండఁగా
సిగముడి శీర్షమధ్యమున శేఖరమై కనుపట్టఁ, బొల్చు ము
జ్జగముల పున్నెమైన యతిచంద్రుఁ, బ్రపన్నజనేంద్రు గొల్చెదన్

కూళతనంబుతోడఁ బగఁగోరెడువారికిఁ దీక్షభావమున్
మాలిమి గల్గు మా యెడల మార్దవముం బచరించి యేలుకోఁ
జాలిన మా యతీశ్వరుఁడు చక్కఁగ వర్ధిలె సోద్యమమ్ములన్
శీలముచే నభిన్నుఁడయి, శ్రీహరియాయుధ పంచకమ్ముతోన్

తొలఁగఁగఁజేసె శంకరుఁడు తొల్లిగఁ గల్గినవారి గర్వమున్
బలమున నుద్ధరించెఁ బ్రతిభా విభవమ్మున యాదవప్రభన్
జెలఁగి, యథార్థమున్ శ్రుతికిఁ జెందనిరీతి యొనర్చె వహ్వారే!
తలఁపగ రామసోదరుఁ డితం డతఁడేకద వేయిమారులున్!

కొంచె మెరింగి వేదములకుం గల యర్థము తారుమారు గా
వించెడివారిచేతఁ బ్రభవించు ప్రచారము రూపుమాఁకగా
నంచిత నీతి పంజరమునందుఁ దిరమ్ముగ నుండిపెట్టె మా
నంచిత భాగ్యమైన యతిచంద్రుని పల్కులు విస్తరిల్లెడున్

గురుజనరత్నసంచయము గుంభితమే ఘమనీయహార మ
ద్దిర! రవికాంతి గేరెడు యతిక్షితినాథుఁ డితండు నాయక
స్ఫురణము గల్గి వెల్గ బుధపుంగవు లెల్లర కిద్ది సర్వజా
యరమర లెల్ల దీర్చి, హృదయంగమమై విలసిల్లు నెప్పుడున్

పక్ష మొదలని యతిరాజు పర్వతంపు
వంశమున హారితత్వ మెప్పటికిఁ జెడదు
తత్వముద్భూత శుద్ధ శీతల సువృత్త
సారముక్తాళి భువి కళంకారమేని

పరమ విచిత్ర ఘన్నఁ డెడరాయఁడు విష్ణుపదాశ్రయంబు, నె
త్తరిని గళావిహీనతనుఁ బాల్పఁడు, పీడఁ గళంక యోగ సం
కరణి జడాశయోదయము గాంచఁడు, దాను పరాగవీథ్యనం
బెరుగఁడు మా యతీశ్వరకులేంద్రుఁడు, వాని భజింతు నెమ్మదిన్

అసదృశ బుద్ధిమంతు లనఘాత్ములు శ్రీహరిభక్తి సేవనా
రసికవరేణ్యు లోలి యతిరాజ మహా పదపద్మ భక్తినా
వసథము నాశ్రయించి హరిభక్తినిధానము ద్రవ్వికొంచు సం
తసమును గాంతు రొండొరులఁ దత్క్రయ విక్రయ లాభసంపదన్

కర మపవాద యుక్తమును, గర్కశమా పరవాది వాదమున్
దరుమగ నబ్ధి తూలి ఘతసమ్మునుఁ జెందగఁ బంకిలమ్ముగాఁ
బరగెను శ్లాఘ్య వాగ్ఝరిణి భవ్య యతీశ్వరకీర్తి చిల్లయై
విరచెను బంక మిప్పు డిది ఫీమల విందగు పండితాళికిన్

కుదురు త్రివర్గపుణ్యములకు న్నిలయ మ్మపవర్గసౌఖ్య సం
పదకుఁ, బ్రపన్న సంతతికిఁ బట్టుగు, శ్రీహరి దివ్యధామమున్
చెదరెడి చిత్తవృత్తిగల చేతనకోటికి జీవనౌషధం
బది యతిరాజ దివ్యపద మద్మిలిఁ బట్టితి నాశ్రయమ్ముగన్

ఊరుకుచేతనే పరుల యుక్తుల చిందర వంద్ర చేయఁగా
నేరిచి, నైగమార్థముల నీరనిధిం గడముట్టఁ జూచి, యు
వ్వారిగ శ్రీ యతీశ్వరుని పాదయుగమ్మున బద్ధ భావులౌ
వా రపవర్గమార్గ మనుపన్న మొనర్చెద రాశ్రితాళికిన్

మునుకొని వేదవృక్షముల మూలమునం దుపవిష్టుఁ డౌచు, దు
ర్జనుల శతమ్మునం గలుగు జంతు నెడల్పఁగ మూఁడు దండముల్
గొని, యల రంగరాట్ప్రణత కోమల మానస రాజహంసమా
మునిపతి రక్షకుం డగుతఁ బొందుగ మాదృశ మర్త్యకోటికిన్

జననము, మృత్యువన్ భయద సర్పము కాటు నిడంగ, నింద్రియా
ద్యనుభవ దుర్విషమ్ము మన కంతటఁ బ్రాకఁగ వద్ది ప్రీలఁగా
నొనరుచు మంత్రవిద్వరుఁడు, యోగి నరేంద్రుఁడు వైనతేయ కే
తనుని దృఢమ్ముగాఁ దలచి, త ద్విషమున్ హరియించుచుండెఁ దాన్

అనఘుఁ డితండు, సంయమికులాగ్రణి - లోన నడంగియున్న నా
ఘన తిమిరమ్ము స్వీయ నఖకాంతులచేఁ దొలగించి, తత్త్వ వా
క్య నయ నిదేశకేళి రసికమ్మగు పాణిసరోరుహమ్ముచే
మనమున జ్ఞానచిత్ర మసమానముగా లిఖయించుచుండెనో!

మాటనఁబడ్డ వేదముల మాటల యర్థము లుద్గ్రహింప నా
బోటి యధీర చిత్తములఁ బొందుగ వానిఁ ప్రవేశపెట్ట, నా
స్ఫోటిత పాటలాంబురుహ సుందరమా యతిరాట్కరాంగుళీ
కోటిఁ జెలంగు జ్ఞానమయ కోమల ముద్రను గందు మెప్పుడున్

నిగమశిర స్సరస్వతుల సేతువునై దరిజేరదీయు లో
వగపులు మాన్పు బాహ్యములు భగ్న ఘనర్చు మహోగ్రసంస్థితిన్
దగిలి తపించువారలకుఁ దద్దయుఁ బథ్యములున్, మనోజ్ఞముల్
జగతిని మా యతీంద్ర మునిసత్తము స్వాదువచఃపరంపరల్

తన్మయిఁ జిత్ర మిద్ది కద! చల్లనివాఁడు, శిఖాన్వితుండు - దో
షోపహతిక్రియన్ నియత మున్నతిఁగాంచిన యోషధీశుఁడున్
దాపము లెల్ల దీర్చి, ప్రజ దన్పెడి సూర్యుఁడు మా యతిక్షమావిభుం
డేపుగ మూఁడు వెల్గులకు నిక్కాగ శోభిలుచుండె నిత్యమున్.

పొలుపుగ విద్యలన్ నదులు పుట్టిన కొండయుఁ బుట్టు చావు బా
టలఁ బడి పర్వఁగా నలసటం గనువారికి నీడచెట్టు, వ్యా
కుల కుహనా మతమ్ము వడఁగూల్చెడి బాలదివాకరుండుఁ, దా
నిల యతిరాజు వర్ధిలుఁ ద్రయీకలశాబ్ధి జనించు చంద్రుఁడున్

మునిజనులెల్ల మెచ్చినది, ముక్తికి నిచ్చెనవంటి, దెల్ల స
జ్జనులకుఁ జేదగుల్కొన శాశ్వత భాగ్యఫలంబు బాప వా
సనలు శమింపఁజేసెడిది, సంయమిచంద్రుని దివ్యసూక్తియం
దని గహనార్థ మందినది - దాని ప్రసాదము మాకు గల్గుతన్ !

అమిత భవాతపాతురుల కందిన నీటి కొలంకు, వోసముల్
సమసినవారి నాల్కలకుఁ జక్కెర కల్పిన పాలధార, యా
గమముల మస్తకమ్ములకుఁ గన్నగు లక్ష్మణసూక్తి - నారక
ప్రమథన సేవనానుభవ భావపటుత్వ మొసంగి శోభిలున్

పలు సమయమ్ము లీ జగతి వర్తిలఁజేయుచు, శౌరి నర్మ లీ
లలు బొనరింప నాదిమ కులంబున నొక్కటి యంత్యవర్ణమున్
వెలయఁగజేయ, వైషయిక విశ్వము బ్రోవ విరాట్చమూవిభుం
డిల యతిరాజుగా నవతరించెఁ ద్రిదండముగాఁగ వేత్రమున్

క్షితి యతిరాట్ప్రబంధములు చేరినవారి మహోగ్రతాప సం
గతిఁ బరిమార్చు దుశ్చరిత గంధములన్ శమియింపఁజేయు వి
స్తృత బహుశాఖలం దనరు శ్రీహరిపాద మరంద ధారలన్
స్నుతము లొనర్చు వక్త్రజన నూతన కల్పన కల్పవృక్షముల్

లక్ష్యస్థానము బుద్ధికిన్ రసనకున్ లాస్యావహం బాశ్రితా
పేక్ష్యంబై, పరిశుద్ధమై, మధురమై, యేపారు కర్ణౌషధం
బీక్ష్య శ్రీపతిరత్నదర్పణము మౌనీంద్రోపదేశమ్ము సం
లక్ష్యాలక్ష్యములైన భావమణులన్ రాజిల్లఁ గూపారమై

యతిపతి సంప్రదాయ మను నక్షయమైన ధనమ్ముతోడ వ
ర్ధితమగు నాత్మబుద్ధి బలదేహములం జెలువారు పండితుల్
సతతము గండు తుమ్మెదల చాలు మునుంగు మదమ్ము నిండు గం
డ తలము గల్గు స్తనుల ఘటమ్ములనైన త్రుణీకరింత్రుగా

వలగొని రంగభూమి మనువారికి దాండవహేతు వౌచు, ని
శ్చల నిగమార్థశీలన రసజ్ఞులచేత గృహీతమౌచు, ని
స్తుల గుణసూక్తి ఘట్టనలతో రవళించుచునుండె బోరనన్
సలలిత సంయమీశ్వర యశఃపటహమ్ము దిశాముఖమ్ములన్

కుమతుల గూల్చు వాగ్నదులకున్ మొదలైన ప్రసత్య దుర్మత
క్రమ విపదహ్నిచే నొగులు గల్గినవారల కౌషధమ్ము లా
గమ సుదతీ కచాగ్రమునఁ గమ్మని పూల సమర్చినట్టి వే
సమయమునన్ సుధన్ గురియు శాశ్వతముల్ యతిరాజ సూక్తముల్

వేల్పులకేని లోఁబడని వేదములం బుడిసిళ్ళ ద్రావి, నా
క్కల్పనలం దెదుర్కొనిన కన్పడు బౌద్ధుల నుక్కడంచి, తాఁ
గొల్చుచునుండె మా మదులకుం బ్రమదమ్ము యతీంద్రుఁ డచ్యుతా
నల్ప గుణౌఘ మౌక్తికమ్ము లందగఁజేసెడి సూక్తిసూక్తులన్

ఓలి శివాగమం బనెడు నూతిఁ దగుల్కొని, కాపిలంపు వా
గ్జాలమునందు జిక్కువడి, గాటపు బ్రహ్మమతోదరమ్మునన్
దూలియు సన్నిపాతిం గడచి, దుష్కుహనావృత వక్త్రిమందునన్
వాలిన బ్రహ్మమున్ గరము బట్టిన లక్ష్మణమౌని వర్థిలున్

తెగని కణాద తర్కముల త్రిప్పటలన్ కపిలార్థ కల్పనో
పగతి కుమారిలా ప్రథిత భాషల విప్పఁగరాని ముళ్ళచే
సుగత మతప్రవర్తకుల సూత్రములన్ గిజుదింపఁబడ్డ యీ
జగతి పునఃప్రతిష్ఠఁ గనెఁ జక్కని శ్రీ యతిరాజ సూక్తులన్

వాద కుతూహల గ్రహము బట్టి యెదుర్పడఁగ నేగుదెంచు దు
ర్మదుల గోలయన్ కడలి బుక్కిట బట్టిన కుంభసంభవుల్
స్వాదు యతీంద్రు వాక్సుమరసంబును గ్రోలిన బంభర ప్రభుల్
మేదిని సర్వవైభవము మీరుచునుండి రుదాత్త భారతుల్

శిరమునఁ దాల్చువాఁడ యతిశేఖరసూక్తి పరీమళమ్ముచే
గరిమ వహించు సాశయము గల్గినవారి యడుంగు దమ్ములున్,
మరియుఁ దదన్య దుర్మత విమర్శమునన్ జెలరేగువారి ము
ష్కరుల శిరమ్మునం దెడమ కాలిడువాఁడ, నిదే గ్రహింపుఁడీ!

తొల్లిటివౌచు నీ భవము తోడుత వచ్చిన దుష్టవాసనల్
జల్లెడబట్టు శ్రీ యతికులప్రభుమార్గము నాశ్రయింపుమా
ఉల్లమ! చక్రివీక్షణము లుద్దవిడింబడఁ బాప వప్రముల్
చిల్లరపెంకులై పగుల శీఘ్రగతిం బరసౌఖ్య మందుమా!

కుమతుల గ్రంథజాలముల గొల్లఁగ జూచి మతాంకురమ్ములన్
దమిగొనువార లల్పముగఁ దారు గణింత్రు యతీంద్ర భారతిన్
విమల మురారి వక్ష మను పీఠము శోభిలఁజేయు కౌస్తుభం
బమిత కులాద్రి సామ్యమునకై వసియించిన నెంత యోగ్యమా!

ముదుసలి వేదముల్ మనికి బొందిన శ్రీ యతిరాజ భారతిన్
విదలిచి కొట్టనేమి? మరి పీనుల బెట్టిన నేమి? దుర్మతుల్
పదునుగఁ గమ్మ కప్పురపు వాసన లీను విటంక వీథులన్
బ్రదుకగ నుప్పనమ్ము కొనువా రభిమానము సూపువారొకో?

నలువ వచించె వేదముల నాల్గిటితోడుత హోమములందుఁ దో
య్యల నల శంకరుండుఁ దన యోగమునన్ నగ మిచ్చె నాఁతికిన్
ఇల బరతత్త్వమైన యతఁడే వశమయ్యెను గోపికాళికిన్
గలఁ గరు పుష్పసాయకుని ఘాతములన్ యతిరాజ సంశ్రితుల్

నిగమపు బాటసారులకు నీడ నొసంగెడు వృక్ష మాళలన్
దెగడినవారి కాశ్రయము తేఁకువ శిష్యుల మానసమ్ములన్
దగ నడిపించునేత భువనమ్ముల చీఁకటి జిమ్ముప్రొద్దు మా
ర్పు గనని సాగరుండు యతిపుంగవుఁ డగ్రణిగా త్రివిద్యలన్

పడిఁబడఁ బండ్లు గీటికొనుచుం బెడవాదము సేయువారికిన్
బడలిక దీర్చు నౌషధులు ప్రాజ్ఞుల నేలెడి రాజదండముల్
కదలిన బుద్ధికి న్నిధులు కర్ణసుఖమ్ములు సమ్మదామృతం
బిడునిడు మేఘముల్ యతికులేశ్వరసూక్తు లఘాపనోదముల్

సకలమునన్ బృథక్త్వమును జక్కఁగఁ జూపెడునట్టి దీపముల్
అకలుష విష్ణుతత్త్వ మరయం దమఁ బూనినవారి కాలసిం
శుక క్షుధఁ దీర్ప నప్పటికె పంటకు వచ్చిన కల్పవృక్షముల్
వికలత లేక చూచెదము విశ్రుతముల్ యతిరాట్ప్రబంధముల్

మురహరు భక్తియన్ కలువపూవుల తోటకుఁ బండువెన్నెలల్
పరగఁగఁజేయు మానివరువాక్యము లాత్మ మతాంధకారమే
పరమ హితమ్ముగాఁ దలచు వాదుల పేరిటి గుడ్లగూబలన్
బరువిడఁజేయు సూర్యకిరణమ్ములు ముక్తిరమానిధానముల్

ఏయెడ బాధలేనివి యతీశ నిబంధములౌర! పూత బో
ధాయన వాక్ప్రవాహమున నందములై పరిశుద్ధ బోధలన్
గాయజ దోషముల్ దొలఁగగా నిమురింపని ప్రజ్ఞతో సుధీ
నాయక బృందమందు రసనాడులు గోయు శితాననమ్ములన్

శ్రుతిపథ మంతయున్ బగులు చొప్పున మత్త మతంగయూధ ము
ద్ధతిఁ జెలరేగి యొండొకటఁ దల్లడ మందఁగఁజేయురీతిగన్
ప్రతి కథకుల్ వితండముగ వాదములాడెడి సంకులమ్ము శ్రీ
యతివరనాథుఁ డిచ్చమెయి నార్చినయంత నడంగు నప్పుడే

కుల విభవమ్ము తర్కములకు న్నిలయమ్ము సమస్త వేద వా
క్కులకుఁ బ్రపత్తికిన్ గొలువు కూటము తాపసవాక్య సంతతుల్
చెలువము గాంచు దర్పణము శ్రీపతితత్త్వము సూక్ష్మ, దీప మీ
యిల యతిరాజసూక్తి వెలయించును జ్ఞానము చేతనాళికిన్

హాత దురితమ్ములైన హరియంఘ్రి సరోజ యుగమ్మునందె శ్రీ
యతికులనాథు వాక్యము లనన్యగతిం బరిబద్ధ భావముల్
క్షితి సమరేంద్రు నింద్రునిగఁ జేయవు, స్కందుని వందనమ్మునన్
మతి నిడబోవు బ్రహ్మపయి మాన్యత సూపవు, జూడ వీశ్వరున్

చెలఁగి వివాద దర్పమున సెబ్బర లాడెడివారి గోలచే
నలిగిన వేదమాత వ్యసనమ్మును దీర్చ్చి యతీశ్వరుండు తాఁ
బలికిన వెల్ల, వేదముల భాగ్య ఫలమ్ములు తత్త్వ మెట్టిదో
తెలుపఁగఁ బుట్టినట్టివి క్షితిన్ బ్రవహించు సుధాప్రవాహముల్

ధర నిగమమ్ము లెల్ల దలఁదాల్చిన శ్రీ యతిరాణ్మతమ్మునన్
బరులు స్వపక్షదోషములు వత్తిలఁజేసిన నేమి? యెవ్వడేన్
మొరకుఁడు మేనిపై బురద బూసుక యయ్యది జారుచుండగా
నరమర లేక యాకసమునందున బూసిన నేమి లోపమా?

లోకము గ్రుడ్డిదైనతరి లో బొరపొచ్చెము లేని స్నిగ్ధతన్
దేకువ లక్ష్మణార్యమణిదీపము ధాత్రి వెలుంగకున్నచో
నేకరణిన్ ధుతాఘులు తరించెడి వారల విద్యవంటి చెన్
జీకటులన్ గుతర్కమను చిల్వల దుర్మత నాగలోకమున్

యతిపతి సూపినట్టి మత మందుత? క్రొత్తది - దానికన్న నే
మతము పురాతనమ్మొ? యదిమాత్రము నిగ్గుగ దేలెనేమి? యా
స్థితి యొకవేళ గల్గినను జెచ్చెర దన్మతమండలం బనా
దృతి నొనరించువారె గుహదేవుఁడు, నా ద్రమిడుండు, టంకుఁడున్

శ్రుతుల మహత్త్వము న్నిలుపు సుందర లక్ష్మణమౌని వాక్యముల్
శ్రుతికుహరమ్ములందు వినుచున్ సతత మ్మమృతప్రవాహమున్
క్షితిని తదీయ సేవనముచే విలసిల్లిన బుద్ధి గల్గు పం
డితుల వచోమృతం బదియు నిత్యము సజ్జనపాళి గ్రోలనా

భోగపరాఙ్ముఖుల్ విబుధపుంగవు లప్రతిమానభక్తితో
చాగిలి మ్రొక్క, యాదలల సమ్మతిఁ దాల్చినయట్టి భాష్యకృ
ద్యోగివరేణ్యు శ్రీచరణయుగ్మము మోహ మహా వనమ్మునన్
రేఁగిన నా మనోమదకరి న్నియమింపగ శృంఖల మ్మగున్

అనిశముఁ బాపముల్ గడుగునట్టిది ముక్తుల కన్నతల్లి, యా
మునముఖ తీర్థయుక్త రసపుష్టి జెలంగిన దెట్టి ఖేదమున్
గననిది, శ్రీ యతీంద్ర కరుణామయ దివ్యనదీమతల్లి తా
దోనదోన తారుపొట్టపయిఁ దొట్టి నిలంబడియున్న నా పయిన్

వాసిగ లక్ష్మణార్యుని ప్రబంధ మరందము లాను బుద్ధి బల్
దోసము లీను నర్థములతో ముడివడ్డ చినుంగు బొంతలా
కూసు మతమ్ములన్ గనునె? కోమల మౌక్తికముల్ రహిల్ల గం
గా నతిఁదాల్చు శంకరుఁడు కప్పల కాల్వ ధరింప నెంచునే?

ఏ కరుణాసుధాంబునిధి యిచ్చిన శుద్ధజలమ్ము గ్రోలి, మే
ఘాకృతి హస్తిశైలపతి యర్మిలిఁ గోర్కుల మేరమీద నా
హా! కురిపించు నా యతికులాగ్రణి గొల్తు - శుభాంకరిష్ణువై
శాకథ లల్లువారి తన కంట కణంచెడి మేటి ధీనిధిన్

ఎవని గుణమ్ములుం బొగడి, యెవ్వరి సూక్తుల నాలకించి, ధీ
వివృతిఁ జెలంగ మా యశము విస్తరిలెన్ జలరాశి దన్క, వై
ష్ణవ మగు మూర్తి యద్ది యశమ్ము వెలుంగ ద్రిదండ ధారియై
యవని ద్రయీ శరణ్యమయి, యక్షరమై, ససువర్ణ చేలమై

రచ్చల ధూళిపైనఁ బడి రక్షగ నిల్చు శిరమ్ములందు వి
ద్వచ్ఛయ మూను లక్ష్మణుని పాదయుగమ్ము భజించు భిక్షుకై
వచ్చుచుఁ బోవుచుండు తటిఁ బావనమై యతిరాట్పదద్వయం
బచ్చువడంగఁ బద్మ మకరాంకములన్ భరియించె ధాత్రియున్

యతిపతి యాజ్ఞలన్ వినక, యక్కట! నైక కుతంత్ర లుబ్ధులై
క్షితినిఁ గుదృష్టు లెల్లరును జేసిన దుర్నయ నిర్ణయమ్ములన్
మతిసెడె బాదరాయణుఁడు ప్రమాణ్పడె రామచరిత్రకారి వం
చితుఁ డయె శ్రీశుకుండు - వెతజెందిరి తక్కు మహర్షు లందరున్

పకృతి చిన్మయోత్కులు జపించెడివారికి విష్ణుమాయ యన్
జీకటిరాత్రి తల్లి యొడిజేరగ దీసెడి రీతి నుండు నా
శ్రీకర లక్ష్మణార్యమునిచే నడుపంబడు నాడు బుద్ధి హా!
హా! కలితార్థ మయ్యె జగమంతట భీతి హరించువానిచేన్

కలశపయోధికన్య కడగన్నులఁ దాండవమాడు వాలుచూ
పుల బులకించి వెన్నుడు ప్రమోదమునన్ గనువిప్పఁగా నన
ర్గళ మగు నా మనీష యుదిరమ్ము గనుంగదె సంయమీంద్ర వా
గ్వలయము తోడుతన్ వెడలివచ్చిన నైగమ శీర్ష సౌధమున్

యతిపతిమార్గమందుఁ జనినందునఁ బుట్టుకతోడ శుద్ధమా
మతిగలవారి వాక్యముల మాధురి మాగ్ధము శాశ్వతత్వమున్
జతురత యుండనిం డటుల చయ్యన దర్కరణమ్మునందు నా
హాతుఁడయి మాదు ప్రేమాల నెవడైనను గద్గవ విప్పకుండునే!

న్యాయము నాచరించితిని, వ్యాకరణమ్మును బిండిగొట్టితిన్
బాయక నైకమార్గములు బట్టుక నూరితి, సాంఖ్యయోగముల్
రాయిడి బెట్టినాఁడ నని రంతులు వల్కిననేమి మాకగున్?
శ్రీ యతిరాజుగూర్చిన విశీర్ణ తమమ్ముల నేఁగు మానవుల్

మహిత యతీశ్వరుండు నిగమత్రయసార ముపన్యసింపఁగాఁ
దహతహ లాడె బోధము, వితాకు నిడెన్ కపిలాఖ్యతంత్రమున్
మహినిఁ గణాద తర్కము శమంబు వహించెఁ, గుమారిలోక్తి యున్
గుహరము సొచ్చె, సౌరభము గోల్పడె శంకరముఖ్యవాదముల్.

ప్రబ్బి యగాధమైన యతిరాజ యశోంబుధిఁ దోఁగువారిచే
నబ్బె మహాభిషేకము కథాహవమందు వివాది ప్రజ్ఞలన్
మబ్బుల బింజ పింజలుగ మాపుటకున్ సుడిగాలులైన యీ
డెబ్బది పద్యముల్ బుధుల డెందములన్ కలిగించు మోదమున్ ।

ఎగయుచు నాశలన్ మదపు టేనుగుల వేగమె బట్టి, యోగిరా
ణ్ణగపతిపాదమం దిడిన నాదము సత్కవితార్కికావళిన్
మృగపతియైన ధీరుఁ డొనరించిన దియ్యది వాదమందుఁ గాం
క్ష గలిగియున్నచోఁ బదుల కర్ణములన్ రవళింపఁజేయుఁడీ ।

న్యాయవిదూరులైన కుహనా మతకర్తలు వెట్టు విప్లవ
చ్ఛాయలు దీరగా నుపనిషత్తులకై యుపచారదీపమే
నీ యతిరాజ సప్తతిఁ బఠించినవారు విభూతియుగ్మమున్
దోయిటి పండుగాఁ గనెడి దొడ్డ మనమ్మును గాంత్రుగావుతన్ ।

* * *

ఇల యతిరాజసప్తతి బఠింపదలంచినవారు – సత్కథా
వళు లరచేతిపండయినవారయి, వేదము లెల్ల సమ్మతిన్
దల ధరియించు, స్వాదు వచనంబులు వల్కెడివారలై, రుషా
కలుషితులైనవారలనుఁ గాంతి విహీనులఁ జేయువారలౌ



# శ్రీ రామానుజీయ మనోభావన

'శిరోమణి - పండితరాజ - న్యాయమీమాంసార్ణవ
దేశిక దర్శన ధురంధర - పూర్వోత్తరతంత్ర ప్రదీప'

## శ్రీమాన్ డి టి తాతాచార్యులవారి సంస్కృత మాతృకకు ఆంధ్రానువాదము

— అనువాదకులు —

ఉభయ వేదాంత శిరోమణి

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం ఏ

—❋—

మహాత్ముఁడుకాని, దురాత్ముఁడుకాని, సదాత్ముఁడుకాని, తాను జీవించిన కాల మందలి మానవ విజ్ఞాన సీమను అతిక్రమింపకయే ప్రవర్తించును లేక, నివర్తించును దీనిని ఎవరును అతిక్రమించుటకు ఇచ్ఛగింపరు భగవద్రామానుజులును తమ కాలము నాఁటి విజ్ఞానమును అందిపుచ్చుకొని, మత ప్రచారము కావించిరి మానవుని విమయగ్రహణశక్తి తత్తద్దేశకాలములకు సంబంధించిన ఐతిహాసిక, రాజకీయ, భౌగోళిక విజ్ఞానములను సాక్షాత్తుగగాని, పరంపరగాగాని తప్పక గ్రహించితీరును దార్శనికులు, సమాజనేతలు, ధర్మప్రచారకులు - వీరందఱు ఈ విమయమును ఆచరణలో చూపి యున్నారు ఇట్లే, తమ తమ రచనలను కావించియున్నారు భగవద్రామానుజాచార్యులు ఈ మార్గముననే గ్రంథములను రచించిరి లోకవ్యవహారము కాలానుసారముగ పరివర్తనశీలమని తలంచి, దానిని వదలిపెట్టిరి జీవనక్రమము సైతము ఆర్థిక, రాజకీయములకు అధీనమని భావించి ఉపేక్షించిరి వ్యవహార ప్రపంచమును కాలానుసార ముగ మార్చుటకు ప్రయత్నించిరి మఱియు, చాలకాలముగ వచ్చు చున్న మానవ భావనా ధోరణిని ఆకళించుకొని, దానిని చక్కగా

సంస్కరించి, యుక్తి - ప్రమాణ - అనుభవములతో విశదీకరించిరి మే మిపుడు శ్రీ భగవద్రామానుజుల దార్శనిక వాదమునంగల ప్రస్ఫుట భావనా ధోరణిని ఉపపాదించుచున్నాము

## దర్శన వాద సరణి

'ఈ ప్రపంచము కల్పితమా ? పరినిష్పన్నమా ? లేక, పరతంత్రమా ?' అను సమస్య - అనాది కాలముగ నున్నదే ఇది మాధ్యమికుల గ్రంథములలో అనువదింపబడి, దూషింపబడినది ఈ మూడు విధములైన ప్రశ్నలు విమర్శకులకు ఎల్లప్పుడు ఎదురగుచునే యుండును ఈ ప్రశ్నలకు శ్రీ శంకరాచార్యులవారి సమాధానము - 'ఈ ప్రపంచము కల్పిత' మని శ్రీమద్రామానుజులు - 'ఈ ప్రపంచము పరినిష్పన్నము, పరతంత్ర' మనియు, 'చిదచిత్తుల ద్వారా పరినిష్పన్నము, ఈశ్వరునకు పరతంత్ర' మనియు సప్రమాణముగా వివరించిరి శ్రీమదానందతీర్థులు - 'పరతంత్ర' మని సిద్ధాంతీకరించిరి

ఇట్లుండ, పూర్వమీమాంసకులు ఫలాసంయోగవాదము (ఫలముతో సంబంధము లేదు), ఫలసంయోగవాదము (ఫలముతో సంబంధము కలదు), అనిష్టాననుబంధ ఫలసంయోగవాదము (అనిష్టముతో సంబంధము లేని ఫలసంబంధము) అనుచు, వేదార్థ విచారమును ప్రక్కదారి పట్టించిరి శ్రీమద్రామానుజులు - 'సంధి మిచ్ఛన్తి సాధవః' (సజ్జనులు సంధిని కోరుదురు) అను న్యాయము ననుసరించి, వారి ఆశయములను అంగీకరించుచు, పూర్వోత్తర మీమాంసకులకు ఏకశాస్త్రమును యుక్తిప్రమాణములతో సమన్వయించి చూపిరి

'వేదములు తెలిపిన కర్మలను అనుష్ఠింపవలెనేకాని, ఫలమును కోరరాదు, యజ్ఞయాగాది కర్మలను ఎట్లు చేయవలయును ? వేనితో

చేయవలయును ?' అని ప్రశ్నింపవలయునేకాని, ఏ ఫలమునకై చేయవలయును ?' అని ప్రశ్నింపరా' దని సామాన్యముగా ప్రాచీనులైన మీమాంసకులు (వేదార్థ విచారకులు) తలంచుచున్నారు ఇదియే ఫలాసంయోగవాదము 'శాస్త్రము స్వతంత్రమైనది ఇది నిష్ఫలమైన కార్యమునందు పురుషులను ప్రవర్తిల్లజేయదు ఫలసహిత కర్మలనే విధించును జైమిని మొదలగువారు లోకానుభవము కలవారు' అని ప్రాభాకరాదులు ఫలసంయోగ వాదమును దూషించిరి ఇది వారి అభిప్రాయ సారము

కాలానుసారముగ సమాజమువలె అభిప్రాయములును మారుచుండుట అనివార్యమే యగుచున్నది కావున, కుమారిలభట్టు మొదలగువారు ఫలసంయోగవాదమును ఆదరింపసాగిరి 'చపేటా ప్రహారమును (చెంప దెబ్బను) తప్పించుకొనుటకు ఏ జడబ్రహ్మచారియైనను ప్రయత్నించును ఇట్లే, ప్రయోజనమును చెప్పనిదే - ఎవఁడును, ఏ కార్యమును చేయఁడు ప్రయోజనము తెలియక, ఏ మందబుద్ధియు కార్యాచరణమునకు పూనుకొనఁడు '(ప్రవృత్తి జ్ఞానముచే ప్రయోజన మేమి ?' (కుమారిల శ్లోక వార్తికము) ఇది వారి ఆశయము

నైయాయికులు ప్రబలమైన అభిష్టముగా చేరని యిష్టప్రాప్తియే ఫలమని తలంచుచున్నారు అదియే విధికి అర్థమని వారు ప్రతిపాదించిరి శ్రీమద్రామానుజులు దీని నంతటిని పర్యాలోచించి, సారమును గ్రహించి, విలక్షణమైన సిద్ధాంతమును ప్రవర్తింపఁజేసిరి మీమాంసకుల మతమున ఈశ్వరుఁడు లేఁడు నైయాయికుల మతమున పురుషసంస్కారమే ప్రధానము రామానుజులు - 'ఈ ప్రపంచము భగవదధీనమై, పరతంత్రమై యున్నందున, భగవన్నిగ్రహము పాపముగను, భగవదనుగ్రహము పుణ్యముగను పరిగ

ణింపఁబడుచున్నది కావున, ఫలాపేక్ష లేని కర్మానుష్ఠానము ఆవశ్యక' మని ఉపదేశించిరి ఇందువలన, 'వేదబోధిత కర్మ లన్నియు భగవ దారాధనా రూపములు' అను భావముతో అనుష్ఠింపవలయునని స్పష్ట మగుచున్నది జీవుఁడు భగవచ్ఛేషత్వైక స్వరూపుఁ డగుటచే, అనగా - భగవంతునకే ఉపయోగపడువా డగుటచే, భగవదాజ్ఞ చొప్పున చేయు కర్మలలో ఫలాపేక్ష యుండదు 'కుర్వ న్నేవేహ కర్మాణి' అను శ్రుత్యర్థమును అనుష్ఠానమున చూపినట్లైనది దీనిచే ప్రాభాకర - కౌమారిల - నైయాయిక మతములను అనుసరించుచునే, భగవ చ్ఛేషత్వమును బోధించు ఔపనిషద మతమును అంగీకరింపఁ జేసిరి ఈ రీతిగా, పై వాదములకు అవిరుద్ధముగా, లోకవేదసమ్మత ముగా ఎట్టి బాధలు లేని పద్ధతిలో - మానవ జీవితమున సంప్ర దాయములను, ఆచరణ విధానమును ఉపదేశించిరి

## సంప్రదాయమున సమదర్శనము

ప్రతితంత్రసిద్ధాంతముగా (ఆ యా మతములయందు ప్రత్యే కముగ గ్రహింపఁబడిన సిద్ధాంతములు ప్రతి తంత్ర సిద్ధాంతములు ) వీరు ప్రపత్తిని స్వీకరించిరి దీనికి ఆఱు అంగములు కలవని సంప్ర దాయవేత్త లందురు వీనిలో ఆనుకూల్య సంకల్పము మొదటిది కావుననే అనుష్ఠానమునను ఇది మొదటిదిగా పేర్కొనఁబడుచున్నది 'చరాచరములయిన భూతము లన్నియు భగవంతుని శరీరము కావున, దానికి అనుకూలముగా మనము ప్రవర్తింపవలయుననుట నిశ్చయ' మని దీనినిఁ గూర్చి అహిర్బుధ్న్య సంహిత చెప్పుచున్నది శ్రీమద్రా మానుజులు తమ శ్రీభాష్యమున జైన బౌద్ధాదుల మతములను నిరా కరించుచు, కొన్ని అధికరణములను వ్యాఖ్యానించియుండిరని ఈ సంద ర్భమున మనము గుర్తులో నుంచుకొనవలసియున్నది ఆ వ్యాఖ్య - దార్శనికుల వాద ప్రతివాద పద్ధతి ననుసరించి గావింపఁబడిన దనుట

యుక్తము సమాజ సామాన్య మీ విషయమున వీరికి విశేషించి అభిప్రాయభేదములు లేవు కరచరణాదిరూపమున బహు విధములుగ నున్న ఈ శరీరమును రక్షించుకొనవలయును — అట్లే భిన్నము, అభిన్నము, సుఖదుఃఖాత్మకము అయిన ఈ జగత్తును రక్షించుకొనవలయును' అని బోధిచర్యావతారికలో చెప్పఁబడిన విషయమును విమర్శకులు గమనింపవలసి యున్నది ఈ విషయమును శ్రీమద్భాగవతమునందును — తన ప్రాణములు, ధనములు, బుద్ధి, వాక్కు — వీని ద్వారా ఇతర ప్రాణులకు శ్రేయమును కలిగించుటయే తన జన్మకు సాఫల్య' మని నుడువుచున్నది అహిర్బుధ్న్యసంహిత, బోధిచర్యావతారము, శ్రీమద్భాగవతము — వీనిలోని పై వచనములను పరిశీలించితిమేని, శ్రీమద్రామానుజుల యుపదేశము బౌద్ధ ఆచార్యుల ఉపదేశములకంటెను భిన్నముకాదని తెలియఁగలదు

## లోకానుశాసనము

మానవ జీవనమున జీవన సరణి మూడు విధములుగా నున్నది (1) శాస్త్రీయ విచార ధోరణి (2) నిత్య, నైమిత్తిక, కామ్య, కర్మానుష్ఠాన-సరణి (3) దైనందిన మానవ జీవన నీతి మంజరి అని వీనిలో — శాస్త్రీయ విచార ధోరణి ఎన్నడును అనుభవమునకు రాదు కావుననే అది ఎగుడు దిగుడుగా ప్రవర్తించుచు, అడుగడుగునను పరస్పర విరుద్ధ మగుచున్నది ఇట్లే, నిత్య — నైమిత్తిక కామ్య పరంపరలు భేదించుచున్నవి కాని, సమాజ జీవననీతిమంజరి మాత్రము ఎన్నడును మానవ జీవన తరువును వదలివేయదు వాదశీలురు, భావనాకుశలురు, పరమైకాంతులును మూఁడు విధములుగాఁ గల మానవ భావనా ధోరణిని ఉపేక్షించి, వీనిని మూడింటిని సంకీర్ణ మొనరించి, ఆత్మానుభవ విరహితులై, ఆచరణమున అసమర్థులై, వాదమాత్ర

లుబ్ధులై, 'శాస్త్రీయము' అనుపేర, సంప్రదాయ విషయకమగు కోలాహలము గావించుచు, అజ్ఞానులను క్రిందికి త్రోయుచు, తాము నుమఱింత క్రిందికి పోవుచున్నారు ఇట్టి దుర్దశయే బౌద్ధ సంప్రదాయమును కలుష మొనర్చి, నవీన బౌద్ధము తానును తిరోహిత మైనది బుద్ధుఁడు లోకవ్యవహారమున ఎట్లు నడచుకొనవలసినది బోధింపలేదు కాని, అతని అనుయాయులు అవకాశమునుఁబట్టి, సంప్రదాయ మను పేర, సదాచారములను, దురాచారములను సల్పించి, చివఱకు బౌద్ధమతమునొక్క ఉదాత్తతను నామమాత్రావశిష్టము గావించిరి

ప్రస్తుతము రామానుజీయుల పరిస్థితియు - రామానుజుల ఉపదేశములలోని ఉదారగుణమును వీడి, కుంఠితమై యున్నది

పతితులను ఉద్ధరించుట, జ్ఞానమును వ్యాప్తి చేయుట, సర్వ సమతాదృష్టి, అనేక మార్గములలో మానవ సమాజమును ఏకీకరించుట, దేశ విదేశ పర్యటనము, తత్త్వప్రచారము - ఇవి రామానుజుల ఉపదేశములలోని సాధారణాంశములు మన మీ నాఁడు అవ్యవస్థలో పరాకాష్ఠను చేరితిమి రామానుజుల దార్శనిక తత్త్వమును సామాన్య రూపముననైనను మనము ఎఱుఁగము ఇక విశేష విషయములలో మనము ఇతరులకంటె భిన్నులమైనట్లు దూరముగా నుండి, సమాజమునుండి బహిష్కరించుటలో శ్రద్ధ కలిగియున్నాము పతితులను ఉద్ధరించుటను ఏనాఁడో మఱచితిమి కావుననే - మన మీ నాడు పతితప్రాయులమై, ఇతరులచే క్రిందికి త్రోసివేయఁబడి, మానముగా నున్నాము జ్ఞానమును వ్యాప్తి చేయుటలో ప్రవృత్తియే లేదు అంతః కలహములయందును, సామాజిక కలహములయందును మన ధోరణి అనితరసాధారణమై యొప్పుచున్నది సర్వసమతాదృష్టి కలిగియుండుటకు ఆధ్యాత్మికజ్ఞానము ఆవశ్యకము ఆప్తులు, బంధువులు అయిన వారితో కలహించు మనకు - సర్వ సమతాదర్శనమున అధికార

మెక్కడిది? మానవ సమాజమును ఏకీకరించుటలో భాగస్వామ్యము వహించుటయే మన సిద్ధాంతము ఇది మన పూర్వాచార్యుల అనుష్ఠానమున ఉండెడిది కుక్షింభరులమైన మనము దేశ విదేశ పర్యటనమున ఆదరణ కలవారమే కాని, జ్ఞానమును ప్రసార మొనర్చుటకు కాదు ఇది యీనాటి మన పరిస్థితి

అకృత్యకరణము, కృత్యాకరణము రెండును దోషములని ప్రాచీనులు చెప్పిరి ఇవి రెండును మనలో నేడు కానవచ్చుచున్నవి. మన సమాజమున – 'రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్' అను ఘోష నిత్యము వినఁబడుచున్నది కాని, ఆ యాజ్ఞ యెట్టిది? ఎచ్చట నున్నది? ఏ ప్రయోజనమునకై యున్నది? దానిని ఎవరు అనుష్ఠించిరి? అనుష్ఠించిన విధము ఎట్టిది? ఈ మొదలగు ప్రశ్నలే మనకు కలుగవు కలిగినను, సమాధానము చెప్పువారు లేరు శ్రీభాష్య కాలక్షేపములు గావింపవచ్చును ద్వాత్రింశత్ విద్యలలో ఏ యొక్క బ్రహ్మవిద్యను పరంపరగా అనుష్ఠించుట ఎఱుఁగనివారమైనను, వాని పూర్వపక్షసిద్ధాంతముల నిరూపణమున సమర్థుల మగుచున్నాము లేక, ద్రావిడ వేదాంతములను అధ్యయన మొనర్పవచ్చును 'తెంగలై, వడగలై' సంప్రదాయ భేదములను జిహ్వాకండూతి తీఱునంతవఱకు ఉపన్యసింపవచ్చును లేక – పరస్తైకొంతులమై, ధనికుల అనుగ్రహముతో సులభముగా మన కోరికలను తీర్చుకొనుచు జీవింపవచ్చును ఇది యంతయు రామానుజాజ్ఞ యని చెప్పుట యుక్తము కాదు రామానుజుల మాటలలో – ఆ యాజ్ఞ ఇట్లున్నది – 'సత్సంతాన ప్రసూతుఁడు, సదాచార నిరతుఁడు, ఆత్మగుణోపేతుఁడు' అని యనుచు, ఆత్మగుణములను ప్రస్తుతించిరి ఆత్మగుణములే ప్రధానములైనపుడు, శాస్త్రాధ్యయనము గౌణము కాఁగలదు ధర్మసూత్రకారులును ఆత్మగుణములే బ్రహ్మప్రాప్తి సాధనము లనియు, ఇతరములు కావనియు నిస్సంకోచముగా, స్పష్ట

ముగ చెప్పియున్నారు ప్రాకృత రూపములు విజృంభింపనున్నపుడే ఆత్మగుణములు వికసింపఁగలవు ప్రాకృత గుణములు విజృంభించి నపుడు ఇవి ఖ్యాతి - లాభ - పూజా హేతువులై, అహమహమికతో తోఁణికినలాడుచుండును ఆత్మగుణములు వికసించినపుడు ఈ శుష్క పాండిత్యము తలక్రిందు లగును పరస్పర ద్వేషాసూయాదులు సూర్యుని సన్నిధిని చంద్రకిరణములవలె తిరోహితము లగును శరీర మును విడిచివేయుటకు ముందే, కామ క్రోధాదుల వేగమును ఎవఁడు జయించునో, అతఁడే ముక్తుఁడు, అతఁడే సుఖముగా నుండగలవాఁడు' అని శ్రీకృష్ణపరమాత్మయు చెప్పియున్నాఁడు

దీనికి విరుద్ధముగా మనము ఆత్మగుణములను అలక్ష్యము చేసి, ప్రాకృత గుణములతోనే- 'రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధ తామ్' అని ప్రత్యక్ష విరుద్ధముగా ఘోషించుచు, చులకనయై పోవు చున్నాము ఆత్మగుణములు అభివ్యక్తములైనపుడే ఫలాభిసంధి రహితముగా కర్మానుష్ఠానము గావింపఁగలము ధర్మసూత్రకారులు - గర్భాదాన, పుంసవన, సీమంతోన్నయనాదులు ఎనిమిది, నాలుగు వేదవ్రతములు, స్నానము, సహధర్మచారిణీ సంయోగము, అయిదు మహాయజ్ఞములు, ఏడు పాకయజ్ఞములు, ఏడు హవిర్యజ్ఞములు, ఏడు సోమసంస్థలు అనునవి నలుబది సంస్కారములు ఆత్మగుణ ములు ఎనిమిది సర్వభూతదయ, క్షాంతి, అనసూయ, శౌచము, అనా యాసము, మంగళము, అకార్పణ్యము, అస్పృహ - ఆ నలుబది సంస్కారములు, ఈ ఎనిమిది ఆత్మగుణములు కలవాఁడు బ్రహ్మ సాయుజ్య, సాలోక్యములను పొందఁగలడు నలుబది సంస్కారము లలో కొన్ని లేకున్నను, ఆత్మగుణములు ఎనిమిది ఉన్నచో, ఆతఁ డును బ్రహ్మసాయుజ్య, సారూప్యములను పొందఁగలడు నలువది సంస్కారములలో కొన్ని లేకున్నను, ఆత్మగుణములు ఎనిమిది

ఉన్నచో, ఆతఁడును బ్రహ్మసాయుజ్య, సాలోక్యములను పొందఁ గలఁడు (గౌతమ ధర్మసూత్రములు 7, 13)

ఈ విధముగా రామానుజుల హృదయము సర్వమును సమన్వయపఱచినది - ఏదియో యొక యంశమును స్వీకరించి కాదు భగవద్రామానుజులు శాస్త్రీయములైన వాదోపవాదములను ఏకత్రీకరించి, సమన్వయించిరి ఇట్లే, సామాజికాచారములను సైతము కాలానుసారముగ సంస్కరించిరి ఆ విధముగా నడచుకొనునట్లు ప్రజలను ప్రేరేపించిరి కావుననే పలువురు భిన్నసంప్రదాయముల వారు రామానుజుల నాశ్రయించిరి నేఁటికిని, దూరదర్శులగువారు - అద్వైతసంప్రదాయస్థులయినను, రామానుజీయులయందు గౌరవ భావమును గలిగియున్నారు

ప్రపంచమున పరమార్థమే యెల్లపుడు సమగ్రముగ వర్ధిల్లదు లోకవ్యవహారముకూడ ఆవశ్యకమై యున్నది లోకవ్యవహారమునకు లోకజ్ఞాన మావశ్యకము శాస్త్రవ్యవహారము శాస్త్రజ్ఞానము నపేక్షించును లోక - శాస్త్ర విముఖులు రెండు విధముల అనర్హులు మొదట లోకము తర్వాత పరమార్థము భుక్తిలేని ముక్తి యెట్టిది ? భుక్తి నిఁబట్టియేకదా అన్ని వ్యవహారములు ఏర్పడుచున్నవి ! శ్రీ భగవద్రామానుజుల మార్గము ననుసరించు మనముకూడ లోకవ్యవహారము ననుసరించి శాస్త్రజ్ఞానము నార్జించినచో, తప్పక మేలు కలుగగలదు ఆ రీతిగా కానినాడు, చెదరిపోయిన మేఘశకలములవలె, మన జీవితములను సైతము పాడుచేసికొనిన ట్లగును కావున, 'క్షురస్య ధారా నిశితా దురత్యయా' కత్తి అంచు మిక్కిలి పదునైనది తప్పించుకొన శక్యము కానిది' అను రీతిని లోకము ననుసరించి జీవితమును గడుపుచు, రామానుజార్య దివ్యాజ్ఞను ఆచరణమున చూపుట మన కర్తవ్యము

శ్రీ వేదాంతదేశికులు ఈ యర్థమునే - 'నిర్విష్టం యతిసార్వభౌమ వచసా మావృత్తిభి ర్యావనమ్' యతిరాజుల దివ్యసూక్తులను ఆవృత్తి చేసికొనుచు - 'యౌవనము గడచినది' అని తమ దివ్య జీవిత విధానమును తెలిపిరి ఇపుడు కాలము మారినది తలక్రిందులైన యతిరాజసూక్తుల ఆవృత్తి - ప్రయోజనకారి కాదు సామాన్యులకు బోధించుట నేటికిని ఆవశ్యకమే అనుభవము లేనివాఁడు బోధించుటకు అనర్హుఁడనుట నిశ్చయము కావున, శ్రీరామానుజుల దివ్యాజ్ఞను తాను అనుష్ఠించి, ఇతరులచే అనుష్ఠింపఁజేయఁగోరు శ్రద్ధాళువులు - ముందు ఆత్మగుణముల విషయమున శ్రద్ధ గలిగియుండవలయును ప్రాకృతగుణముల ప్రభావమునకు లోను కారాదు అట్టి వారికి రామానుజాజ్ఞ కరతలామలక మగును స్థిరమతి, దీనబంధువు, పరిత్యక్తాభిమానుఁడు, స్వపర హితైషి అయినవాఁడు ఆచార్యుడు కాఁదగును ఇట్టి ఆచార్యులవలననే రామానుజార్యాజ్ఞ వర్ధిల్లును

"నిత్యశ్రీ ర్నిత్య మంగళమ్



# శ్రీ రామానుజ తారావళి

'కవికోకిల విద్వత్కవి కావ్యకళానిధి'
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**

—*—

శ్రీమద్భూతపురీమహోదయ ! దయాసింధూ ! జగద్బాంధవా !
శ్రీమత్కాంతిమతీసతీప్రియసుతా ! శేషాంశసంభూత ! మా
యామేయాంధతమఃప్రభాకర ! అజేయక్షోణి సంచార ! నీ
నామం బెప్పుడు మాకు జీవన మనంతప్రజ్ఞ ! రామానుజా !

కుందస్మేర ముఖారవింద విలసత్ గోవింద నిధ్యాసు, ని
ష్పంద జ్ఞాన నిధాను, మానితిలకున్ వందారు మందారు ఆ
ళ్వందారున్ స్మరియించి, తచ్ఛుభ మనోవాంఛాప్రకారంబు పెం
పొందన్ భాష్యము సంతరించితివి భావోదార ! రామానుజా !

వ్యాసప్రోక్తము బ్రహ్మసూత్రములకున్ భాష్యంబు, గీతార్థ వి
న్యాసంబున్ వెలయించు భాష్యమును సంధానించి, లోకోపకా
రాసక్తిన్ ప్రకటించి సర్వజనసేవ్యంబైన సౌభాగ్యమున్
వాసింపన్ విలసిల్లినావు కరుణాపారీణ ! రామానుజా !

దేవాధీశ కిరీటరత్న ఘృణిమత్ శ్రీరంగపాదద్వయీ
సేవాతత్పర ! శేముషీచతుర ! కాశ్మీరస్థ శ్రీ శారదా
దేవీప్రాపిత భాష్యకారబిరుదా ! దివ్యప్రబంధక్రియా
ప్రావీణ్యప్రవణా ! భవ న్మహిమ నే వర్ణింతు రామానుజా !

జిలుగుం బంగరు రంగులం గులుకుచున్ చెన్నారు నెమ్మేను, మం
జుల మందస్మిత కుంద కుట్మల రుచుల్ సొంపారు కెమ్మోవి, క్రొం
దెలి నిగ్గుల్ గొను ఊర్ధ్వపుండ్రములు నుద్దీపించు నెమ్మోమునున్
గల నీ భాసురమూర్తి సేవ్యము జగత్ కల్యాణ ! రామానుజా !

అతిభవ్యంబు భవత్పదాంక నికరం బానేతు శీతాద్రి భా
రత భూమిన్ తిలకించె, నీ మధుర గంభీరార్థ శ్రీసూక్తి సం
తతి వేదాంతవచః ప్రపంచమును నుద్ఘాటించి భాసించె నా
శ్రితవాత్సల్యపయోధి! చేతనగణశ్రేయస్క! రామానుజా!

యతిలోకాగ్రణి! కేశవార్య తనయా! అవ్యాహతాజ్ఞా సము
న్నత! ప్రజ్ఞాన నిధాన! నాస్తిక మతోన్మాదప్రభేదక్రియా
శతకోటీ! కృతధాటి! పాటిత తమ స్సందోహా! విద్వజ్జగ
న్నుత వేదాంతకలాప! భాగవత బంధూ! స్వామి! రామానుజా!

శ్రీరంగేశపదారవిందయుగళీ చింతామధూళీ తృషా
సారంగాయిత మానసా! సకల శాస్త్రజ్ఞాన సంపూర్ణ తా
పారంగత్వ విశిష్ట ధీవిభవ! దీవ్య ద్భవ్య సౌశీల్య భూ
షా రంగత్ శుభ జీవనా! యతిపతీ! సద్భావ! రామానుజా!

నిను సేవించెద, నిన్ భజించెదను, నిన్నే యెప్డు పూజించెదన్,
నిను భావించెద, నీ కృపాగుణము వర్ణింతున్ సదా, శేష భూ
జన సంభావన భాజనా! గురువరా! సంసార నిర్మగ్న చే
తన లోకోద్ధరణ ప్రవీణ! భవభిత్ పారీణ! రామానుజా!

పాషండ ద్రుమషండ దావ దహనా! పాపాగ్ని వర్షోదయా!
దోషధ్వాంత నివారణారుణఘృణీ! దుర్వార సంసార రుక్
భైషజ్యోక్తినిధీ! సుధీనుత వచః ప్రాగల్భ్యశ్రీ సంపన్నతా
శేషా! సద్గుణభూష! సుందర దర స్మేరాస్య! రామానుజా!

దేవా! విశ్వనుతప్రభావ! విలసత్ ధీవైభవోపేత! మ
ద్భావశ్రేణి నితాంతభక్తిరస శుంభత్ కుంభ పూర్ణంబు గా
వేకీ విమలాంబు ధారలయి ప్రక్షాళించు నీ పాద రా
జీవంబుల్ యతిరాజ! సద్గుణగణశ్రీధామ! రామానుజా!

స్వామీ ! లక్ష్మణయోగివర్య ! సకలాశాదేశకాలంబులన్
స్థేమంబై, నుతనామ మాచును భవత్ దివ్యాజ్ఞ శశ్వత్ జన
స్తోమక్షేమకరంబుగా, ఘనముగా శోభిల్లి వర్ధిల్లుతన్
భూమానంద పదప్రదాన చతురా ! ప్రోఘాత్మ ! రామానుజా !

అల ఢిల్లీశుని రాణివాసమున ప్రేమారాధనల్ గొంచు సం
పిలు రామప్రియు దెచ్చి వైభవముగా మేల్కోటలోనన్ పురా
కలిత ప్రాభవరీతి నిల్పుచు జగత్ ఖ్యాతిన్ సమార్జించు నీ
యలఘు ప్రజ్ఞను సన్నుతించుటకు శక్యం బౌనె ? రామానుజా !

నీ దివ్యోక్తి తతుల్ సుధారస స్రవంతీధారలై చేరలన్
వేదాంతార్థము సంతరించినవి తత్ పీయూషధారా రసా
స్వాదాసక్తులు నిత్యముక్తు లగుచున్ వైకుంఠు ప్రేమాదరా
మోదప్రాప్తికి యోగ్యులౌదురు గుణాంభోరాశి ! రామానుజా !

గురు నాదేశము త్రోసిరాజని జనుల్ కొండాడగా దేవ మం
దిరపుం బ్రోన్నత గోపురంబుపయినన్ నిల్చుండి గొంతెత్తి, 'ఓ
నరులారా !' యని పిల్చి, మోక్షపద సంధానంబు గావించు శ్రీ
తిరుమంత్రంబును చాటినావు కరుణాబ్ధీ ! స్వామి ! రామానుజా !

పదతీర్థంబు నొసంగి రాజసుత దృష్యద్బ్రహ్మరక్షస్సు నా
పద బాపంగల పుణ్యమూర్తివి భవత్ వాల్లభ్య సౌలభ్య సం
పద సొంపున్ వినుతింపగా వశమె ! దేవా ! భాష్యకారా ! పరం
పర సంపాదన కీవె కారణము భవ్యస్వాంత ! రామానుజా !

శయనం, బాసన పాదపీఠములుగా, ఛత్రంబుగా, పాదుకా
ద్వయిగా, సుందర మందిరంబుగ సదా తాత్పర్యసంయుక్తి, నా
వ్యయ నిష్ఠన్ సిరివల్లభున్ గొలుచు నీ వా శౌరియాజ్ఞన్ మహో
దయ మందన్ విలసిల్లె చేతనజనోద్ధారంబు రామానుజా !

వర భాస్వత్తరుణారుణాంశుక రుచుల్, భవ్య త్రిదండోల్లసత్
కరపద్మంబును, ఊర్ధ్వపుండ్రముల నుద్భాసించు స్నిగ్ధాంగముల్
కరుణాపూరిత లోచనాబ్జములు కల్గన్ వెల్గు నీ దివ్య బం
ధుర తేజోమయమూర్తికిన్ నతుల పూదోసిళ్ళు రామానుజా !

నిష్ఠాధిష్ఠిత చిత్తవృత్తి యలరన్ నిర్వృత్తి సంపన్న స
ద్గోష్ఠీపూర్ణుల మంత్రవర్ణకలనా గుంజన్ముఖాంభోజా శ్రీ
గోష్ఠీపూర్ణ బుధేంద్రు పావనతరాంఘ్రుల్ భక్తితో గొల్చియున్
శ్రేష్ఠంబౌ తిరుమంత్రరత్నము నొగిన్ చేకొంటి రామానుజా !

శ్రీమద్గాంగజలంబు, వహ్ని, తులసీ శ్రీపత్రమున్ మించి యెం
తో మాన్యత్వ పవిత్రతా గరిమమున్ నూల్కొల్పగాజాలు నీ
నామంబున్ స్మరియించు మాత్రమున నానా దోషముల్ దూరమౌ
నీ మాహాత్మ్యము సన్నుతింతు భగవన్నిష్ఠాత్మ ! రామానుజా !

భవవారాన్నిధి తారకంబు, బుధసంభావ్యంబు, ముక్తిప్రద
వ్యవహారప్రచురాత్మకంబగు విశిష్టాద్వైతసిద్ధాంత వై
భవమున్ వేయిముఖాలుగా జగతిలో వ్యాపింపగాజేయు నీ
యవతారార్థము సార్థకం బగుచు స్తుత్యంబయ్యె రామానుజా !

నీ పాదాబ్జ పరాగరేణువులు మాణిక్యాలుగా మాకు ని
క్షేపంబై విలసిల్లె, తద్ధనము ప్రక్షేపించినన్ జీవన
వ్యాపారంబు విశేష మోక్షపదలాభస్ఫూర్తి గావించి, సు
శ్రీ పర్యాప్తత గూర్చు నో యతివరా ! చిద్రూప ! రామానుజా !

నీ సౌశీల్య వివేక వాగ్విభవముల్ నిత్యప్రశంసార్హముల్
నీ సౌభాగ్య మహత్వ తత్త్వము సదా నిష్ఠా గరిష్ఠాప్తమున్
నీ సౌలభ్య విశాల ధీ గరిమముల్ నిర్వాణ సంధాయకం
బై సొంపిల్లె సతంబు లక్ష్మణ యతీంద్రా ! స్వామి ! రామానుజా !

తరుణీకోమలనేత్రమోహితు ధనుర్దాసున్ కటాక్షించి, సుం
దర రంగేశుని కన్నుగవమ్ములను సందర్శింపగా జేసి, శ్రీ
హరికిన్ దాసునిగా నొనర్చితివి నీ అవ్యాజ కారుణ్య మా
ధురికిన్ లోకము నైకరీతులుగ నిన్ స్తోత్రించె రామానుజా !

భవవారాశి తరించి, నిత్యసుఖ సంపద్యోగ్య వైరాగ్య లా
భ విపంచిన్ పలికించి, మోక్షపదవిన్ ప్రాపింప భక్తిప్రప
త్తి విశేషంబులె సాధనాంతరము లనుచున్ దివ్యోక్తి సాయించి, మా
నవ లోకంబును ఉద్ధరించితివి సందాత్మ ! రామానుజా !

శ్రీకూర్మంబును, అంజనాచలమునున్, సింహాద్రియున్, ధన్యతో
త్సేకంబౌ కరిశైలమున్, బదరియున్, శేషాచలం బాదిగా
నైకక్షేత్రములందు వైష్ణవ కళాన్యాసంబు గావించు అ
స్తోకంబైన భవ త్ప్రభావమునకున్ జోహారు రామానుజా !

శ్రీ రామానుజ కీర్తికౌముది కళాస్నిగ్ధాంతరంగంబు, ఆ
ళ్వారాదుల్ వెలయించినట్టి ద్రవిడప్రాబంధి కార్థంబులన్
సారస్యంబును, భక్తిమేల్మిని, విశిష్టాద్వైత వేదాంత సం
భారంబున్ వరదాప్తమై కనియె శశ్వత్కీర్తి రామానుజా !



# శ్రీవైష్ణవ మత వైశిష్ట్యము

విద్యా భూషణ – కవితా విశారద

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

*శ్రీ రామానుజ కీర్తి కౌముది సంపాదకులు*



"శాంతాకారం భుజగ శయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్
లక్ష్మీకాన్తం కమల నయనం యోగిభి ర్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ "

## 1 అష్టాదశ దర్శనములు

భరత ఖండమున అష్టాదశ (18) దర్శనములు సుప్రసిద్ధములు వీనిలో - చార్వాక, జైన, వైభాషిక, సౌత్రాంతిక, యోగాచార, మాధ్యమిక, నైయాయిక, వైశేషిక, పాశుపత, సాంఖ్య, యోగ దర్శనములు పదునొకండును అవైదిక దర్శనములు ఇయ్యవి - తమోగుణ ప్రధానము లగుటవలనను, పారలౌకిక ప్రయోజన శూన్యము లగుటవలనను నిష్ఫలములని, మనుధర్మశాస్త్ర ముద్ఘోషించుచున్నది[1] కాఁగా, భాట్ట - ప్రాభాకర - భాస్కరీయ - యాదవీయ - ద్వైత - అద్వైత - విశిష్టాద్వైత దర్శనము లేడును వైదిక దర్శనములే యయ్యును, భాట్ట దర్శన ప్రభృతి - యాదవీయ దర్శన పర్యంతముగాఁగల నాల్గు దర్శనములును వేద తాత్పర్యమును సక్రమముగా గ్రహింపనందున, అయ్యవి ఉపాదేయములు కాఁజాలవని విజ్ఞుల వక్కాణ వేద హృదయమును అవగతము గావించుకొనిన ద్వైతాద్వైత విశిష్టాద్వైత దర్శనములలో-విశిష్టాద్వైత దర్శనము

---

1 "యా వేదబాహ్యాః స్మృతయః యాశ్చ కాశ్చ కుదృష్టయః
సర్వా స్తా నిష్ఫలా ప్రేత్య తమోనిష్ఠా హి తే స్మృతా "
—(మను స్మృతి 12-4)

శ్రుతిస్మృతీతిహాస పురాణ సమ్మతమై, ఆచరణయోగ్యమై, మహాఫలప్రదమై, బ్రహ్మానంద సంధాయకమై, అగ్రగణ్యముగా విలసిల్లుచున్నది

## 2 మతత్రయ పరామర్శము

### ౧ అద్వైతము

బ్రహ్మ మొక్కటియే సత్యము జీవుఁడు, ప్రకృతి అనునవి లేవు జగత్తు అంతయు మిథ్యయే కాని, అజ్ఞానమువలన అది ఉన్నట్లు కనఁబడుచున్నది అట్టి అజ్ఞానము తొలఁగిన యెడల, మానవునకు ఈ జగత్తు సత్య మనెడి భ్రాంతి తొలఁగిపోవును అట్టి భ్రాంతి తొలఁగువఱకు మానవునకు ముక్తి కలుగదు అజ్ఞానము (మాయ) తొలఁగినంతనే, తాను బ్రహ్మయే యని మానవుడు తెలిసికొనఁగలును అదియే ముక్తి జీవుడు శరీరముతో నున్నను, అజ్ఞానము తొలఁగినయెడల, అత డచ్చటనే మోక్షము పొందినవాఁ డగును దానినే 'జీవన్ముక్తి' అందురు జీవన్ముక్తిని పొందినవారికి శరీర మున్నను, లేకున్నను ఒక్కటియే అతఁడు నిరంతరము బ్రహ్మానందానుభవముతో వర్తించుచుండును

బ్రహ్మము నిర్గుణము కేవల చైతన్యమే బ్రహ్మము తదితర మంతయు మిథ్య త్రాడును చూచి సర్పమని భ్రమించినట్లు, బ్రహ్మమును చూచి, జగత్తు అని అజ్ఞానమువలన భ్రమించుచున్నాము జ్ఞానబోధచే అజ్ఞానము తొలఁగినంతనే, సర్పభ్రాంతి తొలఁగి, సత్యమగు త్రా డెట్లు కనఁబడునో - అట్లే, జ్ఞానముచేత జగద్భ్రాంతి తొలఁగి, మానవుఁడు తన బ్రహ్మత్వమును తెలిసికొనును ఘటమునందును, వెలుపలను ఒకే ఆకాశము వ్యాపించియున్నది కనుక, ఘట మున్నంతకాలము - ఆ ఘటాకాశమునుండి, ఘటవిచ్ఛేదక మంతయు ఒకే యాకాశ మెట్లగుచున్నదో, అజ్ఞానావృతమైన బ్రహ్మము అజ్ఞాన

నివృత్తియైన యనంతరము బ్రహ్మముకంటె వేఱుగా కానరాదు ఇదియే అద్వైతము

ఈ అద్వైత సిద్ధాంతమున జ్ఞానమే మోక్షోపాయము అట్టి జ్ఞానము చేకూరినవెంటనే - 'అహం బ్రహ్మాఽస్మి, తత్త్వమసి, సోఽహమ్' ఇత్యాది వాక్యములు వచించినట్లు, జీవుఁడు తనను తానే పరబ్రహ్మముగా తెలిసికొనఁగలఁడు ఈశ్వరారాధనము, జప, తపాదులు అజ్ఞాన నిర్మూలకములు

ఈ అద్వైత సిద్ధాంత ప్రకారము - జీవుఁడేగాక, ఈశ్వరుఁడు కూడ అజ్ఞానావృతమైన బ్రహ్మమే గుణసమ్మేళన మంతయు అజ్ఞానమే గనుక, సృష్ట్యాది గుణములను ఆపాదించిన ఈశ్వరుఁడుకూడ అజ్ఞానియే నిర్గుణ పరబ్రహ్మము క్షణికముగాక, నిత్యసత్యమునై యున్నది

ఈ అద్వైత సిద్ధాంతమున మోక్షప్రాప్తికి జ్ఞానమే సాధనము మోక్ష స్థాన మనునది వేఱొకటి లేదు అజ్ఞాననివృత్తియై, గుణ సంశ్లేషము లేక, కేవలము జ్ఞానైకాకారము నొందుటయే మోక్షము స్వప్నము లేని నిర్మలమైన సుషుప్త్యవస్థ ఎంతటి ఆనందదాయకమో - మోక్షముకూడ అట్టిదియే యని అద్వైత సిద్ధాంతము

2 ద్వైతము :-

బ్రహ్మము, జీవుఁడు అనునవి రెండును ప్రత్యేక తత్త్వములు సర్వజగత్తునకు సృష్టి స్థితి లయ కారకు డగు పరబ్రహ్మమునకును, అజ్ఞాన పూరితమగు సంసారాంధకారమునఁబడి సతమత మగుచుండు జీవునకును పోలిక లేదు ప్రారబ్ధమునఁ దగులుకొని, కర్మానుభవము పొందు జీవునకు - తన్నివృత్తికై, నిరంతరానుష్ఠాన వ్రతాద్యాచరణమే మోక్షసాధనము

ఇట్టి నిష్ఠాజీవనముచే జీవునకు ప్రతిబంధక నివృత్తియై, నారాయణుని పాదారవిందముల సన్నిధికి చేరు అర్హత చేకూరును అట్టి పరమ స్థానమునందు - అనఁగా, భగవత్పాద సాన్నిధ్యమునఁ జేరు జీవులు నిరంతరము శ్రీ వైకుంఠనాథుని కటాక్ష వీక్షణముల ననుభవించును తదితర వస్తు వైరాగ్య మవలంబించి, సేవలు చేయుటయే ద్వైతుం పరమావధి మోక్షస్థానము సహితము సర్వజీవులకు తమ స్వకీయాకారముతే వర్తించుచుండునని ద్వైత సిద్ధాంతము

3 విశిష్టాద్వైతము -

జీవుఁడు, ప్రకృతి, బ్రహ్మము అనునవి మూఁడు తత్త్వములు వీనినే 'చిదచిదీశ్వరులు' అందురు ఈ మూఁడు తత్త్వములును సత్యములే బ్రహ్మము సర్వాంతర్యామి యనియు, ప్రకృతి జీవుల కిరువురకును బ్రహ్మము ఆత్మ యనియు, బ్రహ్మమునకు ప్రకృతియు, జీవుఁడును శరీర మనియు విశిష్టాద్వైత సిద్ధాంతము

అంతర్యామిత్వముచే బ్రహ్మముతో శరీర శరీరి సంబంధము లేని జగద్వస్తువు ఏదియు లేదు - ఉండజాలదు బ్రహ్మయే సర్వమునకును ఆత్మ పరబ్రహ్మము నిర్గుణుఁడు కాఁడు అనంత కల్యాణగుణ పరిపూర్ణుఁడు, ఆనందమయుఁడు, భక్తవత్సలుఁడు, పరమపురుషుఁడు జీవునకును పరబ్రహ్మమునకును స్వరూప భేదము లేదు కర్మవిచ్ఛేదనానంతరము మోక్షార్హుఁడగు జీవుఁడు పరమపదమునఁ జేరి, పరబ్రహ్మ సాయుజ్యమును పొంది, అనంత కల్యాణగుణగణములను అధివసించి, ఆనందమయుఁడగు పరబ్రహ్మముతో నవవిధ సంబంధములు కలిగి, ఆనందము ననుభవించును మోక్షమునందలి యానందము - కల్యాణగుణ సముపేతుఁడగు పరమాత్మయొక్క గుణానుభవము ప్రత్యక్షముగా నొందుటయే ఈయది శరీర త్యాగానంతరమే

గాని, తత్పూర్వము కలుగదు అట్టి ఆనందప్రాప్తికి భక్తియే సులభో పాయము భక్తియొక్క పరాకాష్ఠ స్థితియే ప్రపత్తి (శరణాగతి) అహంభావనను సమూలముగ నిర్మూలించి, దాసోఽహం భావనఁ గల్గి, సర్వమునకు పరబ్రహ్మయే స్వతంత్రుఁడు, స్వామి యని విశ్వసించి, శరణాగతి చేయుటయే ప్రపత్తి బ్రహ్మము భోక్త జీవబ్రహ్మలు భోగ్యవస్తువులు జీవునకు అహంకార నిర్మూలనమైననేగాని, బ్రహ్మమున కర్హమగు నిర్మల భోగ్యవస్తుత్వము చేకూరదు కనుక, శరణాగతిలేక, మోక్షము దుర్లభము ఇదియే విశిష్టాద్వైత సిద్ధాంతము

ఇట్టి యీ విశిష్టాద్వైత సిద్ధాంతము - 'శ్రీ వైష్ణవ మత' మను పేర ప్రసిద్ధి గాంచియున్నది దీనికి - శ్రీసంప్రదాయ మనియు, భాగవత మత మనియు, రామానుజ దర్శన మనియు అనేక నామాంతరము లున్నవి

ఈ వైష్ణవ మతమున విష్ణువే ఆరాధ్య దైవము కనుక, అట్టి విష్ణుభగవానుని వైశిష్ట్యమును మున్ముందిట తెలిసికొనవలసియున్నది

## 3 విష్ణు పరత్వము

**"విష్ణుఁడె భక్తవత్సలుఁడు — విష్ణుఁడె దేవమయుండు — వేల్పులన్**
**విష్ణువె బ్రోవనేర్చు - మఱి విష్ణువె విశ్వగురుండు సర్వమున్**
**విష్ణుమయంబులై పరచు . . "**

**— (వెన్నెలకంటి సూరన - ఆంధ్ర విష్ణుపురాణము 29 పద్యము)**

ఆశ్రితులైన భక్తులయందు వాత్సల్య ముంచి, రక్షింపఁగల వాఁడు విష్ణువే దేవత లందఱియందును వ్యాపించియున్నవాఁడు విష్ణువే దేవతలనుఁగూడ రక్షింపఁగలవాఁడు విష్ణువే సర్వవిశ్వము నకు విష్ణువే గురువు సకల చరాచర ప్రపంచము విష్ణుమయమై ప్రవర్తించుచుండును "



స శంఖ చక్రం స కిరీట కుండలం స పీత వస్త్రం సరసిరుహేక్షణమ్
సహారవక్షస్స్థల కౌస్తుభశ్రియం నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్.

జమ.

## 4 విష్ణు శబ్దార్థము

"విషి శ్చ వ్యాప్తి వచనో, ణ శ్చ సర్వత్ర వాచకః
సర్వవ్యాపి చ సర్వాత్మా తేన విష్ణుః ప్రకీర్తితః "
– (బ్రహ్మవైవర్తము – బ్రహ్మఖండము : 17 16)

'విషుల్ వ్యాప్తౌ' అను ధాతువునుఁబట్టి, విష్ణుశబ్దము సముత్పన్నమైనది వ్యాప్తినిఁదెలిపెడి 'నుక్' ప్రత్యయము అంతమందు గల 'విష్' ధాతువుయొక్క రూపమే 'విష్ణువు' అను శబ్దము ఈ విష్ణుశబ్దమునకు – 'అంతటను వ్యాపించియుండువాఁడు' అని యర్థము ఈ విష్ణువు – మహద్వాచకుఁడు అనగా – అందఱికంటెను అధికుఁడు ఇట్టి యాధిక్యమును నిర్దేశించుట కేర్పడినదే 'మహత్' శబ్దము ఇందువలన, విష్ణువు – 'మహావిష్ణువు'గా విఖ్యాతి వహించెను ప్రకృతిస్వరూపిణియైన శ్రీదేవిని వక్షస్థలమున ధరించినవాఁడు – అనగా – ఐశ్వర్యరూపమైన, సమగ్రమైన సిరిగలవాఁడు గనుక, మహావిష్ణువు – శ్రీ మహా విష్ణువుగా కీర్తింపఁబడుచున్నాఁడు

ఇట్లింకను ఈ విష్ణు శబ్దమునకు అనేక వ్యుత్పత్తు లున్నవి ఇవి యన్నియు విష్ణువుయొక్క సర్వవ్యాపకత్వమును, విష్ణుప్రభావమును విశదీకరించునవియై యున్నవి ౪

---

౪ (౧) విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణు
విశ్వమునందు వ్యాపించియుండువాడు

(౨) శేషతి సించతి ఆప్యాయతే విశ్వ మితి విష్ణుః
ప్రపంచమును రక్షించువాఁడు

(౩) విష్ణాతి వియునక్తి భక్తాన్ మాయాపసరణేన విష్ణుః
మాయామయమైన సంసారబంధమునుండి తన భక్తులను
విముక్తుల జేయువాఁడు

(౪) విశన్తి సర్వభూతాని అత్రేతి విష్ణుః
చేతనాచేతనము లన్నియు తనలో గలవాఁడు

## 5 విష్ణు ప్రభావము

"అగ్ని ర్వై దేవానా మవమః, విష్ణుః పరమః,
తదంతరేణ సర్వే అన్యా దేవతాః"
- (ఐతరేయ బ్రాహ్మణము 1 1)

దేవతలలో అగ్ని తక్కువవాఁడనియు, విష్ణువు దేవత అందఱి కంటెను గొప్పవాఁడనియు, వా రిరువురి నడుమ బ్రహ్మరుద్రేంద్రాది దేవత లెల్లరు నిలిచియున్నారనియు -

"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః - (ఋగ్వేదము 154 - 5)

అట్టి మహావిష్ణువుయొక్క నివాస స్థానమైన పరమపదము ఆనంద దాయకమై యలరారుచుండుననియు -

"విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాగుంసి "
- (ఋగ్వేదము : 101 154 1)

ఈ భువన త్రయమును సృజించిన అట్టి విష్ణువుయొక్క ప్రభావ మును త్రికరణశుద్ధిగా స్తుతింపవలెననియు -

"తము స్తోతారః పూర్వం యథావిద ఋతస్య గర్భం జనుషా పిపర్తన
అస్య జానంతో నామ చిద్వివక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే "
- (ఋగ్వేదము : 2-2-86)

ఓ స్తోతలారా! సత్యములోని సారమైన ఆ పురాణ పురుషునే బాగుగాఁ దెలిసికొని, దాని యథార్థ జ్ఞానముచేత జన్మను సమాప్తము చేసికొనుట సముచితము ఈ విష్ణువుయొక్క నామములను తెలిసికొని జపింపుడు ఇతరులు జపించిన జపింతురుగాక! జపింపక్షేపోయినపోవు దురుగాక! ఓ విష్ణువా! మేము నీ దివ్య ప్రకాశమును భజింతుము "

"యః పూర్వ్యాయ వేధసే నుమజ్జానవే విష్ణవే దదాశతి
యో జాత మస్య మహతో మహిబ్రవత సేదుశ్రవోభి ర్యుజ్యం చిదభ్యసత్
– (ఋగ్వేదము 1-56-2)

ఏ పురుషుడు అందరికంటెను అధికుఁడో, నిత్యనూతనుఁడో, జగత్స్రష్టయో, స్వయంజాతుఁడో, ప్రపంచమున మదమునుఁ గల్గించు లక్ష్మికి పతియో, అట్టి విష్ణువుకు తన ద్రవ్యమును, తనను సమర్పించి, గమ్యమగు పరమపదమును పొందగల్గుచున్నాఁడు"

"భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః
భీషాస్మా దగ్ని శ్చేంద్ర శ్చ మృత్యు ర్ధావతి పంచమః
– (తైత్తిరీయోపనిషత్తు 2.8 1)

అట్టి విష్ణువలని భయమువల్లనే వాయువు వీచుచున్నది, సూర్యుఁ డుదయించుచున్నాఁడు, అగ్ని దహించుచున్నది, ఇంద్రుడు వర్షించుచున్నాడు ఐదవ దగు మృత్యువుకూడ విష్ణువుయొక్క భయమువల్లనే పాఱిపోవుచున్నది"

"అస్యేశానా జగతో విష్ణుపత్నీ
– (యజుర్వేదము 4-4)

"విష్ణోః శ్రీ రనపాయినీ
– (విష్ణుపురాణము 2 13 2)

ఈ విష్ణుభగవానుని పత్నియగు లక్ష్మీదేవియే సకల జగత్తులకు మహారాజ్ఞి అనఁగా - జగన్మాత ఈమె విష్ణువును వీడియుండదు

"నాయమాత్మా ప్రవచనే న లభ్యః
న మేధయా నబహుధా శ్రుతేవ
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్
– (కఠోపనిషత్తు - 1-2 22

ఈ పరమాత్మ - వేదార్థాదులచేగాని, ధారణాశక్తిచే గాని, విశేష శ్రవణముచేగాని లభింపఁడు సాధకుఁడు ఏ పరమాత్మను వరించుచున్నాఁడో, ఆ పరమాత్మయే తాను స్వయముగా అతనిని పొంది, అతనికి తన రూపమును అభివ్యక్తము చేయును"

తమక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదాన్మహిమాన మాత్మనః

- (కఠోపనిషత్తు 1 2 20)

నిష్కామము గల సాధకుఁడు - జగత్కర్తయు, పురుషుఁడు నగు పరమాత్మయొక్క మహిమను గాంచుచు, శోకరహితుఁడగు చున్నాఁడు"

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తం హ దేవమాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే

- (శ్వేతాశ్వతరోపనిషత్తు 6-18)

పూర్వము ఏ పరమాత్మ దేదీప్యమానముగా ప్రకాశించెనో, వేదములచే నెవఁడు కీర్తింపఁబడెనో, అట్టి పరమాత్మను బుద్ధి పూర్వకముగా నేను మోక్షార్థినై శరణు జొచ్చుచున్నాను"

"అథైతం విష్ణవే దరుం నిర్వపతి యజ్ఞోవై విష్ణుః
యజ్ఞ ఏవాన్తతః ప్రతితిష్ఠతి సోఽత్ర జుహోతి
విష్ణవే స్వాహా యజ్ఞాయ స్వాహా ప్రతిష్ఠాయై స్వాహా

— (శతపథ బ్రాహ్మణము)

విష్ణువు యజ్ఞస్వరూపుఁడు అతఁడు యజ్ఞములవల్లనే ప్రతిష్ఠిత మగుచున్నాఁడు ఆ విష్ణువు నుద్దేశించి చరుహోమమును 'విష్ణవే స్వాహా, యజ్ఞాయ స్వాహా, ప్రతిష్ఠాయై స్వాహా' అని చేయుదురు

"త ద్విష్ణోః పరమం పదమ్ సదా పశ్యన్తి సూరయః దివీవ చక్షురాతతమ్
త ద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ స స్సమిన్ధతే విష్ణోర్య స్పత్పరమం పదమ్
– (నారాయణము)

విష్ణువుయొక్క నిత్యవిభూతి యనఁబడు పరమపదము - ఆకాశమున ఉన్నతముగా నున్నది ఆకాశమున కాంతులతో నలువైపులందును వ్యాపించు సూర్యుఁడు ప్రకాశించునట్లు, విష్ణుభగవానుని పరమపదముకూడ ఉన్నతస్థానమున నలువైపులందును ప్రకాశించుచున్నది ''

"తస్మా త్సర్వేషు వేదేషు విష్ణు రేవ సనాతనః
తస్మాత్ సర్వప్రయత్నేన విష్ణు మేవ సమాశ్రయేత్ ''
– (విష్ణుధర్మోత్తరము)

దేవత లందఱిలో శ్రీమహావిష్ణువే పరాత్పరుఁడు కావున, ఆ స్వామిని ఆశ్రయించుటకై, సర్వవిధముల ప్రయత్నింపవలెను ''

ఇట్టి పరశ్శత ప్రమాణములనుఁబట్టి, విష్ణుప్రభావము సుస్పష్టము

## 6 విష్ణుభక్తి - ఫలప్రాప్తి

నా విష్ణుః కీర్తయే ద్విష్ణుం నా విష్ణు ర్విష్ణు మర్చయేత్
నా విష్ణు స్సంస్మరే ద్విష్ణుం, నా విష్ణు ర్విష్ణు మాప్నుయాత్

విష్ణుభక్తుఁడుగాక, విష్ణువును కీర్తించరాదు; విష్ణుభక్తుడుగాక - విష్ణువును అర్చించరాదు; విష్ణుభక్తుఁడుగాక విష్ణువును స్మరింపరాదు; విష్ణుభక్తుఁడుగాక, విష్ణువును పొందనేరఁడు' అని, పంచమవేదముగా ప్రసిద్ధి గాంచిన మహాభారతేతిహాసము వక్కాణించుచున్నది

ఇచ్చట విష్ణుభక్తుఁ డనఁగా - వైష్ణవుఁ డని యర్థము వైష్ణవుఁడైనవాఁడు - విష్ణువును కీర్తించినను, అర్చించినను ఫలవంత మగును

వైష్ణవ దీక్షను స్వీకరించినవాఁడే వైష్ణవుఁడు పంచ సంస్కార సంపన్నుఁ డగుటయే వైష్ణవదీక్ష[8] అట్టి వైష్ణవ దీక్షాపరుఁడు - అనన్య భక్తితో విష్ణుభగవానుని మాత్రమే ఆరాధింపవలెను అట్టివాఁడే వైష్ణవుఁడు

"నాన్యం దేవం నమస్కుర్యాత్, నాన్యం దేవం ప్రపూజయేత్
నాన్యం దేవం స్మరే న్నిత్యం విష్ణుపాదాంబుజాశ్రయః

విష్ణుపాదాశ్రితుఁడైన వైష్ణవుఁడు - ఇతర దేవతలకు నమస్కరింపరాదు, ఇతర దేవతలను పూజింపరాదు ఇతర దేవతలను స్మరింపరాదు' అని, మహాభారత ముద్ఘోషించుచున్నది

## 7 వాసుదేవ 'నారాయణ' నామముల ప్రాముఖ్యము

విష్ణుభగవానునకు అనంత నామము లున్నవి అట్టివానిలో - సహస్ర (1000) నామములను వ్యాసమహర్షి ఎన్నిక చేసి, మహాభారతములో - అనుశాసనిక పర్వమున-'శ్రీవిష్ణుసహస్ర నామ స్తోత్ర' మను పేర నిబంధించియున్నాఁడు అట్టి సహస్రనామములందును - చతుర్వింశతి (24) నామములు అతిముఖ్యములైనవానినిగా మఱి కొందఱు ప్రముఖులు భావించి, వానిని కేశవాది నామములుగా ప్రత్యేకించియున్నారు అట్టి చతుర్వింశతి నామములలో విష్ణువునకు - 'వాసుదేవ' 'నారాయణ' నామములు రెండును మిక్కిలి ప్రాముఖ్యమును పొందియున్నవి

## 8 'వాసుదేవ శబ్ద నిర్వచనము

**విను మైత్రేయ! జగంబులు దనలోపల, జగములలోన దానును వసియిం**
**చు విభుత్వంబున జూప్మి యతిమహాత్ములు వాసుదేవుఁ డండ్రు ముకుందున్ ''**

---

8 తాపము, పుండ్రము నామము, మంత్రము, యాగము అనునవియే పంచ సంస్కారములు

అమలం బవ్యక్త మప్రమేయ మఖిల వ్యాపార మాద్యంత శూ
న్య మశేషంబు సమస్తముం దన మయుండై మించు వర్తింప గా
లము, కాలం బన వాసుదేవునకు లీలారూప మా కాల రూ
పము నిత్యంబు దివానిశా ప్రకృతి జూపట్టున్ మునీంద్రోత్తమా !

– (ఆంధ్ర విష్ణుపురాణము 1 35  37 )

తనలో సమస్త ప్రపంచమును, తాను సకల జగములయందును వసించుచుండుటచే, ఆద్యంత రహితము, అశేషమునైన ఈ సర్వ, ప్రపంచమును తన స్వాధీనములో నుండి, కాలము ప్రవర్తించు చుండును అట్టి కాల మనఁగా – వాసుదేవునకు లీలా రూపము నిత్యము రాత్రింబవళ్ళుగా ప్రకృతిలోఁ గన్పట్టుచుండును ”

## 9 వాసుదేవ శబ్ద వ్యుత్పత్తి

"వసం త్యస్మిన్ జగంతీతి వాసుః – వాసు శ్చాసౌ దేవ శ్చ వాసుదేవః

జగము లన్నియు – తనయందుఁ గల దేవుఁడు

"జగతి వసత్యయ మితి వా ''

వాసుః – వసించువాఁడు, దేవః – జగత్తుతో క్రీడించువాఁడు అసురులను జయింపఁగోరువాఁడు, సృష్ట్యాది వ్యవహారములను నిర్వహించువాఁడు, ప్రకాశించువాఁడు, స్తుతింపఁబడువాఁడు, సర్వత్ర గమనము గలవాఁడు కావున, 'విష్ణువు' వాసుదేవుఁ డనఁబడు చున్నాఁడు

"వాసనా త్సర్వభూతానాం వసుత్వాత్ దేవయోనయః
వాసుదేవ స్తతో వేద్యో యోగిభి స్తత్త్వదర్శిభిః ''

– (శాంతిపర్వము 70 – 3 )

సకల భూతములను ప్రవర్తింపఁజేయుట, వసురూపుఁ డగుట, దేవతలకు కారణముగా నుండుట – ఈ హేతువులచే, తత్త్వదృష్టిగల

యోగులు విష్ణువును వాసుదేవుఁడని తెలిసికొందురు" ఇది మహాభారతములోని మాట ఈ మాటనుఁబట్టియే వాసుదేవుని సర్వాధిపత్యము స్పష్టము ఈ యంశమునుగుఱించి విష్ణుభగవానుఁడే స్వయముగాఁ బల్కిన పల్కులు అవశ్య గమనార్హములు -

ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః
సర్వభూతాని వాసశ్చ వాసుదేవ స్తత స్స్మృతః '
– (శాంతిపర్వము 341-41)

నేను సూర్యునివలెనుండి సమస్త ప్రపంచమును చిద్రూపములైన నా కిరణములచే కప్పివేయుచున్నాను కావున, వాసుదేవుఁ డనఁబడితిని"

ఈ పై ప్రమాణములు వాసుదేవుని ప్రచండ ప్రభావమును స్పష్టీకరించుచున్నవిగదా! కావున, అట్టి వాసుదేవుని భజించువాఁడు ధన్యాత్ముఁడు కాఁగలఁడు

## 10 వాసుదేవ నామోచ్చారణ ఫలము

"స్తుత్వా విష్ణుం వాసుదేవం విపాపో జాయతే నరః
విష్ణో స్సంపూజనా న్నిత్యం సర్వపాపం ప్రణశ్యతి"

విష్ణువైన వాసుదేవుని స్తుతించు మనుజుఁడు - పాపరహితుడగును విష్ణువును పూజించుటచే, పాప మంతయు పటాపంచ లగు' నని స్కాందపురాణ ముద్ఘోషించుచున్నది

సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని
భూతేషు స చ సర్వాత్మా వాసుదేవ స్తత స్స్మృతః
–(విష్ణుపురాణము 6 5 80)

అన్నింటిలో వసించువాఁడగుటచేతను, అన్నింటిని తనలో వసింపఁజేసికొనువాఁ డగుటచేతను విష్ణువు వాసుదేవుఁ డనఁబడుచున్నాఁడు.

ఇట్టి వాసుదేవ తత్త్వ మహాత్వము వాచామగోచర మని మహర్షుల వక్కాణ అనేక జన్మ సుకృత పరిపాకముచేఁగాని ఈ వాసుదేవ తత్త్వమహత్వము తెలియజాలరు ఈ యంశమును ఆ భగవానుఁడే స్వయముగా నిట్లు చెప్పియున్నాఁడు —

**బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే**
**వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః**

— (*భగవద్గీత 7-19*)

అనేక జన్మలు గతించిన యనంతరము — తుది జన్మయందు జ్ఞానము గలవాఁడై, విశ్వ మంతయు వాసుదేవ మయమని తెలిసికొని, నన్ను శరణుపొందును అట్టి మహాత్ముఁడు మిగుల దుర్లభుఁడు ”

## 11 'నారాయణ' శబ్ద నిర్వచనము

**“నారములనాగ నుదకము చారుతరాయనము** నాగ సంచారం బా
**నీరధిశయనుని కిమ్మెయి నారాయణుఁ డనఁగ** దివ్యనామము గలిగెన్ ”

నారము లనఁగా — ఉదకము అట్టి ఉదకము స్థానముగాఁ గలవాఁడుగనుక, 'నారాయణుఁడు' అను దివ్యనామము విష్ణుభగవానున కేర్పడెను ఇట్టి నిర్వచనమే మఱికొన్ని గ్రంథములలో కానవచ్చును మనుస్మృతిలో —

**“ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః**
**తావ దస్యాయనం పూర్వం తేన నారాయణ స్స్మృతః** (1 10)

ఉదకములకు నారము లని పేరు ఇవి నరుని నుండి ఉద్భవించినవి అట్టి ఉదకములు విష్ణువునకు స్థానములుగా నున్నందున, విష్ణువు నారాయణుఁ డనఁబడుచున్నా' డని నారాయణ శబ్దము నిర్వచింపఁబడినది. ఇట్లే మహాభారతమునందును —

"నరా జ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః
తా న్యేవ చాయనం నిత్యం తేన నారాయణ స్స్మృతః ''

నరునిచేఁ గల్గిన తత్త్వములు నారములని చెప్పఁబడును అవి స్థానముగాఁగల విష్ణువు – నారాయణుఁ డనఁబడుచున్నా' డని చెప్పఁబడినది

నార మనఁగా –'జ్ఞాన' మని మఱి యొక అర్థము కలదు కనుక, 'నారం అయనం యస్య సః నారాయణః' నారము (జ్ఞానము) ఎవనికి స్థానభూతమై యున్నదో, అతఁడు నారాయణుఁడని చెప్పబడుచున్నాఁడు విష్ణువు జ్ఞానమునకు స్థానభూతుఁడు గనుక, అట్టి యర్థమును ప్రతిపాదించునదియే నారాయణ శబ్ద మని దీని తాత్పర్యము

## 12 నారాయణ ప్రభావము

నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణ ఏవేదగ్ం సర్వమ్ ,
నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత
శ్శుద్ధో దేవ ఏకో నారాయణః న ద్వితీయోఽస్తి కశ్చిత్ "

– (మహానారాయణోపనిషత్తు)

పరబ్రహ్మ నారాయణుఁడే పరతత్త్వము నారాయణుఁడే సకల చేతనాచేతన శరీరి నారాయణుఁడే ఆతడు కళంక రహితుఁడు, కర్మస్పర్శ రహితుఁడు, నిర్వికల్పుఁడు, ప్రాకృత నామము లేనివాఁడు, పరిశుద్ధుఁడై వెలుగొందువాఁడు, అట్టివాఁడు మఱి యొకఁడు లేఁడు"

"ఏకోహవై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః నేమే ద్యావా పృథివీ
నక్షత్రాణి నాపో నాగ్ని ర్నసోమో న సూర్య ఇతి ''

– (మహానారాయణోపనిషత్తు)

సృష్టికి పూర్వము నారాయణుఁ డొక్కఁడు మాత్రమే ఉండెను బ్రహ్మకాని, రుద్రుడుకాని, కనిపించు భూమ్యాకాశములు కాని, నక్షత్రములుకాని, నీరుకాని, నిప్పుకాని, చంద్రసూర్యులుకాని ఒక్కరును లేరు

**"అథ పురుషోహ వై నారాయణో ఒకామయత ప్రజా సృజేయేతి నారాయణా త్ప్రాణో జాయతే మన స్సర్వేంద్రియాణి చ ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ నారాయణా ద్బ్రహ్మ జాయతే నారాయణా ద్రుద్రో జాయతే నారాయణా దింద్రో జాయతే నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయన్తే నారాయణా దేవ సముద్భవన్తే నారాయణాత్ ప్రవర్తన్తే నారాయణే ప్రలీయన్తే**

– *(మహానారాయణోపనిషత్తు)*

పురుషుఁడైన నారాయణుఁడు ప్రజలను సృజింపఁదలచెను అపుడు నారాయణుని నుండి ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి అనునవి పుట్టెను అనంతరము నారాయణునినుండి బ్రహ్మ, రుద్రుఁడు, ఇంద్రుఁడు, ప్రజాపతులు మున్నగువారు ఉద్భవించిరి ఇట్లు నారాయణునినుండి ఉద్భవించినవారెల్లరును నారాయణునివల్లనే ప్రవర్తించుచున్నారు తుదకు – నారాయణుని యందే లీనము కాఁగలరు"

**నారాయణ పరా వేదా యజ్ఞా నారాయణాత్మకాః**
**తపో నారాయణ పరం నారాయణ పరాగతిః**
**నారాయణపరం సత్యం ఋతం నారాయణాత్మకం**
**నారాయణపరోధర్మః పునరావృత్తిదుర్లభః**

– *(శాంతి పర్వము* 347, 348 81, 82)

వేదములు నారాయణ పరములు యజ్ఞములు నారాయణాత్మకములు తపము నారాయణ పరము నారాయణుఁడే పరమగతి

నారాయణుండే సత్యము[4] ఋతము[5] నారాయణాత్మకమైనది నారాయణ పరమైనదియే ధర్మము అట్టి ధర్మాచరణము - పునరావృత్తి రహితమైనది "

యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరం ఏష సర్వభూతా న్తరాత్మా
అపహతపాప్మా, దివ్యోదేవ ఏకోనారాయణః "

– (అంతర్యామి బ్రాహ్మణము)

ఎవనికి చేతనజాతమున్నూ, పృథివ్యాది అచేతనమున్నూ శరీరమువలె ఆధేయము, విధేయము, శేషభూతము అగుచున్నదో, అట్టి సకల ప్రాణులకును అంతరాత్మయై, పాపములకు శత్రువైన వైకుంఠధాముడై విరాజిల్లువాఁడు - అద్వితీయుఁడగు శ్రీమన్నారాయణుండే "

"సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువం
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం ప్రభుమ్
విశ్వతః పరమా న్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం
విశ్వ మేవేదం పురుష స్త ద్విశ్వ ముపజీవతి
పతిం విశ్వ స్యాఽఽత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్
నారాయణ పరంజ్యోతి రాత్మా నారాయణఃపరః
నారాయణ పరంబ్రహ్మ త త్త్వం నారాయణఃపరః
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణఃపరః
యచ్చ కించ జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా
అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః "

– (తైత్తిరీయ నారాయణము 11)

---

4 సత్యము = వాక్కుతో యదార్థము పలుకుట

5 ఋతము = మనస్సుచేత వస్తు చింతన చేయుట

అనంత శిరములు, అనంత నేత్రములు కలవాఁడు, విశ్వమునకు సుఖము గల్గించువాఁడు, సర్వప్రాణులకు ఆధారభూతుఁడు, నిత్యుఁడు, విశ్వశ్రేయమునుఁ గూర్చువాఁడు, మంగళకరుఁడు, మోక్ష ప్రదాతయు నగు నారాయణునకు నమస్కారము విశ్వరూపుఁడు, విశ్వాతీతుఁడు, పరమాత్మ, శాశ్వతుఁడు, మంగళకరుఁడునగు నారాయణుఁడు వేదాదులచే ప్రశంసింపఁబడినవాఁడు, మునులచే ప్రస్తుతింపఁబడినవాడు నగు నారాయణుఁడు-గురుశుశ్రూషాదులచే తెలిసికొనఁ దగినవాఁడు అట్టి సర్వాంతర్యామి రూపుఁ డగు నారాయణునకు నమస్కారము నారాయణుఁడే పరంజ్యోతి అతఁడే పరమాత్మ నారాయణుఁడే పరబ్రహ్మ సత్యస్వరూపుఁడు, సర్వోత్తముఁడును నారాయణుఁడే అట్టి నారాయణునకు నమస్కారము ధ్యానము, ధ్యానింపఁబడువాఁడు నారాయణుఁడే అనంతకోటి బ్రహ్మాండములు కలవని వినఁబడునదియు, మనకు కానవచ్చు లోకముకూడ నారాయణుఁడే"

పైన పేర్కొనఁబడిన శ్రుతి స్మృతీతిహాస పురాణ వాక్యములనుఁబట్టి, దేవ - మానవ - తిర్యక్ - స్థావరాది భేదములతోఁ గూడిన జీవాత్మ లన్నియు, చతుర్దశ భువనములు నారాయణునినుండియే ఉద్భవించెననియు, కొంత కాలము గడచిన పిమ్మట, ఈ చరాచర ప్రపంచ మంతయు ఆ నారాయణునియందే లీనము కాఁగలదనియు స్పష్ట మగుచున్నది

"ముహూర్త మపి యో ధ్యాయేన్ నారాయణ మనామయమ్
సోఽపి సిద్ధి మవాప్నోతి కిం పున స్తత్పరాయణః'

అనామయుఁడగు నారాయణుని ఒక్క ముహూర్తకాలము[6] ధ్యానించినను అతఁడు సిద్ధిని పొందగలడు ఇఁక ఎవఁడు నారాయణుని

6 పదునెనిమిది రెప్పపాట్ల కాలము - కాష్ఠ అనబడును. అట్టి 30 కాష్ఠలు ఒక కల 30 కలలు ఒక క్షణము అట్టి 12 క్షణములు ఒక ముహూర్తము అనఁగా - రెండు గడియల కాలము (48 నిమేషములు)

యందు తత్పరుఁడై యుండునో - అట్టివానికి లభించు మహా భాగ్యమును గుఱించి వివరించి చెప్పనేల ?"

**ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః**
**ఇద మేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా "**
**- (మహాభారతము)**

సమస్త శాస్త్రములను పరిశీలించి, అనేక పర్యాయములు విచారించి, ఒక్క నారాయణుఁడు మాత్రమే ధ్యానింపఁదగినవాడని నిర్ణయింపఁబడినది "

ఇట్టి ప్రమాణములను బట్టి, నారాయణ - వాసుదేవ నామములతో విరాజిల్లు విష్ణుభగవానుఁడు సర్వులకును ఆరాధనీయుఁ డనియు, ఆ దేవదేవుని యనుగ్రహమువల్లనే జీవాత్మ లన్నియు గమ్యస్థానము చేరఁగలవనియు స్పష్ట మగుచున్నది

## 13 విష్ణుగాయత్రీ మంత్ర మహిమ

విష్ణు భగవానునకు అనంత నామము లున్నవి 'వాసుదేవ' 'నారాయణ' అను రెండు నామములును ప్రముఖము లైనవి ఈ యంశమును విష్ణుగాయత్రీమంత్ర మిట్లు నిర్ధారించుచున్నది -

**"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్**

ఈ విష్ణుగాయత్రీ మంత్రమున, విష్ణు - నారాయణ - వాసుదేవులకు పరత్వము నిర్దేశింపఁబడినది ఇట్టి యీ మంత్రప్రభావము - శ్రీ పాంచరాత్ర దివ్యాగమశాస్త్రములో నిట్లు వివరింపఁబడినది -

**శంఖ చక్ర గదాపాణిం గరుడారూఢ మచ్యుతం**
**సౌమ్యం చతుర్భుజం దేవం స్ఫటికాద్రి సమప్రభమ్**

ధ్యాత్వా జపే చ్చతుర్వింశ లక్షత స్తద్దశాంశతః
తర్పణం తత్సమో హోమః తత స్సిద్ధో మహామనుః
సర్వమంత్రఫలం దద్యాత్ సాధకస్య న సంశయః
నా స్తి నా స్తి సమో మంత్రో విష్ణుగాయత్రిసమ్మితః '

— (శ్రీవిష్ణు తిలకము 4-వ అధ్యాయము)

చతుర్భుజములుగలిగినట్టియు, శంఖ చక్ర గదా శార్ఙ్గములను పాణిపల్లవములతో ధరించినట్టియు, శుద్ధసత్త్వగుణసంపన్నుఁడైనట్టియు, స్ఫటికాద్రివలె ధవళకాంతులతో ప్రకాశించునట్టియు, గరుడవాహనారూఢుఁడునైన శ్రీ విష్ణు భగవానుని - విష్ణుగాయత్రీ మంత్రముతో ఇరువదినాల్గు లక్షల పర్యాయములు గాని, లేక - అందులో దశాంశము గాని ధ్యానించి, జపించి, తర్పణము గావించి, తత్సమముగా హోమము గావించినయెడల, అట్టి సాధకునకు సర్వమంత్రఫలము నొసంగును ఇందు - సందియము లేదు విష్ణుగాయత్రితో తుల్యమగు మంత్రము మఱి యొకటి లేదు "

## 14 అష్టాక్షరీ మహా మంత్ర ప్రభావము

ఇది యిట్లుండ, శ్రీవైష్ణవ మతమున - విష్ణుషడక్షరీ, [7] నారాయణాష్టాక్షరీ, [8] వాసుదేవ ద్వాదశాక్షరీ [9] మంత్రములు మూఁడును సుప్రసిద్ధములై యున్నవి అందునను - నారాయణాష్టాక్షరీ మహామంత్రము అగ్రగణ్యమైన దనియు, అత్యంత ఫలప్రదమైన దనియు శ్రీపాంచరాత్ర దివ్యాగమశాస్త్రమున, శ్రీమహావిష్ణువు - తన నాభి కమలమున నుద్భవించిన బ్రహ్మకి ట్లుపదేశించుచున్నాఁడు -

---

7 విష్ణు షడక్షరీ మంత్రము — ఓం నమో విష్ణవే

8 నారాయణాష్టాక్షరీ మంత్రము — ఓం నమోనారాయణాయ

9 వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రము — ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రుణు వత్స ప్రవక్ష్యామి మంత్రాణా ముత్తమం మనుం
సర్వార్థ సిద్ధిదం లోకే సర్వారిష్ట వినాశకమ్
తస్య కల్పం సవిస్తారం సాంగోపాంగం శుభప్రదం
వక్తుం వర్షశతేనాఽపి మయాచైవ న శక్యతే
తస్మా ద్వేత ద్విధానం చ ఫలం దిఙ్మాత్ర ముచ్యతే
ధర్మార్థకామమోక్షాణాం ఇద మేకం హి సాధనమ్
సిద్ధయో బహుధా ప్రోక్తా జపస్య హవనస్య చ
మంత్రాంతరాణాం యా సిద్ధిః కల్పే కల్పే ప్రకీర్తితా
సాఽపి ప్రసిద్ధే దస్యైవ సకలా వీర్యవత్తయా
షడంగాని చ వేదాం శ్చ మంత్రా శ్చాన్యే పరశ్శతాః
అన్యచ్చ వాఙ్మయం సర్వం మన్త్రేఽస్మిన్ సుసమాహి   త
అపునర్భవ లిప్సూనాం గతి రష్టాక్షరం మతం
జన్మ న్యస్మి న్నతీతే వా యదేత త్యంచితం మహత్
తన్మంత్ర జపమాత్రేణ ప్రలయం యాతి నిశ్చయమ్
మ్రియమాణ శ్శుచి ర్ధ్యాత్వా మంత్ర మేత ముదీరయన్
ప్రాప్నోతి వైష్ణవం స్థానం దుష్ప్రాప మవినాశనమ్
కిం తస్య బహుభి ర్మంత్రైః కిం తస్య బహుభి ర్వ్రతైః
య స్యైషా వశ మాపన్నా విద్యా సర్వార్థ సాధనే

— (నారాయణ సంహిత)

ధర్మార్థకామమోక్షము లనంబడు చతుర్విధ పురుషార్థములను సాధించుటకు ఈ అష్టాక్షరీ మహా మంత్రమే సర్వోత్తమమైనది ఈ మహా మంత్రమును జపమునందును, హవనమునందును అనుష్ఠింప వచ్చును ఇందువలన, సర్వార్థములు సిధించును సర్వారిష్టములు నశించును వేదములు, వేదాంగములు, ఇతర మంత్రములు మొదలగు వాఙ్మయ మంతయు ఈ మహామంత్రమునందే సమాహితమై యున్నది పునర్జన్మ రాహిత్యమును కోరువారికి ఈ ఒక్క మహా

మాత్రమే గతియై యున్నది ఇయ్యది — జన్మజన్మాంతర సంచిత మైన మహాపాపమును నివారించును ఈ మంత్రమును శుచిగా జపించుటమాత్రముచేతనే శాశ్వతమైన విష్ణుసాయుజ్యమును పొందఁగలరు కావున, ఇతరములైన అనేక మంత్రములతోను, అనేక వ్రతములతోను ఇక పని యేమి ? ”

ఇదియే భగవ దుపదేశము ఈ ఉపదేశమునుఁబట్టి, అష్టాక్షరీ మహామంత్ర ప్రభావము సుస్పష్టము 'తిరుమంత్రము' 'మూల మంత్రము' అను నామాంతరములుగల ఈ అష్టాక్షరీ మహామంత్ర మును, మంత్రార్థమును, మంత్రమహిమను శ్రీభగవద్రామానుజులు - గుర్వాజ్ఞను సైతము పాటింపక, లోకకల్యాణ కాంక్షతో, ఆలయ గోపుర మధిరోహించి, ఉచ్చైస్స్వరముతో వివరించి, శాశ్వత యశ మును పొందిన విషయము జగద్విదితము కావున, అట్టి ఆ మహనీ యులు ముముక్షువుల నుద్దేశించి వెలువరించిన సిద్ధాంత విశేషము లిట అవశ్య గ్రహణీయములై యున్నవి -

## 15 శ్రీరామానుజ సిద్ధాంత విశేషములు

శ్రీ యామునాచార్యులు తమ గ్రంథములలో నిర్దేశించిన సిద్ధాంతములనే శ్రీమద్రామానుజులు విస్తృతము గావించి, లోకమున ప్రకటించిరి చిత్తు (జీవుఁడు) — అచిత్తు (జడ సముదాయము) — ఈశ్వరుఁడు (పురుషోత్తముఁడు) అను ఈ మూఁడు తత్త్వములే ముఖ్యము లనియు, జీవులు - దృశ్యప్రపంచము ఈశ్వర శరీర మనియు, అవియే ఈశ్వర శరీరమునకు ఆత్మ యనియు శ్రీ రామానుజులు నిర్ధా రించుచు, ఈ తత్త్వత్రయమును సమర్థించుటకు వివిధ విషయములను నిశితముగా వివేచించి, ఇట్లు వివరించిరి —

ప్రమేయ నిరూపణము, ప్రమావశ్యకత – యథావస్థిత వ్యవహారానుగుణ జ్ఞానమే ప్రమ ప్రమాకారణమే ప్రమాణము ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణములు మూడు విధములు సాక్షాత్కారము ప్రమాకారణ మగు ప్రత్యక్షము నిర్వికల్పము, సవికల్పము అని, ప్రత్యక్షప్రమాణము రెండు విధములు ఈ రెండు మాత్రమే విశిష్ట విషయములు అవిశిష్ట విషయము జ్ఞానోపలబ్ధి కాజాలదు ఇయ్యది - ప్రత్యక్ష జ్ఞాన ప్రక్రియా స్వరూపము ఆత్మ మనస్సుతో, మనస్సు ఇంద్రియములతో, ఇంద్రియములు విషయములతో సంయుక్తము లగును అనంతరము జ్ఞాన ముదయించును ఇందువలన, జ్ఞానము విషయావగాహి యని స్పష్టము నిర్విశేషవస్తువుకు జ్ఞాన ముదయింపజాలదు స్మృతి - పృథక్ ప్రమాణము కాదు స్మృతియు ప్రత్యక్షమున అంతర్గత మగుటయే ఇందులకు కారణము పూర్వానుభవ) భూతమైన వస్తుసంస్కారమువల్లనే స్మృతి కల్గును ప్రత్యభిజ్ఞయు ప్రత్యక్షమున అంతర్భుక్తము అభావము భావాంతరరూపమే ఇందువలన, అభావ జ్ఞానముకూడ ప్రత్యక్షమందే మిళితమై యున్నది పుణ్యపురుషుని ప్రతిభ (యోగజ్ఞానము) కూడ ప్రత్యక్షమునందే అంతర్గతమైయున్నది

అతః సర్వం జ్ఞానం సవిశేష విషయం చ "

జ్ఞాన సత్యము లన్నియు సవిశేష విషయకములు నిర్విశేష వస్తుగ్రహణము అసంభవము భ్రమ జ్ఞానము, స్వప్నాది జ్ఞానము - జ్ఞానాంతర్గతములు

'అతః సర్వం విజ్ఞానజాతం యథార్థజాత మితి సిద్ధమ్ "

ఉపమాన - అర్థాపత్తులును అనుమానాంతర్గతములే అపౌరుషేయములు, నిత్యములు నగు వేదవాక్యములే శబ్దప్రమాణములు

మోక్షాధికారి — కర్మయోగమున జ్ఞానముగలవాఁడే బ్రహ్మ జిజ్ఞాసాధికారి మొదట — కర్మయు, కర్మఫలానిత్యతాదులు కలిసి జ్ఞానమగును అటుపిమ్మట, బ్రహ్మజిజ్ఞాసాప్రవృత్తి యేర్పడును వెంటనే వేదాధ్యయన వాంఛయు, కర్మయందు అనిత్యఫలజ్ఞానము, ముక్తియందభిలాషయు స్థిరఫలాకాంక్షయు క్రమముగాఁ గల్గును తత్ఫలితముగా — బ్రహ్మజిజ్ఞాస యేర్పడును అట్టివాఁడే మోక్షాధికారి

విషయము — స్థూలము, సూక్ష్మము అగు చేతనాచేతన బ్రహ్మయే విషయము అట్టి బ్రహ్మయే పురుషోత్తముఁడు అతఁడు సగుణుఁడు, సవిశేషుఁడు నిర్విశేషము వస్తుజ్ఞానము కాఁజాలదు

ప్రయోజనము - అవిద్యా నివృత్తియే ప్రయోజనము జీవునకు అజ్ఞానము స్వభావసిద్ధము అయ్యది ఉపాసనద్వారా పరబ్రహ్మ సాక్షాత్కారమైన పిమ్మట తొలఁగిపోవును ముక్తజీవుఁడు భగవంతునకు దాసుడై యుండును అట్టి దాసుఁడు భగవంతుని నిత్యలీలలలోఁ గల ఆనందమును అపారముగా అనుభవించును

పరబ్రహ్మ - పరబ్రహ్మ సగుణుడు, సవిశేషుఁడు ఆతని శక్తియే మాయ అతఁడశేష కల్యాణగుణాకరుఁడు హేయగుణ రహితుఁడు సర్వేశ్వరత్వ, సర్వశేషిత్వ, సర్వకర్మారాధ్యత్వ, సర్వ ఫలప్రదత్వ, సర్వాధారత్వ, సర్వకార్యోత్పాదకత్వ, సమస్తద్రవ్య శరీరత్వాదులు ఆతని లక్షణములు అతఁడు సూక్ష్మచిదచిద్విశేష రూపమున నిమిత్తకారణుఁడు జీవుఁడు, జగత్తు ఆతని శరీరము అతఁడే ఆత్మ ఆతని గుణములు అసంఖ్యాకములు అతఁడే సృష్టి కర్త, కర్మఫలదాత, నియంత, సర్వాంతర్యామియు అతఁడే సర్వాధికుఁడైన శ్రీమన్నారాయణుఁడు అట్టి శ్రీమన్నారాయణుఁడు

పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారము లను అయిదు విధములుగా నున్నాఁడు అతఁడు - శంఖ, చక్ర, గదా, పద్మధారి కిరీటాది భూషణాలంకృతుఁడు - చతుర్భుజుఁడు శ్రీ భూ నీళా సమేతుఁడు

**అవతారములు :-** మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, శ్రీకృష్ణ, కల్కి అవతారములు పది ఈ యవతారములలో - ముఖ్య, గౌణ, పూర్ణ, అంశ భేదములు కలవు అవతార హేతువు ఇచ్ఛామాత్రమే కాని, కర్మ ప్రయోజన హేతువు కాదు సాధు పరిత్రాణము, దుష్కృత వినాశము, ధర్మ సంస్థాపనము అనునవి అవతార కృత్యములు ఆవశ్యకమగునపు డెల్లను భగవంతుఁ డవతరించును

**బ్రహ్మ, జగతు** - జీవుఁడు బ్రహ్మశరీరము జీవబ్రహ్మలు చేతనులు బ్రహ్మ విభుఁడు జీవుఁడు అణువు జీవబ్రహ్మలలో - సజాతీయ విజాతీయ భేదము లేదు స్వగతభేదము మాత్రమే కలదు బ్రహ్మ అఖండుఁడు జీవుఁడు ఖండితుఁడు బ్రహ్మ ఈశ్వరుఁడు జీవుఁడు దాసుఁడు ముక్త జీవుఁడుగు ఈశ్వరదాసుఁడే జీవుఁడు కార్యము ఈశ్వరుఁడు కారణము జీవబ్రహ్మలు రెండును స్వయం ప్రకాశకములు చేతనము - జ్ఞానాశ్రయము, ఆత్మస్వరూపమునై యున్నది

జీవుఁడు దేహేంద్రియ మనఃప్రాణాదులకంటెను భిన్నుఁడు అతఁడు నిత్యుఁడు ఆతని స్వరూపముకూడ నిత్యమే ప్రత్యేక శరీర మున జీవుఁడు భిన్నుఁడు స్వాభావిక రూపమున అతఁడు సుఖుఁడే కాని, ఉపాధివశుఁడైన పిమ్మట, సంసారభోగము ననుభవింపఁగలుగు జీవుఁడే కర్తయు, భోక్తయు, శరీరియు, శరీరమునై యున్నాడు ఇట్టి జీవులలో - కొన్ని భేదములు కలవు

ముక్తి, ముక్తుఁడు - భగవద్దాసత్వమే ముక్తి వైకుంఠ ధామమున, శ్రీ - భూ - నీళాదేవులతోఁ, అసమాన తేజోవిరాజితుఁడగు శ్రీమన్నారాయణుని సేవించుటే జీవునకు పరమ పురుషార్థము దేహము నశించిన యనంతరము - అప్రాకృత దేహియై, శ్రీమన్నారాయణునితో భోగము ననుభవించుటయే ముక్తి - నిత్యుఁడు, అణుస్వరూపుఁడు, తామసుఁడు అగు జీవుఁడు - ఎన్నఁడును విభుఁడు కానేరఁడు ముక్తజీవుఁడు వైకుంఠలోకమున, అపార కల్యాణ గుణ గణసాగరుఁడగు శ్రియఃపతికి దాసుఁడై, ఆనందానుభవము నొందును ముక్తజీవునియందు అష్టగుణము లావిర్భవించును జీవుఁడు ఈశ్వరుని ఇచ్ఛాధీనుఁడైన యనంతరముకూడ, సర్వత్ర సంచారము చేయును, ముక్తి ఉపాసనద్వారా లభించును ఉపాసనాత్మకమగు భక్తియే ముక్తికి మేలైన సాధనము

సాధనము, ధ్యానము, ఉపాసనము మున్నగునవి - ముక్తి సాధకములు జ్ఞానము ముక్తిసాధనము కాదు ముక్తిప్రాప్తికి భక్తియే ఉపాయము బ్రహ్మాత్మైకజ్ఞానముచే, అయ్యది నివృత్తి కాఁజాలకుండుటయే ఇందులకు కారణము భగవానుఁడు భక్తిచే ప్రసన్నుఁడై, ముక్తి నొసంగును

ప్రపత్తి - న్యాస విద్యయే ప్రపత్తి అనఁగా - తన యభీష్టము వేరొకదానిచే సాధింప శక్యముకాఁదని తెలిసికొని, మహావిశ్వాస పూర్వకముగ, శ్రియఃపతియే ఉపాయమని తలఁచి, తన రక్షణకై శ్రియఃపతిని యాచించుటే ఇది - న్యాసము, శరణాగతి, ఆత్మ సమర్పణము, ఆత్మ నివేదనము, ఆత్మ నిక్షేపము, భర సమర్పణము అను నామాంతరములతో వ్యవహరింపఁబడుచున్నది ఇట్టి ప్రపత్తికి - అనుకూల సంకల్పము, ప్రతికూల వర్జనము, రక్షణ విశ్వాసము, గోప్తృత్వ వరణము, కార్పణ్యము, ఆత్మ నిక్షేపము అను ఆఱు అంగ

ములు కలవు శ్రీమన్నారాయణుఁడే సర్వేశ్వరుఁడు ఆతని చరణారవిందములయందు ఆత్మ నిక్షేపము గావించుటవల్లనే జీవునకు శాంతి లభించును పరతంత్రుఁడై, సర్వభారమును తనయందుంచిన జీవుని, శ్రియఃపతి - సర్వపాపములనుండి విముక్తునిఁ గావించి, కరుణించి రక్షించును

**"సత్యకామ, సత్యసంకల్ప, పరబ్రహ్మభూత, పురుషోత్తమ ! మహావిభూతే' శ్రీమన్నారాయణ ! శ్రీవైకుంఠనాథ ! అపారకారుణ్య, సౌశీల్య, వాత్సల్యౌదార్యైశ్వర్య సౌన్దర్య మహోదధే, అనాలోచిత విశేషాలోక శరణ్య, ప్రణతార్తిహరా, ఆశ్రిత వాత్సల్యైక జలధే, అనవరత విదిత నిఖిలభూత యాథాత్మ్య, అశేష చరాచర భూత నిఖిల నియమన నిరత, అశేష చిదచిద్వస్తు శేషిభూత, నిఖిల జగదాధార, అఖిల జగత్స్వామిన్, అస్మత్స్వామిన్, సత్యకామ, సత్యసంకల్ప, సకలేతరవిలక్షణ, అర్థికల్పక, ఆపత్సఖ, శ్రీమన్నారాయణ ! అశరణ్యశరణ్య అనన్యశరణ, త్వత్పాదారవిందయుగళ మహం ప్రపద్యే**

*– (శ్రీమద్రామానుజులు - శరణాగతి గద్య)*

పూర్ణకాముఁడు, సత్యసంకల్పుఁడు, పరబ్రహ్మరూపుఁడు అగు పురుషోత్తమా ! మహాఐశ్వర్య యుక్తుఁడవగు శ్రీమన్నారాయణా ! వైకుంఠనాథా! కారుణ్యము, సౌశీల్యము, వాత్సల్యము, ఔదార్యము ఐశ్వర్యము, సౌందర్యము మొదలగు గుణములకు నీవు మహానిధివి వరతారతమ్య విచక్షణ చేయక, అందఱను నీవు రక్షింతువు నీవు నిజముగా శరణాగతులయెడ వాత్సల్య సముద్రుఁడవు సమస్తభూతముల యథార్థతను నీవు సర్వదా తెలిసికొనుచుండగలవు సంపూర్ణ చరాచర భూతములకును, సకల నియమములకును, చేతనాచేతన వస్తుజాతమునకును నీవు అవయవుఁడవు, సమస్త ప్రపంచమునకు ఆధారుఁడవు అఖిల లోకములకు, సకల జీవులకు నీవు ప్రభుఁడవు నీ వాంఛలు పూర్ణములు నీ సంకల్పము సత్యము సమస్త ప్రపంచమునకంటెను నీవు ఇతరుడవు, విలక్షణుఁడవు అర్థులకు కల్పకమవు విపత్సముద్రమున

మునిఁగిన జీవులకు ఆశ్రయ మిచ్చువాఁడవు ఇట్టి మహిమ గల శ్రీమన్నారాయణా! నేను నీ చరణారవింద యుగళమును శరణు పొందుచున్నాను నీ పాదపద్మములు దక్క, నాకు గత్యంతరము లేదు

"పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాని చ
"సర్వధర్మాం శ్చ సంత్యజ్య, సర్వకామాం శ్చ సాక్షరాన్
లోకవిక్రాంత చరణౌ శరణం తే వ్రజం విభో"!

— (శరణాగతి గద్య)

స్వామీ! నేను తల్లిదండ్రులను, భార్యాపుత్రులను, బంధుమిత్రులను, రత్నములును, ధనధాన్యములను, గృహారామములను, సర్వధర్మములను సాక్షరములైన సర్వకామములను త్యజించి, బ్రహ్మాండము నాక్రమించు నీ పాదపద్మమును శరణుపొందుచున్నాను"

"మనోవాక్కాయై రనాదికాల ప్రవృత్తానన్తాకృత్యకరణ, కృత్యాకరణ — భగవదపచార — భాగవతాపచార — అసహ్యాపచారరూప, నానావిధానన్తాపచారా నారబ్ధకార్యానారబ్ధకార్యాన్, కృతాన్, క్రియమాణాన్, కరిష్యమాణాం శ్చ సర్వా నశేషతః క్షమస్వ" — (శరణాగతి గద్య)

భగవానుఁడా! మనోవాక్కాయములద్వారా అనాదికాలము నుండియు చేయుటకు అయోగ్యములగు కర్మల ననేకములను చేయుటచేతను, భగవదపచారముచేతను, భాగవతాపచారముచేతను క్షమార్హములుకాని నానావిధ అనంత అపరాధములవలనను, ప్రారంభమైనట్టియు, ప్రాకృతములు కానట్టియు, ప్రారబ్ధమైనట్టియు, ప్రారబ్ధములు కానట్టియు సమస్త పాపములను క్షమించుము"

"మదీయానాది కర్మ ప్రవాహప్రవృత్తాం భగవత్స్వరూప తిరోధానకరీం విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధే ర్జననీం, దేహేంద్రియత్వేన

భోగ్యత్వేన సూక్ష్మరూపేణావస్థితాం, దైవీం గుణమయీం మాయాం, దాసభూతం, శరణాగతోఽస్మి దాస ఇతి వక్తారం మాం తారయ ' – (శరణాగతి గద్యా)

అనాది కర్మప్రవాహమున కొట్టుకొని వచ్చినట్టియు, భగవత్స్వరూపమును తిరోధానము జేయునట్టియు, విపరీతజ్ఞానజననియు, స్వవిషయమున భోగ్యబుద్ధిని కల్గించునదియు, దైవసంబంధము – త్రిగుణమయమునగు మాయకు దాసభూతుఁడనైన నేను నీ దాసుఁడను, కింకరుఁడను, నిన్ను శరణు పొందితిని ఇట్టి నన్నుద్ధరింపుము "

దీనుఁడైన జీవుఁడు – సర్వేశ్వరుఁడైన శ్రీమన్నారాయణుని ఈ రీతిగా ప్రార్థించి, శరణాగతుఁడు కావలెను అట్టి శరణాగతుఁడైన జీవుఁడే ధన్యుఁడు

## 16 అభయ ప్రదానము

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ
– (శ్రీమద్రామాయణము)

నేను నీవాఁడనైతి నని శరణాగతి చేసిన భక్తప్రపన్నునకు – సకల చేతనులకు అభయ మిచ్చుచున్నాను ఇది నా వ్రతము' అని శ్రీరామచంద్రమూర్తియు –

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః
– (భగవద్గీత 18-66 )

ధర్మములు నన్నిటిని విడచి, నన్నొక్కనినే శరణుపొందుము నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తుని చేయఁగలను దుఃఖింపకుము' అని శ్రీకృష్ణభగవానుఁడును భక్తప్రపన్నులకు అభయ మిచ్చియున్నారు

## 17 ఫలశ్రుతి

పరమాత్మకు రెండు విభూతు లున్నవి పరమపద మంతయు నిత్య విభూతి దృశ్యమానమగు ఈ ప్రకృతి మండల మంతయు లీలా విభూతి ఇచ్చట కర్మ జ్ఞానయోగముల సహాకారము పొందిన భక్తి యోగ మొకటియే పరమాత్మ ప్రాప్తికి సాధనము శేషించిన వేవియు ఉపయోగింపఁజాలవు

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః

— (తైత్తిరీయోపనిషత్తు)

కర్మచేగాని, సంతానముచేగాని, ధనముచేగాని అమృత పదవి (ముక్తి) లభింపదు అది ఒక్క త్యాగమువల్లనే లభించును"

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

— (భగవద్గీత 11-53,54)

వేదములచేఁగాని, తపస్సుచేఁగాని, యాగముచేఁగాని నా నిజ స్వరూపమును నీ విపుడు చూచినట్లు చూచుటకు సాధ్యము కాదు అనన్య భక్తి చేతనే ఇట్టి నా రూపమును తెలిసికొనుటకు, దర్శించుటకు, నాలోకమును పొందుటకు శక్య మగును" అని, శ్రుతి స్మృతు లుపదేశించుచున్నవి కావున, ఈ భక్తుఁడు పరమాత్మయందు శరణాగతి యొనర్చిననే గాని, ప్రతిబంధక మంతయు తొలఁగి, మోక్షము

లభింపదు భగవత్ప్రపత్తి యొనర్చి, వివేక - విమోక - అభ్యాస - క్రియా - కల్యాణ - అనవసాద - అనుద్ధర్షము లను సప్త సాధనము లను చక్కగా అనుష్ఠించువాఁడే పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తుల నుపాసించి, భగవత్ప్రాప్తి నొందఁగల్గును

ఈ భక్తియోగము, ప్రపత్తియుకూడ, భగవద్గీతలో ప్రతిపాదింపఁబడినవి ఇయ్యవి - పాంచరాత్ర దివ్యాగమమున విస్తరించి నిరూపింపఁబడినవి శ్రుత్యుపబృంహణ మగు ఈ పాంచరాత్ర దివ్యాగమము - శ్రీవైష్ణవ సంప్రదాయమునకు పరమ ప్రమాణము

'నేమిర్వై సహస్రారః సహస్రారో నేమిః
నేమినా తప్త తనూః అతప్త తనూ ర్నతదామో ఒశ్నుతే

ఇత్యాది శ్రుతివిహిత మగు తప్తచక్రాంకనముగూడ ఈ పాంచరాత్రాగమమునందు విస్తరించి ప్రతిపాదింపఁబడినది తైత్తిరీయ ప్రతిపాదితమగు ఈ పాంచరాత్రాగమముకూడ, అట్టిదగు భగవద్గీతతో సమానముగా శ్రీ వైష్ణవ మతమున ఆదరింపఁబడును ఇట్లు ప్రపన్నుఁడు ద్వయమంత్రముతో[10] భగవత్ప్రపత్తి - శరణాగతి యొనర్చుచు, మూల మంత్రముతో[11] భగవంతుని ఉపాసించుచు, స్వవర్ణాశ్రమ విహితములగు కర్మల నొనర్చుచు, అంతిమ స్మృతితో భగవదనుసంధానయోగము ననుష్ఠింపనగును

దేహ త్యాగానంతరము అట్టి భక్తప్రపన్నుని - అర్చిరాది మార్గముగా వాహకులు గొనిపోయి, ప్రాకృత - అప్రాకృత మండల

---

10 ద్వయ మంత్రము = శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే శ్రీమతే నారాయణాయ నమః

11 మూల మంత్రము = నారాయణాష్టాక్షరీ మంత్రమునే మూలమంత్ర మనియు, తిరుమంత్ర మనియు వ్యవహరింతురు

ు సరిహద్దగు విరజానదికడ వదలుదురు అప్పుడా భక్తపవ
ఁడు అచటి విరజానదీస్నాన మొనర్చినవెంటనే, అతనికి ప్రాకృత
బంధ మంతయు సవాసనగా నశించిపోవును ఆపైన, పరమపద
సుని యనుజ్ఞ వలన, పారిషదులు ఈతని కెదురుగా వచ్చి, స్వాగత
, శ్రీమన్నారాయణుని కొలువుకూటమగు మణిమంటపమునకు
ుపోవుదురు అచట, పరమాత్మచే అతఁడుపలాలితుఁడై, శుద్ధ
త్త్వమయ మగు ఆ నిత్యవిభూతియందు పరమాత్మయిచ్ఛ కనుగుణ
ు కైంకర్యముల నొనర్చుచు, దివ్యమంగళవిగ్రహ సేవచే, నిరతి
శయానంద మొందును

ఇది యే శ్రీ వైష్ణవ మత వైశిష్ట్యము

"పశు ర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవ సంశ్రయాః
తే నైవ తే ప్రయాస్యంతి త ద్విష్ణోః పరమం పదమ్ "



## 18 విష్ణు సంశ్రియ ఫలము

"భ్రమరంబుచే కీట భావ మప్పుడె చెడి
పురుగు తుమ్మెదగాను బొసగు లెఱఁగి
స్పర్శంబుచే లోహ భావ మప్పుడె చెడి
యినుము బంగారమై యొనఁగు కరణి
అగ్నిచే స్వర్ణ సక్తాఖిల దోషంబు
లప్పుడే చెడి మేలి మగుట యెఱఁగి
క్షత్రియత్వము తప స్సామర్థ్యమునఁ జెడి
అతఁ డప్పుడే విప్రుఁ డౌట యెఱఁగి

శ్వపచుఁడైనను విష్ణు సంశ్రయము వలన
ఆ క్షణంబున పరిశుద్ధుఁ డౌను - అతఁడె
అధికుఁ డనియును - అది లేని యతియు నధముఁ
డనియు లక్ష్మణ మునివరుం డాన తిచ్చె"

తుమ్మెదచే కీట భావము తొలఁగి, పురుగు తుమ్మెద యగునట్లును, స్పర్శవేదిచే లోహ భావము తొలఁగి, ఇనుము బంగార మగునట్లును, అగ్ని తప్తముచే బంగారము నందలి మలినము తొలఁగి, అది మేలిమి యగునట్లును, తప శ్శక్తిచే క్షత్రియత్వము తొలఁగి, అతఁ డపుడే విప్రుఁ డగునట్లును, శ్వపచుఁడేనియు - విష్ణు సంశ్రయము వలన ఆ క్షణముననే పరిశుద్ధుఁ డగును అతడే అధికుఁడు విష్ణు సంబంధము లేని యతీశ్వరుఁ డైనను అధముఁడే' అని శ్రీ రామానుజ యతిసార్వభౌములు సెలవిచ్చి యున్నారు

— (ముముక్షు జన కల్పకము)

# 19. శ్రీవైష్ణవ మతము — పదార్థ విభాగము

రచన
**ధనకుధరం వరదాచార్యులు**
ప్రచురణ
**శ్రీ రామానుజ కీర్తి కౌముది**
**( నవమి )**

- పదార్థము
  - ప్రమాణము
    - ప్రత్యక్షము
    - అనుమానము
    - శబ్దము
  - ప్రమేయము
    - ద్రవ్యము
      - జడము
        - ప్రకృతి
          - ప్రకృతి
          - మహత్తు
          - అహంకారము
          - మనస్సు
          - పంచజ్ఞానేంద్రియములు
          - పంచకర్మేంద్రియములు
          - పంచతన్మాత్రలు
          - పంచమహాభూతములు
        - కాలము
          - భూతము
          - భవిష్యత్
          - వర్తమానము
      - అజడము
        - పరాక్
          - నిత్యవిభూతి
          - ధర్మభూతజ్ఞానము
        - ప్రత్యక్
          - జీవుడు
            - బద్ధుడు
              - బుభుక్షువు
                - అర్థకామపరుడు
                - ధర్మకామపరుడు
                  - దేవతాంతరపరుడు
                  - భగవత్పరుడు
              - ముముక్షువు
                - కైవల్యపరుడు
                - మోక్షపరుడు
                  - భక్తుడు
                  - ప్రపన్నుడు
                    - ఏకాంతి
                    - పరమైకాంతి
                      - దృప్తుడు
                      - ఆర్తుడు
            - ముక్తుడు
            - నిత్యుడు
          - ఈశ్వరుడు
            - పరము
            - వ్యూహము
              - కేశవాది
              - వాసుదేవాది
                - వాసుదేవ
                - సంకర్షణ
                - ప్రద్యుమ్న
                - అనిరుద్ధ
            - విభవము
            - అంతర్యామి
            - అర్చావతారము
    - అద్రవ్యము
      - సత్త్వము
      - రజము
      - తమము
      - శబ్దము
      - స్పర్శము
      - రూపము
      - రసము
      - గంధము
      - సంయోగము
      - శక్తి

# అన్నమాచార్యులు - సంకీర్తన వాఙ్మయము

భాషాప్రవీణ

## శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు

—❋—

## నమస్సుమాంజలి

"శ్రీవేంకటేశ మతి సుందర మోహనాంగం
శ్రీభూమికాంక మరవింద దళాయతాక్షమ్
ప్రాణప్రియం ప్రవిలస త్కరుణాంబురాశిం
బ్రహ్మేశవంద్య మనిశం మనసా స్మరామి"

## శ్రీనివాస విలాసము

శ్రియఃపతి యగు శ్రీనివాసప్రభువు పరమ కారుణ్యసింధువు భక్తజన గణ బంధువు మానవుని మహిమాన్వితుని గావింపజాలిన ఆయన కటాక్ష లేశము ఎవరి కెపుడు లభ్యమగునో ఎవరు చెప్పగలరు? ఎవ రూహింపనేర్తురు? పురాకృత సుకృత విశేషముగా, నిరంతర తపః ఫలముగా మాత్రమే శ్రీ వేంకటేశ్వరానుగ్రహము సిద్ధించును అది మనుగడను చరితార్థ మొనరించు వరముల సర్వము బ్రతుకు మొత్తమునకు పర్వము అట్టి యోగ్యత నందుకొనినవారు ధన్యులు ఆ యదృష్టమునకు నోచుకొనినవారు మాన్యులు జీవితమును మనము ఆలయముగా భావించుకొనినచో - ఆ ఆలయమును పదిలముగా కాపాడు సప్తగిరినాథుని కృప - ఒక బృహత్ప్రాకారము నరుని కోరికల గుంపును దాహముతో పోల్చుకొనినచో - హద్దులు మీరని ఆ ఆశాదాహమును తీర్చు శేషాద్రి నిలయుని దయ - పరమ రమణీయమైన మధుర జల పూర్ణ కాసారము ఈ ప్రాకారములో భద్ర

ముగా బ్రతుకును వెళ్ళదీసికొన్నారు, ఈ కాసారములో గొంతు తడుపుకొని కృతార్థతనందుకొన్నవారుచరిత్రలో ఎందరో ఉన్నారు

కలియుగ ప్రత్యక్ష దైవముగా, ఆపద మ్రొక్కుల ప్రభువుగా, ఎలచిన పలికెడి స్వామిగా, అందరి గుండెలలో గుడి గట్టుకొని కూర్చున్న అలమేల్మంగా మనోహరుని మహాద్భుత లీలావిశేషములు చరిత్రకు క్రొత్తలు గావు సృష్ట్యాదినుండి ఆయనను నమ్మి కొలుచు కొనుచున్న భక్తజను లందరు ఆయనకు ప్రాత కాపులే

తెలుగు గడ్డపై గల కడప జిల్లా - రాజంపేట తాలూకా - తాళ్ళపాక అను సుగ్రామమున గల సామాన్య కుటుంబీకు లయిన లక్కమాంబా నారాయణ దంపతులమీద, ఒకా నొక తరుణమున శ్రీ వేంకటేశ్వరుని కరుణ కిరణము ప్రసరించినది ఆ కిరణ కాంతి పుంజము దంపతుల కోర్కెలను పండించినది వారి గుండెల సంబర మును నిండించినది శ్రీనివాసుని అనుగ్రహఫల విశేషమున వారికి తనయుడుగా జన్మించిన చరితార్థ జాతకుడే అన్నమయ్య ఆతని పుట్టుక వలన తాళ్ళపాక వంశము తరించి, కళకళ లాడినది కడపజిల్లా ఆధ్యాత్మిక - సాంస్కృతిక - సాహిత్య చరిత్రలో ధన్యమై, తళతళ లాడినది యావ దాంధ్రదేశము పావన గేయకవితా తేజముతో మాన్యతను గని, క్రొంగ్రొత్త వెలుగులను వెలార్చుచు, మిలమిల లాడి నది సకల భక్తహృదయజలధి సంగీత సాహిత్య గంగా తరంగముల పొంగులతో జలజల కలసి ప్రవహించినది వాఙ్మయ ప్రపంచమున సరిక్రొత్త బాణీకి శ్రీకారము చుట్టబడిన శుభ ముహూర్త వేళ యది హృద్యమై, నిరవద్యమై, గద్యపద్యాత్మకమైన ఒకా నొక వినూతన సారస్వత ప్రక్రియ తళుక్కు మన్న తరుణ మది

## మహోదయము

క్రీ॥శ 1424 లో - క్రోధి వైశాఖమున, విశాఖా నక్షత్రమున అన్నమయ్య జన్మించెను పన్నిద్దరాళ్వారులలో ప్రముఖులగు నమ్మాళ్వారులు జన్మించిన నక్షత్రమది పరమ గురువులుగా పలువురి సన్నుతుల గన్న మహావిజ్ఞాననిధులగు వేదాంతదేశికులు - శ్రీనివాస భగవానుని కోవెలలో గల ఘంట యంశమున జన్మించినట్లే, లక్కమాంబా నారాయణ దంపతులు దివ్యక్షేత్ర తీర్థము లన్నింటిని సేవించి పుత్రసంతాన వాంఛ ఫలింపక, తిరుమలకు చేరి, యెల్లరి యేడుగడ యైన ఏడుకొండల దొరను శరణు జొచ్చిరట అభ్యర్థనలతో కయి మోడ్పు లందించి, అనన్య భక్తితో ఆశ్రయించిరట స్వామివారు వారి మొర నాలకించి కరుణించెనేమో ! కొలది కాలమునకే వారి తపస్సు పండినది వారి చిరకాల వాంఛ నెరవేరినది లక్కమాంబా దంపతులకు పుత్రోదయ మైనది ఆ బిడ్డయే శ్రీవేంకటేశ్వరస్వామి వారి నందకాంశమున నుదయించిన అన్నమయ్య యని విఖ్యాతి వచ్చెను

తండ్రి నారాయణ విశుద్ధవర్తనుడు తల్లి సౌశీల్య సంపన్న యగు సాధ్వీమణి భక్తిభావవైభమునకు సదన మనదగిన హృదయము గలవారి కభీష్టములు భగవదనుగ్రహ బలమున ఆలస్యముగనైన ఫలించు ననుటకు నారాయణదంపతుల పవిత్ర చరిత్రమే ప్రబలోదాహరణము

వీరు నందవర వైదికబ్రాహ్మణ వంశమునకు జెందినవారు ఋగ్వేదులు ఆశ్వలాయన సూత్రము వీరిది భారద్వాజస గోత్రమున సంబంధించినవారు

నారాయణ దంపతులు శ్రీవేంకటేశ్వర వరప్రసాద లబ్ధ జన్ముడగు తమ తనయుని గని, ఎంతో సంతోషించియుందురు స్వామి వారి అపార కారుణ్య లీలకు కయిమోడ్పు లందించియుందురు జీవిత మంతయు పరంధామునకు ఋణపడిపోయితిమని భావించియుందురు బహుశః అందువలననే తమ బిడ్డకు వా రాప్యాయముగ 'అన్నమయ్య' యని పేరిడికొనిరేమో! 'అన్నం పరబ్రహ్మ స్వరూప' మనెడి యంతరార్థము నెరిగిన ఆ దంపతులు - భగవదనుగ్రహ ఫలమైన కుమారుని - 'అన్నమయ్య' అని నోరార బిలుచుకొన నభిలషించిరి

అన్నమయ్య బాల్యమునుండియే ప్రహ్లాదుని పగిది భవ్య భక్తి భావ సంభరితాంతఃకరణుడై మెలగదొడగెను ఆయన పసితనమున నడచిన నడక యంతయు దడవు టారంభించిన, అది యొక పవిత్ర బాలభక్త చిత్ర లీలాచరిత్రముగా వెలయగలదు

ఈ రీతిగా బాల్యమునుండియే ప్రగాఢ భక్తితత్త్వమునకు నిలయముగ పరిఢవిల్లిన అన్నమయ్య జీవిత కుసుమము సమీపించి నంతనే నవనీయ సారస్వత సౌరభ సమన్వితమై, సప్తగిరినాథుని చరణ సన్నిధికి చేరుకొన్నది

బాలభాస్కరుని అరుణారుణ కిరణ కాంతులు తూర్పుకొండ మీది కెగబాకుచు పైకి వచ్చుచుండ, సరస్సున గల పద్మబాల దళ ముల వికాసముతో దోసిలి బట్టి, లోక బాంధవునకు స్వాగత మిచ్చును అది సహజము

నెమిలికన్నె మబ్బుదొరను జూచి నాట్య మాడినను, పూర్ణిమ నాటి చంద్రశీతల కిరణ స్పర్శతో సాగర తరంగముల మధ్య నృత్య భంగిమ లేర్పడినను - అది ప్రకృతిధర్మమే అదే విధముగ వయస్సు పెరుగుచున్న కొలది - క్రమక్రమాభ్యుదయ పథమున అన్నమయ్య ఒక పుణ్యక్షణమున ఒక మహాకవిగా మారెను ఆయన వాణి -

తెలుగు సాహిత్య నందనములో - క్రొంగ్రొత్త కుసుమ వితానమునకు శ్రీకారము చుట్టినది నాంది గీతమును ఆలపించినది శ్రీ వేంకటేశ్వరుని దివ్య శ్రీవిలసిత ఫాలఫలకమున గల తిరునామమును దర్శించినంతనే ఆతని చిత్తభృంగము శ్రీనివాసుని సరోజ సౌరభమును సమాస్వాదన మొనర్పబూనుకొన్నది ఆయన మహర్షి తుల్యుడై విలసిల్లెను మహా కవి బిరుదముతో విరాజిల్లెను సంకీర్తనాచార్యుడుగా విఖ్యాతి గాంచెను

## ప్రసూన సౌరభములు

ఆయన పలికిన ప్రతి పలుకు - తేనె చినుకయినది ఆయన ప్రయోగించిన ప్రతి పదము - ఒక రసాస్వాదమై రాణించినది ఆయన శైలీవిన్యాసములో శారదావిలాసము గోచరించినది ఆయన భావన - తెలుగు రసజ్ఞలోకమునకు దీవనగా నిలిచినది ఆయన మాట రసాల రసముల ఊట ఇక్షుఖండముల సుధాసదృశ రసార్ద్రాల తేట మహాంధ్ర సరస్వతీ నిరుపమ నివాస శ్రీకి నిలయమై భాసించు నిస్తుల సౌందర్య సంపన్నమైన సాహిత్య సామ్రాజ్యపు కోట అదియే అన్నమయ్యనోట - శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో వెలు వడిన తొట్ట తొలి తెలుగుపాట అది రసమయ సంగీతప్రపంచ పాంథ కోటికి రాచబాట సాధక లోకమునకు ముత్యముల మూట

తెలుగు సాహిత్య శారదాచరణముల అందెల రవళిలో క్రొత్త నాదము గాయక లోక సర్వస్వమునకు అనూహ్యముగా గుండెలు నిండిన మోదము ఆంధ్ర కావ్య విహాయస వీథులలో తారకలోకము తరిసి మురిసి కావించుకొను రమణీయ కమనీయ నవీన వాదము

అదియే అన్నమయ్య అద్భుత సృష్టిగా ఆంధ్రవాఙ్మయ చరిత్రలో అనంత కాంతిపుంజములను వెల్లివిరియించిన గేయవేదము

సాహిత్యములో - ఒకానొక క్రొత్త ప్రక్రియకు సప్తగిరినాథుని సన్నిధిలో అంకురారోపణ జరిగినది

అన్నమయ్య ఆంధ్రకవితా శారదామందిర ప్రాంగణమున నిల్చి, గేయలక్ష్మికి స్వాగతము చెప్పెను సత్కారములు చేసెను

శ్రీనివాస భగవానుని పరిపూర్ణ కటాక్షమునకు పాత్రుడైన అన్నమయ్య - ఎంతో అదృష్టవంతుడు ఆయన పుణ్యము పంటకు వచ్చిన సమయమున, స్వామి సన్నిధికి చేరుకొనెను నాటికి పదునారేండ్ల ప్రాయ మాయనది ఆ వయస్సున అన్నమయ్యకు శ్రీనివాస ప్రభువు సాక్షాత్కరించుటే మహాభాగ్యము

"ఇప్పు డిటు కల గంటి నెల్ల లోకములకు
అప్ప డగు తిరువేంకటాద్రీశు గంటి

అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతి లేని గోపురప్రభలు గంటి
శతకోటి సూర్యతేజము వెలుగగ గంటి
చతురాస్యు బొడగంటి చయ్యన మేలుకంటి

కనకరత్న కవాట కాంతు లిరుగడల గంటి
ఘనమైన దీపసంఘము గంటి
అనుపమ మణిమయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కున మేలుకంటి '

ఇట్టి యదృష్ట మాంధ్రకవిలోకమున, ఒక్క అన్నమయ్యకు మాత్రమే అబ్బియుండవచ్చును స్వప్నమున గన్పించిన స్వామి యేమని యాదేశించెనో! అన్నమయ్య తత్సర్వము శిరసావహించెను పారవశ్యముతో శేషాద్రిని శ్రీహరివాసముగ భావించి, ఆయన పాడిన

పాటలోగల ప్రతి మాటయు - రతనమై మెరసినది ఆయన మనస్సులో పూలవాన కురిసినది

### పసిడి పంట

"అదివో! అల్లదివో శ్రీహరి వాసము
పదివేల శేషుల పడగల మయము

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో! బ్రహ్మాదుల కపురూపము
అదివో! నిత్యనివాస మఖిల మునులకు
అదెచూడు డదె మ్రొక్కు డానందమయము

చెంగట నల్లదివో! శేషాచలము
నింగి నున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో! మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము

పంచసంస్కారములు పొంది, వైష్ణవ స్వీకార మొనర్చి, భవ సఫలతకొరకై బాల్యమునుండియే ప్రాకులాడుటకు ప్రారంభించిన భక్తాగ్రేసరుని నోట - పరమ పావన భావపరంపరయే వ్యక్తమగును కాని, ఆ తీరు క్రొత్తదగుట-ఆసారు అపూర్వ మగుట-అన్నమయ్యను మహాకవి నొనర్చినవి ఆయన - మహాంధ్ర భాషానందనము గేయ కుసుమములు పెంచు దీక్షతో - మహోద్యమమును నడిపించిన తెలుగు పాటల తోటకాపరి అయ్యెను ఇది నిస్సంశయము నిర్ద్వంద్వము విద్వద్వరేణ్యు లగు వేటూరి ప్రభాకరశాస్త్రి మహోదయులు - 'తమిళ కర్ణాట మహాంధ్ర భాషలలో - ఉద్బుద్ధమైన, స్వరయుక్తమైన, సాహిత్య సౌరభసమన్వితమైన, భక్తి శృంగార భావబంధురమైన పాట - మొదటిసారిగా తెలుగుభాషయందే ఆవిష్కరింపబడినది' అని మోతుబరి సాక్ష్య మిచ్చి, ఈ వాదమునకు తిరుగులేని బలమును సమకూర్చిరి

అన్నమయ్య కవిత - అభ్యాసమువలననో, అధ్యయనమువలననో ఆవిష్కరింపబడినది కాదు అది యొక మహాద్భుత కవితావేశము అది శ్రీ వేంకటేశ్వరానుగ్రహాదత్త మధుర సారస్వత ఫలము అన్నమయ్య సాహిత్యము అక్షరముల క్షీరసాగరము అందలి యెన్ని పయః కణముల నేరి రుచి జూపించిన ఆ సముద్ర మాధుర్య మహిమ అర్థము కాఁగలదు? పుంఖానుపుంఖముగ అన్నమయ్య హృదయ తూణీరమునుండి వదలబడిన గేయ కవితాస్త్రములు ముప్పది రెండు వేలు వానిలో - దేని కదియే పదునైనది దేని కదియే బలమైనది దేని కదియే వాడి వేడి గలది అయినచో - అన్నింట శ్రీ వేంకటేశ్వర లీలా విలాస ముద్ర స్పష్టముగా ప్రతిఫలించుచుండును వానిలో ప్రతి గేయము సారస్వత రంగమున నూతనాధ్యాయముగా కనుపించు చుండును ఆధ్యాత్మిక రంగమున మహోజ్జ్వల భక్తి భావ శుభోదయ ముగా ప్రతిబింబించుచుండును ఈ నవోదయమే అన్నమయ్య ధ్యేయము ఆ ధ్యేయమే శ్రీ వేంకటేశ్వర స్తుతివిలసిత మధుర గేయము

అన్నమయ్య అమర సారస్వత సృష్టి - పున్నమినాటి వెన్నెల. భావికాల సకల గాయక కళాభరణము అందలి వన్నెల చిన్నెల వర ముల నవస్వరములు - తర తరముల సాహితీప్రియ జనమనోహరములు.

ఎన్నిక జేసి మన్నిక గన్న పాటలలో - మున్నన జేయుదగిన వానినిగా కొన్నింటిని విభజించి వేరు పరచి వివరించి విశదీకరింప బూనుట వివేకవంతమైన విషయము కాజాలదు ఎన్నిక జేయ బూను కొన్న వ్యక్తి ఎన్నింటిని స్వీకరింపవలెను? ఏవి స్వీకరణార్హములు? ఏవి పరిగ్రహణానర్హములు? ఇది తేలని సమస్య. విడిపడని చిక్కు ముడి. చుక్కలన్నియు మొక్కఁబోవని కాంతి గలవియే మధుకోశ

మున గల ప్రతిబింబువు - మధురాతిమధురమే అన్నమయ్య పాటలన్నియు అమృత ధారలే

అన్నింటిని వివరించుటకు బూనుకొనుట - బృహత్ గ్రంథ సృష్టికి హేతు వగునుగాన, పరిమిత వ్యాసమున ప్రత్యేక పరిధిలో వివరింపగలిగినంత వివరించుట మంచిది ఆ దృష్టితో - మనస్సు మెచ్చిన కోణమునుండి చూచి, మధుర సుధారస వర్ష ధారలను రుచి జూపించుటకు సాగించు ప్రయత్నమే యిది

శ్రీమద్రామానుజ కీర్తి కౌముదీ విలాసమును పదునారు భాగములలో ప్రకటింప బూనుకొనుటయు అట్టి సాహసమే యగునుగదా! అనంతమైన సంస్కృతీ వైభవ ప్రశస్తిని పదునారు భాగములలో సంక్షిప్త పరచి వెల్లడింప బూనుట సామాన్యమా! అయినను రామకార్యములో సేతునిర్మాణమున ఉడుత కృషియు పరిగణనకు వచ్చెగదా! అట్లే, ఆ ధోరణిలో - అన్నమయ్య సారస్వత సృష్టి యందలి వైచిత్రిని, వైశిష్ట్యమును, వైభవమును, సందర్భోచితముగ ప్రస్తావించుటే ఈ లఘు వ్యాసమునకు సంబంధించిన గురు భావన

ఆయన శ్రీ వేంకటేశ్వర శ్రీచరణముల గని, పారవశ్యమున నెట్లు పాడెనో పరిశీలింతము -

"బ్రహ్మ గడిగిన పాదము
బ్రహ్మము దానే పాదము

చెలగి వసుధ గొలిచిన నీ పాదము
బలితల మోపిన పాదము
తలకక గగనము దన్నిన పాదము
బలరిపు గాచిన పాదము"

స్వామి శ్రీపాదవైభవము బహుభంగుల స్తుతించిన యీ విధానము పరమ రమణీయము శ్రీమన్నారాయణుని పావన చరిత్ర

యందలి అంతరాంతరార్థములను తడివిచూపించు సన్నివేశములను గుర్తు జేయు రచన యిందలి ప్రతి పంక్తిలో ద్యోతక మగుచున్నది. కవితకు గల పరమాదర్శమును ప్రతిఫలింపజేయు యీ పంక్తుల యందలి భావ పరిమళము — కవి అస్తమించిన యనంతరము తర తర ములవరకు యుగ యుగముల పిమ్మటగూడ, భావుకుడైన పాఠకుని నాసాపుటములకు పారవశ్యమును కలిగించుచుండును. ఏనాటి కథా వైభవములనో గుర్తునకు తెచ్చుచుండును అందలి విశేషములను బోధించుచుండును తద్ద్వారా భక్తిభావనను లోకములకు ప్రసాదించు చుండును

"పాము తల నిడిన పాదము"

అని నంతనే శ్రీకృష్ణావతారమున దేవకీ వసుదేవుల గర్భమున జన్మించి, నందనందనుడుగా పెరిగిన దేవదేవుని శ్రీచరణములు కాళీ యుని కేవిధముగ మోక్షమును లభ్యపడ జేసినవియో స్ఫురణకు వచ్చుట లేదా! అల్పాక్షరములతో అనల్పార్థ రచనాభివ్యక్తీకరణము మహాకవి లక్షణ మనుచుండిరి అన్నమయ్య విరచించిన చిన్నచిన్న పంక్తులలో - ప్రతిదానియందు సైతము అట్టి దివ్యత్వమే వెల్లివిరియు చుండును వ్యర్థపదములనుగాని, సార్థక భావ సంపదనుగాని తన కవిత లలో తలయెత్తనీయని దక్షత జూపగల మహాకవి అన్నమయ్య

"పొడగంటిమయ్య మిమ్ము పురుషోత్తమా !
మమ్ము నెడబాయకవయ్య కోనేటి రాయడా !
కోరి మమ్ము నేలినట్టి కులదైవమా !
చేరిచి పెద్ద లిచ్చిన విధానమా !
గారవించి దప్పిదీర్చు కాలమేఘమా !
చేపటేర గాచినట్టి చింతామణీ !
కామించే కోరిక లిచ్చే కామధేనువా !
మమ్ము కావై రక్షించేటి ధరణీధరా ! "

ఇది పురుషోత్తముడైన పరంధాముని స్తుతి కోనేటిరాయడా! కులదైవమా! పారిజాతమా! చింతామణీ! కామధేనువా! దివ్యౌషధమా! మొదలయిన పదములతో స్వామిని సంబోధించుచు సాగిన యీ స్తుతి - అన్నమయ్య భావాంబరమున కురియుచున్న వెండి వెన్నెల జల్లుల పోహళింపులకు ప్రతిబింబము సర్వేశ్వరుని సర్వశక్తి సంపదను సముచితముగ సంస్మరించి సంబరపడెడి కవి యూహకు నిజమైన ప్రతీక

"ఎటువంటి వాడవో! నీ మహిమ
లెట్లు దెలియ వచ్చును?
నిటల లోచనుడు - అజుడు తెలియలేరు
విన్నెట్లు దెలిసేరు మానవులు?"

ఫాలాక్షునకు, పరమేష్ఠికి గూడ తెలియని నీ మహిమలను ప్రాకృతిక మాయామోహితులయిన మానవు లెట్లు గుర్తింపగల రయ్యా స్వామీ!' అనుచున్న అన్నమయ్యకు -

"ఎవరు శ్రీవేంకటనాథ
అలమేలుమంగ నెద
నుండగా దెలిపె మీ గోప్యము"

గోప్యమును గుర్తింప నేర్చిన కోవిదునివలె, కవి - పాఠకుల కిచట గోచరించుచున్నాడు

"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన
అంతమాత్రమే నీవు -
అంతరాంతరము లెంచి చూడ
పిండంతే నిప్పటి యన్నట్లు"

ఎవని యూహాలతో ఎవ రెట్లు స్మరించిన, వారి కట్లే, వారి యేకాగ్రతకు తగినంతనే దర్శన మిచ్చుచుండు' నని అన్నమయ్య భగవానుని ప్రస్తుతించుచున్నాడు,

## భక్తి భావ ధార

"కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మ మనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివు డనుచు
అలరి పొగడుదురు కాపాలికు లాది భైరవు డనుచు"

ఇట్లు అన్నమయ్య హృదయాంతరాళములలో పొంగి పొరలినది మహాద్భుత భక్తి భావధార

"యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహమ్"

అనెడి గీతార్థమున కనుగుణముగ నున్న పరమార్థ మిది లోకసామాన్యమైన యీ యాలోచనను పరమ రమణీయముగ అన్నమయ్య వాకొనియెను భగవానుని ఎవరు ఏ రూపమున - ఏ నామముతో ధ్యానింతురో, స్మరింతురో - వారి కా రూపముననే స్వామి సాక్షాత్కరించు ననెడి సత్యమును సరస సూక్తి సుందరముగ అన్నమయ్య ఇచట అభివర్ణించెను

"విష్ణు స్సర్వేషా మధిపతిః పరమః పురాణః
పరో లోకానా మజితో జితాత్మవన్"

అనెడి మంత్రార్థ మేమనుచున్నది ? సర్వవ్యాపియైన సర్వేశ్వరుడు అందరకు అన్ని రూపములలో వారి అభిమతానుగుణముగ దోచు చుండుననియే కదా ! ఆ విశాలాశయమ్మే గీతమున ద్యోతక మగుట లేదా ! హృదయ స్నాయువులను స్పృశించుచు కొనసాగెడి రచనా వైఖరి యిది అన్నమయ్య కవితయందీ వైఖరి అంతట పరచుకొని యున్న దనుట అత్యుక్తి కానేరదు

శ్రీహరిపాదతీర్థమే మందు
మోహపాశాలు తెగగోసి మోక్ష మిచ్చే మందు

కారమై కంటగి చవి కడు చల్లని మందు
నూరు కాచవియట్టి నున్నని మందు
కోరికతో వెలవెట్టి కొనితే చల్లని మందు
వేరు వెల్లంపులు కూర్చునట్టి వెందువోని మందు

శ్రీనివాస భగవానుని సన్నిధిలో భక్తుల కొసగు తీర్థమహిమ యీ సంకీర్తనమున గొప్పగ స్తుతింపబడినది. ఆ శ్రీహరి పాదతీర్థమే నేడు శ్రీపాదరేణుసహిత తీర్థముగ నొసగబడుచున్నదా! కావచ్చును. ఏది ఏమైన నేమి? ఆ తీర్థమన్నివిధములైన ఆధివ్యాధుల నణచు గల శక్తివంతమైన దనెడి సత్యము సర్వప్రజానీకమున కనుభవము నందున్న అంశమే.

"ఉపవాస తపము లివి – యితని ప్రసాదంబు
లొగి భుజించుటె నాకు దినదినంబు
జప రహస్యోపదేశంబు లితని పాద
జలములు శిర నునేటి సేవ యొకటె"

అనెడి పలుకులలో సైతము శ్రీవారి ప్రసాదముల – పాదాభిషేక జలముల మహిమలే వివరింపబడియున్నవి.

బల్లిదులు నీకంటె బరు లున్నారా!
దొల్లింటి వారి వింత దోయకుమో యయ్య!
చిక్కుల భవముల జేరంటికి పోవలేక
నిక్కి నీ మఱుగు జొచ్చి నిలిచితిని
అక్కరమై అల్లనాటి అప్పుల కర్మము లెల్ల
ఇక్కడనే చుట్టుముట్టి ఏమిసేతునయ్యా!"

నీకంటె రక్షింపగల బలవంతు లెవ రున్నారు ప్రభూ! తొలి జన్మముల దురితముల బారద్రోలి, భవజలధింబడి, బాధల నిచ్చగింపక నీ పాలబడితిని; నీ మఱుగు జొచ్చితిని నిన్నే శరణంటిని! అనుచున్న

అన్నమయ్య సర్వార్పణ తత్త్వము సర్వేశ్వరుని, సర్వశరణ్యునిగా వివరించుచున్న తీరు —

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"

అను సూక్తిని గుర్తున కెలయించుచున్నది ఈ దృష్టి - సాధకుడైన భక్తునిలో సాక్షాత్కరింపవలెనని అన్నమయ్య ఆశయమై యున్నది అట్లుండినగాని, అనంతుడైన శ్రీమన్నారాయణుని అనుగ్రహమునకు భక్తుడు పాత్రుడు కాజాలడు

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

ఇది గదా శ్రీ స్వామి దీక్ష!

"చూడు డిందరకు సులభుడు హరి
తోడు నీడ యగు దొర యితడు

పావన మొక రూపమై విరజకు
నావై యున్నా డిదె యితడు
శ్రోత్రపై శ్రుతులకు దుదిపదమై
కైవల్యమునకు కనకపు త్రోవల

కాపాడిన లోకములకు సుజ్ఞాన
దీపమై, జగతికి దేవుడై
పాపాల దరప ఫువ షఘోధులకు
తేపై యున్నా డిదె యితడు

శ్రీపతిం దలచి, వైష్ణవుడై తరించెనట ఎంత మంచిమాట! శ్రీవైష్ణవ సిద్ధాంతమును శిరోధార్యముగా నెంచి, మధురానుభూతి నందిన విధము మనోహరముగ వర్ణితమైన దిచట శ్రీవిష్ణుసహస్ర నామ మహిమ యిట్టి దని చాటుచున్నాడు అన్నమయ్య అన వచ్చునా? అనవలసినదే

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖాః సుఖినో భవ 0

విష్ణుసహస్రనామ స్తోత్ర ఫలశ్రుతి యిది శ్రీమన్నారాయణ నామస్మరణ పారాయణ పరాయణత్వమే సకల శ్రేయములకు మూల కారణమనుట నిర్వివాదాంశముగదా! ఆ దివ్యబోధనమునే అన్నమయ్య పై పాటలో వివరించెనేమో!

## మధుర భావములు

అన్నమయ్య ఎంతటి భవ్య భక్త్యావేశపరుడో, అంతకు మించిన మధుర కవితావేశ హృదయుడు కొన్ని సందర్భములలో ఆయన ప్రయోగించిన పదములు - తేనెలో మాగబెట్టిన ట్లుండును చెఱకు రసమున నానవైచినట్లుండును శర్కరలో పొదివిన ట్లుండును స్వాదు శీతల పానీయములు పయిపయిం జల్లినట్లుండును ఉపమాన ములతో, ఉదాత్త రీతులతో, సముచిత సారస్వత విలాసములతో, సరస భావ ప్రాభవములతో నలరారునట్లు కవితను సందర్భోచిత ముగ నడిపింపగల దక్షత అన్నమయ్య కున్నది కావుననే ఆయన మహాకవి కాగల్గినాడు

"ఏ మొకో! చిగురు ఒధర ఎన
నెడ నెడ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన
పత్రిక కాదు గదా!"

ఎంత అందమైన భావన యిది! భక్తి రసమును వలె - సమ యము వచ్చినపుడు శృంగార రసమును గూడ ముద్దుముద్దుగ వివరింప నేర్చిన కవి అన్నమయ్య

"ముద్దియ చెక్కుల కెలకుల
ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దిక లాగు లివేమో ।
వూహించరె చెలులు '

మనస్సు నొక క్షణముపాటు నిలబెట్టి, కలబెట్టి, హృదయమును స్పందింపజేయు నిట్టి శబ్ద చిత్రముల నెన్నింటినో అన్నమయ్య సృష్టింపజాలెను. సమర్థుడైన చిత్రకారుని మాదిరి- భావముల రంగుల సమ్మేళనముతో దృశ్యమునకు ప్రాణప్రతిష్ఠ గావింపజాలిన మహత్తరశక్తి అన్నమయ్య లేఖినికి గలదనుట నిర్వివాదాంశము

"తేనెలపై తేట తిన్నని చెలువు
పావకములలో నేరుపరచిన మేలు
చక్కెరలో తీపు చల్ల తెమ్మెరలు
చిక్కని కపురంపు జీవరత్నములు
కల యమృతంబు మీగడమీది చదువులు
చెలువుడు కవు లెల్ల చే యెత్తి మ్రొక్క'' — — -

అన్నమయ్య తన సాహిత్య వ్యవసాయమును కొనసాగించెను శ్రీ వేంకటేశ్వరుని దివ్యామృతానుగ్రహమే హృదయ క్షేత్రమును పదును చేయగా, అదును గనిపెట్టి, భక్తిభావ బీజములు విత్తి, అవసరమైన స్థాయిలో శ్రమించి, అందమైన పాటల పంటను అన్నమయ్య పండించి చరితార్థు డయ్యెను

"హరి ముకుందుని గొనియాడగ
నేర్చిన నా జిహ్వ -
నిను గొనియాడనేరదు ''

అని, తనపేరుమీదుగ పాటలు రచింపగోరిన ప్రభువునకు నిర్భయముగ, నిస్సంకోచముగ, సమాధాన మీయగల్గిన గుండె దిటవు గల్గిన కోవిదుడే అన్నమయ్య. ఆయన - మహారాజులు

కల్పించు భోగములపట్ల లవలేశమేని మక్కువ లేనివాడు, మమత జూపనివాడు కవితారంగమున పోతన్నతో బోల్చదగిన యిట్టి ధన్యులు కొందరే యుందురు

## తీవ్రభావములు

"నరహరి కీర్తన నానిన జిహ్వ
యితరుల నుతింపగ నోపదు జిహ్వ
మురహరు పదముల మ్రొక్కిన శిరము
పరుల వందనకు పరగదు శిరము

శ్రీపతినే పూజించిన కరములు
చోపి యాచనకు జొరవు కరములు
ఏపున హరికడ కేగిన కాళ్ళు
పాపుల యిండ్లకు బారవు కాళ్ళు"

కొన్నికొన్ని సందర్భములలో అన్నమయ్య ఆలోచనలింత నిష్కర్షగా నుండును గావుగుండెతో ఖంగు మని మ్రోగు అన్నమయ్య కంఠమున ఆవేశము రూపుదాల్చుచున్న సమయములో - భావ పరవశ్య ప్రోక్కసనుటకు పయి పంక్తులు నిదర్శనములు

నిప్పులు గ్రక్కు ఊహాలకు వెలువరించు తరుణములో దూసుకొనివచ్చుచున్న భానుకిరణపంక్తుల మాదిరిగా ఆయన పదములు వీర రసాస్పదములుగా భాసించును ఉత్తమకవిభావసరళి - అత్యుత్తమ విధమున, మహోదాత్తపథమున ఎట్లు కొనసాగునో - ఆ యా సందర్భములలో అన్నమయ్య పదసంపద మనకు ప్రబలోదాహరణముగ దర్శన మిచ్చును

"ఇతరులకు నిను నెరుగ దరమా ?
సతత సత్యవ్రతులు సంపూర్ణ మోహవిర
హితు లెరుంగుదురు నిను నిందిరారమణా !

నారీ కటాక్ష పటు నారాచ భయరహిత
శూరు లెరుగుదురు నీ చూచేటి చూపు
ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు
ధీరు లెరుగుదురు నీ దివ్య విగ్రహము

రాగభోగవిదూర రంజితాత్ములు మహా
భాగు లెరుగుదురు నిను బ్రణుతించు విధము
ఆగమోక్త ప్రకారాభిగమ్యులు మహా
భాగు లెరుగుదురు నీ వుండేటి యునికి

సాహిత్యము, సరస శైలియు పై పంక్తులలో గల కవితావిలాసమునకు సముచిత రీతిలో సహకరించినవి శయ్యా సౌకుమార్యము సహజ భక్త్యావేశ సమన్వితమై, స్వామి దివ్యానుగ్రహమునకు కవిని పాత్రుని గావించుచున్నది ఇట్టి మధురసన్నివేశ పరంపర అన్నమయ్య సారస్వతమున కొల్లగ కనిపించును. ఉల్లము నానంద పల్లవితము గావింపగల్గును

ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా
కేళీవిహార లక్ష్మీ నరసింహా!

దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రానల వి
కార స్ఫులింగ సంగక్రీడయా
వైరి దానవ ఘోర వంశభస్మీకరణ
కారణ ప్రకట వేంకటనారసింహా!"

ఇది అహోబల నరసింహస్వామిని అన్నమయ్య స్తుతి చేసిన విధము సమయ సందర్భముల ననుసరించి, ఇతివృత్తానుగుణముగ అన్నమయ్య భావయు బుసలుకొట్టు ననుట కిది యొక సాక్ష్యము

## వైష్ణవ ప్రతిపత్తి

సహజ వైష్ణవాచార వర్తనుల
సహవాసమే మా సంధ్య

అతిశయమగు హరి సంకీర్తనమే
సతతంబును మా సంధ్య
మతి రామానుజ మతమే నాకును
చతురత మోసిన సంధ్య — "

సర్వము విష్ణుమయ మని యెంచిన పరమ భాగవతోత్తముడు అన్నమయ్య భగవంతునియందు పరిపూర్ణానురక్తిని ప్రదర్శించుటయే పరమ లక్ష్యముగాగల యీ మహాకవి సర్వేశ్వరార్చనయు, పరంధాముని సేవయు త్రికాల సంధ్యగా భావించిన విధ మిందు వర్ణితము

జీవుడు శ్రీమన్నారాయణ చరణారవిందస్మరణ పరాయణుడై యుండుట సర్వతోభద్రప్రదమయిన యంశము పరమాత్మ కృపావలోకమునకు పాత్రమగు టొక్కటే జీవాత్మ పరమలక్ష్యము పరతత్త్వమన్నతిపట్ల పరమాదర ముంచి, జీవతత్త్వపు లౌకిక వ్యాపారమునుండి బయల్వెడలెడి మార్గము నన్వేషించుట మానవజాతి పరమార్థము తాదృశమైన ఆత్మపరిశీలనాధోరణిని పరమ రమణీయ శైలిలో అన్నమయ్య తన సంకీర్తనమునందు నిబంధించిన విషయము గమనార్హము

జీవాత్ముడై యుండు చిలుకా నీ
పావలికి బరమాత్ముడై యుండు చిలుకా !
నీ వన నెవ్వరు ? నే నన నెవ్వరు ?
నీవ నేనై యుండు చిలుకా
శ్రీ వేంకటాద్రిపై జిత్తములో నుండి
సేవింపుకొనునట్టి చిలుకా !"

విషయ సౌలభ్యమున కనుగుణముగ భావ మారుట - పద ప్రయోగశైలి మారుట - భావముల కూర్పు మారుట - పరమ సుందర శైలీ విలాస విన్యాసమే మారుట మహాకవి లక్షణమే యగును గదా!

కావుననే అన్నమయ్య యిట్టి పట్టుల - మహోన్నత దృశ్య నిర్మాణ చతురుడుగ సాక్షాత్కరించును

బిడ్డ దోసగును తండ్రి పరిగణింపడు భక్తుని నేరమును భగవానుడు పరిశీలింపడు 'అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణం మమ' అనెనో - ఇక జీవుడు దేవుని కారుణ్యమునకు నోచుకొనినట్లే తన యాశ్రితులయెడ్లగల అపూర్వ ప్రేమాభిమానముల నమ్మి సేవించుట కొరకై వచ్చువారిని తథాస్తనునేమో భగవానుడు! తదనుగుణముగనే జీవాత్మ పరమాత్మల అపూర్వ సరస సమ్మేళనము చక్కని గేయ పద్మములను భారతీ చరణ పంకేరుహములకడ విల్పియుంచిన ఘనత అన్నమయ్యకు దక్కినది

"శతాపరాధములు - సహస్ర దండనలు లేవు
గతి నీవని వుండగ కానకుందరాదు
తలచి నీకు మ్రొక్కగా దయజూపకుండరాదు,
కొలిచి బంట ననగా కోపించరాదు "

శరణాగతుడ నని స్వామికి నివేదించుకొనిన పిమ్మట - సర్వాపరాధములు క్షమార్హములే కాగలవు ప్రపత్తి ప్రభావమది వైష్ణవ సంప్రదాయమున - ప్రపన్న భావన సర్వోత్తమమైనది సర్వవిధ ప్రయోజనకరమైనది

## వ్యక్తిత్వము

అన్నమయ్య ఆలోచనలు సర్వసాధారణములయిన లోకధర్మముల కద్దము పట్టునట్టివే చెప్పదలచిన యంశమును సూటిగా వివరించుటకు జంకని వ్యక్తిత్వ మాయనకు గలదు అయినచో, చెప్పుచున్నదంతయు లోకమున వాడుకయందున్న విషయమే సత్య కథనమునకు మాత్రము సాహసించువా రెందరుందురు ? ఆ సందర్భముననే

అన్నమయ్య గాపు గుండెతనము మనకు సువ్యక్తమగుచుండును. కవిగా చూపదగిన సాహసమును నల్పుటలో అన్నమయ్య చూపెడి నిబ్బర మాయన రచనలో మన కట నట స్పష్టముగ గన్పట్టుచుండును

"ఛీఛీ నరుల దేటి జీవనము
కాదుక శ్రీహరి నీవే కరుణింతుగాక !
అడవిలో మృగజాతియైన గావచ్చుగాక
వడి నితరుల గొలువంగవచ్చునా ?
ఉడివోని పక్షియై వుండనైన వచ్చుగాక
విడువ కెవ్వరినైన వేడవచ్చునా ?

పరుల నర్థించి పాయసము భక్షింప జూడకుము కష్టించి ఆర్జించిన గంజి నారగింపుము పక్షివై అడవులలో బ్రతుకుటకైన నిచ్చగింపుము పరులను యాచించి పరమానందము నందజూడకు వాస్తవము వచింపవలెనన్న, ఇవి యన్నియు కఠోర సత్యములు కాని, ఇట్టి నగ్న సత్యములను నిర్భయముగ వచించుటకు కొంత దృఢ మనోబల మవసరమైయున్నది సాధారణ మానవుల విషయ మెట్లున్నను, కవియైనవాడు - కనీసపు కర్తవ్యముగ వీనిని సంభావింపవలసియున్నవి అయిన నెందరు కవు లిట్లు కంఠోక్తిగ సత్యకథనమున కుపక్రమింప గలుగుచున్నారు ? వారిలో అన్నమయ్య మొదటి వరుసలో నుండె ననుట కిట్టి పంక్తు లుదాహరణములు కాగలవు

## సొంపుల పెంపులు

దేవాదిదేవుడైన వేంకట గిరినాథుని స్తుతించుతరి అన్నమయ్య జిహ్వాగ్రమున సరస్వతి నృత్యము సేయునేమో ! తెలుగు పదములు

గాని, సంస్కృత పదములుగాని కోరినరీతి, భావానుగుణముగ క్రమము ననుసరించి పంక్తులలో జేరి నిలుచును

ఆవేశ సంభరితాంతః కరణమునుండి అన్నమయ్య ఆలోచనా గంగ పొంగి, యీ క్రింది పదమున నెట్లొయ్యారములకు బోయినదో తిలకింపుడు గమనపు టురవడిలో నెంతటి చక్కదనమును పొందు పరచుకొనినదో పరిశీలింపుడు

సహజ కవితా చమత్కృతి యనుడు, సరస సారస్వత సృష్టి యనుడు - ఏమనిన నేమి? అదిగో యిది -

"వందే వాసుదేవం
బృందారకాధీశ వందితపదాబ్జం

ఇందీవరశ్యామ మిందిరా కుచతటీ
చందనాంకిత లస చ్చారుదేహమ్
మందారమాలికా మకుట సంశోభితం
కందర్ప జనక మరవింద నాభమ్

ధగద్ధగిత కౌస్తుభాభరణ వక్షస్స్థలం
ఖగరాజ వాహనం కమల నయనమ్
నిగమాదిసేవితం నిజరూప శేష ప
న్నగరాజ శాయినాం ఘన నివాసమ్

కరిపురనాథ సంరక్షణే తత్పరం
కరిరాజవరద సంగతి కరాబ్జమ్
సరసీరుహాననం చక్రవిభ్రాజితం
తిరువేంకటాచల దేవం భజే '

లలిత కవితా సంపదల కొలువాలమైన తీరిది ఈ తీరున పేరు గన్నవా డన్నమయ్య కొన్ని సందర్భములం దాయన కవితా రచన యిట్లుండును భావముల పోహళింపి ట్లుండును పదముల సొగసుదన

మిట్లుండును కలము పట్టి కవిత వ్రాయదలచిన యే ప్రాచీనకవికిగాని, అర్వాచీన కవికిగాని శబ్ద సంపదమీాద ఏతాదృశాధికార మెంత మంది కెంతవర కుండును? పరిశీలింపదగిన ప్రధానాంశమే మనస్సున భావ రేఖ తళుక్కుమని మెరయగనే ఊహాకు రూపము గల్పించి, అంద ములు దిద్దు భావ - అహమహమికతో పరుగులు దీసి రాకున్న, కవి పరు వే మగును? వచ్చిపడౌడి పదములు రసాస్పదములు గాకున్న, కవి ప్రతిభకు విలువ యెంత? వాడిన ప్రతి పదము వాడిగ, వేడిగ నుండక, వక్త యొక్క వ్రజసంకల్పమునకు సుదృఢ సురుచిరాకృతి నేర్పరుపజాలకున్న, కవి యశస్సునకు తేజస్సు లభ్య మగునా? పూల బంతులాటవలె మేలి రకపు పదజాలము పుంఖానుపుంఖముగ కవి మేధా జలధినుండి వెలువడి, కులుకులను కువ్వలుగ బోయుచు, భావ సౌరభ సమన్వితములయిన పువ్వులను రువ్వుచు, పాఠకుల రసజ్ఞతను దువ్వుచు, అవిచ్ఛిన్నముగ కొనసాగకున్న, కావ్యమునకు ప్రామాణి కత్వ మె ట్లేర్పడును? ఇవి యన్నియు గలిసివచ్చిన పట్టులయందే కవిచంద్రుని గట్టితనము మన కన్నులకు గట్టుచుండును

అన్నిటికి నిది పరమౌషధము
వెన్నుని నామమే విమలౌషధము

చిత్త శాంతికిని శ్రీపతి నామమె
హత్తిన నిజ దివ్యౌషధము
మొత్తపు బంధవిమోచనంబునకు
చిత్తజ గురువే సిద్ధౌషధము

పరిపరి విధముల భవరోగములకు
హరిపాద జలమె యౌషధము
దురిత కర్మముల దొలగించుటకును
మురహరు పూజయె ముఖ్యౌషధము

ఇల నిహపరముల నిందిరా విభుని
వలరి భజింపుటె యౌషధము
కలిగిన శ్రీవేంకటపతి శరణమె
నిలిచిన మా కిది నిత్యౌషధము '

ఇట్టి పదములను పఠించునపుడు మన మనస్సుల ముందు — భావము, భాష, శయ్య, శైలి, సారస్వతము నాలుగు పంచకల్యాణి గుఱ్ఱములవలె పరువు లెత్తుచుండ, అన్నమయ్య సారస్వత రథము నెంత యందముగ నడిపించెనో స్పష్టముగ ద్యోతక మగుచుండును పదప్రపంచముమీద అన్నమయ్యకుగల మహాధికార మెట్టిదో మనకు వ్యక్త మగుచుండును ఇది శ్రీ వేంకటేశ్వరుని అపార కృపాబలము

## భగవదనుగ్రహ ప్రాప్తి

కృతే యుగే దేవరాజః త్రేతాయాం రంగనాయకః
ద్వాపరే తు జగన్నాథః కలౌ వేంకట నాయకః

శ్రీనివాస పరబ్రహ్మము కలియుగ ప్రత్యక్ష దైవముగా ప్రపంచ ప్రజల ప్రణతు లందుకొన్న స్వామి శ్రీ వేంకటేశ్వర ప్రభువు కోరి కొలిచినవారి కోరికలను సఫలములు గావింపజాలిన స్వామి ఆయన ఆ స్వామి వేంచేసియున్న సప్తగిరులు సకల ప్రజానీకమునకు సదా సమారాధ్యములు ఆ దేవదేవుని ప్రసన్నములయిన నేత్రములనుండి కారుణ్య గంగ నిరంతరము పొంగులతో సింగారములు చిందిపోయు చునే యుండును ఆ జగదధినాథుని యనుగ్రహము సిద్ధింపవలయునే కాని, అలభ్యమయిన దేమియు నుండదు మనసార, కరువుదీర, తమి దీర శ్రీ వేంకటేశ్వరుని దివ్యమంగళ స్వరూపమునకు గుండెలలో గుడి గట్టుకొని పూజింపనేర్చిన అదృష్టవంతుల కలలు బంగారు కల లయినవి ఆలోచనల స్రవంతి అమృత ప్రవాహముగ మారినది అనుకొనిన దంతయు క్షణములమీద, స్వచ్ఛస్వర్ణ కాంతుల విరజిమ్మెడి

ఆకృతిని దాల్చి, యెట్టయెదుట నిల్చినది ఆ జగత్పతి మహోద్భుతానుగ్రహమునకు పాత్రులైన సామాన్యులు మాన్యులై, చరిత్రలో నిలిచిరి. సమయము వచ్చుటచే, స్వామివారి అత్యాశ్చర్యకర లీలావిలాసముల నభినుతింపవలసి వచ్చినది. అంతియే కాకున్న, ఆ దేవదేవుని దివ్యమహిమా విశేషముల ననుభవమునకు దెచ్చుకొననివారెవరున్నారు? లోకమే ఆ స్వామి దయా రసార్ద్ర ధారల తడిసి మురియుచున్నది. సుదూర సీమలనుండి భవ్య భక్త్యావేశముతో తరలి వచ్చి, గోవిందనామకీర్తనధ్వనులతో కొండలన్నింటిని ప్రతిధ్వనింపజేయుచున్న వేలకొలది, లక్షలకొలది యాత్రిక బృందము లిందలి పరమార్థము నెలుగెత్తి చాటుచునేయున్నవి.

అన్నమయ్యగూడ ఆ స్వామీ దివ్యకటాక్షబలమున వర్ధిల్లినవాడగుటవలననే - పరించినది రవ్వంతైనను, పండితప్రవరుల శ్రేణికి జేరెను. కవిగా ఎదుగగల్గెను. మహాకవి పదము నందుకొనజాలెను.

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్
య త్కృపా తమహం వందే పరమానందమాధవమ్"

అను సూక్తి - అక్షర సత్యమే. ఆ కృప - ఆ సర్వేశ్వర స్మరణము వలననే సాధ్యమని ఎందరో మహనీయులు నిర్వచించిరి.

**కలౌ సంస్మరణా న్ముక్తిః**

కలియుగమున స్మరణభక్తి యొక్కటియే దైవానుగ్రహమును సమకూర్చును. నామసంకీర్తనమునకు గల మహిమ అట్టిది. సంకీర్తన - హృదయ స్నాయువుల స్పృశించి, పారవశ్యమును సంఘటించి, పరమానంద మకరంద రసాస్వాదనానుకూలత ఘటించును. కావుననే మనస్సును మయూరము వగిది నృత్య మొనరింపజేయుచు మహాకవి అన్నమయ్య సంకీర్తన ప్రాధాన్యము నిట్లు వివరించినాడు -

"చాలదా బ్రహ్మ మిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనం
సంతోషకరమైన సంకీర్తనం
సంతాప మణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతము దలచుడీ సంకీర్తనం
సామజము గాచినది సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
సామీప్య మిందరికి సంకీర్తనం
సామాన్యమా విష్ణుసంకీర్తనమ్ '

అవును సంకీర్తనము సామాన్య మెట్లగును? అది సర్వవిధముల మాన్యమే సంకీర్తనా తత్పరులయి, తీయగ, హాయిగ కాలము గడపినవారి మనుగడ నిక్కముగ ధన్యము జీవితమును ధన్యము గావించుకొనవలెనని తపించుచు - పద కవితలు రచించిన పరమ పూజ్యు డన్నమయ్య

## ఆలోచనా సరళి

అన్నమయ్యకు బ్రతుకు లోయల లోతులు బాగుగ తెలియును వాని నెట్లు తప్పుకొని దారి తప్పక నడువవలెనో నిరుపమముగ నెరిగినవా డాయన కావున, సంసారమును గురించి అనుభవముల వివరముల నాయన యెంతగనో సూటిగ గుండెల దాకునట్లుగ జెప్పగలిగెను చెప్పగలిగిన శక్తి గలవాడనని చెప్పకయే చెప్పికొనెను

"నడిబెట్టై కటకటా సంసారము - చూడ
జడధిలోపల యీత సంసారము

జమునోరిలో బ్రతుకు సంసారము
చమురు దీసిన దివ్వె సంసారము
సమయించు వెను దెవులు సంసారము
సమరంబులో నునికి సంసారము ''

కూడబెట్టుకొన్న అనుభవముల గూడుగ అన్నమయ్య గుండె - ఎన్నియో నగ్నసత్యములను విశదీకరించినది ఆ సందర్భమునం దాయన యుపయోగించిన యుపమానము లద్భుతములు

"జలధిలోపలి యీత
చమురు దీసిన దివ్వె
సమరంబులో మనికి''—

సంసారమున గల కష్ట పరిస్థితులను గమనింపజేయుటకై అన్నమయ్య ప్రయోగించిన యీ యుపమానము లర్థవంతము లగుటయే కాక, అనుభవ స్ఫోరకములుగ విరాజిల్లుచున్నవి గదా!

"ఇలలోన దిరువేంకటేశ! నీ దాసులకు
చలువలకు గడు జలువ సంసారము

శ్రీనివాసప్రభువు దివ్యకటాక్ష మెవరికి లభ్యమగునో వారికి మాత్రమే సంసారము చలువలకు జలువ యగునట సత్యమే యగును గదా! సాంసారికములైన తాపత్రయాగ్నిల దావాగ్నుల నార్పివేయ గల శక్తి - స్వామి యనుగ్రహమున కొక్కదానికిమాత్రమే కల దనెడి నిర్వివాదాశమును నిర్ద్వంద్వముగ అన్నమయ్య యిట్టి పదములలో నిర్వచించుట గమనార్హము పండిన లోకానుభవము, భక్తి, వాఙ్మయ వైభవము - ముప్పేటలుగ గలిపి పేనబడిన ఒకానొక మహత్తర కవితా మూర్తిగ అన్నమయ్య మనకు సారస్వత రంగమున సాక్షాత్కరించును

ఊహాలపై నూహాలు మనోహరార్థ బోధకములుగా వెలయింప జాలిన అన్నమయ్య - అవసరమయిన సందర్భమున అవసరమైనంతగ వైరాగ్యమును గురించియు ఎంతయో హృద్యముగ వర్ణింప జాలిన నేర్పరితన మున్న నిపుణుడు వాస్తవముగ ఆ మహనీయుడు చెప్పదలచిన ప్రత్యంశమును సునిశితముగ చెప్పనేర్చిన దిట్టయే అది

భక్తి కావచ్చును, శృంగారము కావచ్చును, నీతిబోధ గావచ్చును, వర్ణనా లాలిత్యమే గావచ్చును - ప్రజ్ఞావంతుడైన రచయితకు సర్వము సవ్యముగ జూచి, సరసముగ పరిష్కరింపగల చతురత జన్మతః లభ్య మగునేమో !

"దురితంబులకు నెల్ల తొడవు మమకారంబు
అరిది మమతలకు తొడవడి యాసలు
గురుతైన యాసలకు గోరికలు జీవనము
పరగ నిన్నిటికి లంపటలె కారణము

అక్షరాక్షర సత్యములంటిన ఎన్నియో విశేషములు నిందన్నమయ్య మహోదాత్త స్థాయిలో వివరించియున్నాడు ఈ బాణీ - కావలెనన్న వచ్చునది కాదు అభ్యసించిన - కైవస మగుననుకొనుట అవివేకము అనుకరించుటకు పూనుకొనుట వెఱ్ఱితనము పురాకృత సుకృత బలము కలిమి, గుండెలనుండి దూసుకొనిరావలసిన ఒకానొక సంస్కార విశేషము ఒకానొక కవితా కళా పరిపాక సముజ్జ్వల మహోద్వేగము

అన్నమయ్య వంటి కారణజన్ములు మాత్రమే ఆ రీతిగా వ్రాయ గలుగుదురు తియ్యదనము, తేటదనము తెట్టలు గట్టి, అట్టి వారి కవితలయందే జాలువారును నాన్యతో దర్శనీయమైన రసగుళికల పరంపరను అట్టివారుమాత్రమే సృష్టింపగల్గుదురు వైవిధ్య సముల్లసితమైన తాత్త్వికాలోచన వెల్లివిరియించి, తదనంతర తరముల వారిని 'భళీ! బాపురే!' యనిపించునట్టి శక్తి వారికి మాత్రమే చెల్లును గానయోగ్యమైన శైలీ సౌకర్యము కొంతగ అన్నమయ్య పదములలో కొరవడెనని కొందరూహించుటయు, కొందరు వాకొనుటయుకూడ జరుగుచున్నది అది నిర్ణయించవలసినది సాహిత్య పరమార్థ పరిశీలనకై తత్పరు లనుటకు వీలులేదు గాత్రమాధుర్యము,

సంగీతశాస్త్ర నిష్ణాతృత్వము గల గంధర్వ విద్యానిధులు – వారెట్టి పదములకైన చక్కని స్వరకల్పన మొనర్చి, భావయుక్తముగ, శ్రవణ పేయముగ గాన మొనర్పగల్గుదురు. భగవదనుగ్రహ విశేషమున అట్టివారికి సారస్వత ప్రజ్ఞయు నున్నచో, ఇక కావలసిన దేమి ? పైడికి పరిమళ మబ్బినట్లగును

సవ్యసాచివలె సంగీత సాహిత్యములయందు మహోన్నత పరిశ్రమ యొనర్చిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మవంటి మహనీయుల దృష్టిని ఒరిపిడి రాయిగ నిడుకొని పరిశీలించినచో, అన్నమయ్య పదములు సర్వవిధముల గానమున శ్రవ్యము లనియే తెలియుచున్నది ఎన్నియో పదములకు ఆ మహనీయుడు స్వరకల్పన మొనర్చి, సంస్తవనీయు డయ్యెను

## శైలీ విన్యాసము

అన్నమయ్య సంకీర్తనలు రాగానుకూలములై యుండుటే కాక, కొన్ని చక్కగ భజన సంప్రదాయజ్ఞుల కభిమానపాత్రములై యల రారుచున్నవి భజనపరుల కంఠములనుండి అట్టి పాట లన్నియు – క్రొత్తదన ముట్టిపడుచున్నట్లు చీత్తముల నాకర్షించుచు, ప్రసారమగుచున్నతటి, విన్నవారు వాస్తవముగ అన్నమయ్య పాటలలోగల రాగ తాళ లయ ప్రసార విశేషములకు ముగ్ధులు కావలసినదే అన్నమాచార్యుల భావపాకమాధుర్య రచనాపై శిష్ట్యములందు అంతర్వాహినిగా వెల్లివిరియుచున్న యీ రాగ సరస్వతీ స్వరూప సాక్షాత్కారము నందిన వారు కొందరే యుందురేమో ! అట్టివారిలో – అనంతకృష్ణ శర్మ మహోదయుల స్థానము అద్వితీయమైనదని చెప్పవచ్చును

"శరణు శరణు సురేంద్ర వందిత !
శరణు శ్రీపతి వల్లభా !
శరణు రాక్షస సర్వసంహార !
శరణు వేంకటనాయకా !

ఈ యెత్తుగడ యెంత మెత్తగ నున్నదో, అంత అందముగ గూడ నున్నది సంగీత రసజ్ఞులు బహు భంగిమల నీ పాదముల నాలపించుచు, పారవశ్యమున గాన మొనర్చు టెంత పరమానంద జనకముగ నుండునో ! ఈ శైలీ విన్యాసము కావలెనన్న వచ్చునది కాదు ఈ భజనానుకూల పదప్రయోగ వైచిత్రిని పట్టుబట్టి వశపరచుకొనవలెనన్న, పట్టుబడునదియు గాదు దానికి సమగ్ర దైవానుగ్రహబలమే పరిపూర్ణముగ కావలయును పండిత కవియును, భావుకుడును, భక్తుడు నగు అన్నమయ్య కట్టి దైవానుగ్రహము పుష్కలముగ గలదు

"కమలధరుడును, కమలమిత్రుడు
కమల శత్రుడు పుత్రుడు
క్రమముతో మీ కొలువు కిప్పుడు
కాదినా రెచ్చరికయా !
విన్నగల ప్రహ్లాదముఖ్యులు
నిన్ను గొలువగ వచ్చిరా !
విన్నపము వినవయ్య ! తిరుపతి
వేంకటాచల నాయకా !

ఈ సంకీర్తన రచనావైఖరి - తదనంతర తరములలో భజన సంకీర్తనమున కుపయోగపడెడి పాటల నల్లువారికి పలువురకు మార్గదర్శకమై అలరారినమాట వాస్తవము

## అన్నమయ్య ఒరవడిలో పురందరదాసు

పైన పేర్కొనిన అన్నమయ్య రచనవంటి రచన పురందర దాసులో స్పష్టముగ గన్పడుచున్నట్లు విజ్ఞులు విస్పష్టముగ విశదీక

రించియున్నారు రచనలో - భక్తి భావనలో వీ రిరువురికిని పోలిక లెక్కువగ నున్నవి భావ వైశద్యము, భావ వివరణలో, శైలీ వైచిత్రిలో వీ రిరువురికి సామ్యము కుదురుట విచిత్రముగనున్న వాస్తవమది.

## వివిధ విశేషములు

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరాంకితముగా రచించిన వేల కొలది పాటలు మాత్రమేగాక, త దితర గ్రంథములు గూడ కొన్ని యున్నవి ద్విపదలో నాడు క్రొత్తగ నొక రామాయణము నీ యన్న మయ్య రచించినట్లు వాడుకలో నొక నానుడి యున్నది కాని, ఆ గ్రంథ మిపుడు లభ్య మగుటలేదు సంస్కృత భాషలో అన్నమా చార్యులు శ్రీ వేంకటాచల మాహాత్మ్యము నొకదానినిగూడ రచించి నట్లు వ్యవహారమున గలదు పండ్రెండు శతకములనుసైత మీ మహా కవి రచించెనట శ్రీ వేంకటేశ్వర శతకము, శ్రీ అలమేల్మంగా శతకము వీనిలో ప్రముఖములు అన్నమయ్య రచించిన పాటలనుగూడ భిన్న విభిన్న శీర్షికల క్రింద వింగడింపవచ్చును వానిలో - భక్తి గీతములు, శృంగార సంకీర్తనములు మెండుగ నున్నవి

తెలుగునాట పలువురు తల్లుల జిహ్వాలమీాద నేటికిని చిరంజీవిత్వము నంది నివసించుచున్న యీా జోలపాట - అన్నమాచార్యులదే యనుట ఆశ్చర్యముగ నుండవచ్చును. కాని, ఇం దిసుమంతయు అసత్యము లేదు

జో అచ్యుతానంద ! జో జో ముకుంద !
రావె పరమానంద ! రామగోవింద !

బంగారు గిన్నెలో పాలు బోసేరో !
అంగజాని గన్న మా యన్న యిటు రాదా !
దొంగ వీవని సతులు పొంగుచున్నారా !
ముంగిట నాడరా మోహనాకారా !

అంగుగా తాళ్ళపా కన్నయ్య చాల
శృంగార రచనగా చెప్పె నీ మేల
సంగతిగ సకల సంపదల నీ వేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల !

## సర్వం విష్ణుమయమ్

శ్రీ వైష్ణవ సంప్రదాయమునందు అన్నమయ్యకు గల భక్తి అపారము ఆయనకు జగమంతయు విష్ణుమయముగ దోచును ఎల్లరు వైష్ణవులుగనే కనిపించుదురు ఈ భావమును ఆయన ఒక కీర్తనమునందిట్లు వివరించెను

వైష్ణవులు గానివారెవ్వరు ?
విష్ణుప్రతాప మీ విశ్వమంతయు గాన
వైష్ణవులు గానివా రెవ్వరు ?
అంతయు విష్ణుమయం బట
మరి ! దేశాంతరములు గలవన నేల ?
భ్రాంతి బొంది యే భావము భావించి
సంతట నే పుణ్యు లొంట దప్పరుగాన '

పవిత్రాత్మకు కులమత తారతమ్యముల భేద యుండదనియు, ఉండరాదనియు అన్నమయ్య అభిప్రాయము.

"ఏ కులజుడైననేమి ? ఎవ్వరైన నేమి ?
ఆకడ నాతడే హరి నెరిగినవాడు
అరుదైన భూతదయానిధి యగువాడు
పరుల దానే యని భావించువాడు '

## సంకీర్తన మహిమ

ఏకాగ్రత కలిగి, పరమాత్మనే ఆరాధించు టొక్కటే ముఖ్యము విచక్షణా రహితముగ స్వామికృప నెవ్వరైన సముపార్జించుకొనగలరు బ్రహ్మము ఘొత్తివి-శరుణించును సంకీర్తనమే తత్సాధనకు మూలము

వాలదా బ్రహ్మ మిది సంకీర్తనం
జాలెల్ల నడగించు సంకీర్తనమ్

సంతోషకరమైన సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతాప మణగించు సంకీర్తనం
సంతతము దలచుడీ సంకీర్తనమ్,

సామజము గాచినది సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
సామీప్య మిందరికి సంకీర్తనం
సామాన్యమా ! విష్ణు సంకీర్తనమ్

సంకీర్తన మహిమ నిట్లాయన యెలుగెత్తి చాటెను భక్తులందరిని సంకీర్తనానురక్తులు కావలసినదిగా హెచ్చరించెను భగవదనుగ్రహ సిద్ధికి మార్గాంతరము లేదని నొక్కి వక్కాణించెను

## సవ్యసాచిత్వము

తెలుగు పదములయందే మక్కువ మిక్కుటముగ అన్నమయ్య చూపె ననుటకు వీలులేదు సంస్కృత పదములను సంకీర్తనముగ మలచుటలో - గీర్వాణ భాషయందు వారికు గల ప్రజ్ఞ మనకు సువ్యక్త మగును.

సకలం హేసఖి ! జానామి తత్
ప్రకట విలాసం పరమం దధసే

అలిక మృగమదమయ మషీకళనో -
జ్జ్వలతాం హే సఖి ! జానామి
లలితం తవ పల్లవిత మనసి వి
శ్చల తర మేఘశ్యామం దధసే

చారుకపోలస్థల కరాంచిత వి -
చారం హే సఖి ! జానామి
నారాయణ మహినాయక శయనం
శ్రీరమణం తవ చిత్తే దధసే

ఘనకుచశైలాగ్రస్థిత విధుమణి -
జననం హే సఖి ! జానామి
తన మనసా వేంకటగిరిపతే
ర్వి మత భోగసుఖ విభవం దధసే

సంస్కృతాంధ్ర పదములను సవ్యసాచివలె సమర్థవంతముగ సముచిత స్థానములలో ప్రయోగించి, సంకీర్తనములను రచించిన మహామహు డన్నమయ్య

## పద్యకవితా వైశిష్ట్యము

మరి యొక విశేషము - నియమ రహిత ము లయిన పదములలో నెంత సులభముగ, సుందరముగ, అన్నమయ్య తన భావమును పొందు పరచగలడో అంత సులభ సుందరముగ నియమ సహితమైన ఛంద మునగూడ తన యూహలకు రూపకల్పన గావింపగలడు ప్రజలకు, భక్తులకు భావమును సన్నిహిత మొనరించుటకై, ఆయన - కావలెనని పదములు రచింపబూనుకొనిన ట్లుండును సంప్రదాయ కవితా సృష్టి పట్ల ఆయనకు వైముఖ్య మేమియు లేదు

"చొచ్చితి తల్లి నీ మఱుగు సొంపుగ నీ కరుణాకటాక్ష మె
ట్లొచ్చెదొ ! నాకు నేడు పరమేశ్వర ! యో యలమేలుమంగ ! నీ
మచ్చికవంచు నీ తరుణి మన్నన నే నిమగంటి నీకు నా
యిచ్చిన మాట లేమిటికి బ్రాతిని చూడగ వేంకటేశ్వరా !"

ఆయన శతక రచనలో సంప్రదాయ సమ్మతముగ శ్రీ స్వామి వారిని స్తుతించిన విధాన మి ట్లున్నది –

"అరిసెలు నూనె బూరియలు నౌగులు జక్కెరమండిగల్ వడల్
బురుదలు పాలమండెగ లపూపము ల య్యలమేలుమంగ ! నీ
కరుదుగ నిందు బెట్టు పరమాన్న శతంబుల నూవకోట్లతో
విరత వినిర్మలాన్నముల నేతుల సోనల వేంకటేశ్వరా !"

పద్యకవితయందును చెప్పదలచిన యంశము నెంత సౌలభ్యముగ అన్నమయ్య వివరించెనో గమనింపదగిన దా విది –

"అమృతు దాక్షపాక ఘను దన్నదు పద్యశతంబు చెప్పె గో
కొమ్మది వాక్ప్రసూనముల గూరిమితో నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేక యుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మద మంది వర్ధిలుము జవ్వనిలీలల వేంకటేశ్వరా !"

మకుటము శ్రీ వేంకటేశ్వరాత్మకమయ్యును – ప్రస్తుతియు, విజ్ఞప్తియు, ప్రార్థనయు సర్వము ఈ శతకమునం దలమేలు మంగాంబికా పరముగ నుండుట విశేష విషయము ప్రకృతి పురుషులకు అభేద భావమును సంభావించి, కవితయం దిట్టి వినూత్నతను కావలె ననియే అన్నమయ్య ప్రతిపాదించెనేమో ! జగన్మాతా పితరుల నేక కాలమునం దేక విధముగ నారాధించుటకై అన్నమయ్య రచించిన పద్యశతమునం దద్భుత భావపరిమళములు గుబాళించుచున్నవి

## రస తరంగములు

వివరింప యత్నించిన కొలది - అన్నమయ్య సారస్వతామృత జలధియందు దిట్టి మహోన్నత సాహిత్యరస తరంగముల పొంగులు, పొహాళింపులు, విలాసములు, విశిష్టతలు ప్రస్ఫుటముగ సాక్షాత్కరించుచునేయుండును యుగములు గడచినవి తరములు దాటినవి అన్నమయ్య కవితయందలి హంగులు, సింగారములు తగ్గలేదు వానికి సంబంధించిన కాంతి కగ్గలేదు. మగ్గిన మామిడిపండువలె మధురమై, జిజ్ఞాసువుల నలరించుచు, భక్తితత్త్వమునకు పతాకమై ప్రకాశించు చున్నది

ఇది అన్నమయ్యను గన్నవారి పున్నె మందమా ? ఆయనకు సంబంధించిన జన్మాంతర సంస్కార మందమా? ఆయన పుట్టుకకు వర ప్రదాతగా నిలిచిన శ్రీ వేంకటేశ్వరుని కరుణా కటాక్ష బల మందమా? ఆయన చేసిన సారస్వత సాధనకు ఫల మందమా ? అన్నియు౦ గలిసి వచ్చిన మహాదృష్ట మందమా ? ఏమైన ననవచ్చును ఏమనిన జెల్ల వచ్చును ఇల్లోకోటి కెరటముల మీదికి పిల్లగాలులు మల్లెల తోటల మీదుగ నురికినట్లు, గోరువెచ్చని గోక్షీరములో కండశర్కరలు కలిపినట్లు, కదళీఫలములు తేనెలో నానినట్లు, గట్టిపాలతో కమ్మని పాయసము తయారుచేసినట్లు, ద్రాక్షగుత్తుల బోత్తుల మొత్తమును చిత్తము వచ్చినలీల నారగించినట్లు - చదివిన ప్రతి పర్యాయము, వినిన ప్రతిసారి - మానసికానంద సంజనకమైన మధురానుభూతిని దేనినో పంచేడి ప్రజ్ఞ - అన్నమయ్య పదముల కున్నది దాని నెవ్వరు కాదనజాలరు సంగీతశాస్త్ర వేత్తలకు సర్వవిధ సంతోషదాయకమైన యంశమది

## ఆశంస

అన్నమయ్య జన్మించిన తాళ్ళపాక వంశము పరమపావనమైనదై, భవిష్యత్తరములవారి ప్రస్తుతులకు పాత్రము కావలసియున్నది వ్రాసిన అన్నమయ్య తరించుటకు మాత్రమే గాక, పాడిన తాళ్ళపాక వంశీయు లెల్లరు - నిన్న, నేడు, రేపుగూడ తరించుట కవకాశమును ప్రసాదించుచు, తెలుగువాఙ్మయమును కళకళలాడించు పదకవితాగంగ అన్నమయ్యపుణ్యమున, ఆంధ్రావని కవతరించినది

విష్ణుపాదోద్భవగా - త్రికాలములయందు సకల జగత్తుచే సమారాధింపబడెడి వియద్గంగ చందమున, శ్రీ వేంకటేశ్వరానుగ్రహ విశేష శక్తిని పుంజుకొని, సర్వజన రంజకముగా అన్నమయ్య ముఖతః వెలువడిన పదకవితా గంగయు పరమపావనమై, సకలసాధు లోకజీవనమై అలరారుట తథ్యము

తిరుమల శ్రీనివాసభగవానుని చరణ పరాగ లేశముకొరకై, ఆ స్వామియొక్క సౌందర్య సంపన్న జగన్మోహనాకృతి సందర్శనము కొరకై, ప్రపంచపు నలుమూలలనుండి భక్తులు విచ్చేయుచున్నంత కాలము, సప్తాచల శిఖర సీమలు యాత్ర లొనర్ప విచేయువారల గోవిందనామస్మరణముతో మారుమ్రోగుచున్నంతకాలము, నిత్యోత్సవ - పక్షోత్సవ - మాసోత్సవ - బ్రహ్మోత్సవములు శ్రీస్వామి వారల సన్నిధిలో జరుగుచున్నంతకాలము, సుప్రభాత పఠనము మొదలుకొని, పవళింపుసేవ వరకు గల వైభవోపేతములయిన దివ్య సేవా పరంపర - అలమేల్మంగాధవునికడ సాగుచున్నంతకాలము, గగనమున చుక్కలు వెలుగుచున్నంతకాలము, గాలి వీచుచున్నంత కాలము, వెన్నెల జల్లును సుధాకరుడు వర్షించుచున్నంతకాలము, లోక

బాంధవుడు_ కర్మసాక్షియు నగు సూర్యభగవానుడు తూర్పుకొండపై నుదయించుచున్నంతకాలము, జలధులు మేఘపంక్తులకు నీరముల నందించుచున్నంతకాలము, పృధివి సస్యసంపదను లోకములకు పంచి పెట్టుచున్నంతకాలము, తీయదీయని యాలోచనల రేకెత్తించుచు, భక్తిభావనలను పొంగించుచు, హృద్యమైన అన్నమాచార్యుల సారస్వతామృతము - వాఙ్మయ ప్రపంచమున నిత్య వసంత కాంతులను వెల్లివిరియించుచునే యుండును

**తేనియ చిందు కైతలకు దీవిగ విల్చిన అన్నమయ్య డెం**
**దాన మనోజ్ఞ గేయసుధ తాత్త్విక రోచుల మధ్య పొంగు శ్రీ**
**శాన విశిష్ట వైష్ణవ వికాస విలాసముల న్వెలార్చు రా**
**మానుజ కీర్తి కౌముది' పవాశర రూపము నిచ్చె నాద్భుతిన్**



# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులు

జననము 9-6-1959 జన్మస్థానము – కృష్ణాజిల్లా, చిన శ్రీరంగపురము జననీ జనకులు – వెంకటనరసమ్మ గోపాలకృష్ణమాచార్యులు విద్యాభ్యాసము – కృష్ణాజిల్లా – జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వఱకు, అనంతరము 1974 నుండి 1976 వఱకు చిట్టిగూడూరు సంస్కృతకళాశాలలో విద్యాభ్యాసము 'సాహిత్య విద్యాప్రవీణ' పరీక్షలో ఉత్తీర్ణత 1981 నుండి 1983 వఱకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్వదర్శన విభాగమున అధ్యయనము, సంస్కృతములో ఎం ఏ డిగ్రీ స్వీకరణము పరిశోధన వ్యాస రచనము ;-1) 1984 నుండి తిరుపతిలో, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము నందు – విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము తత్ప్రాధ్యక్షులు చతుశ్శాస్త్ర పండితులు, 'తర్కవాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతి పురస్కార గ్రహీతలు నగు శ్రీమాన్ N S రామానుజ తాతాచార్యులవారి పర్యవేక్షణమున – వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్ అను విషయముపై పరిశోధన వ్యాసమును రచించి, Ph D డిగ్రీ నిమిత్తమై, రాష్ట్రీయ సంస్కృత సంస్థానమందు 9 10-1986 తేదీన సమర్పించిరి 2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు జైపూరునందు – 'ఆత్మ విచారము అను పరిశోధక వ్యాసమును సమర్పించిరి 3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో – భక్తేః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః అను శీర్షికతో పరిశోధనాత్మక వ్యాసమును సమర్పించిరి

ప్రస్తుత పరిశోధనము – విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్ (ఆంధ్రులు – విశిష్టాద్వైతము) అను విషయముపై పరిశోధన చేయుచున్నారు

సంపాదకత్వము – శ్రీమాన్ శిరిశినగళ్ కృష్ణమాచార్యులవారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థసంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని – 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ మను పేర, టి టి డి వారి ఆర్థిక సహాయముతో 1986 లో వెలువరించిరి

వ్యాఖ్యానము – శ్రీ యామునాచార్యులవారి గీతార్థ సంగ్రహము'నకు – వివరణము' అను వ్యాఖ్యానమును రచించిరి

అనువాదము – 1) భక్తిసిద్ధాంతః 2) అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్ 3) సవిశేషం బ్రహ్మ 4) లక్ష్మీ పురుషకార వైభవమ్ 5) విశిష్టాద్వైతమ్ 6) తత్త్వ త్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి

1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు 2) గాడ్ అండు సోల్ 3) డాక్ట్రిన్ ఆఫ్ విశిష్టాద్వైత అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు

ఉద్యోగము రాష్ట్రీయ సంస్కృత సంస్థానము (న్యూ ఢిల్లీ) వారిచే నిర్వహింపబడిన ఇంటర్వ్యూలో' వీరు సెలక్టు అయి తిరుపతిలో – కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7 987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు

జననము :– దుందుభినామ సంవత్సర చైత్రశుద్ధ పంచమి (6-4 1922) జననీ జనకులు తిరువేంగళమ్మ, శ్రీనివాసాచార్యులు గారలు విద్యాభ్యాసము విజయనగర సంస్కృతకళాశాలలో – 'వ్యాకరణ విద్యాప్రవీణ, 'భాషాప్రవీణ కాశీ – హిందూ విశ్వవిద్యాలయమున సంస్కృతములో ఎం ఏ ఉభయవేదాంత శిక్షణ శ్రీమాన్ తె కం గోపాలాచార్యులవారివద్ద ఉద్యోగములు శ్రీకాకుళము, మదరాసు, కాకినాడ, రాజమండ్రి పట్టణములందలి ప్రభుత్వ కళాశాలలో సంస్కృతోపన్యాసకులు ప్రస్తుత నివాసము విశాఖపట్టణము

ఉభయ భాషలలో, ఉభయ వేదాంతములలో వీరు ఉద్దండ పండితులు మహా వక్తలు దేశమున నాలుగు చెరగులలో పర్యటించి, సంప్రదాయబద్ధములైన వివిధ విషయములపై అనేక మహోపన్యాసము లొనంగి, ఘన సన్మానములను, బిరుదములను పొందినవారు

రచనలు :– 1) మహాభాష్యము పస్పశాహ్నికము (తెలుగు అనువాదము) 2) వాక్యపదీయము (తెలుగు అనువాదము తెలుగు అకాడమీ ప్రచురణము) 3) తిరుప్పావై (తెలుగు వివరణము) 4) సుందర కాండము 5) తత్త్వదీపిక (తెలుగు వివరణము) 6) శ్రీ తత్త్వము భగవత్తత్త్వము (ఉపన్యాస సంకలనము) 7) ఏడుకొండలు – ఏడుకొండలు మున్నగునవి

## శ్రీమాన్ తెలికిచర్ల కందాడై గోపాలాచార్యులు



జననము - శోభకృత్ నామసంవత్సర పుష్య బహుళ సప్తమి (1903) జననీ జనకులు సీతమ్మ, రంగాచార్యులు గారలు ముడుంబై శాఖ జన్మస్థానము కోరుకొండ తూర్పు గోదావరిజిల్లా

తొమ్మిదవయేట ఉపనయన సంస్కారమును బడసి, అగ్రగణ్యులును, భగవద్విషయవేత్తలును, కవిశేఖరులును అగు శ్రీమాన్ వరాహస్వామివారివద్ద పంచసంస్కారములు పొందిరి

విద్యా వ్యాసంగము - సంస్కృతములో కావ్య నాటక అలంకారాది సాహిత్య గ్రంథములను, న్యాయ, వేదాంత శాస్త్రములను అధ్యయనము చేసిరి మరియు - శ్రీభాష్యమును, శ్రుతప్రకాశికా వ్యాఖ్యానమును, కొన్ని వేదాంత వాదములను అభ్యసించిరి అష్టాదశ రహస్యములను, ద్రావిడ దివ్య ప్రబంధములలో రెండు ఆయిరములు ప్రతిపదార్థముతోను, భగవద్విషయమును, ఆచార్యహృదయమును సేవించిరి ఆంగ్లమున ప్రవేశ (స్కూలుఫైనల్) పరీక్ష వఱకు అభ్యసించిరి స్వయం కృషితో హిందీభాష నభ్యసించి, పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణులైరి

శ్రీమాన్ గోపాలాచార్యులవారియొద్ద - సప్తర్షులవలె ఏడుగురు జీయరు స్వాములు, ఆంధ్రదేశీయులగు పదిమంది విద్యావేత్తలు, అయోధ్య - బృందావనము బదరికాశ్రమము - నేపాలు ప్రాంతములలో ప్రస్తుతము సుప్రసిద్ధ ప్రచారకులుగా నున్నవారు కొందరును, నల్గురు మహంతులును, కొందరు ఆంధ్రమహిళామణులును భగవద్విషయమును అధ్యయనము చేసియున్నారు శ్రీమాన్ గోపాలాచార్యులవారు శ్రీవైష్ణవ విద్యార్థులకు తమ యింటనే భోజన - వసతి సౌకర్యములను కలుగజేసి, కొంతకాలము ఆధ్యాత్మిక విద్యను గరపిరి

ఆంధ్రప్రదేశమున అనేక స్థలములలో - ఉపన్యాసములద్వారా మతప్రచారము చేయు పద్ధతిని విశ్వవిద్యాలయములలో ఉద్యోగ యోగ్యతగల పండితులకు- అపేక్షములగు ఉభయ వేదాంత శిబిరములను ఏర్పాటు చేసి, ఉభయ వేదాంత గ్రంథములను కాలక్షేపముగా అందజేయుటకును ప్రప్రథమమున వీరే ఏర్పాటు చేసిరి

వీరు పది సంవత్సరములు ప్రతిసంవత్సరము వరుసగా బదరికాశ్రమమునకు వెళ్ళి 4-6 మాసము లుండి, అష్టాక్షరీ క్షేత్రమును, సత్సంగ సదనమును నిర్మింపజేసి, అచ్చటనే ఉభయవేదాంతశిక్షణా శిబిరములను నిర్వహించిరి శ్రీభాష్య భగవద్విషయములను కొందఱకు అచ్చటనే కొంత కొంత బోధించిరి

సుమారు ఏబది సంవత్సరములనుండి 'భక్తి నివేదన అను వేదాంత మాస పత్రికకు వీరు సంపాదకులుగా నుండి, శ్రీ పెద్ద జీయరుస్వామివారి పూర్వాశ్రమము నుండియు వారి సహాయముతో ఆధ్యాత్మికప్రచారము గావించుచున్నారు శ్రీ పెద్ద జీయరుస్వామివారు గావించిన ప్రతి అతిమానుష కార్యకలాపములలో వీరు ప్రధాన పాత్రను వహించి సహకరించిరి

ఇటీవల ఒక దశాబ్దమునుండి నడిగడ్డపాలెములో - వాసుదాసాశ్రమమున నివసించుచు, అచటనున్న వేదవేదాంగ విద్యాలయమున, సంస్కృతవేద - ద్రావిడ వేద - ఉభయవేదాంత కాలక్షేపములను స్వయముగా చేయుచు, పాంచరాత్రాగమమును శ్రీవైష్ణవ విద్యార్థులు కొందఱకు గరపించుటయేగాక, పంచదశ కర్మలలో శిక్షణను కూడ ఇప్పించిరి

ప్రస్తుతము ఆంధ్రదేశీయ నేపాలదేశీయ విద్యార్థులకు వసతి భోజనాది సమస్త సౌకర్యములను కల్పించి, స్వయముగను ఆ యా పండితులచేతను అవసరమగు ఆధ్యాత్మిక ప్రవచనమును నిర్వహించుచున్నారు ఇరువురు నేపాల్ విద్యార్థులకు ఉభయ వేదాంత ప్రకరణ గ్రంథములను, ఒక స్వామికి భగవద్విషయ కాలక్షేపమును చెప్పుచున్నారు ఇరువురును సమర్థులైన స్వాములకు ఆచార్యపీఠము ద్వారా నెలకు రూ 150 చొప్పున విద్యార్థివేతనమును ఇప్పించుచు ద్రావిడవేద కాలక్షేపమును గావింపజేసిరి ఇట్లెన్నియో ఆధ్యాత్మిక కార్యకలాపములకు - వీరు తమ జీవితమును అంకిత మొనర్చియున్నారు

రచనలు - 1) తిరుప్పావై (విశేషార్థములతో 2 భాగములు - వేయి పుటలు) 2) భగవద్గీత (టీకా తాత్పర్య సహితము శ్రీరామానుజభాష్య వేదాంత దేశికుల తాత్పర్యచంద్రిక ఆధారముతో) 3) శ్రీవైష్ణవ ఆహ్నికము 4) ఆచార్య హృదయము (సూత్రార్థ తాత్పర్యములతో) 5) నిరుక్తము (దానికి ఆంధ్రానువాదముతో) 6) అష్టాక్షరీ మహామంత్రము 7) దర్శనములు (చార్వాకదర్శన ప్రభృతి విశిష్టాద్వైతదర్శనపర్యంతము) 8) భరతుని వైరాగ్యము 9) దేవు డంతట నున్నాడు 10) గజేంద్రమోక్షము 11) కల్యాణ త్రయము (గోదా, సీతా, రుక్మిణీ కల్యాణములకు - ద్వయ, అష్టాక్షరి చరమశ్లోకములతో సమన్వయము) 12) జీవకర్తృత్వ విచారము 13) జీయరు క్షేత్రయాత్ర 14) తిరుప్పావై (పాశురము, ప్రతిపదార్థము, తాత్పర్యము మాత్రమే గాక గోదాకల్యాణముతో) 15) సంధ్యా వందనము 16) సంధ్యావందనమునకు వడగల్, తెంగళ్ సంప్రదాయ సుప్రసిద్ధ భాష్యములకు ఆంధ్రానువాదము 17) కృష్ణయజుర్వేద సంధ్యావందనము 18) పురుషసూక్తమునకు శ్రీ సుదర్శన భాష్యమునకు ఆంధ్రానువాదము 19) శ్రీ సూక్తమునకు, నారాయణానువాకము మొదలగువానికి పూర్వాచార్యులు ప్రసాదించిన భాష్యములకు ఆంధ్రానువాదము 20) గీతోపదేశసారము 21) గీతాసారము 22) విశిష్టాద్వైత విశిష్టత 23) సాధు పరిత్రాణము 24) శబరి (కర్మజ్ఞాన భక్తి యోగముల స్వరూపము మున్నగు విషయములతో) 25) చివరి మెట్టు 26) తిరువారాధన క్రమము 27) భగవదారాధన 28) గోదా కల్యాణము (చిన్న నాటిక) 29) భగవంతు డెవ్వరి ప్రేమించును? 30) వైష్ణవుడవు కాగోరుచున్నావా? 31) అర్చిరాది సార సంగ్రహము 32) వేదాధికార విమర్శ 33) శ్రీ రామాయణ వేదాంతార్థము 34) పరాంకుశ పరోపదేశములు 35) గీతోపదేశములు 36) ఉపనిషత్సూక్తులు 37) మంచి చెడుగుల నిర్ణయము 38) గీతా వైచిత్రి 39) ప్రాగర్నిత్యానుసంధేయము 40) శ్రీరామ వనవాసము 41) పూర్వమీమాంసా దర్శనము 42) శ్రీరామాయణ సంక్షేప ఆంధ్రానువాదము 43) రామాయణమున అనేక కళలు ప్రదర్శనము 44) రామతత్త్వము నెఱిగిన రమణులు 45) రామతత్త్వము నెఱింగిన రాక్షసులు మున్నగునవి ఇవిగాక భక్తి నివేదన పత్రికలో, శ్రీవైష్ణవ పత్రికలో వీరి వ్యాసము లనేకములు ప్రచురింపబడినవి

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



జననము 1924 జన్మస్థానము జగ్గయ్యపేట. ప్రస్తుత నివాసము విజయవాడ. వీరు సంస్కృతాంధ్ర భాషల నభ్యసించిరి. తర్క - వ్యాకరణ - అలంకార - సంగీత శాస్త్రములను, ద్రావిడ దివ్య ప్రబంధములను అధ్యయనము చేసిరి. 'సంగీత సాహిత్య కళానిధి' యను బిరుదును సంపాదించిరి. విజయవాడ ఆకాశవాణి నిలయ సంగీత విద్వాంసులుగా ప్రశస్తి గాంచిరి. వాయులీన వాదనమున చిరయశమును సంపాదించిరి. అనేక సన్మానములను పొందిరి.

త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము మున్నగు వీరి తెలుగు కావ్యములును, 'నరసింహ తాండవమ్' అను నొక హరికథయు, భూప్రశంస, చంద్రకళా షోడశత్వము, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యపదేశాః మొదలగు వీరి గ్రంథములు పండిత ప్రశంసలకు పాత్రములైనవి. క్షేమేంద్రుని కళావిలాసమున కనువాదము, సింహావలోకనమ్ (సంస్కృతము), శ్రీనివాస కల్యాణము, రామకృష్ణపరమహంస, వరదాభ్యుదయము (హరికథల), విప్రనారాయణ (యక్షగానము)మున్నగునవి ముద్రణ భాగ్యమును పొందవలసియున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. త్యాగరాజు, రామదాసు, గోదాదేవి మొదలగు హరికథా కాలక్షేపములు శ్రోతలను తన్మయుల గావించుచు, కొనియాడబడుచున్నవి. వీణెలు వాద్యములో ఆసేతు శీతాచలము పెద్ద పెద్ద సభలలో వీరి పక్కవాద్యములు, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కుచోట్ల సంగీతమునుగూర్చి ఉపన్యాసము లొసంగిరి. 19[illegible]2 డిసెంబరులో మద్రాస్ మ్యూజిక్ అకాడమీలో సంగీతోత్సవమున విద్వత్పరిషత్తులో సంగీతమును గురించి తమిళమున ప్రసంగించి, శ్రోతల మన్ననలను బడసి, ఘన సన్మానము నందిరి.

## శ్రీమాన్ డి. టి. తాతాచార్యులు



శ్రీ భగవద్రామానుజాచార్యుల మేనమామగారైన శ్రీశైలపూర్ణుని వంశములో నుద్భవించిన – కాంచీపురాభిజనులైన శ్రీ లక్ష్మీకుమార తాతదేశికులవారి వంశమున వీరు జన్మించిరి. ఎనిమిదవ యేట ఉపవీతులై, కాలక్రమమున వేదాధ్యయనమును సమాప్తి గావించి, తిరువాయూరు సంస్కృత మహాకళాశాలలో ప్రవేశించి, అచ్చట – ప్రఖ్యాత పండితులవద్ద అలంకార – న్యాయ – మీమాంసా శాస్త్రములను అధ్యయనము చేసి, ఆ యా పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, ఆ కళాశాలయందే M.O L. పరీక్షలోకూడ ప్రథమస్థానమును సంపాదించిరి. అనంతరము విశిష్టాద్వైత వేదాంత గ్రంథములను అధ్యయనము చేసిరి. అనంతరము ఆ కళాశాలయందే మీమాంసాశాస్త్రమున ప్రధానాధ్యాపక పదవిని అధిష్ఠించి, పదునేడు సంవత్సరములు కడు సమర్థతతో నిర్వహించిరి. ఆ సమయమునందే వీరివద్ద విద్యార్థులనేకులు – అలంకార, మీమాంసాశాస్త్రములను అధ్యయనముచేసి, ప్రసిద్ధ పండితులుగా విలసిల్లిరి. ఆ తరుణమునందే వీరు సంస్కృత భాషాప్రచారము నుద్దేశించి 'ఉద్యాన పత్రిక' యను మాసపత్రికను నడుపుట కారంభించి, నలుబది సంవత్సరములు దిగ్విజయముగా నడపిరి. 17 సంవత్సరములు తిరువాయూరులో అధ్యాపనము చేసిన యనంతరము వీరు తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో ప్రాచార్యస్థానమున నియుక్తులై, 8 సంవత్సరములు ఆ పదవిని అత్యంత సమర్థవంతముగ నిర్వహించిరి. తదనంతరము వీరు తిరుపతిలోనే – శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య సంశోధనాలయమున (శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రీసర్చి ఇన్‌స్టిట్యూటులో) 'డైరక్టర్' పదవిని అలంకరించి, కొంతకాలము గడచిన పిమ్మట – ఉద్యోగ విరమణ గావించిరి. అటు పిమ్మట – ఉత్తర భారతమునందలి బృందావనములోగల శ్రీవైష్ణవ విశ్వవిద్యాలయమున అధ్యాపకులుగా చేరి. కొన్ని సంవత్సరములు అచ్చటనే నివసించి, ఆ ప్రాంతీయులకు విశిష్టాద్వైత వేదాంతమును బోధించిరి. వీరిపుడు పరమపదవాసులు.

రచనలు :- 1) మీమాంసా పరిభాషా వ్యాఖ్యా పరిష్కారః 2) మీమాంసా పరిభాషావ్యాఖ్యా అక్షరార్థః 3) మీమాంసా అభ్యుదయః 4) అర్థసంగ్రహ వ్యాఖ్యా 5) కావ్యాదర్శ వ్యాఖ్యా 6) భామహాలంకార వ్యాఖ్యా 7) విశిష్టాద్వైత కోశః 8) విశిష్టాద్వైత సిద్ధిః 9) శరీర సిద్ధిః 10) వైశేషికసూత్రవివృతిః 11) బ్రహ్మసూత్రవృత్తిః 12) యథార్థ రామానుజః 13) సజ్జనారాధనమ్ 14) పాదుకాసహస్ర వ్యాఖ్యా 15) సంప్రదాయ ప్రదీపః 16) ఉపనిషద్వ్యాఖ్యా (ఆంగ్లము) 17) భగవద్గీతా వ్యాఖ్యా (ఆంగ్లము) 18 రూపక పరిశుద్ధిః 19) సంస్కృత శిక్షా 20) సిద్ధాంత సిద్ధాంజన భంజనమ్ మొదలగునవి.

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు



జననము 1-7-1930 జన్మస్థానము తిరుపతి. జననీ జనకులు - జానకమ్మ, వేంకట నరసింహాచార్యులు. విద్యాభ్యాసము - వేద సంస్కృత కళాశాలలో - నెల్లూరు. ఉభయవేదాంతాధ్యయనము :- తండ్రిగారి సన్నిధిలో. డిగ్రీలు :- 1) విద్యాప్రవీణ, 2) భాషాప్రవీణ 3) ఎం. ఏ. (సంస్కృతము) వీరిపుడు నెల్లూరులో - వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా పని చేయుచున్నారు.

రచనలు :- (ముద్రితములు) 1) శుక సందేశమ్ (సంస్కృత కావ్యము) 2) సంస్కృత భాషాప్రవేశిక (వ్యాకరణము) 3) వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) 4) శ్రీమన్మహాశిల గిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము స్వాగతమ్ (ఖండకావ్యము) 6) హాహా హూహూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ తెలుగు నవలకు సంస్కృతానువాదము) (అముద్రితములు) 7) స్వప్నమాలా (డాక్టరు :- బెజవాడ గోపాలరెడ్డిగారి వచన కవితకు సంస్కృత పద్యానువాదము. 8) శర్వరీ (ఆకిలి శ్రీరామశర్మగారి ఆంధ్రపద్య కావ్యమునకు సంస్కృత పద్యానువాదము 9) బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన సంవాదరూపమున

బ్రహ్మ సూత్రార్థ వివరణము తెలుపుట.) 10) ఉపనిచ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ తాత్పర్యములు గలది. ఛాందోగ్య - బృహదారణ్యకములు మినహా.)

## శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు



జననము 27-7-1930 జన్మస్థానము సిద్దిపేట. జననీ జనకులు :- రామక్క, రంగాచార్యులు అభ్యసించిన భాషలు - తెలుగు, సంస్కృతము, హిందీ. అభ్యసించిన విద్యలు ;- వ్యాకరణము, తర్కము కొంతవరకు. డిగ్రీలు :- బి. వో. యల్. (తెలుగు) హోదాలు :- మెదకుజిల్లా అధికారభాషా సమీక్షా సంఘ సభ్యులు. ఉద్యోగము ;- ప్రభుత్వోన్నత పాఠశాల (సిద్దిపేట)లో - ప్రధానాంధ్ర పండితులుగా చిరకాలము పని చేసి, 31-7-88 తేదీన ఉద్యోగ విరమణ చేసిరి. ఇక మీదట, భగవత్సేవ - సాహిత్యసేవ చేయుచు, కాలము గడుపవలెనని అభిలషించు చున్నారు.

సమ్మానములు ;- 1) 1-7-70 లో - సిద్దిపేట పురజనులచే సన్మానము. 2) 1980లో - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారిచే ఘన సన్మానము. 3) కోరుట్లలో - వానమామలై వరదాచార్యులవారి స్మారక బహుమతి. 4) వనపర్తిలో - ఉమ్మెత్తల సాహితీ పురస్కారము. 5) కడపలో - గడియారం వేంకట శేషశాస్త్రిగారి స్మారక బహుమతి. 6) మచిలీపట్టణములో - శ్రీ త్రిపురసుందరీ ప్రతిష్ఠానమువారి సాహితీ పురస్కారము, ఇంకను అనేక మండలములలో - వివిధ సందర్భము లందు - వివిధ సంస్థలచే సత్కారము.

రచనలు – 1) ప్రబోధము 2) అమరజీవి బాపూజీ 3) కవితాంజలి నవ మాలిక 5) తిక్కన 6) మణికింకిణి 7) వీర పూజ 8) శ్రీ వేంకటేశ వినతి 9) శ్రీ వేంకటేశోదాహరణము 10) తెలుగు బాలనీతి 11) బాలగేయా 12) శ్రీ గోపాలకృష్ణ సుప్రభాతమ్ 13) కవితా కాహళి 14) ఆంధ్ర విష్ణు 15) మంజీర నాదాలు 16) జీవనస్వరాలు 17) కవితాసిందూరం 18) కాం వైజయంతి 19) శ్రీ బాసర సరస్వతీ వైభవము 20) వివేక విజయము 21) భ రామదాసు 22) వ్యాస కలాపం 23) అక్షర దీపాలు ఇంకను బాలల కొఱ కొన్ని గ్రంథములు వ్రాసిరి

విశేషాంశములు :– వీరి కవితలు కొన్ని – హిందీ, గుజరాతీ భాషలలోన అనువదింపబడినవి కొన్ని పద్యములు – కర్నాటక ప్రభుత్వమువారి పదవ తరగ తెలుగు పుస్తకములో పాఠ్యాంశముగా నున్నవి ఉస్మానియా విశ్వవిద్యాలయ 'తిక్కన' కావ్యమును, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము ఆంధ్ర విష్ణువ కావ్యమును, గుల్బర్గా విశ్వవిద్యాలయము కాంతి వైజయంతి పద్యకవితా సంపుటి డిగ్రీపరీక్షలకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించిరి ఉస్మానియా విశ్వవిద్యాలయవ వారు – వేముగంటి కృతులపై ఎం ఫిల్ చేయుటకు అనుమతి ఇచ్చినారు

పలుమారులు ఆకాశవాణినుండి వీరి కవితలు, ప్రసంగములు ప్రసారితముల భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి స్రవంతి, ఆంధ్రప్రదేశ్ మున్నగు వివిధ పత్రికలలో వీరి కవితలు, వ్యాసము ప్రచురితములు అనేక గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసిరి

## శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు



జననము – 13-2-1929 జన్మస్థానము – ప్రకాశం జిల్లా - పరుచూరుకు సమీపమునగల వీరన్నపాలెము జననీ జనకులు రాఘవమ్మ, కాండవ కృష్ణమాచార్యులు

శ్రీమాన్ రంగాచార్యులుగారు తమ పితృపాదులవద్ద సంస్కృతాంధ్ర భాషలలో సుశిక్షితులై, అనంతరము తెనాలి సంస్కృత కళాశాలలో నాల్గు సంవత్సరములు విద్యాభ్యాసము చేసి, భాషా ప్రవీణ పరీక్షలో ప్రథములుగా ఉత్తీర్ణులై, ఆంధ్ర విశ్వవిద్యాలయమున, బంగారు పతకమును బహుమానముగా పొందిరి అనంతరము 36 సంవత్సరముల కాలము పరుచూరులో యార్లగడ్డ రామన్న ఉన్నత పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా పని చేసి, 1987 లో ఉద్యోగ విరమణ చేసిరి

రచనలు – 1) ఆదర్శమూర్తులు 2) త్యాగమూర్తులు 3) పుణ్యమూర్తులు 4) దివ్యమూర్తులు 5) తేజోమూర్తులు (ఇవి యైదును గద్యకావ్యములు) 6) భక్తపోతన 7) బాల నాటికలు 8) అప్పాజీ 9) దివ్యదీక్ష - అన్నమాచార్య (టి టి డి ప్రచురణ) 10) గుహుడు (ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిచే, బి ఏ తెలుగు పాఠ్యముగా నంగీకరింపబడిన పద్యకావ్యము 11) శబరి (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారిచే బి ఏ తెలుగు పాఠ్యభాగమునకు స్వీకరింపబడిన పద్యకావ్యము ) ఇంకను 12) పూజాపుష్పాలు 13) మురళి 14) బాలబోధ మొదలైన పద్యరచన లనేకములు ఇట్లు వివిధ ప్రక్రియలలో వెలువడు శ్రీరంగాచార్య లేఖినినుండి వెలువడిన కృతి రత్నములు ముప్పదికి మించి యుండును

విద్యార్థుల ఉపయోగార్థమై వీరిచే రచింపబడిన బాలనాటికలు, బాలబోధ, ఆంధ్ర వ్యాకరణము మున్నగునవి - అనేక పర్యాయములు ముద్రణ భాగ్యమును పొందినవి

ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి, కృష్ణా వంటి ప్రముఖ పత్రికలలో వీరి గద్య పద్య రచన లనేకములు ప్రచురింపబడినవి వీరు ప్రముఖ కవిపండితులతో కలిసి భువనవిజయము, భారతావతరణము మొదలైన సాహిత్య రూపక ప్రదర్శనములలో పాల్గొని, పేరు గాంచిరి భాగ్యనగరమున ప్రపంచ తెలుగు మహాసభలు జరిగినపుడు వీరు భువన విజయ సభలో పాల్గొని, ప్రభుత్వ పక్షమున ఘన సన్మానము పొందిరి 4 8 86 తేదీన మద్రాసులో యార్లగడ్డ వెంకన్న చౌదరి అవార్డును స్వీకరించిరి విభవ ఉగాది పర్వదినమున, హైదరాబాదు రవీంద్రభారతిలో కవి సమ్మేళనమున - ముఖ్యమంత్రిచే ఘన సన్మానము పొందిరి

తిరుపతి, సింహాచలము, అన్నవరము, శ్రీశైలము మున్నగు ప్రముఖ దేవాలయములలో ఆధ్యాత్మిక ప్రసంగము లనేకములు చేసిరి ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి వీరి ప్రసంగములు స్వీయ కవితలు కొన్ని ప్రసారములై ప్రశంసలు పొందినవి సహృదయులుగా, సాహితీ సమారాధకులుగా, ఉత్తమ ఉపాధ్యాయులుగా, వక్తలుగా, మధుర కవులుగా వీరు సుప్రసిద్ధులు



# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 10 | వే వి | వేదవి |
| 18 | 4 | ప్రపంచము | ప్రపంచము, |
| 88 | 25 | దృష్టుంతము | దృష్టాంతము |
| 93 | 14 | బ్రహ్మను | బ్రహ్మను |
| 97 | 15 | తెఠియు | తెలియు |
| 104 | 16 | ఆకొశముతో | ఆకాశముతో |
| 118 | 10 | లేదటని | లేదని |
| 118 | 24, 26 | కారరూపాది | కారాది |
| 126 | 4 | క్రమిముగా | క్రమముగా |
| 130 | 18 | సంతమయః | సందమయః |
| 135 | 21 | సద్భువ | సర్భువ |
| 145 | 7 | చతర్విధా | చతుర్విధా |
| 157 | 5 | ఋత్ | కృత్ |
| " | 8 | పురః | పురుషః |
| 160 | 15 | నమ | నక్ర |
| " | 27 | పురాణము | పురాణము |
| 161 | 10 | పురాణము | పురాణము |
| 165 | 20 | సవతరింప | నవతరింప |
| 167 | 14 | ధ్యాని చు | ధ్యానించు |
| 170 | 24 | అనవసాద | అనుద్ధర్ష |
| 174 | 17 | సదాంతమును | సిద్ధాంతమును |
| 175 | 16 | హే తాథి | హోతాధి |
| 188 | 18 | వేతువుమై | వేరువుమై |
| 189 | 10 | వోసముత్ | దోసముత్ |
| 212 | 25 | స్మృతా | స్మృతాః |
| 214 | 20 | అజాన | అజ్ఞాన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 217 | 20 | యు డువాడు | యుండువాడు |
| 221 | 8 | విష్ణోర్యస్పత్పరమం | విష్ణోర్యత్పరమం |
| 222 | 22 | దవతోనను, | దనలోనను, |
| 223 | 8 | సర్వ, | సర్వ |
| 224 | 23 | వురాణము | పురాణము |
| 232 | 12 | సుసమాహిత | సుసమాహితమ్ |
| " | 14 | యు త్యంచితు | యదేశద్యంచితం |
| 236 | 18 | జగతు | జగత్తు |
| 238 | 18 | శర్యణ | శరణ్య |
| 239 | 8 | నర్వధర్మాం | సర్వధర్మాం |
| 242 | 20 | అర్చితాది | అర్చిరాది |
| 254 | 18 | నందనము | నందనమున |
| 256 | 8 | భైరవు | భై రవు |
| 258 | 12 | సు భడు | సులభుడు |
| 262 | 7 | ప్రణుతి చు | ప్రణుతించు |
| " | 21 | వే కట | వేంకట |
| 263 | 6 | మె సిన | మెరిసిన |
| " | 20 | యు డు | యుండు |
| 272 | 15 | సముజ్వల | సముజ్వల |

—❋—

## మహారాజ పోషకులు

1 శ్రీమాన్ చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, B A B L I R S (రిటైర్డు ఇన్‌కంటాక్సు ఆఫీసర్) గుంటూరు

2 Sri Narender P Reddy, Ph D
Associate Profesor The University of Akron, AKRON

## రాజ పోషకులు

1 శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, B Com గుంటూరు

## పోషకులు

1 శ్రీమాన్ నండూరు సత్యనారాయణాచార్యులు గుడివాడ

2 శ్రీమాన్ తిరాంబి వెంకట నరసింహాచార్యులు పెంటపాడు

3 శ్రీ పుతుంబాక శ్రీరాములు (మాజీ శాసన సభ్యులు) పెదపాలెము

## విరాళములు

1 Sri Venkateswara Temple Pitts Burgh, Dls 250

2 Sri P Narender Reddy, Akron ,, 280

3 శ్రీ కంకణాల యతిరామానుజయ్య, హైదరాబాదు రూ 300

4 డాక్టర్ చించాపట్టణం శ్రీరంగాచార్యులు, మహబూబ్‌నగర్ ,, 200

## కృతజ్ఞత

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయము గావించిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికిని —

మా గ్రంథమాలలో సభ్యులుగా చేరుట మూలమున సహకరించిన సహృదయులకును —

తమ తమ విరాళములను అందజేయుట ద్వారా మా మహోద్యమమునకు దోహద మొసంగిన మహాశయులకును —

ఇందుమూలమున మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము

— ప్రకాశకులు

# దశమి కౌముదిలో రానున్న రచనలు

౧ శ్రీ పద్మావతీ శ్రీనివాస స్తుతి
శ్రీమాన్ ఆసూరి మరింగంటి పురుషోత్తమాచార్యులు, M A B Ed

౨ లక్ష్మీ పురుషకార వైభవము
డాక్టర్ కట్టా విజయరాఘవాచార్యులు M A Ph D

౩ శ్రీమద్రామానుజులు - ఛారి కృతిరత్నములు
శ్రీమాన్ చింతపాటి విజయరాఘవాచార్యులు M A B Ed D I S

౪ శ్రీమద్రామానుజులు - ఉపనిషత్తులు
శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు (విద్యారత్న)

౫ భగవద్రామానుజులు - శ్రీభాష్యము (ద్వితీయాధ్యాయము)
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు M A

౬ శ్రీమద్రామానుజులు - గీతా భాష్యము
డాక్టర్ : చించావట్టణం శ్రీరంగాచార్యులు M A Ph D

౭ గీతా రహస్యము
శ్రీమాన్ గుడిమెళ్ళ రామానుజాచార్యులు (కవిరత్న)

౮ విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము
శ్రీమాన్ వల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు (ఉభయ వేదాంత విద్వాన్)

౯ శ్రీ రామానుజ ప్రశస్తి
శ్రీ మొవ్వా వేంకటదాసు (భక్తకవిశేఖర)

౧౦ శ్రీ వైష్ణవ మతము - శ్రీ పాంచరాత్ర వాఙ్మయ ప్రభావము
శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు (విద్యాభూషణ)

౧౧ శ్రీ పాంచరాత్ర ప్రాశస్త్యము
శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు (ఆగమాచార్య)

౧౨ [illegible] సంప్రదాయములు - వైష్ణవ మత ప్రభావము
[illegible] చెలమచెర్ల రంగాచార్యులు (శిరోమణి)

